# సుకవి మనోరంజనము

కూచిమంచి వేంకటరాయ
ప్రణీతము

పరిష్కరణ
కోవెల సంపత్కుమారాచార్య
తెల్గుశాఖ, ప్రభుత్వ కళాశాల
జగిత్యాల, కరీంనగరము జిల్లా




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవనము - సైఫాబాదు - హైద్రాబాదు - 4

# తొలిపలుకు

సాహిత్య ప్రపంచమున కూచిమంచి తిమ్మకవిని, జగ్గకవిని ఎరుగని వారుండరు. సుకవి మనోరంజనము కూచిమంచి వేంకటరాయ ప్రణీతము. వారి వంశీయులైన శ్రీ కె. కామేశ్వరరావుగారు, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీకి తాళపత్రగ్రంథము పంపగా, దానిని తిరిగి వ్రాయించి పరిశీలించుట జరిగినది. తేలినదేమనగా పరిపూర్ణగ్రంథ మెచ్చటను దొరకుటలేదనీ, ఇది ప్రచురణ యోగ్యమనీ; ఆమేరకు అకాడమీ కార్యవర్గము దానిని ముద్రింప నిర్ణయించి దానికి పీఠికను సిద్ధముచేయు బాధ్యతను శ్రీ కోవెల సంపత్కుమారాచార్యుల వారి కప్పగించినది. ఆ పీఠికతో గ్రంథము ప్రస్తుతము వెలువడినది.

ఈ గ్రంథము కేవలము వ్యాకరణ గ్రంథము కాని ఛందోగ్రంథము కానికాదు. మిశ్రమమై, అనేక అంశములతో కూడినది. చింతామణి, బాల సరస్వతీయము, అథర్వణ కారికావళి, అప్పకవీయము, అహోబలపండితీయ ములకు, ఇది వ్యాఖ్యాప్రాయమైన గ్రంథమనవచ్చును. అప్పకవితో భేదించిన సందర్భములు యిందు పొందుపర్చనైనది. విరివిగా పూర్వగ్రంథ ములనుండి ఉదాహరణములీయనైనది. కొన్ని వ్యావహారిక ప్రయోగము లకు సాధుత్వము కల్పించిన రీతియు ఇందు గమనింపదగినది. ఛందోవ్యాకరణ విషయముల కిది సాధికారగ్రంథమని కొందర భిప్రాయపడుచున్నారు. ఈ గ్రంథమునకు అనంతరము ఇట్టిప్రయత్నము జరిగినట్లు కనబడదు.

ఇట్టి అవకాశమును సద్వినియోగము చేసికొని ఆంధ్ర లాక్షణికుల కిట్టి అపూర్వగ్రంథమును సమర్పించి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ, తన విధ్యుక్త ధర్మమును తాను నెరవేర్చుకొన్నది.

ఈ గ్రంథము తాళపత్రప్రతిని అకాడమీకి యిచ్చిన శ్రీ కె. కామేశ్వరరావు గారికి, వారిని అకాడమీకి పరిచయముచేసిన శ్రీ జి. కృష్ణ గారికి కృతజ్ఞతలు. కోరినంతనే యీ గ్రంథమును పరిశీలించి వ్రాతప్రతిని సిద్ధముచేసి పీఠికను వ్రాసిన డా. కోవెల సంపత్కుమారాచార్య గారికి, అకాడమీ పక్షాన అనేక ధన్యవాదాలు.

హైదరాబాదు
1-1-1976.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి.

# నివేదన

కూచిమంచి తిమ్మకవి సార్వభౌముని 'లక్షణసార సంగ్రహము' నకు పరిష్కృతప్రతిని సిద్ధముచేసి, 'సమీక్షణము'ను సంతరించి సమర్పింపగా- నా పరిశ్రమను గుర్తించి, గ్రంథగౌరవమును పురస్కరించుకొని 1971 లో ప్రచురించిన ఆం. ప్ర సాహిత్య అకాడమీవారు, ఈనాడు కూచిమంచి వేంకటరాయని 'సుకవి మనోరంజనము'ను పరిష్కరించి 'సమాలోకనము' సమకూర్చు నవకాశము కలిగించుట వ్యక్తిగతముగా నాకెంతో సంతోషకర మైనది. 'కూచిమంచి' లాక్షణికులకు, తద్ద్వార లక్షణరంగమునకు 'ఉడుతా భక్తి'గా సేవజేయగల యదృష్టము, మొదటి సారిగా ముద్రణ కెక్కు నీ గ్రంథమును పరిష్కరించు నవకాశము కలిగించినందులకు సాహిత్య అకాడమీ కార్యవర్గమునకు, సహృదయులు అకాడమీ కార్యదర్శి శ్రీ రామానుజరావు గారికి సర్వదా కృతజ్ఞుడను.

ఈ పరిష్కరణ కృషిలో, సమాలోకన రచనలో ప్రత్యక్షముగానో, పరోక్షముగానో సహకరించిన గౌరవనీయులు డా. జి. యన్. రెడ్డిగారికి, మరియు శ్రీ ఆవంత్స సోమసుందర్, శ్రీ జి కృష్ణ, శ్రీ నిడదవోలు సుందరే శ్వరరావు మొదలగు మిత్రులకు, ఆదినుండి నాకు తోడగు డా. కోవెల సుప్రసన్నాచార్యులకు నా ధన్యవాదములు

నా కృషిఫలమునకు ప్రమాణమైన పండిత విమర్శకుల సహృదయతకు నా నమోవాకములు.

నాకు లక్షణ శాస్త్రమార్గమును చూపిన మా తండ్రిగారు శ్రీమాన్ కోవెల రంగాచార్యులుగారిని, నన్నొకదారిలో ముందుకు నడిపించిన గురు వర్యులు బ్రహ్మశ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మగారిని ఈ సందర్భమున భక్తి పూర్వకముగా సంస్మరింతును.

జగిత్యాల. కోవెల సంపత్కుమారాచార్యులు

# విషయానుక్రమణిక

## సమాలోకనము :



## సుకవి మనోరంజనము :

## ప్రథమాశ్వాసము :

## తృతీయాశ్వాసము :-

**చతుర్థాశ్వాసము :-**



**పంచమాశ్వాసము :-**



**అనుబంధములు :-**

# సుకవి మనోరంజనము
# సమాలోకనము

---

## పరిచయ రేఖ

'సుకవి మనోరంజనము' విశిష్టమైన లక్షణగ్రంథము. ఈనాటివరకు అముద్రితమయి గూడ ప్రసిద్ధి నార్జించిన లక్షణగ్రంథ మిది. లక్షణగ్రంథ రచనారీతిలో ప్రాచీన పద్ధతికి భరత వాక్యముగా, ఆధునిక పద్ధతికి నాందీ వచనముగా గత శతాబ్దపు తృతీయ పాదాంతమున తెలుగు లక్షణగ్రంథ రంగమున కవతరించిన దిది. ప్రాచీన తెలుగు లక్షణగ్రంథములను పరిశీలించినచో నాయాలక్షణకర్తలు తాము యుక్తమనుకొన్న లక్షణమును ప్రవచించుటయే తప్ప మరొకరీతికి ప్రాచుర్యము కన్పించదు. కొన్ని లక్షణములందు కొన్నికొన్ని సందర్భములలో ఇతర లాక్షణికుల లక్షణములను నిరసించుట, నిరాకరించుటలు లేకపోలేదు. అయితే ఆయా అంశములను చర్చించి, వాటి సామంజస్యాసామంజస్యముల నిరూపించి తేల్చి వివరించెడు పద్ధతి కన్పించదు. అట్టి పద్ధతి ఈ 'సుకవి మనోరంజనము' నందు సాక్షాత్కరించును. ఇది ఒకవిధముగా 'భాష్య' పద్ధతి ఒకవిధముగా ఆధునిక విమర్శకీతి. ప్రాచీన ధోరణిలో లక్షణము చెప్పుటయు, ఆధునిక రీతిలో విమర్శించుటయు ఈ గ్రంథమందు ఆకర్షకమయిన ఒకానొక విశిష్టత. తన నాటికి అచ్చుపడిన అనేక గ్రంథములందలి పలు పాఠముల స్వరూపములను విమర్శించి నిరూపించియు ఈనాటి వరకును తాళపత్ర ప్రతుల రూపముననే మిగిలిపోయిన దీ 'సుకవి మనోరంజనము' ఇది 'సుకవి మనోరంజన' మే కాదు ముద్రితమగుచు నీనాడు 'ఛందో విమర్శక మనోరంజనము' కూడ. ఇట్టి విశిష్టమయిన లక్షణగ్రంథమును రచించిన విమర్శకుడు 'లాక్షణిక చక్రవర్తి' బిరుదాంకితుడైన కూచిమంచి వేంకటరాయడు.

## వేంకటరాయని
## వంశ ప్రశంస

వేంకట రాయడు జన్మించిన 'కూచిమంచి' వంశము ప్రసిద్ధమైన కవి, పండిత, లాక్షణిక వంశము. అభినవ వాగనుశాసన, కవిసార్వభౌమ బిరుదాంకితుఁడు, బహుగ్రంథ ప్రణేత, సుప్రసిద్ధుడు నగు తిమ్మన కూచిమంచి వంశమునంతటిని ధగద్ధగాయమాన మొనరించిన మహాపురుషుడు. ఆయన యన్నచో నావంశీకులందరికిని పట్టరానంత గౌరవము.

'అమ్మహాత్ముని వలన గాదా ప్రసిద్ధి
కలిగె కూచిమంచి సమాఖ్య కులము కెల్ల'

-సు. మ. రం. అవ.

అని వేంకట రాయడు ఎంతగానో గౌరవాదర భక్తి భావ పురస్సరముగా చెప్పుకొనినాడు. ఇప్పటివరకు తిమ్మన ఒక ఉత్తమ పండితకవిగా మాత్రమే తెలియవచ్చినది కాని వేంకటరాయని వలన, తిమ్మన జీవితములోని యొక ఉదాత్తాంశ మీనాడు క్రొత్తగా తెలియ వచ్చినది. తానిక మూడు దినములకు ఈ భౌతికదేహమును వదులవలసి యున్నదని తెలిసిన తిమ్మన సన్యాసమును స్వీకరించినాడట. ఆ సన్యాసాశ్రమమందు తిమ్మనపేరు 'శివరామ తీర్థులు'. (సు. మ. రం. అవ) తిమ్మన స్వతః పరమశైవుడు. తన జీవితమును, రచనను శివాంకితమొనర్చినవాడు. అయితే శివకేశవ భేదము పాటించనివాడు.

'మహేశ్వరే వా జగతా మధీశ్వరే
జనార్దనే వా జగదంతరాత్మని
న వస్తు భేద ప్రతిపత్తి రస్తి మే
తథాపి భక్తి స్తరుణేందుశేఖరే'

అని స్వనిష్ఠ వివరించుకొన్న భర్తృహరికి తిమ్మన సదర్ముడు. సన్యాసాశ్రమమున గ్రహించిన పేరునందును 'వస్తుభేద ప్రతిపత్తి'ని చూపనంతటి పరవస్తు తత్త్వవేత్త. కాగా తిమ్మన ఉదాత్తుడైన లాక్షణిక విద్వత్కవి మాత్రమే కాక, జీవితమునందును సిద్ధిపొందిన మహానుభావుడు. తిమ్మన తమ్ముడగు జగ్గన తన అన్నగారిని 'దైవభక్తి' తో సేవించెడివాడట. అవును, అంతటి

వాని నట్లు సేవించుటలో నాశ్చర్యమేముండును? చిత్రమేమనగా అన్నగారెట్లు పరమ శివభక్తుడో ఈ తమ్ముడు అంతటి విష్ణుభక్తుడు. వీరిద్దరిని స్మరించుచు 'శివకేశవాంఘ్రి రాజీవభక్తి జాతాగ్రసరులు' అని వేంకట రాయడు చెప్పినాడు. ఈ జగ్గన కూడ అన్నగారియంతటి సుప్రసిద్ధుడు. ప్రబంధపద్ధతిలో 'సుభద్రా పరిణయము' ను, ప్రబంధ పద్ధతికి 'పేరడీ' గా 'చంద్రరేఖా విలాపము' ను రచించిన విచిత్రమైన ఊహాశాలి; హాస్యశీలి. తిమ్మన-జగ్గనలు ఈ వంశమునకు పెట్టిన మణికిరీటములు. ఇట్టివారి వంశమునకు చెందిన అద్వితీయమంతుడగు నుత్తమ లాక్షణికుడు వేంకటరాయడు.

ఈ వంశమున కవిసార్వభౌముడైన తిమ్మన కృతిసంతానమే తప్ప సంతానము లేనివాడుగా కన్పించును. తిమ్మన కున్న ముువ్వురు తమ్ములలో జగ్గన నడిమివాడు. ఆతని వలననే ఈ వంశము విస్తరించినట్లు కన్పించును. జగ్గన యొక్క మనుమని మనుమడే 'సుకవి మనోరంజన' కర్తయగు వేంకట రాయడు. వేంకటరాయని తండ్రిపేరు కూడ తిమ్మనయే. ఆయన కిద్దరు భార్యలు. పెద్దభార్య సుబ్బమ్మ, చిన్నభార్య గంగమ్మ. వేంకట రాయడు సుబ్బమ్మ కుమారుడు. ఏకైకపుత్రుడు. గంగమ్మకు జగ్గన,రామన అని యిద్దరు కుమారులు. లక్ష్మణాదులు శ్రీరామచంద్రుని సేవించినట్లు వారు తనను సేవింతురని వేంకటరాయడు వ్రాసికొనుట వారి పరస్పర సోదరప్రేమకు సూచకము.

వేంకటరాయడు తనదాక వివరించిన 'కూచిమంచి'వారి వంశక్రమము ప్రక్క పుటలో చూపనైనది.

ఆ వంశక్రమమందు తిమ్మననామధేయు లైదుగురు, జగ్గన నామధేయులు నలువురు గంగన నామధేయులు ముువ్వురు, సింగన నామధేయు లిద్దరు (వెంకట రాయ నామధేయులు గూడ నిద్దరనుకొనవచ్చును. నాల్గవ తిమ్మన మూడవ కొడుకు మొదటివాడు కాగా, అయిదవ తిమ్మన మొదటికొడుకు రెండవవాడు.) ఈ వంశమున కంతటికి కవిసార్వభౌముడగు రెండవ తిమ్మన, రెండవ జగ్గనలే మిక్కిలిగా ప్రసిద్ధులు. అయితే మిగిలినవారంతగా ప్రసిద్ధులు కాకున్నను, అందరును గ్రంథకర్తలు కాకున్నను శాస్త్రములందు, సాహిత్యమునందు కృషి చేసినవారే. తన వంశీకులలో కొందరు రచించిన గ్రంథములను వేంకటరాయ డిట్లు పేర్కొన్నాడు.


ఐయ్యన
తిమ్మన-1
గంగన-1
(భార్య : లచ్చమ్మ)
జగ్గన-1
సింగన-1
నరసన
తిమ్మన-2
(కవిసార్వభౌముడు)
సింగన-2
జగ్గన-2
సూరన
తిమ్మన-3
గంగన-2
జగ్గన-3
(భార్య : జోగమ్మ)
తిమ్మన-4
గంగన-3
భాగయ
వేంకటరాజు
తిమ్మన-5
భార్య : సుబ్బమ్మ
(వంకాయలపాటి
వేంకటనారాయణ పుత్రిక)
భార్య : గంగమ్మ
(జల్దంకి రామయ్య పుత్రిక)
వేంకటరాయడు
('సుకవి మనోరంజన' కర్త)
జగ్గన-4
రామన.

తిమ్మకవి సార్వభౌముడు :-

1. రాజశేఖర చరిత్రము.
2. రుక్మిణీ పరిణయము.
3. నీలా (సుందరీ) పరిణయము
4. సింహశైల మాహాత్మ్యము.
5. సప్తసాగర చరిత్రము.
6. సారంగధర చరిత్రము
7. (అచ్చతెనుగు) రామాయణము
8. సర్పపుర మాహాత్మ్యము
9. సర్వలక్షణ సారసంగ్రహము.[1]
10. రసికజన మనోభిరామము
11. శ్రీ శివలీలా విలాసము
12. శ్రీ కృష్ణ దండకము

ఇవియేకాక కొన్ని శతకములు.[2]

జగ్గన-2

1. జానకీ పరిణయము
2. నర్మదాపరిణయము
3. రాధాకథాసుధానిధానము
4. సుభద్రాపరిణయము.
5. ఉమాసంహిత.[3]

---

1. నిజమున కిది 'లక్షణసార సంగ్రహము'.

2. ఈ శతకములలో భర్గశతక మొకటి. అందుండి వేంకటరాయడు తన లక్షణ గ్రంథమున కొన్ని పద్యము లుదాహరించినాడు.

3. జగ్గన కృతులలో 'చంద్రరేఖా విలాపము' ను వేంకటరాయడు చెప్ప లేదు కాని అది ప్రసిద్ధమైన గ్రంథము.

ఇవియేకాక బహు శతకములు, గీత ప్రబంధములు, గద్యలు, రగడలు, మంజరులు,[1] బహుసువృత్తంబులు. (ఇవి చాటుపద్యములు కావచ్చును.)

గంగన-2

1. తారక బ్రహ్మరామాయణము.[2]

మరియు కొన్ని దండకములు, శతకములు.

తిమ్మన-5

1. సరసహృత్కుముద చంద్రిక.[3] (సంస్కృతము)
2. వాసవదత్త.
3. కాదంబరి.

దాదాపుగా తన వంశీకులలో నందరును కావ్యనిర్మాణక్షములనియు, కీర్తిమంతులనియు, పరాక్రమవంతులనియు, రాజాదరణ పొందినవారనియు దానగుణము గలవారనియు వేంకటరాయడు చెప్పినాడు.

## వేంకటరాయని స్వీయ పరిచితి

వేంకటరాయడు తన వంశమునుగూర్చి ఎంత విరివిగా చెప్పికొనినాడో, తననుగూర్చి అంత తక్కువగా చెప్పుకొనినాడు. తననుగూర్చి చెప్పుకొనిన దిది: తాను 'శ్రీ కుక్కుటేశ్వర కరుణార్ద్ర కటాక్ష సంప్రాప్త విద్యాకలాపు'డు. సరస 'విద్వత్కవి సంశ్లాఘనీయ' రీతిలో సంస్కృతాంధ్రాభ్యాంధ్రములందు లలిత వాగ్గద్యకవన రచనాధురీణుడు. తన కవితాశక్తి చేత 'జాతరూప నగేంద్రచాప,తార తారకా,వార...శారదాభ్రశుభ్రవిభ్రాజమాన యశోవిలసితు'డు. అయితే తానురచించిన గ్రంథములేవియో వేంకటరాయడు పేర్కొనలేదు. కాని, 'రామచంద్ర, కుక్కుటేశ్వర, గోపికా హృదయలోల' శతకములు ఆయన

---

1. 'గద్యలు, రగడలు, మంజరు లన్నవి చాటు కావ్యములు. వీటినిగూర్చి కావ్యాలంకార చూడమణిలో చూడవచ్చు.
2. దీనికే 'శతకంఠ రామాయణ'మని మరొక పేరున్నట్లు తెలియుచున్నది.
3. దీనికే 'సుజన మనః కుముద చంద్రిక' అని మరొక పేరు.

రచనలుగా కన్పించును.[1] ఇతర రచనల విషయమెట్లున్నను ఆయన కావ్య రచనాశక్తికి ఈ 'సుకవి మనోరంజనము' నకు 'అవతారిక' గా రచించిన పద్య భాగము చక్కని ఉదాహరణ. వివిధ విశేషవృత్త ప్రయోగ నైపుణి, గద్య రచనారీతి, వర్ణనాశక్తి ఈ 'అవతారిక' యందు స్పష్టమగును. పిఠాపురమును ప్రాబంధిక ధోరణిలో వర్ణించిన వేంకటరాయుడు ప్రబంధరచనా చమత్కార మును కరతలామలక మొనర్చుకొన్నట్లు కన్పించును. పద్యరచనాశక్తి విశద మగును.

వంకాయలపాటి వేంకటనారాయణ వేంకటరాయని మాతామహుడు[2]- వేంకటరాయని పితామహియగు జోగమ్మ ఈ వేంకటనారాయణుని సోదరియే- వేంకటనారాయణ చక్కని కవిత చెప్పగలవాడని, ఇహాపురాణ విదుడని, దయా వంతుడని వేంకటరాయడు చెప్పినాడు. తనకు మాతామహుడగుటయే గాదు, వేంకటనారాయణ తనకు 'పంచాక్షరీప్రదు' డయిన గురువు కూడ.

వేంకటరాయడు దేవులపల్లి సీతారామశాస్త్రిని, దేవులపల్లి బుచ్చయ్య శాస్త్రిని తన గురువులుగా చెప్పుకొనినాడు. ఈ చెప్పిన రీతిలో బుచ్చయ్యశాస్త్రి గారే తనకు అసలు విద్యాగురువులుగా కన్పించును. ఈ సీతారామశాస్త్రి బుచ్చయశాస్త్రి- ఇరువురు సోదరులు. ఇద్దరిలో వయస్తారతమ్య మధికము. సీతా

---

1. ఈ యంశము '-రంజన పరిష్కృతి' శీర్షిక క్రింద స్పష్టమగును

2. తిమ్మకవి సార్వభౌముని 'లక్షణసార సంగ్రహము'నకు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నొక ప్రతికృతి యున్నది. సంఖ్య- R. 1994. దీనిని వ్రాసిన వ్యక్తి వంకాయలపాటి చిట్టెన్న కొమారుడు వేంకటనారాయణప్ప, వేంకటరాయని మాతామహుడే అయిఉండును. ఆ ప్రతి వ్రాయబడినది రక్తాక్షి. కాగా 1803 లేక 1863 క్రీ శ. అగును. ఈ విధముగా కాలము కూడ సరిపోవును. అట్లే ప్రా.లి.పు.భాం. లోని R. 2037 సంఖ్యగల ప్రతి వ్రాయసగాడు వంకాయలపాటి తిరుపతిరాజు. ఆ ప్రతి శోభకృత్‌లో వ్రాయబడినది. అనగా క్రీ.శ. 1843. ఈ విధముగా మొదటి ప్రతి క్రీ. శ. 1803 దని, రెండవది క్రీ.శ. 1843 దని నిశ్చయింప వచ్చును. మరి ఈ తిరుపతిరాజు వేంకటనారాయణ కేమగునో సరిగా తెలి యదు. (చూ. అకాడమీ ప్రచురించిన 'లక్షణసార సంగ్రహము'నకు నా వ్రాసిన' సమీక్షణము పు. 3-4.

రామశాస్త్రికి బుచ్చయశాస్త్రి తమ్ముడు. ఇద్దరి మధ్య 15 సంవత్సరములపైగా ఎడము. వీరిరువురును పిఠాపుర ప్రభువుల ఆస్థాన విద్వాంసులు. వీరిలో సీతారామశాస్త్రి వేంకటరాయని తండ్రియగు తిమ్మనకు విద్యాగురువులు. తాను సీతారామశాస్త్రి వద్ద నాల్గు శాస్త్రములు చదువుకొన్నట్లు తిమ్మన 'సరస హృత్కుముదచంద్రిక' లో వ్రాసికొన్నాడట. ఈ గ్రంథము కవిసార్వభౌముడగు తిమ్మన రచించిన 'రసికజన మనోభిరామము' నకు సంస్కృతీకరణ మందురు. ఈ విధముగా సీతారామశాస్త్రిగారు తన తండ్రికి విద్యాగురువులగుటయు, తన విద్యా గురువులగు బుచ్చయశాస్త్రికి అన్నగారగుటయు కారణముగా వేంకటరాయడు తాను గూడా సీతారామశాస్త్రిని గురువులుగా స్మరించినాడు. వారివద్ద ఏదైన శాస్త్రీయాంశములు తెలిసికొన్నాడేమో తప్ప, తాను చదివినది బుచ్చయశాస్త్రిగారి వద్దనే. అందుకనియే సీతారామశాస్త్రిగారి కీర్తిని మాత్రమే వర్ణించి, బుచ్చయశాస్త్రిగారి పాండిత్యమును వర్ణించినాడు, పైగా బుచ్చయశాస్త్రి తనను 'లక్షణ నిధివరులందు పండితుని' చేసినట్లు బహుమాన పురస్సరముగా చెప్పికొన్నాడు.

ఈ గురు-శిష్య కుటుంబములకు అత్యంత సాన్నిహిత్యము, పరస్పర గురుభావమున్నట్లు కన్పించును దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారికి వేంకటరాయడు లక్షణోపదేశికులట. సుబ్బరాయశాస్త్రిగారి తమ్ముడై, తమ్మన్నశాస్త్రిగా ప్రసిద్ధులైన వేంకటకృష్ణశాస్త్రిగారి కుమారులే ఆధునిక కాలమున 'భావకవితా' యుగమును ధగధగలాడించిన 'కృష్ణపక్ష' కర్త శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. ఈ దేవులపల్లివారి కుటుంబము, కూచిమంచివారి కుటుంబము, వింజమూరి వారి కుటుంబము, ఆవసరాల వారి కుటుంబము— ఇవన్నియు విద్వత్కవి కుటుంబములు. ఈ కుటుంబముల వారందరికి పిఠాపుర సంస్థానముతో గాఢమైన సంబంధమున్నది. గోలుకొండ నవాబులు తమ సైన్యాధ్యక్షులలో నొకరైన తెనుగు రాయణిం గారిని పిఠాపుర సంస్థాన పాలకులుగా నియమించిన నాటి నుండి, వారి నాశ్రయించి వారికి రాజపురోహితులుగా తెలంగాణా ప్రాంత మందలి వింజమూరు నుండి పిఠాపురమునకు వచ్చినవారు.[1] వింజమూరి కుటుం

---

1. ఈ కాలముననే గోల్కొండ నవాబులవద్ద పరిపాలనా వ్యవహర్తలయి గోల్కొండ వ్యాపారులని పేరొందిన విశిష్టాద్వైత నియోగి కుటుంబములు కొన్ని పిఠాపురము వచ్చినవి. 'ఆవంత్స' కుటుంబము వాటిలో ఒకటి. ఆవంత్స కుటుంబమున ఈనాడాధునికాభ్యుదయ కవిగా ప్రసిద్ధుడు శ్రీ సోమసుందర్.

..మున ప్రసిద్ధులు 'రాఘవ యాదవీయ' మన్న సంస్కృత శ్లేష కావ్యకర్త సోమేశ్వర కవి. ఈ వింజమూరివారి బంధువులుగా తెలంగాణా ప్రాంతము నుండి పిఠాపుర సంస్థానమునకు వచ్చినవారు దేవులపల్లివారు.[1] ఆనాటి నుండి దేవులపల్లివారు అనువంశికముగా పిఠాపురాస్థాన విద్వాంసులుగా వెలుగొందినారు. కుమార వేంకట మహీపతిరాయణింగారు తమ ఆస్థాన కవులగు దేవులపల్లి బాపన్నకవిగారికి పిఠాపురమునకు దాదాపు రెండు మైళ్ల దూరములోనున్న 'ఫకురుద్దీన్‌పాలెం' గ్రామములో సుక్షేత్రమును దానము చేసినారు.[2] అవసరాల పద్మరాజుగారు వేంకటనీలాద్రిరాయణింగారి అమాత్యులు. 'బాలభారత' మన్న చంపూ ప్రబంధమును రచించినవారు.[3] దేవులపల్లి రామశాస్త్రిగారు ఈ ప్రబంధమునకు 'సుధీచంద్రిక' యను వ్యాఖ్య రచించినారు. 'రామాభ్యుదయ' చంపూ కావ్యాన్ని కూడా రామశాస్త్రిగారు రచించినారు.

కూచిమంచి వంశీకులకు పిఠాపుర సంస్థానముతో సన్నిహిత సంబంధమున్నను, ఆస్థాన కవులుగా కాని, విద్వాంసులుగా గాని ఉన్నట్లు కన్పించదు. అయితే ఆ సంస్థాన ప్రభువులచే సన్మానములు మాత్రము విరివిగా పొందినారు. రావు నీలాద్రి మాధవరాయణింగారు[4] తిమ్మనను 'కవిసార్వభౌమ' బిరుదముతో ..మనముగా సత్కరించినారు. గంగన-2 'రావు వేంకటరాయ ధరావరాగ్రగణ్య

---

1. దేవులపల్లివారు తెలంగాణములో ఈనాటికి నున్నారు. ఆ.ప్ర.సా. అకాడమీ ప్రస్తుత కార్యదర్శి శ్రీ రామానుజరావుగారు 'దేవులపల్లి' వారే.

2. ఈ బాపన్నగారికి బ్రహ్మనశాస్త్రియని మరొక ప్రసిద్ధనామము. వేంకటమహీపతి రాయణింగారినిగూర్చి సంస్కృతమున 'తారావళి' రచించి సమర్పించిన సందర్భమున ఈ సుక్షేత్రదానము జరిగినది. (చూ. 'మహేంద్ర విజయ' మందలి వంశావతార వర్ణనము)

3. పద్మరాజుగారు, ఆధునికముగా గురజాడ సాహిత్యమును పరిష్కరించి 'విశాలాంధ్ర ప్రచురణాలయ' పక్షాన ప్రచురించిన శ్రీ అవసరాల సూర్యారావుగారి తండ్రికి ప్రపితామహులు.

4 వక్కలంక వీరభద్రకవి రచించిన 'వాసవదత్తా పరిణయము' ను కృతిపొందినవారీయనయే.

దత్తమహైశ్వర్య కలితుడు'. ఈ వంశీకులకు పెద్దాపురము,[1] బొబ్బిలి సంస్థాన ప్రభువుల సన్మానము గూడ లభించినది. పెద్దాపుర ప్రభువగు వత్సవాయి తిమ్మజగపతి రాజుగారు జగ్గన-(2) కవీంద్రుని 'బేబదల్'[2] బిరుదుచే భూషించినారు. బొబ్బిలి ప్రభువగు శ్రీ విజయ రామరాజుగారిచే 'శిబికాసమృద్ధి' పొందినాడు. పిఠాపురాధీశ్వరుడగు వేంకట సూర్యనారాయణిం గారి రెండవ కుమారుడు బొబ్బిలి సంస్థానమువారికి 'దత్తు' లయినారు. ఆ విధముగా బొబ్బిలితో కూచిమంచివారికి సంబంధము కలిగియుండును.

వేంకటరాయడు శ్రీ రావు వంశవారిధి సుధాధాముడైన గంగాధర రామారావనీధవుడు పిఠాపురమును పాలించు కాలమున నున్నవాడు. ఈ గంగాధర రామారావుగారు వేంకటరాయని 'లక్షణ చక్రవర్తి' బిరుదముతో గౌరవించినారట.[3] వేంకటరాయడు తన గ్రంథమున నీ యంశమును వ్రాయలేదు. కావున 'సుకవి మనోరంజన' రచన తరువాత నీ బిరుదము లభించియుండుననిపించును. లేదా, ఈ బిరుదును పేర్కొనకపోవుట వినయ సూచకము కావచ్చును. వేంకటరాయడు తన గ్రంథావతారికలో పీఠికా పురవర్ణనాంతమున శ్రీ రావు గంగాధర రామరాయణిం గారి పిఠాపుర పరిపాలనమును గొప్పగా చెప్పినాడు పిఠాపురము రాజమహేంద్ర వరదేశరాజిత మన్నాడు. ఈనాడు తూర్పు గోదావరి జిల్లాగా వ్యవహరింపబడుచున్న ప్రాంతము ఈ శతాబ్ద ప్రథమ పాదమువరకు 'రాజ

---

1. 'భర్తృహరి సుభాషితత్రిశతి' ఆంధ్రీకర్త ప్రసిద్ధ కవి ఏనుగు లక్ష్మణకవి ఈ పెద్దాపుర సంస్థాన పండితుడు. తిమ్మకవి సార్వభౌమునకు మిత్రుడు.

2. 'బేబదల్' అనగా 'అసదృశ ప్రతిభావంతుడు' అని అర్థము- ఈ యంశమను కూచిమంచి వంశీకుల మిత్రులగు శ్రీ ఆకొండివారు శ్రీ సోమసుందర్ గారికి తెలిపినారట.

3. ఈ గంగాధర రామారాయణింగారి కుమారుడే ప్రసిద్ధమైన 'సూర్యరాయాంధ్ర నిఘంటు' నిర్మాణము చేయించిన కవిపండిత పోషకుడగు రాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దూర్ గారు. వీరి కుమారుడు ఆధునిక కవి 'చినుకులు-చిందులు' కర్త శ్రీ గంగాధర రామారావు.

మంౘ్రి జిల్లా' గా వ్యవహరింపబడుచుండెడిది. అందువలన పిఠాపురము 'రాజ మహేంద్ర వరదేశరాజిత' మైనది.[1]

కూచిమంచి వంశీకులు మొదట 'కందరాడ' లో నివసించినారు. తిమ్మన తాను కందరాడ వాసిననియే చెప్పుకొనినాడు. తరువాత ఆయన 'చంద్రమ పాలెము' (దీనికే 'రావువారి చంద్రమపాలె' మని మరొక పేరు. ఇది పిఠాపుర ప్రభువుల వంశము పేర వెలసియుండును.) తరలి వచ్చినట్లున్నది. దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారు 'మహేంద్ర విజయము'[2] న 'కవిజీవితము' లో 'కూచిమంచి తిమ్మకవీంద్రునకుం గడపటి కాపురంబైన రావుగారి చంద్రమపాలెము' వారి నివాసముగా చెప్పబడినది. చంద్రమపాలెమునకు బందిపోటుల బాధ కలిగినదట. అది పడలేక అక్కడి వారు కొందరు సుమారు అరమైలు. దూరముగా 'ఫకురుద్దీన్‌పాలెము'ను పొందించుకొన్నారట. కూచిమంచివారు కూడ ఈ పాలెమునకు వచ్చినట్లు తెలియుచున్నది.

కూచిమంచివారు రాజ సన్మానములు పొందినవారేతప్ప రాజాస్థానీకులు కారు. జీవనోపాధికి లోపములేని, తాము కలిగి, ఇతరుల కింత కలిగించునట్టి వ్యవసాయమును వృత్తిగా అవలంబించుకొన్నవారు.

వేంకటరాయనికి 'న ప్రతిగ్రహీత' అని ప్రసిద్ధి, పలువురు ప్రసిద్ధులు, పెద్దలైనవారి కత్యంతాప్తుడు. అయినను తనకొరకుగానీ, ఇతరులకొరకుగానీ, అన్యుల నాశ్రయించినవాడుకాదు. ఆ కాలములో రాగి 'కానీ'లు సర్వసాధారణ మైన చిన్న నాణెములు. ఎవరినుండియును 'కానీ' గూడ పుచ్చుకొని యుండ లేదని తద్వంశీకులందరు. ఆయన ఉత్తమ నిష్ఠాపరుడు. ఉన్నంతలో దాత.

వేంకటరాయని భార్య కామేశ్వరి. చక్కని శ్రుతపాండిత్యము గలది, అంతటి పండితుడైన వేంకటరాయనికి దీటైనదందురు. వేంకటరాయడు చక్కని హాస్యశీలియని, జీవితమును దైన్య విరహితముగా గడిపివాడని తద్వంశీకులు

---

1. పైన వివరింపబడిన కుటుంబములను వ్యక్తులను గూర్చిన విశేషాంశము తెల్పినవారు మిత్రులు, ప్రసిద్ధాధునిక కవులు శ్రీ అనంతప్ప సోమసుందర్‌గారు- వారికి నా కృతజ్ఞతలు.

2. 'మహేంద్ర విజయము' 1907 లో అచ్చయినది.

చెప్పుచుందురు ఈ దంపతులకు ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమారితులు. వేంకటరాజుగారి పెద మనుమని పేరుకూడ వేంకటరాజుగారే. చక్కని కవి.చిన్న వయసులోనే గతించినారు. అన్నగారి కవితలను తమ్ముడు కామేశ్వరరావు 'కాలికి ముత్యాలు' అనుపేర పుస్తకరూపమున ప్రకటించినారు. దానికి శ్రీవేంకట రావుగారు పీఠిక సంతరించినారు.[1]

ఈ విధముగా కవిపండిత లాక్షణిక వంశమున జన్మించి, అట్టి ఇతర వంశీకులతో నిత్యసంబంధము కలిగి మహాపండితుడైన కూచిమంచి వెంకట రాయడు రచించిన దీ 'సుకవి మనోరంజనము' ఈ గ్రంథరచనకు పూర్వమే లాక్షణికములయిన యనేకాంశములనుగూర్చి పలువురు పండితులతో వేంకట రాయడు చర్చించి యుండును. అనేక గ్రంథముల పరిశీలించియుండును. అందుకే గ్రంథాంతమున సుకవీంద్రులకు చేసిన మనవిలో తాను, 'తద్గ్రంథసమితినరసి, విబుధుల దెలసి సమంచితముగ' నీ 'సుకవిమనోరంజనము'ను 'సంఘటించితి'నని నిబ్బరముగా చెప్పకొనగలిగినాడు. వేంకటరాయని వంశమునుగూర్చి, ఆతనికి కలిగిన కవిపండిత సమాజ సంబంధమునుగూర్చి తెలిసిన తరువాత, ఈ గ్రంథ మును చదివిన తరువాత ఈ నిబ్బరము నిజముగా అబ్బురము గొలుపునదిగానే యుండును.

## 'సుకవి మనోరంజనము' కృతి:

### మూల ప్రతి

'సుకవి మనోరంజనము' ను శా. శ. 1794 వ సంవత్సరమునకు సరి యగు ప్రజోత్పత్తినామ సంవత్సరమున తాను రచించినట్లు గ్రంథాంతమున వేంకటరాయడు చెప్పినాడు. అనగా ఇప్పటికి క్రీ. శ. 1974 నాటికి - 102

---

1. వేంకటరాయని యీ కౌటుంబిక విషయములు నాకు తెలిపిన వారు శ్రీ జి. కృష్ణగారు (ఇండియన్ ఎక్స్‌ప్రెస్ విజయవాడ) వారికి నా కృతజ్ఞతలు. కూచిమంచి కామేశ్వరరావుగారు జగ్గకవిగారి 'చంద్రరేఖా విలాపము' తాటాకు ప్రతికై తమ పాత ఇంటిలో భోషాణమున వెదుకగా ఈ 'సుకవి మనోరంజనము' ప్రతులు బైటపడినవి. అవి శ్రీకృష్ణగారిద్వారా అకాడమీకి లభించినవి. ఆప్రతులే ప్రస్తుత పరిష్కృత ప్రతికి ఆధారము.

సంవత్సరముల క్రితము - క్రీ శ. 1872 లో రచింపబడినది. మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు ఈ గ్రంథమునకు R. 796, R 862 R. 912 సంఖ్యలలో మూడు ప్రతికృతులు - పత్రప్రతులున్నట్లు తెలియుచున్నది. అయితే వీటిలో నేదియు సమగ్రప్రతిగాదు. శ్రీగిడుగు సీతాపతి. శ్రీరావూరి దొరస్వామిశర్మ మొదలగు ఛందోవిమర్శకులు ఈ గ్రంథము (తాళపత్రప్రతుల) నుండి అనేకాంశములు తమ వ్యాసములం దుదాహరించి[1] ఇందు బహునూతనాంశములున్నట్లు తెలుపుతువచ్చినారు గాని, ఈ నాటికి నీ గ్రంథము అముద్రితముగానే ఉండిపోయినది. ఈ గ్రంథము రచింపబడునాటికి తెలుగులో 'ముద్రణ' ప్రచారములోనికి వచ్చినది. అప్పకవీయ, భారతాదులు ముద్రితములయినవి గూడ. వేంకటరాయడు తన గ్రంథములందు పలుచోట్ల 'అచ్చు' ప్రతుల నుండి పాఠము లుదాహరించి చర్చించినాడు. మరి ఈ గ్రంథము అముద్రితముగా తా. ప. ప్రతిరూపమున అలభ్యస్థాయిలోనే యీ నాటికి నుండుటకు కారణ మెవరును పూనుకొనకపోవుటతప్ప మరియొకటి కన్పించదు. ఇది ముద్రితమయి - అందరికిని లభ్యస్థాయికి రావలయునన్నది ఛందోవిషయానక్తుల చిరకాలవాంఛ ఈ నాటికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వలన ఆవాంఛ వెరవేరుట అత్యంత ముదావహము.

సాహిత్య అకాడమీ వారికి పైనచెప్పిన మదరాసు ప్రతులలోనివి కానట్టి 'సుకవి మనోరంజన'పు తాళపత్రప్రతులు రెండు లభించినవి. ఈ రెండింటిని సౌలభ్యము కొరకు 'అ. ప్రతి. ఇ - ప్రతి' యని పేర్కొనవచ్చును. అ. ప్రతి గ్రంథాద్యవతారికతో, గ్రంథాంత పద్యములతో దాదాపు సమగ్రముగా నున్నది. దాదాపుగా అనుటకు గారణము మధ్యలో కొంతభాగమునకు చెందిన తాళపత్రములు లోపించుట. ఇ, ప్రతియందు గ్రంథాద్యవతారికగాని, గ్రంథాంత పద్య

1. శ్రీ గిడుగువారు అప్పకవీయము (వావిళ్ళ ప్రచురణ) నకు వ్రాసిన పీఠికలో సుకవి మనోరంజనము మూడుచోట్ల ప్రస్తావించబడినది. ఆ పీఠికయందు అఖండయతి విషయికముగా చూపబడిన 'వీరలు దైవభక్తి' (భారత పద్యము) వంటి పద్యములపై చర్చ సు. మ. రం. లో నున్నది. (ఈ పీఠికా రచనాకాలము 1922) శ్రీ రావూరివారు అఖండయతి ప్రయోగముల వేళ ఈ గ్రంథమునందలి ప్రయోగములు కొన్ని చూపినారు. (చూ. తెలుగుభాషలో ఛందోరీతులు పు 303)

ములుగాని లేవు. మధ్య మధ్య గ్రంథభాగములు కొన్ని కొన్ని లోపించినవి అయితే అ- ప్రతియందు లోపించిన భాగమును ఇ. ప్రతి పూరించినది[1] ఈ విధముగా నీ రెండు ప్రతుల సహాయముతో ప్రస్తుత పరిష్కృతప్రతి ముద్రణకు సిద్ధము చేయబడినది

మరి యీ రెండు ప్రతులకు వ్రాయసకాండ్రెవరన్నది తెలియదు. గ్రంథ మందెక్కడ కూడా పేరు కన్పించదు. పరిశీలించగా రెండు ప్రతులయందును వ్రాత యొకతీరుగానే కన్పించును. ఇదిట్లుండగా అ ప్రతి గ్రంథకర్త స్వయముగా వ్రాసినదనిచెప్పవచ్చును. అ- ప్రతి వ్రాయుట ప్రజోత్పత్తి జ్యేష్ఠ శుద్ధ విదియ ఆదివారమునాడు ప్రారంభించినట్లుగా అవతారికా ప్రారంభమున తిథి నమోదు చేయబడినది. అవతారికారంభమనగా ప్రథమాశ్వాసారంభము. ఇక, ద్వితీయాశ్వాసారంభమున ప్రజోత్పత్తి జ్యేష్ఠ బహుళ తదియ సోమవారమని, తృతీయాశ్వాసారంభమున ప్రజోత్పత్తి ఆషాఢ బహుళ దశమి బుధవారమని వ్రాయబడినది. మరియు చతుర్థాశ్వాసాంతము, అనగా గ్రంథాంతమున శా.శ. 1794 నకు సరియగు ప్రజోత్పత్తి సంవత్సరమున ఆశ్వయుజ బహుళ ఏకాదశి సోమవారమునాడు గ్రంథము పూర్తిచేయబడినట్లు చెప్పబడినది. గ్రంథాంతమున గ్రంథసమాప్తిని చెప్పుచు తిథి నమోదుచేసిన పద్యము వేంకటరాయనిదేగదా! గ్రంథాంతమున గ్రంథ రచనాకాలము నిట్లు స్పష్టముగా నమోదుచేయుట కూచి మంచివారి వంశమున తిమ్మకవి సార్వభౌముని గ్రంథములందు కన్పించును. అదేపద్ధతిని వేంకటరాయడును అనుసరించినాడు. గ్రంథ ప్రారంభకాలము, గ్రంథరచన పూర్తియైనకాలము, ఆశ్వాసారంభములందును నమోదు చేయబడిన తిథులు-ఇవన్నియు నొకక్రమములో నుండుట చూడగా ఇది గ్రంథకర్తయగు వేంకటరాయని స్వహస్త లిఖితప్రతియే యని కచ్చితముగా చెప్పవచ్చును. కాగా

---

1. 'ఇ. ప్రతి' పూరించిన భాగములు.

   i. తృతీయాశ్వాసమున 'చంద్రోదయంబైన చందాన నీరాక' (3-311వ పద్యము) నుండి ఆశ్వాసాంతము వరకు.

   ii. చతుర్థాశ్వాసము మొదటినుండి 23 వ వచనము వరకు

   iii. పంచమాశ్వాసము మొదటినుండి 149 పద్యమువరకు అని గమనించవలయును.

వేంకటరాయుడు ప్రజోత్పత్తి జ్యేష్ఠ శుద్ధ విదియ సోమవారము (క్రీ. శ. 1872 మే 21) నాడు గ్రంథరచన ప్రారంభించి, ప్రజోత్పత్తి ఆశ్వయుజ బహుళ ఏకాదశి సోమవారము (క్రీ. శ. 1872 అక్టోబరు 14) నాడు గ్రంథరచన పూర్తి చేసినాడని స్పష్టము. అనగా మొత్తము గ్రంథము నాల్గునెలల ఇరువదినాల్గు దినములలో రచింపబడినది. మొదటి రెండాశ్వాసములు ఒకనెల తొమ్మిది దిన ములలో పూర్తికాగా మిగిలిన భాగము మూడునెలల పదునైదుదినములలో పూర్తి యైనది.

ఈ విధిక్రమమును బట్టియేకాక, గ్రంథమందు అక్కడక్కడ వ్రాసి, కొట్టివేయబడిన కొన్నికొన్ని పదములకు, వాక్యములను, కుండలీకరింపబడిన యంశములను, 'మార్జిన్' లో గుర్తుగా వ్రాసికొన్న యంశములను చూడగా నీ ప్రతిని గ్రంథకర్తయే స్వయముగా వ్రాసినదని స్పష్టమగును. ఉదాహరణముగా నొకయంశము:- 'అ' ప్రతిలో 81వ పత్రమున రెండవవైపు-

> తద్భవ వ్యాజయతికి కవిత్రయమువారిలో నొకరి
> లక్ష్యము వ్రాయలేదు. ఎ। హ।
>
> సీ. నవయౌవనులు మనోజ్ఞ విచిత్రగంధమా
> ల్యాలంకృతాంగులు నీల పీత
> వాసులు దివినుండి వసుధపై ॥

అని వ్రాసి కొట్టివేయబడియున్నది. ఇక్కడ దీనినిట్లు కొట్టివేయుటకు కారణమున్నది. చక్కటి యతిని వివరించుచు

"కొందఱు చక్కటియతి మంచిదిగాదు, కవిత్రయము వారి ప్రయోగము లేదు-అంటారు. కవిత్రయము వారి ప్రయోగములేని తద్భవవ్యాజయతిని పావులూరి మల్లన ప్రయోగము నెటువలె నంగీకరించిరో తెలియదు-"

అని వేంకటరాయుడు వ్రాసినాడు. తద్భవవ్యాజయతికన్న ముందే చక్కటియతి వివరింపబడినది. తద్భవవ్యాజయతికి కవిత్రయము వారి ప్రయో గములేదని మొదట చెప్పినాడు. తద్భవవ్యాజయతివద్ద ఎఱ్ఱనగారి ప్రయోగము (ఎ। హ। = ఎఱ్ఱనగారి హరివంశము.) వ్రాసినాడు. వ్రాసి చక్కటియతి వద్ద

వ్రాసినయంశము గుర్తించియో, లేక తద్భవవ్యాజయతి చెల్లిన ఎఱ్ఱనగారి ఆ పద్యమునకు పాఠాంతరము కన్పించియో, కాక ఆ ప్రయోగము సరియైనదికాదని తాననుకొనియో-కాదా, ఈ ప్రయోగము భారతమందలిది కాదనియో... మరేదో కావచ్చు- భావించి ఇది కొట్టివేయబడినది. ఈ పని గ్రంథకర్త తప్ప మరొకరు-వ్రాయసగాడు-చేసెడి పనిగాదు. ఈ విధముగా ఆయా వ్రాతలందిట్టి యంశములకు గమనించునచో 'అ. ప్రతి' వేంకటరాయ స్వహస్తలిఖిత ప్రతియేయని నిశ్చయమగును.

ఇక 'ఇ. ప్రతి'. ఈ ప్రతియు వేంకటరాయనిచే లిఖితమని భావించ వీలున్నది. ఇందును వ్రాయసగాని పేరెచ్చటను గన్పింపదు. పైగా 'అ ప్రతి' వ్రాతపోలికలో నీవ్రాతయునున్నది. ఈ యంశమిట్లుండగా, 'ఇ. ప్రతి' యందు ఒక్క తృతీయాశ్వాసారంభమున మాత్రము ఆషాఢ శుద్ధ చతుర్దశి సోమవారమని వ్రాసియున్నది. ఈతిథి 'అ. ప్రతి' యందలి తృతీయాశ్వాసారంభ తిధికి పది దినములు ముందు మిగిలిన ఆశ్వాసాదుల ఆరంభమున నిట్లు తిథినమోదు చేయబడలేదు, నమోదయిన అంశమునుబట్టి చూచినచో మొదట 'చిత్తు'గా నొక్కొక యాశ్వాసమును వ్రాసికొని, ఆ తరువాత ఒక్కొక్క ఆశ్వాసముగా శుద్ధప్రతి వ్రాయబడినట్లు ఊహించవచ్చును. 'ఇ. ప్రతి' యందు అవతారిక లేకపోవుటకు, గ్రంథాంతమున వేంకటరాయడు సుకవులకు చేసిన మనవి, గ్రంథసమాపనతిధి తెల్పిన సీసపద్యములు రెండు లేకుండుటకు, ప్రతి 'ఆద్యాయాః పంచాచద్వర్ణాః...' అని 'అవధరింపుము' ఇత్యాదిగా లేకుండగానే ప్రారంభమగుటకు, మధ్యమధ్య కొన్ని 'లోపము' లుండుటకు, వాక్యములు పలుచోట్ల మారియుండుటకు ఇదేకారణమని ఊహింపవచ్చును. ఈ విధముగా 'ఇ. ప్రతి'యు వేంకటరాయనిచే లిఖితమని భావింపబడినది. 'అ. ప్రతి' ఎట్లును వేంకటరాయనిదే. ఇక మదరాసు ప్రతులు అసమగ్రములగుటచే[1] ఈ సంపూర్ణ ప్రతులకవి కొన్నిభాగములుగా ప్రతికృతులని భావించబడినది. అందువలన ప్రస్తుత ముద్రితప్రతిని రూపొందించుటలో వాటి ప్రమేయము అవసరము లేకపోయినది.

---

1. 'R. 1007, 912, 862 అను సంఖ్యలుగల గ్రంథములలోఁ గొంత కొంత భాగము కలదు' అని శ్రీ రావూరివారు ఈ ప్రతుల అసమగ్రత సూచించినారు. (చూ. తెలుగు భాషలో ఛందోరీతులు పు. 401)

## '—రంజన' పరిష్కృతిరీతి

'సుకవి మనోరంజనము' ను వేంకటరాయడు నాలుగాశ్వాసములుగానే రచించినాడు. అయితే నాల్గవ ఆశ్వాసమున రేఫ-ఱకారవిషయమును ప్రారంభించి మధ్యలో ప్రత్యేకముగా ప్రసక్తి కలిగించుకొని అప్పకవిని విమర్శించుచు కొన్ని వ్యాకరణాంశములు, శబ్దస్వరూపములు-అదేవరుసలో ప్రతాపరుద్రీయమున చెప్పబడిన 'దోష' ములలో కొన్ని విమర్శింపబడి, మరల రేఫ-ఱకారవిషయము మందుకోబడినది. అందువలన విషయక్రమము స్పష్టముగానుండుటకు వీలుగా ఈ భాగము విడిగా-అయిదవ ఆశ్వాసముగా ప్రస్తుత పరిష్కృతప్రతియందు చూపబడినది. చతుర్థాశ్వాసమందు గ్రంథమును గూర్చి, రచనాకాలమును గూర్చి వేంకటరాయడు రచించిన రెండు సీసపద్యములు ఈ ప్రతియందు పంచమాశ్వాసముచివర చేర్చి గ్రంథసమాప్తి చూపబడినది. ప్రస్తుతము పంచమాశ్వాసముగా చూపబడిన భాగము చతుర్థాశ్వాసమున 23 (వచనము) తరువాతి నుండి మూలప్రతియందు ఆరంభమగును. ఈ యంశ మీపరిష్కరణయందు ముఖ్యముగా గమనింపదగినది.

ఆశ్వాసాదులయందు శ్రీ కుక్కుటేశ్వరస్వామిని సంబోధించు పద్యము, 'అవధరింపుము' అన్న వచనము తప్ప, ఆశ్వాసాంతములందు గద్యలు రచింపబడలేదు, ప్రస్తుత కల్పిత పంచమాశ్వాసాదియందు చతుర్థాశ్వాసాదియందలి సంబోధనపద్యమే కూర్చబడినది.

గ్రంథమంతయు పూర్తిగా వచనములోనే యున్నదనవచ్చును. ఇతర గ్రంథములనుండి లక్ష్యములుగా, లక్షణములుగా ఉదాహరించిన పద్యములే తప్ప, వేంకటరాయడు ఈ గ్రంథమునకై స్వంతముగా రచించిన పద్యములు మిక్కిలి తక్కువ, తాను క్రొత్తగా నిర్మించిన యంశములను చెప్పునప్పుడుతప్ప వేంకటరాయడు దాదాపుగా పద్యములు వ్రాయలేదు. కొన్నితావులలో ఇట్టి లక్షణకథనముకూడ వచనములోనే జరిగినది. ఈ విధముగా గ్రంథమంతయు వచనముగా నుండుటవలన పరిశీలనకు వీలుగా పద్య, వచన క్రమమును సంఖ్యాక్రమముతో సూచించుట క్లిష్టమయిపోయినది. ఆధునికమైన 'పేరా' పద్ధతిలో విభజించి లెక్కించుటకూడ కొన్నిచోట్ల కుదురనిస్థితి. అయినను సాధ్యమయినంతవరకు అనుకూలమగు రీతిలో పద్యములకు వచనములకు క్రమసంఖ్య రూపొందించు

బడినది. ఈ రూపొందింపబడిన సంఖ్యాక్రమరీతి ఈ గ్రంథమున కల్పితమే కాని సహజముకాదు.

'సుకవి మనోరంజనము' నందు దాదాపు వందకుపైగా తెలుగు కావ్యములు, లక్షణగ్రంథములనుండి, పాతికపైగా సంస్కృత కావ్య, లక్షణ, వ్యాఖ్యాగ్రంథముల నుండి లక్ష్యములు, లక్షణములు ఉదాహరింపబడినవి. అయితే దాదాపుగా అన్ని గ్రంథములును సంకేతాక్షరములతోనే సూచింపబడినవి. ఉదాహరణకు 'ఎ। హ।' అనగా ఎఱ్ఱనగారి హరివంశము, 'తి। ఉ।' అనగా తిక్కనగారి ఉత్తర రామాయణము. 'తిం। ల।' అనగా తిమ్మకవిగారి లక్షణ సారసంగ్రహము. 'కా। ఆం।' అనగా కాకునూరి అప్పకవికారి ఆంధ్రశబ్దచింతామణి (అప్పకవీయము). 'చే। వి।' అనగా చేమకూర వేంకటకవిగారి విజయవిలాసము. 'స।' అనగా సభాపర్వము. 'ఆ।' అనగా ఆదిపర్వము. ఈ విధములుగా సంకేతములనే ఉపయోగించుటవలన కొన్ని సందర్భములలో అస్పష్టత కవకాశమేర్పడినది. ఉదాహరణకు 'కోతిరాయఁడ మాపయిఁ గూర్మి నిలిపి...' అను పద్యము యొక్క ఆకరము 'తిం। సా। అ।' అని సూచింపబడినది. ఇందలి 'తిం' తిమ్మనకుసూచకము. మరి 'సా। అ।' ఏమి? ఈపద్యము కూచిమంచితిమ్మన రచించిన అచ్చతెనుగు రామాయణము కిష్కింధాకాండములోని 64వ పద్యము. ఈ పద్యము గుర్తుపట్టబడినతరువాత 'అ' అన్న సంకేతము స్పష్టమయినది. మిగిలిన 'సా।' అస్పష్టము. కాని ఈ 'సా'-'సార్వభౌముడు' అనుటకు సూచకము. కాగా 'తిం। సా। అ।' అనగా 'తిమ్మకవి సార్వభౌముడుగారి అచ్చతెనుగు రామాయణము'. అయితే ఈ 'సా।' కొన్నిచోట్ల ఉండి, కొన్నిచోట్ల లేకపోవుటచే అస్పష్టత ఏర్పడినది. ఇట్లే 'అ। కు' అనియుండగా 'కు' కుక్కుటేశ్వరశతకమని యూహ.[1] మరి 'అ'-అనగనేమి? ఎంతసును దీనివివృత రూపము స్పష్టముగాలేదు. అయితే-పద్యముల రీతినిబట్టి-వాటినుదాహరించిన రీతినిబట్టి 'అ।' తో సూచింపబడినవి వేంకటరాయని స్వీయ రచనలనిపించును. అప్పుడు 'అ' అనగా 'అస్మదీయము' అగును. 'అస్మదీయమని' 'మదీయమని' పద్యముల నుదాహరించుట సంస్కృత కావ్యశాస్త్ర గ్రంథములలో విరివిగా కన్పించును. అందువలన 'అ' వేంకటరాయ సూచకముగా భావింపబడినది.

---

1. అ. కు. సంకేతముతో ఒకే ఒక సీసపాదము ఉదాహరింపబడినది.

ఈవిధముగా చూచినచో—అవతారికయందు వేంకటరాయడు తాను రచించిన గ్రంథముల పేర్లు చెప్పకపోయినను-కుక్కుటేశ్వర శతకముతోబాటు, గోపికా హృదయలోల శతకము, రామచంద్ర శతకము వేంకటరాయని రచనలని చెప్ప వలనుపడుచున్నది... ఈవిధముగా సంకేతములను చాలవరకు గుర్తించి పూర్తి పేరులు వ్రాయబడినవి. ఈయంశమిట్లుండగా, కొన్ని పద్యముల ఆకరములు తప్పుగానున్నవి. ఉదాహరణకు 'ద్రోణుఁడు రయమున నేసిన...' యన్న విరాట పర్వము (5-129) పద్యము ద్రోణపర్వము లోనిదిగా సూచింపబడినది. ఈ పొరపాటు ఆకరముల వలన కొన్ని గ్రంథములలోనివిగా ఉదాహరింపబడిన పద్యములు ఆ గ్రంథములలో కన్పించవు. సాధ్యమయినంతవరకు ఆకరములు వెతికి చూపబడినవి. అసంపూర్ణముగా ఉదాహృతములైన పద్యములు— ప్రధాన ముగా సీస పద్యేతరములు— పూర్తిచేసి చూపుటకు సాధ్యమయినంతవరకు ప్రయత్నించబడినది. ఈ పూర్తి చేయబడిన భాగము కుండలీకరింపబడినది. ఉదాహృత పద్యములకు ఈనాడు ముద్రిత ప్రతులందలి ఆ పద్యములకు కొంత పాఠభేదము కన్పించును. ప్రధానముగా అఖండ యతికి సంబంధించి ఉదాహ రింపబడిన పద్యముల పాఠభేదములు అధోజ్ఞాపికలు యందు చూపబడినవి. మిగిలిన చోట్లకూడ అక్కడక్కడ ఈ పాఠభేదములు చూపబడినవి, ఈ పనికి ఆం ప్ర. సా. అకాడమీ వారు ప్రచురించిన ప్రబంధములు, వావిళ్ళ వారి ప్రచు రణలు, ఉస్మానియా విశ్వవిద్యాలయము వారు ప్రచురించిన 'భారతము' (సంశో ధితప్రతి) ఆధారములు. పై వారు ప్రచురించని గ్రంథములు ఇందు సహాయ పడినవి కొలది మాత్రమే.

గ్రంథమంతయు దాదాపుగా వచనమున సాగినదిగదా! ఈ వచన రచనలో పలుచోట్ల ఊరక వాక్యములు తెగిపోయినట్లుగా, వాక్య మసంపూర్ణ మన్నట్లుగా భాసించును. అట్టి చోట్ల స్పష్ట ప్రతిపత్తి కొరకు కొన్ని సంబం ధక పదములు, వాక్యములు చేర్చబడినవి. ఈ చేర్చబడిన పదాదులు వక్ర రేఖా కుండలీకరణ ( )ముతో చూపబడినవి. ఇట్లే, తా.ప. ప్రతి యందు అక్కడక్కడ శిలమయిన అక్షరములును, పదములును పూరించబడిన చోటులు ఋజు రేఖా కుండలీకరణ [ ] ముతో చూపబడినవి.

గ్రంథకర్త గ్రంథమున పలుచోట్ల ప్రదర్శించిన పదసమూహము స్పష్టతకొరకు పట్టికల రూపమున కూర్చబడివి. ఇట్లు గ్రంథమున చూపబడని యొకటి రెండు అనుబంధములందు అకారాదిక్రమముగా చూపబడినవి.

'సుకవి మనోరంజనము'న వచన రచనలో వేంకటరాయడు ఉపయోగించిన భాష కొంత వింతగా కన్పించును. అది నాటి—'నాటి' మాత్రమే కాదు, నేటి' కూడా—పలు ప్రాచ్య విద్యాపారంగతులు పాఠ ప్రవచన వేళనుపయోగించు భాషారీతిలో సాగినది. అచ్చముగా గ్రాంథికము కాదు, కాని గ్రాంథిక రీతికి—ఒక విధముగా కందుకూరి వారు ప్రతిపాదించిన సులభ గ్రాంథిక రీతికి చాలా దగ్గరగా నుండును. అయితే వ్యావహారిక భాషారీతి క్రియాపద ప్రయోగములో విరివిగా నున్నది. వాక్యమంతయు గ్రాంథిక మన్నట్లుగా సాగిసాగి, 'వ్రాసుతాము', 'చెప్పుతాము' వంటి వ్యావహారిక రూపములతో పూర్తియగును. పోయెడిది' అనుటకు 'పోయీది' వంటి క్రియాపద రూపములు గూడ ప్రయుక్తములయినవి. సామాన్యముగా ప్రాచీన లక్షణ గ్రంథములలో నుపయోగింపబడు వచన స్వరూపమిట్లె యుండును. వ్రాతలో అర్ధానుస్వారము లేదు గాని, 'అందఱు' వంటి పదములలో నియతముగా శకట రేఫము వ్రాయబడినది. ప్రసిద్ధముగా శకట రేఫయుతములైన పదములు ఈ గ్రంథమున సాధురేఫములతో నున్నచో, ఆ పదములు 'ఉభయరేఫము' లనియో, సాధురేఫ సహితములే యనియో భావించవలసి యుండును. వేంకటరాయడు రేఫ-శకట రేఫ నిర్ణయ విషయమున ఆ నిర్ణయము చేసిన తన కన్న పూర్వులగు వారిని విమర్శించిన రీతిని గమనించినచో, ఈ యంశము స్పష్టమగును. ఈ దృష్టితో ఈ గ్రంథమందలి భాషా ప్రయోగము యథాతథముగా నుంచబడినది. గ్రాంథిక- వ్యావహారిక భాషా ప్రయోగ క్రమ పరిణామ రూపమును మాధ్యమిక రూపమును గ్రహించుటకు ఈ భాషా ప్రయోగ పరిశీలనము ఉపయోగించును.

ఈ విధమయిన స్వరూపముగల 'సుకవి మనోరంజనము' సాధ్యమైనంత వరకు సమగ్ర రూపముగా, సహృదయ పరిశీలనకు యోగ్యముగా ప్రస్తుతీకరించబడుచున్నది,

## '—రంజన' స్వరూపము

కూచిమంచి తిమ్మన తన 'లక్షణసారసంగ్రహ' ప్రారంభమున-'తెలుఁగు నకు' మున్న లక్షణంబును మహాకవీశ్వరులు పెక్కురచియించియిడి, రిఁకేల కూర్చవలె?-'అని తన లక్షణగ్రంథ రచనావిషయమున తనసుతానే ప్రశ్నించు కొని'-ప్రౌఢికొఱకు నాకుతెలిసినతెఱంగు నొకకొంత తేటపఱుతు(1-9)'అన్నాడు మరియు-'నన్నయభట్టాదులు కృతుల న్నిలిపిన లక్ష్యములును లక్షణములు యుక్తి న్నెమకి కృతియొనర్చు' చున్నానన్నాడు. ఆయన మార్గమునే వేంకట రాయదును కవీంద్రులతో నిట్లన్నాడు:-

సీ. సుకవీంద్రులార! సర్వకలాకలాపర
　　　త్నములార! మును లక్షణములు పెక్కు-
గలుగగఁ గ్రొత్త లక్షణ మేల రచియించె
　　　నితఁ డని మీకు నుపేక్ష వలదు,
తొల్లిటివారును తోచినయటుల వే
　　　ర్వేరు రచించిన వారు గారె
నేనును తద్రీతినే రచియించితి
　　　నారసి మీకు గ్రాహ్యంబులైన
వాటిని గొనుండు, తప్పులు వాటిలిన ద
గు దయ దనర దిద్దుడు, తద్ద గ్రంథసమితి
నరసి-విబుధుల దెలసి సమంచితముగ
సంఘటించితి, కుక్కుటేశ్వరుని కరుణ.

ప్రశ్నించుకొనుట తిమ్మనవలెనే కన్పించునుగాని, సమాధానము మాత్ర మంత కచ్చితముగా కన్పించదు. వెనుకటివారు రచించినారు, తాను రచించి నాడు. వారికి తోచినట్లు వారు రచింపగా తనకుతోచినట్లు తాను రచించినాడు. ఇక్కడ 'తోచుట' కీలకముగా కన్పించుచున్నది. ఒక దొక లక్షణ మెందుకు రచించును? అంతకుముందు లక్షణమే లేనప్పుడు, లేదా, పూర్వులు చెప్పిన లక్షణము సరయినది కాదనుకొన్నప్పుడు, కాదా అసమగ్రమైనప్పుడు తాను లక్షణము సమకూర్చుటకు ప్రయత్నించును. వేంకటరాయని విషయమున

మొదటియంశము కుదురదు. కాగా చివరి రెండంశములే ఉపయోగించును.-తనకన్న పూర్వులు చెప్పిన లక్షణాంశములు సరిగా, లేదా సమగ్రముగా లేవని తోచి, తనకు 'తోచినయటుల' లక్షణము నిరూపించినాడు, కొన్ని సవరించి చూపినాడు. అయితే తనకు పూర్వుల లక్షణములందు దోషములు కనిపించినట్లు, తాను చెప్పినయంశములందును కొందరికి లోపములు 'తోచ' వచ్చును. తోచిన చో, 'ఉన్న'చో 'దిద్దు' దన్నాడు. ఈ యన్న దెవరితో? సుకవీంద్రులతో,-సర్వకలాకలాపరత్నములతో. వారైనను దిద్దబూనినప్పుడు ఒక అంశమును గుర్తుంచుకొనవలెను. తాను బహుగ్రంథములు పరిశీలించి, విబుధులతో చర్చించి బహ్వంశముల 'తెలసి' ఉచితరీతిలో నీ గ్రంథమును కూర్చినాడు. కావున 'దిద్దు' టలో తొందర పడగూడదని సూచించినాడు. ఇట్లనుటచే పూర్వులుచేసిన గ్రంథపరిశీలనలో, చర్చలలో లోపములున్నవని వేంకటరాయడు భావించినట్లు స్పష్టమగును. అందువలన తనలోపము లెన్నునపుడును బహుగ్రంథ పరిశీలన జాగ్రత్తగాచేసి, బాగా చర్చించియే 'లోపము' లనుడని వేంకటరాయని భావన.

పూర్వుల లక్షణ మసమగ్రమనుకొన్నాడుగదా! మరి అది యెవరి లక్షణము? ఎవరో ఒకరిదోకాదు, ఎవరుచెప్పిన దసమగ్రమయినచో నది తనకు వస్తువగును. కాని ప్రధానముగా అప్పకవి చెప్పిన లక్షణమే వేంకటరాయనికి ముఖ్యవస్తువయినది. ఎందుకు? అప్పకవి అనేక లక్షణగ్రంథముల బేర్కొని 'ఒకదానికంటె మఱివేఱొకటి విశేషంబుఁ జెప్పుచుండు కతమునన్, సకలగ్రంథములను జదువక తెలియునె లక్షణప్రపంచఁబెల్లన్' (1-6) అనిచెప్పి, ఆయాగ్రంథములందలి సర్వవిశేషములను తాను తన గ్రంథమున గూర్చినానను భావముతో-'ఇది చదివినపిమ్మట మఱి, యెదియేనియుఁజదువు బుద్ధి యేలా వొడముఁన్, బదఁపడి గ్రంథములన్నియు, వెదకి వెదకి సారమెల్ల వివరింపంగన్' (1-7) 'పర్వతములెల్ల నొక్క దర్పణమునందుఁ, జూపడు తెలుంగునను గవిత్వోపయోగ, లక్షణములన్నియును సరళంబుగాఁగ, నెఱుఁగఁబడు నిందుఁదెలియనూహించిరేని' (1-8) అని తన గ్రంథసమగ్రత్వమును గూర్చి ఎంతో చెప్పుకొన్నాడు. అనగా తత్పూర్వలక్షణ గ్రంథములన్నిటికన్న అప్పకవి గ్రంథము సమగ్రమని భావము. అప్పకవి గ్రంథమునకు 'అప్పకవీయ' మని ప్రసిద్ధి కాని, దాని యసలుపేరు 'ఆంధ్రశబ్దచింతామణి'. 'శబ్దానుశాసను'డగు నన్నయగారు సంస్కృత భాషయందు 'సంక్షేపంబుగాఁగూర్చిన' ఆంధ్రశబ్ద చింతామణికి

విస్తృతముగా రచించినవ్యాఖ్య దానికి అప్పకవి 'ఆంధ్రశబ్ద చింతామణి' అనియే పేరు పెట్టినాడు. వేంకటరాయడును ఆ పేరునే బహుళముగా స్వీకరించినాడు. 'అప్పకవీయ' మని పేర్కొన్నతావులు చాల తక్కువ, ఇటు 'సమగ్రము' గా భావింపబడు అప్పకవి గ్రంథమును ప్రధాన పరిశీలనీయముగా గ్రహించినాడు. దానిని విమర్శించినచో దాదాపుగా తత్పూర్వలక్షణములన్నింటిని ఒక విధముగా విమర్శించినట్లే యగును. ప్రాసంగికముగా నితర లాక్షణికులు చెప్పినయంశ ములను గూడ విమర్శించినను, వేంకటదాయనికి 'ఆంధ్రశబ్దచింతామణి' యే ప్రధానమైనది.

వేంకటరాయని నాటికి 'అప్పకవీయ' మే కాక భారతాదులయిన పలు ప్రాచీన కావ్యములును అచ్చుకెక్కినవి. ఆ కావ్యములను 'పరిష్కారము' చేసిన వారు అప్పకవీయాధారముగా నాయా కావ్యములందు పలుప్రయోగములకు రూ పాంతరములు కల్పించినారు. కొన్నిపాఠములు 'అలాక్షణికము' లయినవి. ఇదంతయు గమనించిన వేంకటరాయుడు అప్పకవీయమందలి లోపములను వెలు వరచుట అవసరమనుకొన్నాడు అప్పకవి పలువిషయములందు పడిన పొర పాటులను, చేసిన అపలక్షణములను యుక్తియుక్తముగా విమర్శించి-తనకు 'తోచి నటుల' సరియైన లక్షణములను సోదాహరణముగా నిరూపించినాడు. అప్పకవి పలుసందర్భములందు-సుకవుల ప్రయోగముల ప్రమాణీకరించుచు, లోపములను చూపి అప్పకవిని నిరాకరించుట నిజముగా సుకవిమనోరంజకమైన పని. అందుకే వేంకటరాయని లక్షణగ్రథము 'సుకవిమనోరంజన' మయినది

పూర్వలాక్షణికులును స్వేతర లాక్షణికమతములతో భేదించిన సందర్భ ములు లేకపోలేదు, ఇతరుల కొన్ని లక్షణములను నిరాకరించిన తావులును లేక పోలేదు అయితే ఆభేదించుటయు, నిరాకరించుటయు సూత్రప్రాయముగానే జరిగినది తప్ప చర్చారూపమున సాగియుండలేదు. ఈపద్ధతి అప్పకవీయమందు మాత్రము కొంతకొంతగా అక్కడక్కడ కన్పించును. అహోబల పండితీయము 'భాష్య' గ్రంథము కావుటంజేసి దానియందీపద్ధతి విస్తృతముగా నున్నది. 'సుకవి మనోరంజనము' అచ్చముగా దేనికిని వ్యాఖ్యాగ్రంథముగానీ, భాష్యగ్రంథముగాని కాదు. అయినను ఇందులో విస్తృతముగా చర్చారీతి అనుసరించబడినది. పూర్వలక్షణమును స్పష్టముగా ఉదాహరించి, దానిని

చర్చించి యుక్తాయుక్తముగా నిరాకరించు పద్ధతి ఇందున్నది. అహోబల పండితీయమువలె కన్పించును. అయితే అహోబలపండితీయము 'ఆంధ్రశబ్దచింతామణి' కి భాష్యము. మరి యిది దేనికిని కాదు. ప్రాచీన లక్షణగ్రంథములందువలె లక్ష్యలక్షణములు ప్రదర్శించబడినవి. కాగా 'భాష్య' లక్షణము, 'లక్షణగ్రంథ' లక్షణము-ఈ రెండు పద్ధతులను స్వాయత్తీకరించుకొన్న, విలక్షణమైన రీతిలో రూపొందినదీ 'సుకవిమనోరంజనము'.

సుకవిమనోరంజనమున గమనింపదగిన యంశము మరొకటియున్నది. సాధారణముగా లక్షణకర్తలు స్వంతముగా లక్షణము రచించి, ఇతరకవి ప్రయోగములను-కొన్నితావుల తమ ప్రయోగములను గూడ-లక్ష్యములుగా ప్రదర్శింతురు. కొన్నిచోట్ల ఇతర లాక్షణికులు చెప్పిన లక్షణములను గూడ తమ లక్షణములతోబాటు ప్రదర్శింతురు వేంకటరాయడు మాత్రము లక్షణములుస్వంతముగా లక్షణముౘవ్రాసిన తావులు మిక్కిలితక్కువ. ఇతర లక్షణకర్తల లక్షణములనే సామాన్యముగా నుదాహరించి లక్ష్యములు ప్రదర్శించినాడు. పూర్వలాక్షణికులు చెప్పిన లక్షణములు సమగ్రముగా, సరిగా లేవనుకొన్నప్పుడు మాత్రమే తాను లక్షణము వ్రాసినాడు. వేంకటరాయడు గ్రహించిన పూర్వలాక్షణికులు చెప్పిన లక్షణములలో అప్పకవి చెప్పిన లక్షణములే ఎక్కువ. ఆ తరువాత కూచిమంచి తిమ్మనవి. మిగిలినవి చాలా తక్కువ. అప్పకవిని తీవ్రముగా విమర్శించుచును, పలుచోట్ల అతని లక్షణములనే ప్రమాణీకరించుట వేంకటరాయని సహృదయతకు నిదర్శనమనవచ్చును.

ఈ సందర్భమున గమనింపదగిన మరొకయంశముకూడ నున్నది. వేంకటరాయడు తనతాతగారి తాతగారైన తిమ్మన రచించిన లక్షణసారసంగ్రహమును పలుచోట్ల యథాతథముగా స్వీకరించుకొన్నాడు. రేఫ-ఱకారములు గల పదముల నిర్ణయసందర్భము దీనికుదాహరణగా చూపవచ్చును. అయితే తిమ్మనతో భేదించిన సందర్భములును లేక పోలేదు. కాని నిరాకరించుటలో సమర్థించు తీరు కన్పించును కొన్ని తావులలో తిమ్మనపేరు చెప్పకుండ సామాన్యరీతిలో ఎవరో చెప్పినట్లు ఉదాహరించి అది సరికాదన్నసూచన యుండును. ఇంతే తప్ప ఇతరుల లక్షణమును నిరాకరించునప్పుడు ప్రదర్శింపబడు తీవ్రత యుండదు తిమ్మనపై వేంకటరాయనికున్న అపారమైన భక్తి ప్రపత్తులు అతని యీ ప్రవర్తనమునకు కారణము కావచ్చును.

'లక్షణ గ్రంథ' మనునది సామాన్యమైన మాట. ఛందో వ్యాకరణాది గ్రంథముల కన్నింటికిని వర్తించును. కాగా 'సుకవి మనోరంజనము' ఛందో వ్యాకరణాదులలో ఏ వర్గమునకు చెందినది? 'పంచాశద్వర్ణ నిర్ణయము'తో గ్రంథ మారబ్ధమగుటచే వ్యాకరణ గ్రంథమా యనిపించును. కాని గ్రంథమందలి యంశ ములను ఆసాంతముగా పరిశీలించగా 'ఛందో' గ్రంథమని స్పష్టమగును. సుకవి మనోరంజనమున విచారితమయిన యంశము లీక్రింది విధముగా నున్నవి.

ప్రథమాశ్వాసము :-

ఇందులో మొదట సంస్కృతాంధ్ర భాషల యందు ఉండు వర్ణముల విష యము చర్చాపూర్వకముగా నిర్ణయింపబడినది. ఆ తరువాత ప్రాసముల నిరూపణము చేయబడి, చివరకు అప్పకవి చెప్పిన ప్రాస భేదములు విమర్శింప బడినవి.

ద్వితీయాశ్వాసము :-

ఇందు మొదట అప్పకవి చెప్పిన యతి భేదములు విమర్శింపబడి, స్వమ తాను సారముగా యతిభేద సంఖ్యా పరిగణనము చేయబడినది. స్వరయతి, వ్యంజన యతి భేదములు నిరూపింపబడినవి.

తృతీయాశ్వాసము :-

ఈ ఆశ్వాస మంతయు నుభయ యతుల నిరూపణమున కుపయోగింప బడినది. చివర ప్రాసయతి రీతి చెప్పబడినది.

చతుర్థాశ్వాసము :-

ఇందు అప్పకవి మరికొందరు రేఫ-ఱకారములుగల పదముల నిరూపించు టలో పడిన పొరపాటులు వివరింపబడినవి. ఆ తరువాత తిమ్మన ననుసరించి రేఫ ఱకారములుగల పదములు ప్రదర్శించబడినవి. చివరకు యతిప్రాసలలో కవులు చేసిన రేఫ-ఱకార సాంకర్యము ప్రదర్శింపబడినది.

పంచమాశ్వాసము :-

ఇది యొకవిధముగా ప్రకీర్ణము. ఇందు కొన్ని సంధి విషయములు, గ్రామ్యపద విషయములు, సంస్కృతాంధ్రము లందలి కొన్ని పదముల స్వరూ

పముల నిరూపణము, కొన్ని దోషముల విమర్శనము చేయబడినది. ఈ దోష ములు ప్రతాపరుద్రీయము నందు వివరించబడినవి. వాటి సామంజస్యము చర్చింపబడినది

ఈ రీతిని గమనించినచో గ్రంథమునందు ఛందో విషయములకే ప్రాధాన్యము కన్పించును. కేవలము యతి ప్రాసల విషయ మున్నంత మాత్రమున ఛందోగ్రంథ మగునా యనవచ్చును. కాని తెలుగు ఛందో గ్రంథములను పరిశీలించినచో ప్రధానమైన యంశములు యతి ప్రాసలేయని స్పష్టమగును. వృత్తములను, జాతులను కొందరెక్కువ సంఖ్యలో చెప్పవచ్చును. కొందరు తక్కువ సంఖ్యలో చెప్పవచ్చును. ఎవరు చెప్పినను పద్యముల లక్షణములలో పెద్ద తేడా యేమియునుండదు. కొన్ని పద్యములందు యతి చెల్లించవలసిన స్థానములను గూర్చి కొంత భిన్నాభిప్రాయ ముండుటయే తప్ప, మిగిలిన భేదము లకించనములే. కాగా యతిభేదములను, ప్రాసభేదములను చెప్పుటలోనే మతవైవిధ్యము విరివిగా కన్పించును. భిన్నభిన్న ఛందోగ్రంథములందు యతిప్రాస భేదముల పెరుగుదల, తరుగుదలలను గమనించినచో ఛందోగ్రంథములందు వాటి ప్రాధాన్యము సువ్యక్తమగును. తెలుగులో అనేకమయిన పదముల స్వరూపమును నిర్ణయించుటకు ఉపయోగించుట వలన గూడ యతిప్రాసలు ప్రధానములయి పోయినవి. అందువలన అక్షర నిర్ణయము కాగానే వేంకట రాయడు ప్రాసలను, యతులను వాటి భేదములను గూర్చిన విచారమును ప్రారంభించినాడు. గ్రంథమందలి మూడున్నర ఆశ్వాసములలో నీ విచార, విమర్శ, నిరూపణములు వ్యాపించి పోయినవి. రేఫ-ఱకార నిర్ణయముగూడ ఒక విధముగా ఛందో విషయికమే. రేఫ-ఱకారములకు యతి ప్రాసల నంగీకరించక పోవుట వలన ఈ నిర్ణయము లాక్షణికులకు తప్పని సరియై పోయినది. కాగా పంచమాశ్వాస మొక ప్రకీర్ణకము. ఇందును ఛందోభంగము, దాని ననుసరించి 'గురు' లఘు-వర్ణ విషయిక విచారము చేయబడినది. ఈ విధముగా సుకవి మనోరంజనము ఛందోగ్రంథమయినది. అయితే వ్యాకరణాంశములు గానీ, తద్విషయిక చర్చలు గానీ ఇందు లేకపోలేదు. కాని అవియన్నియు ఛందో వ్యాకరణములకున్న సాన్నిహిత్యమును బట్టి ప్రసక్తానుప్రసక్తముగా కొన్ని, అప్పకవి పొరపాటులను బయట పెట్టుటకు కొన్ని ఇందు సమీకృతము లైనవి.

వేంకటరాయడు తన 'సుకవి మనోరంజన'మందు దాదాపు వంద గ్రంథములనుండి వేయి పద్యములకు పైగా ఉదాహరించినాడు. మరి ఇన్ని గ్రంథములను స్వయముగా పరిశీలించియే ఈ ఉదాహరణము లిచ్చినాడనుటకు కచ్చితముగా వీలులేదు. ఈ ఉదాహరణ పద్యములలో ఎన్నో పద్యములు పూర్వలక్షణ గ్రంథములందు ఉదాహరించబడియున్నవే. కవిసంజీవని, అప్పకవీయము, తిమ్మన 'లక్షణ సారసంగ్రహము', రంగరాట్ఛందములను చూచినచో నీయంశము స్పష్టమగును. అయితే అఖండయతికి లక్ష్యములుగా చూపబడిన పద్యములలో నత్యధిక భాగము వేంకటరాయని పరిశీలనా ఫలితములే యనచ్చును. మరియు కొన్ని లక్షణ గ్రంథములందు ఒక గ్రంథములోని పద్యములను వేంకటరాయ డింకొక గ్రంథములోనివిగా ఉదాహరించినాడు. ఉదాహరణకు రంగరాట్ఛందమున 'శాశ్వతవిశ్వ విశ్వంభరా చక్రమీ, రాజుకుమారుఁడేలంగఁ గలఁడు' అన్న సీసపాదము 'శ్రీనాథుని సునందన చరిత్ర' లోనిదని చెప్పబడగా, వేంకటరాయడు 'శ్రీనాథుని మరుత్త చరిత్ర'లోనిదన్నాడు. అసలు ఆ పాద మేగ్రంథమందలిదని తెలియుట కా గ్రంథము లలభ్యములు. మరి వేంకటరాయడీ విధముగా నుదాహరించుటకు కారణ మనూహ్యము. మరెచ్చటనైన మరుత్త చరిత్రలోనిదీ పద్యమని చూచియైన నుండవలెను. లేదా, ఊహించియైన యుండవలెను. 'సునందన చరిత్రము' శ్రీనాధుని రచనగా తెలియ రాదుగదా! ఈ విధముగా మరికొన్ని పద్యములును కన్పించును ఇన్ని గ్రంథములు చూచినను చూడకున్నను వేంకట రాయని పాఠ పరిశీలన మాత్రము ప్రశంసనీయ మయినది. తెలుగు గ్రంథములే కాదు, పలు సంస్కృత గ్రంథముల నుండియు ఉదాహరించిన పద్యములను బట్టి యీ యంశము సువ్యక్తమగును.

వేంకట రాయని రచనా రీతిలో గమనించవలసిన యంశమొకటియున్నది. ఒక పద్యము నొక యంశమునకు ఉదాహరించి, ఆ పద్యమందు గమనించవలసిన యితరాంశములున్నచో వాటినిగూడ సూచించును. 'లుప్తవిసర్గక స్వరయతి'కి 'తాసైరింప కపర్దయుండగ...' అను పద్యము నుదాహరించి, నాల్గవ పాదమున కాకుస్వరయతియు నున్నదని తెల్పినాడు. ఇట్లే రేఫ-ఱకారములకు యతి చెల్లింపబడినదని ఉదాహరణములు చూపుచు రామభద్రుని 'జయరమా రామశతకము' నుండి 'చలమున నీవు...' అను పద్యము ఉదాహరింపబడినది. ఆ పద్యమున 'ముష్టా ముష్టి' యను ప్రయోగమున్నది. దానిని ప్రస్తావించి 'ముష్టముష్టి'యని

యుండవలెనుగాని 'ముష్టాముష్టి'యని యుండగూడదని 'వ్యాకరణ సూత్రముల నుదాహరించి నిరూపించినాడు. ఈ విధమయిన రీతిని గమనించినచో నొక యంశము స్పష్టమగును. వేంకటరాయడు ప్రయోగపరిశీలన సందర్భమున ఏ యొక యంశమున కనియో గాక, పలుముఖములుగా పరిశీలన సాగించును విశేషాంశములు మరెక్కడోకాక అక్కడి కక్కడే సూచించును, వివరించును. సాధారణముగా పాఠప్రవచనము సందర్భమున ఉత్తమోప దేశికులు అవలంబించు పద్ధతియిది. వేంకటరాయని రచనా రీతియందు పలుచోట్ల నీ'దేశికత'కన్పించును ఇట్లు సునిశిత రీతిలో సాగిన వేంకటరాయని విచార విమర్శధారా ధోరణిలోని కొన్ని యంశములు పరిశీలించదగినవి. ఆనందించదగినవి.

## సుకవి మనోరంజనము :

## సంస్కృతాంధ్రవర్ణ విచారము.

'ఆద్యాయాః పంచాశ ద్వర్ణాః'—సంస్కృత భాషకు వర్ణము లేఁబది—యని 'చింతామణి' చెప్పుచున్నది. ఈ పంచాశద్వర్ణ పరిగణన విషయమున అప్పకవితో ప్రధానముగా నొక యంశమున వేంకటరాయడు విభేదించినాడు. అప్పకవి ళకారమును కలుపుకొని, క్షకారమును వదిలి యేబది వర్ణము లన్నాడు మరియు ళకారమును వదిలి క్షకారమును గ్రహించినందుకు అనంతుని 'వెఱ్ఱి' వాడని అవహేలన చేసినాడు. కాని వేంకటరాయనికి యిద్దరి మతములును సరిగా కన్పించలేదు. అయినను అనంతుని 'వెఱ్ఱి'వాడని యప్పకవి యనుట ఆయనకు బాధ కలిగించియుండును అందుకని అప్పకవి మతమును ఖండించి 'ఎద్దేవా' చేసినాడు. అప్పకవి మతమును ఖండించుటలో వేంకటరాయడు చెప్పినయంశము లివి i. ళకారము సంస్కృతవర్గ సమామ్నాయ మందు ఉన్నదనుటకు శాబ్దికు లెవరు నంగీకరించలేదు. ii. కాళ, నాళ, వ్యాళాది పదములందు ళకారము కాక, కాల, నాల వ్యాల-ఇత్యాదిగా లకారమున్నదన రా దనుటకు ప్రమాణమేమియు లేదు. ii. 'లోళః'యని ప్రాకృత వ్యాకరణమున వాల్మీకి లకారమును ళకారము నాదేశించుటచేతనే సంస్కృతమున ళకారము లేదనుటను స్పష్టము చేయును.[1]

---

1. వేంకటరాయడు తన గ్రంథమందెక్కడను సంస్కృత పదములలో 'ళ' కారము వ్రాయలేదు. తత్స్థానమున 'ల' కారమే వ్రాసినాడు.

కాగా, ళకారము పంచాశద్వర్ణములలో నొకటిగా పరిగణనీయముకాదు. క్షకారము క్ + ష్ వర్ణ సంయోగరూపమున నేర్పడినదిగాన ఎట్లును ప్రత్యేక వర్ణముగా పరిగణనీయముకాదు. అయితే ఆ రెంటిని వదిలినచో నలువదెనిమిది వర్ణములేయగును కావున వేంకటరాయడు 'జిహ్వామూలీయ-ఉపధ్మానీయము'లను కలుపుకొని 'పంచాశత్' సంఖ్యను పూరించినాడు. ఈ రెండింటిని కలుపుకొనుట కంగీకరించని అహోబలుని వాదములోని నిస్సారతను ప్రదర్శించుచు, రేఫకాదేశమైన విసర్గను అచ్చులందు పరిగణించి ఉత్పత్తి స్థానములు చెప్పబడిన యీ రెంటిని వర్ణాంతరములుగా గ్రహించకుండులో నౌచిత్యము లేదన్నాడు. మరియు ఎక్కడను చెప్పబడని ళకారమును గ్రహించి, చెప్పబడిన వీటిని నిరాకరించుట అప్రామాణికమని సూచించినాడు. ఈ విధముగా తన మతమున పంచాశ ద్వర్ణములను నిరూపించి, ఈ 'మతములందు ఎవరిమతము బాగుంటే దానిని స్వీకరించవలె'నని 'బుద్ధిమంతుల'ను కోరినాడు

సంస్కృత భాషకు పంచాశ ద్వర్ణములనైతే అంగీకరించినాడు గాని, తెలుగునకు ముప్పదియారు వర్ణములనుటను మాత్రమంగీకరించలేదు. రేఫ-శకట రేఫ గల పద నిరూపణమున నంతగా శ్రద్ధవహించి, ఆ రెంటికిని యతి ప్రాసలు చెల్లవన్నపుడు రేఫతోబాటు ఱకారమును గూడా ప్రత్యేక వర్ణముగా పరిగణించుట న్యాయము. తెలుగునకుండు వర్ణముల పరిగణించు 'చింతామణి' సూత్రమును బాలసరస్వతి—

'ద్వివిధా ది దు దే తో చో వక్రతమా వనుస్వారౌ
కగ చజయుగ టడణ తదన పబమ యరలవ సహళంతు హల్వర్గః'

అని పఠించినాడు. ఈ పాఠము ప్రకారము శకటరేఫ పరిగణనకు రాలేదు కాని ఈ కారిక ఉత్తరార్థము నప్పకవి—

'...క గ చ జ యుగ టడణ తదన
పబమ యరయుగ లయుగ వ స హాశ్చ హలః'

అని పఠించినాడు. ఇందులో 'రయుగ' అని యుండుట వలన శకటరేఫ గూడ గణనకు వచ్చినది. కాగా 'షట్త్రింశ దత్రతే' యన్నది అప్పకవి పాఠమున 'సప్తత్రింశదిహ' అని యున్నది. ఈ అప్పకవి పాఠమును వేంకట

రాయడు గుర్తించ వలసినది. కాని ఈ యంశమును వదిలి 'వ్యాఖ్యాకారు లందఱును 'షట్ త్రింశత్' అన్నారు'అని వ్రాసినాడు. మరి అప్పకవీయము చింతామణికి వ్యాఖ్యానమే. ఈ యంశమును వేంకటరాయడు గుర్తించక పోవుట చిత్రమే.

శకట రేఫమును వర్ణాంతరముగా గ్రహించి, అంతటితో నాగక 'శాలు, కాశ, జఱభి, ఝంఝూటము, ఖజ్జము-వంటి పదములందు కన్పించు 'శ, భ, ఝ, ఖ'అను వర్ణములను, 'ఠవర, ఢాక' వంటి పదములలో కన్పించు 'ఠ,ఢ'లను కలుపుకొని తెలుగునకు మొత్తము నలువది మూడు వర్ణములని వేంకటరాయడు నిర్ణయించినాడు. మరియు 'ఠవర' ఆది పదములను చెప్పియు ఠ,ఢల నప్పకవి పరిగణించక పోవుట నాక్షేపించినాడు.[1] అప్పకవి ఠవరా దిపదములను చెప్పిన దిట్లున్నది :-

'ఠవర, ఠీవి. ఠేవ, ఠావును, ఢాకయు
మొదలుగా ద్వితీయ వర్ణములు చతుర్థ
వర్ణములును గలుగు వాక్యంబులును స్వదే
శ్యములు గాని వైకృతములు గావు' (అ.క. 2-139)

---

1. ii-139. ఠవర, ఠీవి, ఠేవ, ఠావె, ఢాక మొదలైనవి స్వదేశ్యములుగాని, వైకృతములు కావు అని అప్పకవి వ్రాసినాడు. అతడే మరి యొకచోట "స్పర్శాంతరములందుఁ బంచవర్గములను సమముల్తెయుండు నక్షరములు పది...శుద్ధాంధ్ర దేశ్యభాషాపదములు వెదకినను లేవు" (ii-59) అని వ్రాసి యుండుటచేత స్వమత విరోధము కనబడుచున్నది. ఈ పదములలో 'ఠావు'అనేది వైకృత విశేష్యము, గ్రామ్యము అని శబ్దరత్నాకరములో నున్ను, హిందూస్థానీపదము అని సుప్తార్థ ప్రకాశికలో నున్ను ఉన్నది. నన్నయ, తిక్కన మొదలైన మహాకవులందరున్ను ఈ శబ్దము వాడినారు. ఇది నిజముగా వైకృతము- సంస్కృత భాషలోని 'స్థా' అనే ధాతువుతో సంబంధము కలది. తక్కిన పదములు దేశ్యములని శబ్ద రత్నాకరములో సహితము చెప్పి ఉన్నది. అయితే శుద్ధాంధ్ర దేశ భాషా పదములలో వర్గద్వితీయ చతుర్థ వర్ణములు లేవని చెప్పరాదు" శ్రీగిడుగు. (అప్పకవీయ పీఠిక పు. 56).

తవరాది పదములు స్వదేశ్యములగును గాని వైకృతములు కాదన్నట్లు పద్యమందున్నది. కాని స్వదేశ్యములనగా నేమి? వైకృతములనగా నేమి? వైకృతములనగా తెలుగు పదములని యర్థము. మరి స్వదేశ్యములనగా నేవో స్పష్టముకాదు. తెలుగుభాష తెరగులను వివరించుచు 'దేశ్య' మను నొక భేద మును చెప్పి, దానిని శుద్ధాంధ్ర, అన్యదేశజాంధ్రములని రెండుగా విభజించినాడు తప్ప స్వదేశ్యములను విభాగము నప్పకవి చెప్పలేదు. 'స్వదేశ్యము' లనగా దేశ్యపదములే యనుకొన్నచో 'స్వదేశ్యములుగాని వైకృతములుగావు' అన్నది సమన్వితముకాదు. మరియు పద్యమున 'వాక్యంబులును' అనుచోట 'ను'- సముచ్చయ మెందుకో స్పష్టముగాదు. ద్వితీయములు, చతుర్థవర్ణములును గలుగు వాక్యంబులు స్వదేశ్యములనవలయును. సముచ్చయార్థక 'ను' వలన మరియింతనేవో ఆ వర్ణములుగల వాక్యేతరములు చెప్పబడవలెను. కాని అట్టి వేవియు చెప్పబడలేదు. కాగా ఆ పద్యమంచు '...వాక్యంబులును స్వదేశ్య ములు...' అని యుండియుండును. అప్పుడది సమన్వితమగును. తవరాదులన్య దేశ్యములుగాని, తెలుగుపదములుకావు. కావున ఆ పదములందు కన్పించు ఠ, ఢ కారములను అప్పకవి తెలుగు వర్ణములుగా భావించినాడనుటకు వీలుకలుగదు. కాగా, వేంకటరాయడు తవరాదులను, శాల్వాదులను 'వైకృతములు' గానే భావిం చినాడు. వాటియందలి ఠ, శ మొదలగు వాటిని కలుపుకొని తెలుగువర్ణసంఖ్యను నలువది మూడింటికి పెంచినాడు. తవర, శాల్వాదులను వైకృతములుగా గ్రహించుటలో వేంకటరాయడు ప్రమాణములను ప్రదర్శించలేదు. వాటిని తెలుగు పదములుగా నితర లాక్షణికులును పరిగణించినట్లు కన్పించదు. కాగా అప్పకవి చెప్పిన 'సప్తత్రింశత్' సంఖ్యకు క్షతి కలుగలేదనియే చెప్పవలయును.

### 'అద్యః క్రియాసు...' సూత్రము
### 'ఆద్యగం...' దళము

ఈ సందర్భముననే 'ఉయ్యేల' మొదలగు పదముల విషయికముగా వేంకటరాయ దప్పకని నాక్షేపించిన తీరు గమనించదగినది. బాలసరస్వతి—

'అద్యః క్రియాసు భూతార్థ
ద్యోతిన మాద్యగం వినా సర్వః'

అని 'చింతామణి' సూత్రమును పఠించగా, అప్పకవి

'అద్యః క్రియాసు భూతా
ద్యర్థ సముద్బోతితం వినా సర్వః'

అని పఠించినాడు బాలసరస్వతి ననుసరించి చింతామణి పదాది యకారము నంగీంకరించుచుండగా, అప్పకవి ననుసరించి యంగీకరించుటలేదు. ఈ స్థితిలో అసలు పాఠమును అప్పకవి 'దిద్ది' నాడని:-

'దిద్దుటకు కారణమేమంటే, పదాదియందు యకారము లేదు, సూత్రమందున్నది. సూత్రము కొట్టుబడిపోకుండగా నుండుటకు దిద్దినారు. ఈ దిద్దినదైనా నిలువదు. ఏమి హేతువనంటే, కనబడియెడు, చనియెదరు, చనియె-ఈ మొదలైన పదములందు యకారముల కేత్వములన్నారు, సరే. కయ్యము సయ్యన -ఈ మొదలైన పదములందు యకారమునకు తలకట్టులన్నారు, సరె. కనియె, వినియె-ఈ మొదలైన క్రియాపదాంతములందు యకారముల కేత్వములని చెప్ప లేదు, కాని ఏత్వములును ప్రసిద్ధి. ఉయ్యలాది పదములందు తలకట్టులును గలవు. కావున నచ్చట (సూత్రము) కొట్టబడిపోయినది'.

అని వేంకటరాయ డాక్షేపించినాడు. మొదట 'చనియె' మొదలగు వాటి యందు యకారమున కేత్వము లప్పకవి చెప్పినాడని యంగీకరించుచునే, 'కనియె' మొదలగు క్రియా పదాంతములందు యకారముల కప్పకవి ఏత్వము చెప్పలేద నుట స్వవచన వ్యాఘాతముగా కన్పించును. ఇదిట్లుండగా 'ఉయ్యలా'దు లందు తలకట్లుండుటచే అప్పకవి సూత్రమును 'దిద్దు'ట వలన ప్రయోజనము లేకపోయిన దని ఆక్షేపణ. కాని, నిజమునకు- అప్పకవి పాఠ విషయమట్లుండగా- బాల సరస్వతి పాఠము ననుసరించియు ఉయ్యలాదులం దత్వము సాధింపబడదు. పైగా పదాది యకారము సిద్ధమగుచున్నది. అప్పకవి పాఠమున పదాది యకారమున కాస్కారము తప్పినది. ఇదియే అప్పకవి పాఠ ప్రయోజనము.

నిజమునకు 'ఉయ్యలా'దులం దత్వముండుట వలన సూత్రము కొట్టుబడి పోలేదు. సూత్రమును బట్టి అత్వమే ఉండవలయును. ఎత్వమే ఉండరాదు. 'ఉయ్యెలా'ది ఎత్వ సహిత రూపములను 'అద్యః క్రియాసు...' సాధించక పోవుట. సాధించకపోవుట వలననే 'డోలా భూషో త్తరీయాణి...' అన్న అధర్వణ కారిక జన్మించినది. ఈ కారిక వలననే ఉయ్యెలాదులం దెత్వము సిద్ధిం-

చును గాన, అప్పకవి ఉయ్యేలాదులను పదద్వయముగా విభజించుట 'స్వకపోల కల్పితమే' కాని ప్రామాణికము కాదని అహోబలు డప్పకవి నాక్షేపించినాడు. మరి యిట్లాక్షేపణల కాస్కారము కలుగునట్లు అప్పకవి ఉయ్యేలాదులందు పదద్వయ విభాగ మెందుకు చేసినాడన్నది ప్రశ్న.

ఇంతకు ఉయ్యేల-ఉయ్యల ఇత్యాదులగు ఎత్వ-అత్వ ఘటిత రూపద్వయ పదములలో నేది ప్రాచీనము? విచారించినచో ఎత్వ సహితరూపమే యనవలయును. ఎందుకనగా ఎత్వయుతముగానే 'కలిదమయంతిఁబాప...ను, య్యేలయునుబోలె...' (అరణ్య. 2-79) అని నన్నయగారి ప్రయోగము. అత్వసహితమగు రూపము భాస్కర రామాయణము (యుద్ధ. 2857) నాటికి గాని ప్రయోగముల కెక్కనట్లు లాక్షణికుల ఉదాహరణములను బట్టి తెలియును. కాగా ఎత్వ సహితరూపమే ప్రాచీనము. మరి నన్నయగారి ప్రయోగమును 'చింతామణి' సాధించుటలేదు. అందువలన అప్పకవి 'అద్యః క్రియాసు...' సూత్రమునకు ఎత్వ సహితములైన ఉయ్యేలాదులు విరుద్ధములు కాదని నిరూపించుటకు ఉయ్యేలాదు లేక పదములు కావని, 'ఊచు+ఎల'[1] ఇత్యాదిగా పదద్వయ సంధి రూపములని వివరించినాడు. ఉయ్యేల మొదలగు వాటియందు కన్పించు ఎత్వము ఉత్తర పదాద్యము. పదాది ఎకారామున కెక్కుడను నిషేధము లేదు. కాగా 'ఉయ్యేలా'దులు 'అద్యః క్రియాసు...' సూత్ర విషయములు కాకుండనే పోయినవి. ఈ విధముగా ఆ సూత్రము కొట్టుబడి పోవనేలేదు. ఇట్లు ఎత్వమును సాధించిన తరువాత అత్వయుతరూపము లంగీకరించ వీలులేదు. అందు వలన వాటిని నిరాకరించినాడు. అంగీకరించిన ముద్దరాజు రామన నాక్షేపించినాడు. నిజమునకు విచారించినచో అత్వసహిత రూపములు అప్పకవికి పూర్వమే కవి

1. అప్పకవి 'ఊచు + (హేలా) ఏల = ఉయ్యేల అని చెప్పుట తప్పుగా తోచుచున్నది. ద్రావిడ భాషలో ఊఞ్ ధాతువుయొక్క కృదంతము 'ఊఞ్సల్' దీనికి తెలుగు ఊయల, ఉయ్యల, ఊయెల, ఉయ్యేల మొ॥ రూపాంతరములు జనుల వాడుకనుబట్టి వచ్చినవి' అని శ్రీ గిడుగువారు అప్పకవీయ పీఠిక (పు. 57) అన్నారు. అనగా అత్వయుత రూపమే ప్రాచీనమని- ఏకపదమని భావము. ఏకపదత్వ మెట్లున్నను తెలుగున ఈనాటికి లభించు ప్రాచీన రూపము ఎత్వసహితము

ప్రయోగములుండగా, ఒక్క నన్నయగారి ప్రయోగమునే ప్రమాణీకరించి మిగిలిన ప్రయోగములను అప్పకవి నిరాకరించుటలో ఔచిత్యము కన్పించదు. అత్వసహిత రూపముల ప్రయోగములకు పాఠాంతరములైన ఆయనకు లభించిన వేమో యనుకొనవలసి వచ్చును. కానిచో అప్పకవి ఇక్కడ ప్రవర్తించిన తీరు లాక్షణికాహంకారమునకు సూచక మనుకొనవలెను.

అయితే, వేంకటరాయడు అప్పకవి చేసిన పదద్వయ విభాగమును విమర్శించుచు—

'ఊచు + ఎల = ఉయ్యేల అయినందున కేలాగు ద్విత్వయకారము సిద్ధమాయెనో? తాయి + ఎతులు = తాయెతులు అని ఇక్కడ ద్విత్వము లేకపోవుటకు కారణమేమో? తోచినటుల వ్రాయవలసినదౌను. అసందర్భములో నసందర్భము సంభవించినది.'

అని ఆక్షేపించినాడు. ఊచు + ఎల = ఊయెల అయినప్పుడు యకారమునకు ద్విత్వము పెద్ద సమస్య కాదు. పూవు = పువ్వులలో వకారమునకు, ఆయెడ = అయ్యెడ ఇత్యాదులందు యకారమునకు ద్విత్వములు వచ్చిన రీతిలో రావచ్చును. నూయి = నుయ్యి ఇత్యాది రూపములున్నవి. ఇట్లే 'ఎత్తు'లో ద్విత్వము లేకపోవుటయు వింతకాదు. తెలుగు పదము లనేకములందు ద్విత్వము తొలగుటయు నున్నది. చిన్న = చిన, అమ్మ = అమ మొదలగునవి ఉదాహరించుకొనవచ్చు. కాగా చూడవలసినది పదద్వయ విభాగము సరియైనదా కాదా యన్నదే తప్ప ఇట్టి యంశములు కావు. మరియు 'తాయెతు' యొక్క అర్థ విచారణ వేంకటరాయడు దీర్ఘముగా చేసినాడు. వ్యుత్పత్త్యర్థ మొక విధముగా నుండగా రూఢ్యర్థ మింకొకవిధముగా నుండుటయు ప్రతిభాష యందును గమనించవచ్చును. 'తెలువ' యనగా తెలుచిన నోరు గలదని వ్యుత్పత్త్యర్థము. కాని స్త్రీ మాత్రమున రూఢము. ఇట్లు కాదనుకొన్నచో పలుపదములకు రూఢి కుదరదు. మరియు అథర్వణుని 'డోలాభూషో త్తరీయాణి...' చూచినచో అప్పకవి ముద్దరాజు రామన నాక్షేపించియుండడన్నాడు. కాని 'డోలా...' చూచినను చూడకున్నను అప్పకవి దృష్టిలో మార్పు ఉండనక్కరలేదు. 'డోలా...' కారికకు అప్పకవి వాదము బలకరమేకాని భిన్నము కాదు అథర్వణ కారికను పట్టుకొని అహోబలుడు అప్పకవి చేసినది స్వకపోల కల్పితమనుట సాహసమే.

ఉయ్యేలాదులు ఏక పదములుగా భాసించుటచే స్పష్ట ప్రతిపత్తి కొరకు అవ ర్ణణ కారిక ఏర్పడియుండవచ్చు ననుకొనరాదా ! అందువలన అప్పకవి చేసిన పని అలాక్షణిక మేమియుకాదు. ఆయన చేసిన పొరపాటు ఒకటే. అత్వ సహిత రూపములు కవి ప్రయోగములందుండగా, వాటి నలాక్షణికములు చేయుట.

ఒక విధముగా వేంకటరాయడు చెప్పినది నిజము. 'అప్పకవి గారికి నన్నయభట్టు కారికలు ప్రధానము'. అందువలన అప్పకవి అంతగా తంటాలు పడినాడు. కాని అది సరియైన పనికాదు. అప్పకవిని ఆక్షేపించుచు చెప్పినను; వేంకటరాయడు :—

'ఇంచుకంత సంస్కృతమందు, నించుకంత యాంధ్రమందు తెలిసీ తెలి యని పండితం మన్యులు నన్నయభట్టుగారి సూత్రముల ననుసరించినవే సాధు వులు కాని; సూత్రముల ననుసరించనివి అసాధువు లంటారు.'

అని చెప్పిన మాట సరియైనది. ఎందుకనగా :—

'సూత్రమొకరీతి నుంటే, మహాకవి ప్రయోగము లొకరీతి నున్నవి బహు లములు గలవు... ఆంధ్ర వ్యాకరణమందే కాదు, పాణినీయ వ్యాకరణమందును కొన్ని సూత్రములు ప్రవర్తించవు. అంత మాత్రమున వారి మహత్త్వమునకు లోపము రాదు,'

అన్నాడు వేంకటరాయడు. ఈ దృష్టి లాక్షణికులకును, విమర్శకులకును ప్రధానమయినది. వేంకటరాయని గ్రంథము దాదాపుగా నంతయు నిట్టి సరియైన దృక్పథమునకు లక్ష్యమనవచ్చును.

## ప్రాస విలాసము

అప్పకవి పదునేడు ప్రాస భేదములను చెప్పినాడు. వాటిలో అర్ధబిందు, బిందు, ఖండాఖండ, రేఫయుత, లఘుద్విత్వ, వికల్ప, అనునాసిక, లఘుయకార. సంధిగత ప్రాసములను తొమ్మిదింటిని, వీటికి 'నామ నిర్దేశ మాత్రమే ఫలము' అని వేంకటరాయడు నిరాకరించినాడు. ప్రాసవైర మనునది 'ప్రాసభేదమే' కాదు. సంయుతాక్షర ప్రాసము కూడ మొదట చెప్పిన తొమ్మిదింటి వంటిదే. ఇక అభేదప్రాసము శ-డ,ల-ద లకు ప్రాస చెల్లు ననునది తిమ్మనవలె వేంకట

రాయడును 'జలనిధి- జడనిధి, మొసలి = మొసడి' ఇత్యాదిగా రూపద్వయ ముండుటబట్టి- ఈ ప్రాసము నంగీకరించలేదు. కాగా మిగిలిన అయిదింటిని అనంతు నమసరించి బిందు ప్రాసమును- మొత్త మారింటిని వేంకటరాయడు ప్రమాణీకరించినాడు,

## 'ఉభయప్రాస'కు అభయము

న-ణ లకు, మరియు స-ష లకు ప్రాస చెల్లుట ఉభయ ప్రాసము. అయితే ఇవి ఒక పద్ధతిలో ప్రాసచెల్లును. కొన్నిచోట్ల వ్యాకరణ సూత్రముల ననుసరించి న-స లకు వరుసగా ణ-ష లు ఆదేశములగును. ఉదా :- ప్ర + అన = ప్రాణ; వి + సమ = విషమ. ఇట్లాదేశములైన ణ కార షకారములు వరుసగా సహజములైన నకార,సకారములకు ప్రాస చెల్లును. సహజ ణ,ష లకు ఎట్లును చెల్లును, కాని సహజ ణకార, షకారములు సహజ నకార, సకారములకు ప్రాస చెల్లునా యన్నది ప్రశ్న. అనగా 'కణము-ధనము' అని. 'కషణ-రసన' అని చెల్లునా? చెల్లవని అప్పకవి కంఠోక్తిగా చెప్పలేదుగాని అతని లక్షణ వివరణము, లక్ష్య ప్రదర్శనమును బట్టి చెల్లవనియే చెప్పవలెను. అప్పకవికి పూర్వుడైన అనంతుని రీతియు నింతే. కాని పై విధముగా సహజ న-ణ లకు మహాకవి ప్రయోగములందు ప్రాస చెల్లినది. కాదనుటెట్లు? కాదనుటలో సామంజస్యము గూడలేదు. నకారమున కాదేశముగా వచ్చినను, రాకున్నను ణకారమునకు వినుకలిలో భేదము లేదు. వేంకటరాయడు ఈ రీతిని విమర్శించి సహజ న-ణ లకు ప్రాసచెల్లిన ప్రయోగములు ప్రదర్శించినాడు. అయితే, సహజ స-ష లకు ప్రయోగములు లభించనట్లున్నది, అందుకు వాటి విషయము చర్చింపక అప్పకవి ధోరణిలో అతడు చూపిన లక్ష్యములనే ప్రదర్శించినాడు. కాని, సహజ స-ష లును యతి చెల్లుటలో దోషము లేదని న-ణ ల చర్చలద్వారా సూచితమే. ఈ చర్చా సందర్భమున 'త్రిణయన' పదమును గూర్చి వివరించిన తీరు ఉపయోగకరమై క్రొత్త యంశములను ప్రచారమునకు తెచ్చినది.

ఉభయ ప్రాసలో శ-స ప్రాసను గూడ వేంకటరాయడు చేర్చినాడు. అప్పకవి ఈ ప్రాసమును నిరాకరించినను ప్రయోగములను బట్టి అంగీకరింపవలసియే యున్నది. అయితే కస్తూరిరంగ కవివలె నొక ప్రత్యేక ప్రాస భేదముగా కాక ఉభయ ప్రాసలోనే చేర్చినాడు. ఉభయ మట్టి జంటలకు ప్రాసము

చెల్లించుటకు సంబంధించినదగుట చేత ప్రాసభేద సంఖ్యను పెంచుటక్కర లేకుండ ఇందులోనే చేర్చుట వేంకటరాయని వర్గీకరణ రీతిలోని ఔచిత్యమునకు సూచకము.

## ప్రాసమైత్రి ప్రాస :
## మకారస్థితి

'ప్రాసమైత్రి' ప్రాసను వేంకటరాయ డంగీకరించినాడు. బిందు పూర్వక బకారము - ద్విత్వమకారమునకు ప్రాసచెల్లుట 'ప్రాసమైత్రి ప్రాస' అనంతుని నుండి ఈ ప్రాసభేదమును పరిగణించుట ప్రారంభమయినది. నన్నయగారి "ఇమ్ముగ...బిం, బమ్మున...రం, ధమ్ముల...వం, ద్యుంబరమున్..." అను పద్యము ప్రధాన లక్ష్యము. పిన వీరభద్రాదుల ప్రయోగములు దీని ననుసరించినవే. నన్నయగారి పద్యమున 'ఇమ్ముగ' అని ద్విత్వమకారమునకు బదులు, 'ఇంబుగ' అని బిందు పూర్వక బకారమున్న దనుకొన్నచో నీప్రాస భేదమున కాస్కారమే లేదు. (ద్వితీయ, తృతీయ పాదములందు ప్రాసస్థానమున ప్రథమా విభక్తి ముకారము ద్విత్వముగా నున్నది. అది 'బిం, బంబున...' ఇత్యాదిగా బిందుపూర్వక బుకారమగుటలో విప్రతిపత్తి లేదు. అప్పుడు 'ఇంబుగ'తో నవి సరిపోవును.) ఇంబు - ఇమ్ము అని (బిందు పూర్వక బకారముతో, ద్విత్వమకారముతో) రెండు రూపములున్నవి. నన్నయగారి ప్రయోగ మిట్లుకాగా, పినవీరనాదులవి ప్రత్యేకముగా గమనింపదగినవి.

వేంకటరాయడు అప్పకవి ననుసరించి:- 'బకారము దాపల బిందువు కలిగి ద్విత్వమకారముకు ప్రాసమగును' అని ప్రాసమైత్రి ప్రాసకు లక్షణము చెప్పి నాడు. అంతటితో నాగక 'బమలు బిందుపూర్వకముగఁ బ్రాసంబుల, నిలుపఁ జెల్లు...' అను తిమ్మన (ల. సా. సం.) లక్షణము నుదాహరించి 'బిందువు లేకపోతే జమిలిమాలేదు' అన్నాడు. ఇట్లనుటకు కారణమున్నది. తిమ్మన ప్రాస చెప్పినది బిందుపూర్వక బమ లకే తప్ప మకార ద్విత్వ ప్రసక్తిలేదు. అప్పకవి చెప్పిన లక్షణములో మకారము బిందుపూర్వకమగు ప్రసక్తిలేదు. కాని అప్పకవి, తిమ్మనలు చెప్పిన లక్షణములు భిన్నములు కావనుటకే వేంకటరాయడిట్లు చెప్పి నాడు. కాగా అప్పకవి 'జమిలిమా' యని చెప్పినను, బిందు వక్కడ ఉండనే యుండును, బిందువును తిమ్మన చెప్పినను మకారమునకు ద్విత్వముండనే

యుండుననని భావము. కాని అనంతుడు బిందుపూర్వక బమలకు ప్రాస చెప్పగా-దాని నంగీకరింపకనే జమిలిమాయని చెప్పిన అప్పకవి మతమున జమిలిమా-బిందు పూర్వకముకాదు. అయినచో అనంతుని వలెనే అప్పకవియు చెప్పియుం-డును. కావున 'బిందువు లేకపోతే...' అన్న వేంకటరాయని నిర్ణయము అప్ప-కవికి వర్తించదు. వేంకటరాయడు తానుగూడ 'ద్విత్వ మకారమున'కనే చెప్పి-నాడు తప్ప బిందుపూర్వక మకారమునకని చెప్పలేదు. అంతేకాదు అసలు తెలు-గులో బిందుపూర్వక మకారముండుటకు వీలులేదు ఈ భాషా సంప్రదాయ-మట్టిది. కాని వెనుకటివారి వ్రాతరీతిలో 'అమ్మ' ఇత్యాదులు 'అంమ్మ' ఇత్యా-దిగా (బిందుపూర్వక ద్విత్వమకారముగా) వ్రాయుట తాళపత్ర ప్రతులందు కన్పించును. ఈ వ్రాత పద్ధతి నన్నయగారినాడు లేదు. మధ్యకాలమున వచ్చి-నది. నన్నయగారికి పూర్వమునుండి శాసనముల లేఖన రీతిని పరిశీలించినచో ఈ పరిణామము స్పష్టముగా గోచరించును. అయితే మకారము యొక్క బిందు పూర్వకతకు, దాని ద్విత్వమునకు అవినాభావ సంబంధమేమియు లేదు. ఈ 'సుకవి మనోరంజన' తాళపత్ర ప్రతియందు బిందుపూర్వక మకారము ద్విత్వ-ముగాలేదు. (ఇట్లే బిందుపూర్వక నకారము గూడ ద్విత్వముగా లేదు.) అయితే బిందుపూర్వక మకారము ద్విత్వము కానక్కరలేదు గాని, ద్విత్వమకారము తప్పక బిందుపూర్వక మగునని వేంకటరాయని భావమనుటకును వీలున్నది. అట్లు చెప్పినచో తిమ్మన లక్షణముననున్న బిందుపూర్వక మకారము ద్విత్వము కానక్కరలేదు. అనంతుడు చెప్పిన లక్షణ విషయమున గూడ నింతే.కాగా అప్ప-కవి చెప్పిన ద్విత్వమకారము, తాను చెప్పినదియు బిందుపూర్వకములే యనుటకు వేంకటరాయడు 'బిందువు లేకపోతే జమిలిమా లేదు' అన్నాడు. మరియు 'కంమ్మ-ఇంమ్ము, అంమ్ము- ఈ మొదలైనవి బిందువు గలవని తెలియవలయు' ననియు నన్నాడు. 'కమ్మ, అమ్ము' అన్నవి అప్పకవి చూపిన 'స్వీయోదాహ-రణముల లోనివి.' కమ్మతావుల వెదజల్లు నంబుజములు, శంబరారాతిచేతి వాల-మ్ములనఁగ' అన్నది అప్పకవీయోదాహరణము. 'ఇమ్ము' అన్నది నన్నయగారి పద్యములోనిది. అయితే ఇక్కడ నొక చిక్కు కలుగుచున్నది.'కంమ్మ-అంబు' యన్నప్పుడు మకార బకారములు రెండును బిందు పూర్వకములు. మకార మధికముగా ద్విత్వయుక్తము. అయినప్పుడు 'అంబు' నందలి బకారము గూడ ద్విత్వయుత మగుట యుక్తము బకారము బిందుపూర్వకమై, మకారము ద్విత్వయుక్తమైనప్పుడు అక్కడి బిందువునకు, ఇక్కడి ద్విత్వమునకు

సరిపోవును. బకారమునకు ముందున్న బిందువునకు మకారశ్రుతి యుండుటచే సరిపోయినది. ద్విత్వమకారమునకు ముందు బిందువుండగా, దాని మశ్రుతిలో మూడు మకారములు- అనగా మూడు వర్ణములైనవి. 'అంబు' వద్ద రెండే యైనవి. ప్రాసాక్షర మంతట సమాన హల్మేళనముతో నుండుట ప్రాస నియమము. ఇక్కడ అది పొసగుటలేదు. కావున 'అంబు' అన్నది 'అంబ్బు' అని బిందుపూర్వక ద్విత్వబకారముగా నుండవలసి యుండును. ఈ విషయమై వేంకటరాయ దేమియు చెప్పలేదు. ఈ వ్రాతరీతియు తాళపత్ర ప్రతులయందు లేకపోలేదు. అయితే బిందువున్నపుడే ద్విత్వబకారముండును గాని 'అబ్బుర' మిత్యాది ద్విత్వబకారముల ముందు బిందువుండదు. కాగా బిందువు లేకున్నను 'జమిలిబా' యుండును

ఇంతకు బిందుపూర్వక బమలకు ప్రాస చెల్లుటలో నౌచిత్యము కన్పించదు- ఉభయత్ర ధ్వని సామ్యములేదు. ఇదంతయు నన్నయగారు 'ఇమ్ముగ' అని ప్రయోగించినా రనుకొనుట వలన వచ్చిన తగాదా. నన్నయగా రెక్కడను ధ్వని సామ్యములేని ప్రాసముల నుపయోగించలేదు. కావున 'ఇమ్ముగ' అనునది గాక 'ఇంబుగ' అనియే నన్నయగా రుపయోగించినా రనవలయును కాని ఎట్లో 'ఇమ్ముగ' యన్నది ఆ పద్యమున ప్రవేశించి ఇటు లాక్షణికుల కొక ప్రాస భేదమును కల్పించినది. కొందరు కవులచే నొకటి రెండు చోట్ల నా ప్రాసము నుపయోగింప చేసినది.

ఈ ప్రయోగముల విషయమెట్లున్నను, 'బిందువు లేకపోతే జమిలిమా లేదు' అని వేంకటరాయడు చెప్పుటలో కొన్నిచోట్ల కన్పించు లేఖనరీతి తప్ప మరొక ప్రమాణము కనిపించదు. నిజమునకు లేఖనరీతి యతిప్రాసల నిర్ణయమునకు సరియైన ఆధారమనుటకు వీలులేదు. కవులు అక్షరములను వ్రాసి చూచుకొని యతిప్రాసల నుపయోగించరు. ఉచ్చరించు రీతిని బట్టి ఉపయోగింతురు. కాగా ఈ ప్రాసవిషయమున తిమ్మనను వేంకటరాయడు సమర్థించినరీతి అంతః సమర్థనీయముగా కన్పించదు.

**యతి:**

భేదపరిష్కృతి

దాదాపుగా అందరికన్న నెక్కువ సంఖ్యలో యతి భేదములను చెప్పిన వాడు అప్పకవియే. యతి భేదములను స్వర - వ్యంజన - ఉభయ యతి వర్గము లుగా విభజించి స్వరయతులు ఏడు, వ్యంజన యతులు ఇరువది యొకటి, ఉభయ యతులు పం|డెండు చెప్పినాడు. మరియు |ప్రాసయతి వర్గమున |ప్రాసయతి చెప్పినాడు. |ప్రాస భేదములన్నియు |ప్రాసయతి యందు ననువర్తించును. ఇన్ని వర్గములలోని యిన్ని యతి భేదములలో కొన్నింటిని వేంకటరాయడు నిరాకరిం చిన రీతి గమనించదగినది.

స్వరయతులలో స్వరమై|త్రియతి నిరాకరింపబడినది. అయితే అప్పకవి 'స్వరమై|త్రి వలు'లని చెప్పినవాటినే 'సర్వ|ప్రధానవలు' అను పేర వేంకటరాయడు చెప్పినాడు. నిజమునకాయన నిరాకరించవలసినది అప్పకవిచెప్పిన 'స్వర|ప్ర ధానవలు'లను. స్వరసంధిలో ఉత్తర పదాద్యచ్చునకే యతిచెల్లవలెననుట 'స్వర |ప్రధానయతి'. ఇది నిజమున కొకయతి భేదముకాదు. స్వరయతులు చెల్లిం చుటలో పాటింపవలసిన ఒక సామాన్య నియమము. ఈ యంశము |ప్రస్తావింప బడలేదు. కాగా నిరాకరించవలసిన యంశము నుపేక్షించి, తాను నిరాకరించిన దానినే తాను మరల చెప్పుటలో వేంకటరాయని భావము స్పష్టముగాదు.

వ్యంజన యతులలో అప్పకవి చెప్పిన |ప్రాణి, ఋజు, |ప్రత్యేక, భిన్న, ఏకతర, అంత్యోష్మ, సవర్ణ యతు లేడు నిరాకరింపబడినవి. నిజమునకు'|ప్రాణి' యతి భేదము అనవసరమనిపించును. ఈ భేదమును నిరాకరించుచు వేంకట రాయడు—

'వర్గాంత్యాక్షరమును విడిచి, మిగిలిన నాలుగు నొకదానికొకటియైనా, యే యక్షరమున కాయక్షరమైనా నిలిపితే వర్గయతియని అదినుంచిన్ని సు|ప సిద్ధిగా నున్నది. కావున వర్గయతిని స్వర|ప్రధానముచేసి |ప్రాణియతియని పేరుంచుటెంచుకంతైనా వినియోగము లేదు...'

అన్నాడు, అయితే వర్గమునందు మొదటినాలుగింటిలో నేయక్షరమున కాయక్షరము నిలిపినను 'వర్గయతి' యగునని ఎవరును నిరూపించినట్లు కన్పించదు.

లాక్షణికులు వర్గయతి కుదాహరణములు చూపునపుడు ఏయక్షరమున కాయక్ష రమును-అనగా, కకారమునకు కకారము, గకారమునకు గకార మిత్యాదిగా చూపలేదు. కకారమునకు ఖ, గ, ఘ లను—ఇట్లే ఒకదానికొకటిగా—చూపినారు. అందువలన ఏ యక్షరమున కాయక్షరము చెల్లినచో వర్గయతి యనుటకు వీలు కన్పించదు. ఇదిట్లుండగా 'ఏకతరయతి'ని నిరాకరించుచు వేంకటరాయుడు—

'రేఫముకు రేఫము, అకారముకు అకారము ఏకతరయతులని వ్రాసినారు. ఈ రెండును, 'మ-వ-ల'—ఈ మూడును, ఏయక్షరమున కాయక్షరము' ఎక్కటి యతి అని పండిత పామర సాధారణమైనయతి అటువంటిదానికి, రేఫముకు రేఫము, అకారముకు అకారము ఏకతరయతి యనుటయు, మ-వ-ల-ఈ మూడక్ష రములు నేయక్షరమున కాయక్షరము యతియగునపుడు ఏయతో నలుబదొకటి యతులలో చెప్పకపోవుటకు వారిసామర్థ్య మేమనుకోవలె'.

అని వ్రాసినాడు. నిజమే యనిపించును, మ-వ-ల లు దేనికది చెల్లినచో అప్పకవి మతమున నేయతి? వర్గయతి విషయమున వేంకటరాయడు చెప్పిన దానినిబట్టి వ-ల లు దేనికది యతి చెల్లినచో అభేదయతి యగును. వేంకట రాయడు చెప్పినదానినిబట్టి ఇట్లు చెప్పుటకాని, అప్పకవి దృష్ట్యా ఇది సరికాదు. మకారము మిగులుచునేయున్నది. నిజమున కేయక్షర మాయక్షరమునకు యతి చెల్లినచో అప్పకవి దృష్ట్యా 'ప్రాణియతి' యగును. 'ప్రాణియతి'కి అప్పకవి లక్ష్యముగా వ్రాసిన—

'కలశాబ్ధి గంభీర—కాంచనాచలధీర
కాలియోరగవైరి-కైటభారి...'

అను పద్యమునందు కకారమునకు కకారమే యతి చెల్లినది తప్ప ఖకారా దులు చెల్లలేదు. ఏయక్షరమున కాయక్షరము యతి చెల్లినప్పుడే, అనగా—మరొక యక్షరము చెల్లినప్పుడే యతి భేదముల కవకాశమేర్పడినది. అందువలన దేని కది చెల్లినది హల్లయినచో 'ప్రాణియతి', అచ్చయినచో 'స్వరయతి' ఈ ఉద్దేశ్య ముతోనే అప్పకవి స్వరమైత్రియతిలో 'అద్విరామ' మిత్యాదిగా అంతర్భేదములు చెప్పినాడు. ఏయక్షరమున కాయక్షరము యతిచెల్లుట ఈ దృష్ట్యా ఒక ప్రత్యేక యతి భేదము కానక్కరలేదు. కాని యతిభేదములు కొన్నియేర్పడిన తరువాత

దీనినికూడా ఒక భేదముగా చెప్పవలసి వచ్చినది. ఈ విధముగా చూచినచో అప్పకవిచెప్పిన 'ప్రాణి' యతి అవసరమే యగును.

అయితే, ఇప్పుడేకతరయతి విషయమున మరొక చిక్కు కలుగును. ర-అలు ర-అలకే యతి చెల్లినచో ప్రాణియతియే యగునుకదా, అప్పుడు 'ఏకతర'యతిని చెప్పుట ఆనవసరము. నిజమే, కాని ర-అ ల కేకతరయతి చెప్పుట కాయక్షరముల కొకప్రత్యేకత యున్నది. హల్లులలో ప్రతిహల్లు ఏదో ఒకరూపమున మరొకహల్లుతో యతిచెల్లుచున్నది. వర్గయతిరూపమున వర్గలలోని మొదటి నాల్గక్షరము లొకదాని కొకటి, బిందు, పోలిక యతుల రూపమున మకారము పవర్గ మొకటి నాల్గక్షరములు శ ష స ల కు, య-హ లు, న-ణ లు పరస్పరము, అభేదయతిగా వకారము పవర్గ మొదటి నాల్గక్షరములు, ల-ళ లు యతి చెల్లుచున్నవి. ఇట్లు చూచినచో నేవిధముగను మరొక హల్లుకు యతి చెల్లనివి రేఫ-ఱకారములే. అందువలన వీటి ప్రత్యేకతాసూచనగా అప్పకవి ఏకతరయతిని చెప్పినాడు. (ర-ల యతిని అప్పకవి అంగీకరించలేదు.) మరియు రేఫ-ఱకారములు పరస్పరము యతి చెల్లవనుటయు నీయతిభేదము చెప్పుటకొక కారణము. ఇదే పద్ధతిలో ప్రాసలందు 'ప్రాసవైర'మును చెప్పినాడు. అక్కడ నిషేధరూపమున కాగా, ఇక్కడ విధిరూపమున రేఫ-శకటరేఫలకు వేంకటరాయడును యతిప్రాసల నంగీకరించడని రేఫ-ఱకార నిర్ణయమును బట్టి చెప్పవచ్చును. ఈ రేఫ-ఱకార నిర్ణయమును తిమ్మన ననుసరించి వేంకటరాయడు చేసినాడు. కాని ర-ఱ లకు లకారముతో యతి నంగీకరించినాడు. రేఫతో, ఱకారముతో లకారమునకు యతి చెల్లుట నంగీకరించి నప్పుడు రేఫ-ఱకారములకు – ధ్వనిలోని దగ్గరితనమును బట్టి-యంగీకరించుటలో నసామంజస్యము మాత్రము కన్పించదు. ఏకతరయతి నిరాకరణలో నీఉద్దేశ్యముకూడ వేంకటరాయని కున్నదేమో!

అప్పకవి చెప్పిన యతిభేదముల విచారణచేసి వేంకటరాయడు స్వమతానుసారముగా స్వరయతులు ఆరు, వ్యంజనాక్షరయతులు పదునైదు, ఉభయ యతులు ఇరువదిరెండు చెప్పినాడు. ప్రాసయతితో కలుపుకొని మొత్తము నలువదినాలుగు యతిభేదములు. కాగా సంఖ్యాదృష్ట్యా అప్పకవి చెప్పినవాటిలో స్వరయతులం దొకటి,వ్యంజనయతులందు ఆరు తగ్గినవి కాని ఉభయ యతులలో పండ్రెండు పెరిగినవి. అప్పకవి వ్యంజనయతులలో చెప్పిన అంత్యోష్మ, వికల్ప సంధియతులను వేంకటరాయడు ఉభయ యతులలో చెప్పినాడు. అట్లే అభిన్న

యతిని గూడ, ఇక నిత్యసంధి, చతుర్థీవిభక్తి, ఘఞ్, ఆదేశ, నసమాస, నఞ్ సమాస, ప్లుతయతుల నధికముగా చెప్పినాడు. అభేదయతులలో నాలుగు, ప్లుత యతులలో నాలుగు, కాకుస్వరయతులలో నిరువదియైదు అంతర్భేదములు చెప్పి నాడు. కాగా వీటియన్నింటిని కలుపుకొని వేంకటరాయడు డెబ్బదినాలుగు యతిభేదములను చెప్పినట్లయినది. ఈ కాకుస్వర, ప్లుతయతులలో చెప్పబడిన యంతర్భేదములు, నిత్యసమాసయతులలో పూర్వులు కలిపిన యతిభేదములను విడిగాచెప్పిన భేదములు యతిభేదస్వరూప నిరూపణమున వేంకటరాయని నిశిత పరిశీలనాదృష్టిని వ్యక్తముచేయును. ప్లుత, కాకుస్వరముల విషయమున వేంకట రాయని పరిశ్రమ గమనింపదగినది.

### లుప్తవిసర్గకమా ?
### గూఢ స్వరమా ?

స్వరయతుల వివరించుచు లుప్తవిసర్గక స్వరయతి సందర్భమున ఈ 'లుప్తవిసర్గక స్వరయతినే గూఢ స్వరయతి అంటారు' అని వేంకటరాయ డన్నాడు. కస్తూరి రంగకవి అథర్వణచ్ఛందమునుండి గూఢ స్వరయతి లక్షణ పద్యమొకటి ఉదాహరించినాడు. దానిని బట్టి 'అన్యోన్య - పరోక్ష' వంటి వాటిలో ఆకారమునకు యతిచెల్లుట గూఢస్వరయతి యగును. అన్యోన్యాది పదములలో విసర్గయేలేదు, అది లోపించు ప్రసక్తియేలేదు. కావున 'అన్యో న్యా'దుల విషయమున లుప్త విసర్గకయతి యన వీలులేదు. అనంతుడు 'దాసోఽహం' 'యశోఽబ్ధి' పదములుదాహరించి 'లుప్తవిసర్గకోత్వ'మైనచో నీయతి చెల్లునన్నాడు. ఈ యతి కాయన పేరేమియు పెట్టకున్నను,'లుప్తవిసర్గ కోత్వ'మన్నదానిని బట్టి 'లుప్తవిసర్గకస్వర'యతి యనవచ్చును. అప్పకవి అట్లే యన్నాడు. అయితే 'లుప్తవిసర్గకోత్వ'మని లక్షణముచెప్పి విసర్గ లోపములేని 'అన్యోన్య'ది పదములను వారుదహరించుటలో సామంజస్యము కన్పించదు. అయితే 'యశోఽబ్ధి' 'అన్యోన్య' వంటి ఉభయ విధములకు చెల్లుయతిని 'గూఢస్వరయతి' యనవచ్చును. ఉభయత్ర స్వరము గూఢమే. లుప్తవిసర్గకములున్నచో 'అన్యోన్యా'దులు గ్రహింపబడవు. కాగా లుప్తవిసర్గ కస్వరయతి గూఢస్వరయతిలో అంతర్భవించునుగాని, ఇది యందులో నంత ర్భవించదు. వేంకటరాయడు లుప్తవిసర్గకస్వరయతికే గూఢస్వరయతి యొక

నామాంతరముగా చెప్పినాడు. అనగా లుప్తవిసర్గకస్వరయతి లక్షణమే గూఢస్వరయతికిని చెప్పినట్లయినది. అన్యోన్యాదిపదముల నాయన ఉదాహరించ లేదు. అందువలన ఆయన చెప్పినది సరిపోవును గాని, అన్యోన్యాదుల విషయమున ఆయన ఏమి భావించినాడో తెలియదు. ఇదిట్లుండగా, కస్తూరి రంగకవి గూఢస్వరయతికి నుదాహరించిన లక్షణపద్యమునే తానుదాహరించినాడు. అప్పుడు, గూఢస్వరయతియనుటకు బదులుగా లుప్తవిసర్గక స్వరయతి యనుట సమంజసముగా కన్పించదు. కస్తూరి రంగకవి లక్షణపద్యములో అన్యోన్యాదులే ఉదాహరించబడినవిగాని, 'దోసోఽహ' మాదులు గాదు. అందువలన వేంకటరాయడుకూడ 'గూఢస్వర'యతినే పేర్కొని, లుప్తవిసర్గకస్వరయతి అందులోనే అంతర్భవించునని చెప్పి, అన్యోన్యాదులనుగూడ ఉదాహరించినచో సమంజసముగా నుండెడిది.

## అఖండయతి

## అఖండనీయత

అఖండయతి విషయమున వేంకటరాయని పరిశీలన, విచారణ నిజముగా ఎంతో గొప్పది. ఆయన ఈ యతిని వ్యంజనయతులలో నొకటిగా చెప్పినాడు. అఖండయతికి తిమ్మన లక్షణమిట్లున్నది.

'హల్లునకు హల్లు వడి యిడునపుడు దాని
తుదిని స్వరము ఘటిల్లిన నది యఖండ
వడియనంగ(బొల్చు, దేవాదిదేవ...'

హల్లుకు హల్లు యతి చెల్లించునప్పుడు, అక్కడ అచ్చు ఘటించినచో నది అఖండయతి. అనగా, అచ్ సంధిలో ఉత్తరపదాద్యచ్చుకు యతి చెల్లవలసి యుండగా, పూర్వపదాంత హల్లుకు యతి చెల్లినచో అది అఖండయతి యగునని భావము. పై పద్యమున మూడవ పాదమున 'దేవాది' యన్నపుడు 'వ' కారమునకు యతిచెల్లినది. 'దేవ + ఆది' అని విరుగును. ఉత్తరపదాద్యచ్చుకు యతి చెల్లవలసియుండగా పూర్వపదాంత హల్లయిన 'వ' కారమునకు యతి చెల్లినది. అనగా 'దేవాది'లో వకారమునకు తుదిని ఉత్తరపదాద్యచ్చు ఘటిల్లినది. కాగా ఇక్కడ అచ్చుకు యతి చెల్లినచో అఖండయతి కాదు.

స్వరయతి యగును. వ్యంజనమునకు చెల్లినప్పుడే అఖండయతి యగును. అందువలన అఖండయతి వ్యంజనయతి యైనదనవచ్చును.

అయితే ఇక్కడ వకారము యతి చెల్లినది. మరొకచోట మరొక హల్లు యతి చెల్లవచ్చును. అప్పుడును అఖండయతియే యగును. కాని అట్లనుట సరియా? వకారమునకు వకారము యతి చెల్లినది ఎక్కటియతి యగునుగదా! అనగా అఖండయతి పద్ధతిలో 'ఎక్కటియతి' చెల్లినదన్నమాట. వేంకట రాయడుకూడ పలుచోట్ల 'అనునాసికయతిచేత వచ్చిన అఖండయతి, బిందుయతి చేనైన అఖండయతి' ఇత్యాదిగా వ్రాసినాడు. అనగా అచ్చుకు యతిచెల్లవలసిన చోట హల్లుకు యతి చెల్లుట అఖండయతి. ఆ రీతిగా చెల్లు నొకరీతి తప్ప అఖండయతి ఒక ప్రత్యేక యతి భేదముకాదు. వ్యంజనయతి యనగా హల్లు నకు హల్లు చెల్లురీతి యనియే గాని ఒక యతిభేదము కాదుగదా! అట్లే అఖండయతియు.

ఉభయయతి, అఖండయతి యన్నవి సామాన్యముగా సమానార్థకము లన్నట్లు భాసించునుగాని, విచారించినచో భేదమున్నది. ఉభయ యతులనగా అచ్చుకు, హల్లుకు యతి చెల్లుటకు అంగీకరింపబడినచోట్ల అచ్చుకు చెల్లించినను హల్లుకు చెల్లించినను 'ఉభయయతి'యే. 'కర్ణాటా'ది పదములలో అచ్చుకు హల్లుకు - ఉభయమునకు - యతి చెల్లవచ్చును. అచ్చుకు చెల్లినచో స్వరయతి చేనైన ఉభయయతి. హల్లుకు యతిచెల్లినచో అక్కడి వ్యంజనమునుబట్టి ఆ వ్యంజనయతి భేదముచేనైన ఉభయయతి. కాని అఖండయతి ఎప్పుడును వ్యంజన యతిచేనైన అఖండయతియే యగును గాని, స్వరయతిచేనైనది మాత్రము కాదు. స్వరమునకు చెల్లినచో అక్కడ 'అఖండత'కు ప్రాధాన్య ముండదు. అఖండతవలననే వ్యంజనమునకు చెల్లును. కావున అఖండయతి వ్యంజనయతులకే సంబంధించినది. వ్యంజన యతులన్నియు అఖండయతి పద్ధతిలో చెల్లును.

'కర్ణాట' నిత్య సమాసము. ఇక్కడ 'కర్ణ + అట' అని పద విభాగము కుదురదు. 'కర్ణే అటతీతి కర్ణాటః' అని ఇది అస్వపద విగ్రహము. నిజమున కిక్కడ అచ్చునకు యతి చెల్లించగూడదు. కాని స్వరసంధి కన్పించుచున్నది గాని అచ్చుకు యతి చెల్లించవచ్చును. అయితే, స్వరసంధి గాన అచ్చుకే యతి

చెల్లించవలెగదా యన్నచో, హల్లునకును యతి చెల్లించుట అంగీకరింపబడినది. కారణమేమనగా- 'కర్ణాట' రెండు పదములుగా విరుగక ఏకపదముగా భాసించును. 'పదము విభజింప చొప్పడని' దని లాక్షణికు లన్నది ఇట్టి చోట్లనే. అందుకని సంధిని బట్టి అచ్చుకు, ఏకపదాభాసను బట్టి హల్లుకు ఉభయమునకు యతి చెల్లించవచ్చును కావున ఇది 'ఉభయయతి' యైనది. అఖండయతి ఒక విధముగా దీనికి తల[క్రిందులైనది. అచ్చుకే యతి చెల్లించవలసి యుండగా, పద ద్వయ విభాగమున్నను, దాని నఖండ పదముగా భావించి హల్లుకే యతి చెల్లించుట అఖండ యతి.

ఉభయయతి యనగా కేవలము హచ్చునకు, హల్లుకు యతి చెల్లింపవీలైన చోటికి మాత్రమేకాక, రెండు వేర్వేరు హల్లులకు చెల్లింప వీలయిన చోటికి సంబంధించినదియు కావచ్చును. ఉదాహరణకు 'తటిల్లత' అన్న నిత్యసంధిలో 'తటిత్ + లత' అని పదవిభాగము. సంధిలో పూర్వ పదాంత తకారము లోపించి పర లకారము ద్విత్వమైనది. లకారమునకు లకారము యతి చెల్లించుట సామాన్యమే. కాని సంధి జరుగుటకు పూర్వస్థితిలో పూర్వపదాంత మందున్న తకారమునకును యతి చెల్లింపవచ్చును. కాగా 'తకార, లకార' - 'ఉభయము' నకును యతి చెల్లింపనీలైన తావు. అందువలన ఇదియు ఉభయ యతియే కావల యును. వేంకటరాయడు కూడ ఇట్లే భావించినాడు. అందుకనియే 'అంత్యోష్మ-నిత్య-వికల్పసంధి యతులను ఉభయ యతులందు పరిగణించి——

'పై మూడు విధములైన యతిభేదములు వ్యంజన విషయికములయి నప్పటికి సంధి వర్ణమైన ద్విత్వాక్షరపు రెండు విధములైన హల్లులకు యతి చెల్లుట వలన ఉభయ యతులందు నుంచినాము.'

అని వ్రాసినాడు. కావున రెండింటికి- రెండు హల్లులకుగాని, అచ్చు-హల్లులకుగాని, రెండచ్చులకు గాని యతి చెల్లవలసిన తావులు ఉభయ యతిగా పరిగణించవచ్చును. అయితే రెండచ్చులకు యతి చెల్లించుటకు వీలైన వృద్ధి యతి వంటి వాటిని ఉభయ యతులుగా చెప్పలేదు. రెండు హల్లులకు సంబంధించి నప్పుడు ఉభయ యతియైనచో అచ్చుల విషయమునగూడ 'ఉభయయతి'యగుట సమంజసము. ఈ విధముగా ఉభయ యతి యుండగా, అఖండయతి కేవలము వ్యంజన యతులకే సంబంధించినది అయితే అదియొక ప్రత్యేక యతిభేదము గాక, ఒక రీతికి చెందినదగును.

'అఖండ' యతి యన్నది ప్రస్తుతమున కాదిమచ్ఛందో గ్రంథమైన కవిజనాశ్రయము నుండియే యున్నది. కాని క. జ. లో అఖండయతి విషయకముగా కన్పించు 'మానుగ విశ్రమాక్షర...' యన్న ఉత్పలమాలా పద్యము క. జ. కర్త రచన కాదని, ప్రక్షిప్తమని పలువురి మతము. కారణము క. జ. కర్త వృత్తాధికారమున తప్ప నెక్కడను తన గ్రంథమందు వృత్తముల నుపయోగించ లేదు. మరియు నా పద్యము రేచనాంకితము కాదు.[1] ఏదెట్లయినను నాటినుండి పలువురు లాక్షణికులు అఖండయతి నంగీకరించి చెప్పినారు. కాని తిమ్మనవలె స్పష్టముగా చెప్పినవారు మిక్కిలి తక్కువ. అయితే తిమ్మన ఈ అఖండయతి కవిత్రయ రచనలో లేదను విశ్వాసము కలవాడు. ఇంతవరకు అప్పకవి మతమే. కాని తిమ్మన కవిత్రయేతర కవులలో 'ఆదకాదకు' అఖండ యతి ప్రయోగము లున్నవని అంగీకరించినాడు. ఇది అప్పకవి మతాతిక్రమణము.

అఖండయతిని అంగీకరించని లాక్షణికుల సంఖ్య అల్పమే. ఆ కొద్ది మందిలో అప్పకవి మిన్న. అప్పకవ్యాదులు అఖండయతి నెందుకంగీకరించలేదనగా—

అఖండ వడి సమ్మతింతుమేని, స్వరసంధిగల సంస్కృతాంధ్ర శబ్దము లందెల్ల స్వరమునకే కాక వ్యంజనమునకును యతి సమ్మతమగును. రాముఁడతఁడు (డ), నీవిచ్చితి (వి), సర్వేశ (ర్వే), వంశాబ్ధి (శా) ఇత్యాది తెలుగు సంస్కృత సంధులందెల్ల వ్యంజన మైత్రియు నంగీకర్తవ్యమే యగును. ఇది యంత రమ్యముగాఁ దోపదు. ఇట్టి అతిచారాతివ్యాప్తుల నరికట్టి కతిపయ శబ్దము లందేఁ దీనిఁ బరిమితము చేయఁదలఁచి ఉభయ యతిభేదములఁ గొన్నింటినిఁ బ్రాచీన లాక్షణికులు కల్పించిరి.'

---

1. "భీమన అఖండంబు మొదలైన కొన్నివళులకు లక్షణ లక్ష్యంబులు చెప్పఁడు. ప్రజ్ఞాలవ దుర్విదగ్ధుల సంగతంబుగాఁ బెనచి తగిలించివా; రతని యంకితంబులు లేవుగానఁ దానిం బ్రమాణింపఁదగదు' అని వెల్లంకి తాతంభట్టు కవిలోక చింతామణి యందు వ్రాసినాడు. చూ. పరిషత్తువారి కవిజనాశ్రయ తృతీయ ముద్రణ పీఠిక. రచన. (శ్రీ) చిలుకూరి పాపయ్యశాస్త్రి.)

అని శ్రీరావూరి దొరసామి శర్మగారు వ్రాసినారు[1]. ఇది ఒక విధముగా అప్పకవ్యాదుల యభిప్రాయమే. కాని ఇక్కడ గమనింప వలసిన యంశమొకటి యున్నది.

'వడి యనంగఁ జెల్చు దేవాదిదేవ'

'వేలకొలందిగ సౌఖ్య నీ విచ్చినావు'

మొదలగు తావులలో అఖండయతి రమ్యముకాదు గదా! కాని ఇక్కడ ఉభయత్ర వకార శ్రుతియైన నున్నదికాని,

'...సం, హరుఁడగు...మైలమ భీముని...'

ఇత్యాది మవర్ణయతి స్థలములలో హకారమకార ధ్వనులకేమి పోలిక? మవర్ణ విరామము, లుప్తవిసర్గక స్వరయతి మొదలగు వాటిని అంగీకరించిన లాక్షణికులు 'దేవాది' వంటి అఖండయతుల నంగీకరించక పోవుటలో సామంజస్యము లేదు. మరియు అప్పకవి 'యుష్మదస్మచ్ఛబ్దయతి' నంగీకరించినాడు.

'త్రస్తాత్ములమైన యస్మ - దాదులకెల్లన్'

ఇక్కడ 'అఖండయతి' నంగీకరించినాడు కాని 'యుష్మదస్మచ్ఛబ్దయతి' పేర.[2] అఖండయతి నంగీకరింపక ఎన్ని ఉభయ యతిభేదములను చెప్పినను ఈ అచ్చమైన అఖండయతి నంగీకరింపక తప్పలేదు. కారణ మిది నన్నయగారి ప్రయోగ మగుట. అనంతుడు నిత్యసమాసయతికే 'అఖండయతి' ని నామాంతరముగా చెప్పగా, అప్పకవియు నట్లే చెప్పినాడు. కాని 'అస్మదాదులు' నిత్యసమాసము

1. తెలుగు భాషలో ఛందో రీతులు.

2. "కవిచింతామణిలో తాతంభట్టు (ఈ) భారత పాఠమును నిరాకరించెను. అందుల కతఁ డిట్లు వ్రాసె. "మఱియుఁ గొందఱు కవిమ్మన్యులైన సామాన్య కవీంద్రులు కొదువ లొదవ 'ప్రస్తుత ఫణి సత్రభయా, యస్త్రాత్ములమైన యస్మదాదుల" అనియెడు పద్యంబునకుఁ బునరుక్తి దూషితంబైన యపపాఠంబు వాటించి యఖండవళియందు రదియు నభిమతంబు గాదు. "(వళిప్రాసాధికారము). ప్రసిద్ధుఁడైన తాతంభట్టు ఈ ప్రయోగ పాఠము నిట్లు నిరాకరించి విమర్శించి యుండఁగా నప్పకవి పై నన్నయ ప్రయోగము నుభయవళిక్రింద నెట్లుదాహరించెనో?" అని శ్రీ రావూరివారు వ్రాసినారు. (చూ. తె. భా. ఛం. రీ. పు. 275

కాదు. కావున నిత్యసమాసేతరముగా దీని నంగీకరింపక తప్పలేదు. అందువలన తన పట్టు నెగ్గించుకొనుటకు మాత్రమే అప్పకవి 'యుష్మదస్మచ్ఛబ్దయతి' యని క్రొత్తపేరు పెట్టినాడు గాని, అది అచ్చమైన అఖండ యతియే.

అఖండయతి నంగీకరించినచో ఉభయ యతులన్నియు గతార్థములే యగు ననుటకు వీలంతగా కన్పించదు. నారాయణ, వేదండాది పదములలో అచ్చు విరుగునట్లు భాసించదు. అట్టి చోట్ల వ్యాకరణ సూత్రరీత్యా అచ్చున్నదని, దానికి యతి చెల్లించవచ్చునని చెప్పుట యవసరము. ఉభయ యతులందు అచ్చుకు యతి చెల్లించుట ప్రధానము. అఖండ యతులందు హల్లుకు చెల్లించుట ప్రధానము. అందుకనియే అఖండయతి నంగీకరించినవారుగూడ ఉభయయతి భేదములను చెప్పినారు. వేంకటరాయడు ఉభయ యతులలో 'యుష్మదస్మచ్ఛబ్దయతి' నిగూడ చెప్పినాడు. నిజమున కిట్లు చెప్పుట యనవసరమని ఆయన కును తెలియును. కావుననే—

'అప్పకవిగా రఖండయతి నొప్పరుగాన నిచ్చట దిద్ద శక్యము గాక యుష్మదస్మచ్ఛబ్ద యతులని పేరుంచినారు. ఇంతమాత్రముచేత నఖండయతికి లోపము రానేరదని యుంచినాము'

అని వ్రాసినాడు. ఈ రీతిగా చూచినచో అఖండయతి చెప్పినను ఉభయ యతులు చెప్పవలసియున్నదనవలెను.

అఖండయతి, ఉభయయతి భేదముల విషయమున వేంకటరాయని పరిశీలన గొప్పదని చెప్పబడినది. అప్పకవితోబాటు, తిమ్మనతోబాటు ప్రాచీన లాక్షణికులు నిత్యసమాసముల నిరూపణ విషయమున పడిన పొరపాటులను యుక్తియుక్తముగా అనేక ప్రమాణములతో నిరూపించిన రీతిలా ఎన్నో వినూత్న పదరీతులు తెలియవచ్చును. ఆయన చూపిన ప్రమాణములు ఆయన పాండిత్యమునకు నికషోపలములు. రామాయణ, నారాయణాదులు నిత్య సమాసములు కావు 'వేదండము' కాదు. 'ద్వీపా' దులు కావు. ఈ యంశము లన్నియు వేంకటరాయడు నిరూపించిన తీరు తెలుగు ఛందోరంగమున నెంతో విశిష్టమైనది.

అఖండ యతులు కవిత్రయ రచనలో లేవనిగదా అప్పకవి, తిమ్మనల దృఢవిశ్వాసము; ఆధునికముగా కూడ నిట్టి విశ్వాసము కలవారు పలువురు

న్నారు. అందుకే వేంకటరాయడు భారతములోని దాదాపు ప్రతి పర్వమునుండి కొన్నిగా నలువది ప్రయోగములు చూపినాడు.[1] ఈ చూపిన వాటిలో ఏకొన్నియో అఖండ యతులనుటకు వీలులేనివి ఉన్నవి. ఉదాహరణమునకు-

బహులమై బహువిధ-పక్షికోలాహల
భయదమై కడు పర-పైన యడవి

ఇది అరణ్యపర్వ సప్తమాశ్వాసములోని (406) సీసపద్య పాదము. ఎఱ్ఱనగారి రచన. ఈ పాదమున ఉత్తర దళమందు అఖండయతి. కాని ఇది నన్నయగారి సీసపద్య రచనా పద్ధతికి భిన్నముగా కన్పించు సీసపాదము. ఎఱ్ఱనగారును భారతమునందు సీసరచనలో నన్నయగారినే అనుసరించినారు పాదపూర్వదళమున యతి, ఉత్తరదళమున ప్రాసయతి చెల్లెడు రీతికి చెందినదీ సీసపద్యము. కాని ఈ పాదమున ఉభయ దళములందును కేవల యతియే కన్పించును ఉత్తర దళమున ప్రాసయతి యుండవలెను. 'పరపైన' అనికాక 'పరపయిన' అని యున్నచో ప్రాసయతి చెల్లినట్లగును.[2] 'అయిన' 'పైన' అనునవి ఛందోభంగము కానంతవరకు పరస్పరము ప్రాతలో మారవచ్చును. కాగా 'పైన' అనిగాక 'పయిన' అనియుండుటె ఆ సీసపద్య రచనారీతి కనుగుణము. ప్రాసయతి చెల్లినచో అఖండ యతిప్రసక్తియే ఉండదు. ఈవిధముగా వేంకటరాయలు చూపిన లక్ష్యము, 'లక్ష్యము' కాలేక పోయినది. ఇట్లే—

'నీవును నీవారు నతనిఁ నెఱుఁగరె చెపుమా'

(ఉద్యోగ 2-259) అను కందపాదమున 'నీవు' అనియే యున్నదని కచ్చితముగా చెప్పుటకు వీలులేదు. 'ఈవు' అనియు కావచ్చును. కాగా ఇట్టి లక్ష్యములు సందిగ్ధములు.

---

1. శ్రీ గిడుగు సీతాపతిగారు అప్పకవీయ పీఠికలో వేంకటరాయడు మొత్త మఖండ యతికి 25 ప్రయోగములు చూపినాడన్నారు. కాని భారతము నుండియే 40 ప్రయోగములు చూపబడినవి. శ్రీనాథాదుల ప్రయోగము లీ నలువదిలో చేరలేదు. అవి 26.

2. అకాడమీ ప్రతియందు "పరపయిన" అనియే ఉన్నది. ఉ. వి. వి. ప్రతియందు 'పరపైన' అనియున్నది. పాఠాంతరముకూడ చూపబడలేదు.

అయితే ఇట్టి లక్ష్యములు నలువదింటిలో చాలాకొద్ది మాత్రమే.పలు లక్ష్యములు నిర్ధారకములైనవి. ఇవి అచ్చుప్రతులందు పలుచోట్ల పాఠములు దిద్దుబాటుపొంది కన్పించును. దిద్దబడనివికూడ కొన్ని లేక పోలేదు. శ్రీనాథాదుల రచననుండి చూపబడిన ఇరువదియారు ప్రయోగముల స్థితియునింతే. కొన్ని దిద్దబడినవి కొన్ని అట్లేమిగిలినవి. ఈ దిద్దుబాటులకు హేతువు అప్పకవియే. తనకన్న పూర్వులు భారతాదులనుండిచూపిన ప్రయోగములను అప్పకవి దిద్దినాడు.

'చూవె మనంబున దలంచుచు-చుండుదు నెప్పుడున్' అన్న నన్నయగారి ప్రయోగమును "తలంతు-సుందరి" అని దిద్దినాడు. ఈ దిద్దుబాటు సరియైనది కాదని వేంకటరాయడు వ్యాసుని శ్లోకముల నుదాహరించి, సందర్భము వివరించి నిరూపించినాడు. ఈవిధముగా గ్రంథమందలి సందర్భమును, మూలమును, పాఠనిర్ణయ విషయమున ఒక్క ఇక్కడనేకాదు, పలుచోట్ల చేసినాడు. రేఫ-శకట రేఫ విచారణలో "అరగుట"లో రేఫమా-శకట రేఫమా అన్న పరిశీలనలో 'మఱునాడ యగుట...' అను మౌసలపర్వ (1-169) పద్యము నప్పకవి యుదాహరించగా, పూర్వోత్తర సందర్భ పూర్వకముగా నా పద్యమసలు లక్ష్యమేకాదని నిరూపించినాడు. ఇట్లు గ్రంథమున పలుతావులలో నున్నది. ఈతీరు వేంకటరాయని విమర్శ ఎంత స్పష్టమార్గమున సాగుననుటకు గీటురాయి. ఇట్లే అనేక సందర్భములందు అచ్చుపడిన గ్రంథములందలి పలుపాఠములను చర్చాపూర్వకముగా విమర్శించినాడు. ప్రాచీనగ్రంథ పరిశీలనలో ఈరీతి మిక్కిలి యవసరము. మొత్తముమీద అఖండయతి నిరూపణలో వేంకటరాయడు చూపిన లక్ష్యములు, చేసినచర్చ, ఆ యతిని త్రోసివేయుటకు వీలుకానంత స్థిరముగా చేసినవి. అఖండయతి నొప్పనివారి బండారమును బయటపెట్టినవి.

## 'చక్కటి - పోలిక'లు.

చక్కటి యతిని గూర్చి వివరించుచు వేంకటరాయడు 'పోలిక యతికి, చక్కటి యతికి భేదము తెలియదు. స్పష్టముగా నెవరును చెప్పలేదు.' (2-225) అన్నాడు. నిజమే. ఏ లాక్షణికుడును చెప్పలేదు. 'వనము' ఇత్యాదులలోని విభక్తిముకారమునకు 'పు ఫు బు భు'లు యతి చెల్లుట పోలికయతి. 'మరువు' ఇత్యాదులలోని విభక్తీతర ముకారమునకు 'పు ఫు బు భు'లు చెల్లుట చక్కటి యతి. ఈ భేదా వేంకటరాయ డెఱుగనిది కాదు. కాని ఉభయత్ర ముకారమున

పు ఫు బు భు లు చెల్లుచుండగా రెండు యతి భేదములు చెప్పుటెందుకని ఆయన భావము కావచ్చును. అయితే క. జ. కర్త, కావ్యాలంకార చూడామణి కర్త, అనంతుడు పోలికవడినే చెప్పినారుగాని చక్కటి యతిని చెప్పలేదు. విభక్తి ముకారము యొక్క ప్రాచీన రూపము 'బు'. అది క్రమముగా బిందు పూర్వక బుకారముగా, ద్విత్వ ముకారముగా పరిణమించినది. నేటికిని ఈ రెండు రూపము లున్నవి. ద్విత్వము లేని కేవల 'ము'కార రూపము చివరిది. (వ్యవహారమున అది అనుస్వారముగా మారుట ప్రస్తుతానికి చిట్టచివరి దశ.) మరియు పుంస్త్వా దేశ సంధిలో ముకారము 'పు' అని మారుచున్నది ఈ పోలిక దృష్ట్యా విభక్తి ముకారము పు ఫు బు భు లకు యతి చెల్లనిది. ఈ పద్ధతియే ప్రాచీనులగు నన్నయాదుల ప్రయోగములందు కన్పించును. అందువలన క. జ. కర్త మొద లగువారు ఆ యంశమునే 'పోలికయతి' యని చెప్పినారు. కాని చక్కటి యతిని చెప్పలేదు. పోలిక యతి ననుసరించి విభక్తితర ముకారమునకు తరువాతి కవులు 'పు ఫు బు భు' లు యతి చెల్లించు టారంభించగా నది చక్కటి యతి యైనది. నిజమునకు విభక్తితర ముకారమునకును యతి చెల్లింపు నంగీకరించిన లాక్షణి కులు రెండు భేదములను చెప్పనక్కరలేదు. కాని సాంప్రదాయికముగా నీ భేద మును లాక్షణికులు పాటించినారు. అయితే చక్కటి యతి కూడ ప్రాచీన కవు లలో నున్నచో నీ రెండు భేదము లేర్పడెడివే కాదు. 'చక్కటి యతి మంచిది గాదు, కవిత్రయము వారి ప్రయోగము లేదు' అని అంటారు, అని ఎఱ్ఱనగారి ప్రయోగమును వేంకటరాయడు చూపినాడు. అయితే ఎఱ్ఱనగారి నాటికి చక్కటి యతి కవుల ప్రయోగములందు ప్రవేశించుట గమనించదగిన యంశము.

## 'స్త్నాన' యతి

వేంకటరాయడు క్రొత్తగా చెప్పిన యతి భేదములలో 'అగమయతి' యొకటి. తిమ్మన సంయుక్త యతులలో 'స్త్నానము' అనుదానిలో తకారము గూడ నున్నదనియు, సకార, నకారములకే కాక తకారమునకును యతి చెల్లించ వచ్చునని చెప్పినాడు. కాని 'స్త్నాన' పదములో తకారము యొక్క ఉనికి నాయన నిరూపించలేదు. వేంకటరాయడును సంయుక్త యతులలో 'స్త్నాన శబ్దము (నందు) తకారమున్న గలదని యెఱుంగరు' అని తకారమునకు యతి చెల్లిన లక్ష్యములు చూపినాడు. మరి తకారముండుటలో ప్రమాణమేమి ? అది ఈ భ్రాగమ యతివద్ద ప్రదర్శించినాడు,

'అఘోషా దూష్మణః పరః ప్రథమోభినిధాన స్పర్శపరా త్తస్య సస్థానః' అను కుమార వ్యాకరణసూత్ర ప్రకారము ణ, న అను వర్ణములకు పూర్వమున నంటియున్న శ, ష, స, హ లకు ట త ప వర్ణములు అంతాగమము లగును. అనగా 'కృష్ణ' అను పదమున ష-ణ లకు మధ్య టకారము వచ్చి 'కృష్టణ' అని యగును. ఇట్లే 'స్నాన' 'స్నా' లోని స-న ల మధ్య తకారము వచ్చును. ఈ ఆగమములుగా వచ్చిన వర్ణములకు యతి చెల్లినచో 'అగమ' యతి యగును. ఈ విధముగా కుమార వ్యాకరణరీత్యా 'స్త్నాన' శబ్దమున తకారము సాధింపబడినది.[1] అయితే ఆగమ యతికి వేంకటరాయడు లక్ష్యములను ప్రదర్శించలేదు. నిజము నకు ఈ యాగమముగల రూపములకు వ్యవహారము గాని, ప్రయోగము గాని తెలుగులో కావ్యములందు లేదు. అందువలననే కావచ్చును, వేంకటరాయడు లక్ష ణము చెప్పినాడు తప్ప లక్ష్యములను ప్రదర్శించలేదు. కాని 'స్త్నాన' శబ్దమొకటి మాత్రము ప్రయోగములందు కన్పించును. కావున వేంకటరాయడు 'స్త్నాన' లక్ష్యముల నీయతికి లక్ష్యములుగా ప్రదర్శించినచో సరిపోయెడిది. ఈ యాగమ యతి ఒక విధముగా స్వతంత్ర యతి భేదముగాక, సంయుక్త యతిభేదమున కంతర్భేదముగా నుండవచ్చును.

### ఉభయ యతులు : కలగలుపులు

ఉభయ యతి భేదములలో శకంధ్వాది, ఆదేశ, నసమాస, నఙ్ సమాస, నిత్యసమాస, కాకుస్వరప్లుత యతుల పరిశీలనలో వేంకటరాయని దృష్టి నైశి త్యము పూర్వలాక్షణికుల పొరపాటులను ఎంతో స్పష్టముగా చూపించినది. శకం ధ్వాదులలోని పదములను కొన్నిటిని నిత్యసమాసములలో, ఆదేశ, నసమాస,

---

1. గణపవరపు వేంకటకవి యాంధ్రప్రయోగ రత్నాకరములో నీ యతిని సంగ్రహించి ఇట్లు వివరించెను. "స్నాన అనేటప్పుడు అఘోషమైన ఊష్మనకారమునకు స్పర్శ పరమునునుండగా మధ్యేతకారమువచ్చి స్త్నాన మని యుండెను. ఇందులకు ప్రాతిశాఖ్యసూత్రము-' అఘోషాదూష్మణః పరః ప్రథమోభిధానః స్పర్శపరాతస్సస్థానః" అని శ్రీ రావూరివారు.— (తె. భా. ఛం రీ. పు. 314) సూత్రపు టాకరము వేంకటరాయడు భిన్న ముగా చూపినాడు.

నఞ్ సమాస పదములతో బాటు పరిగణించుటగా పూర్వలాక్షణికులు పడిన పొర పాటులను వేంకటరాయడు వివరముగా చూపినాడు. అప్పకవి శకంధ్వాది పద ముల కర్థము చెప్పుటలో చేసినతప్పులు పట్టి పట్టి ప్రదర్శించినాడు నిత్యసమాస ములు కాని పదములను నిత్యసమాసములలో చెప్పుట కేవలముగా అఖండయతిని వారించుటకే యని ఈ వివరణ వలన స్పష్టమగును. ఉదాహరణకు నారాయణ-రసాయనవంటి పదములు నిత్య సమాసములు గావు. నారాయణాది శబ్దములకు వేంకటరాయడు చూపిన అనేక విధములైన విగ్రహ వాక్యములు ఆయన పలు గ్రంథముల పరిశీలన కద్దము పట్టును. పూర్వులు పట్టించుకొనని నిత్య సమాస ములను దాదాపు వందవరకు విగ్రహ వాక్యములతో ప్రదర్శించినాడు. శకం ధ్వాది పదములకు పట్టికలు అర్థ సహితముగా చూపినాడు. ఇవన్నియు ఎన్నియో పదముల స్వరూపములను క్రొత్తగా కన్పింపజేయును.

కాకుస్వర యతిలో అంతర్భేదములను పూర్వలాక్షణికులు కొందరు చెప్పక పోలేదు. అట్లే ప్లుతయతి యందును, అయితే వేంకటరాయడు ఈ అంతర్భేద ములు సరిగా నిరూపితములు కాలేదని, కొన్ని సరిగాలేవని నిరాకరించి కాకు స్వరములో ఇరువది యైదు భేదములను, ప్లుతయతిలో నాల్గు భేదములను ప్రద ర్శించినాడు. ఈ భేదములు, వీటికి ప్రదర్శించిన లక్ష్యములు నిజముగా వేంకట రాయని పరిశీలనా ఫలితములు. అయితే వీటిలో అక్కడక్కడ తొట్రుపాటులు లేకపోలేదు. ఉదాహరణకు కాకుస్వరయతి భేదములలో 'భీతి' కి 'ఎవ్వతె వీవు భీతహరిణే క్షణ......పురంబు జేర నిం, కెవ్విధిఁగాంతుఁ దెల్పగదవే...' అన్న పద్యము లక్ష్యముగా జూపబడినది. ఇందు 'తెల్పగదవే' యన్న చోటి కాకువు 'భీతి' ద్యోతకమని భావము. కాని ఇక్కడ 'భీతి' కాక 'ప్రార్థన' కన్పించును. కాగా 'ప్రార్థన' యన్న యంతర్భేదమున కిది ఉదాహరణీయము. ఇట్లే 'భర్గా ! పార్వతీవల్లభా !' ఇత్యాదులందలి 'భర్గా' వంటివి దూరాహ్వాన ప్లుతమునకు లక్ష్య ములుగా చూపబడినవి. కాని వేంకటరాయడు వివరించిన రీతిని బట్టి ఇట్టివి గాన ప్లుతమునకు చెందును. 'భక్తి, గౌరవము, వాత్సల్యము, అనురాగము -ఈ మొద లైన వాటిచేత, ననగా - తద్ధర్మ ప్రతిపాదక శబ్దముల చేత సంబోధన మాత్ర మున గానప్లుతము' (8-605) అని వేంకటరాయడు గానప్లుతమును నిర్వచించి నాడు. 'భర్గా' వంటి శతకములలోని సంబోధనలు ఈ నిర్వచనము దృష్ట్యా గానప్లుతమునకు లక్ష్యములగును గాని 'దూరాహ్వానము' నకుగాదు. శతకము

లందలి సంబోధనలు భక్త్యనురాగ పూరితములు. ఇంతకు అది ఏ ప్లుతమయినను అక్కడ అచ్చునకు (హల్లునకును) యతి చెల్లుటయే ప్రధానము. కాకుస్వరము లందును నింతే. ఇంతేకాని, కాకు స్వరములలోని, ప్లుతములలోని ఉద్దేశ్యభేదము చేత యతి చెల్లించుటలో భేదమేమియు కన్పించదు. కాకపోయినచో, కాకువు లిన్నిన్ని విధములుగా, ప్లుతధ్వను లిన్నిన్ని విధములుగా నుండునని మాత్రము తెలియును.

నిత్యసమాసాదియతులలో వేంకటరాయదు నిరూపించిన యనేకపదము లందు అచ్చున్నదని కేవలశబ్దశాస్త్రమున నిరూపితమే కాని అచ్చున్నట్లుగా నెంత మాత్రమనిపించని పదము లనేకములున్నవి. అట్టిచోట అచ్చునకు యతిచెల్లించి నట్లే అనిపించదు. ఉదాహరణకు ఈ గ్రంథావతారికలో నొకచోట వేంకట రాయదు వంకాయలపాటి వేంకటనారాయణ గారిని స్మరించుచు వ్రాసిన సీస పద్యములో

సీ. ఏకవి సుకవిత్వ (హేవాక) వాణి కో
మల విపంచీధ్వని నాదరించు
నేపురాణ విదుని మృదువాక్యపటలి కై
లాసంబునకును సోపానపంక్తి...' (అవ-12)

అనియున్నది. ఈ సీసపాదముల ఉత్తరదళములలో యతి చెల్లినట్లే కన్పించదు. కోమల, కైలాస, సోపాన పదములలో శబ్దశాస్త్రరీత్యా అచ్చు విరుగవచ్చును. గాని సరూపాక్షరయతిలో ఉద్దిష్టమైన శ్రవ్యత లోపించినది. కాగా నిత్యసమాసాదులెన్నో యున్నను ఉపయోగకరమయినవి మాత్రము కొద్ది మాత్రమే.

## గుండు రా, బండిఱాల అమైత్రీచందత

గుండు రా, బండి ఱా ల చర్చ లక్షణసారసంగ్రహమున తిమ్మకవియే కొంత విస్తృతముగా నెరపినాడు. దాని నందిపుచ్చుకున్నట్లుగా వేంకటరాయుడా రెండింటి ప్రయోగపరిశీలన, చర్చ మరింత విరివిగా సాగించినాడు. తిమ్మన నిరూపించిన, నిర్ణయించిన రేఫ-శకట రేఫలుగల పదములనే వేంకటరాయదు

యథాతథముగా స్వీకరించినను, పూర్వులు అట్టిపదముల నిర్ణయములో పడిన తికమకలను పలుప్రయోగముల ప్రదర్శనలో తీర్చిదిద్దినాడు. నిజమునకీనాడీ గుండు రా, బండి ఱాల భేదమంతరించినది. పాటింపు లేనేలేదు పట్టుపట్టినవారి పద్యములలో తప్ప అన్యత్ర ఆ అక్షరమే-బండిఱా-కన్పించదు. అయితే పద ముల స్వరూపముల క్రమపరిణామ పరిశీలనకు వీటి విషయికమయిన చర్చ ఉపయోగింపవచ్చును.

ఒకవిధముగా చూచినచో గుండురా, బండిఱా ల మధ్య భేదమును స్పష్ట ముగా, నిశ్చితత్వముతో నన్నయగారుతప్ప మరియే తెలుగుకవియు కచ్చితముగా పాటించినట్లు కన్పించదు. ఆరెండింటిలో భేదము ఆనాటికే మాపువట్టినది. అందు కనియే-ఆ భేదమును నిలుపుటకే-ఆ రెండింటికి యతి ప్రాసమైత్రి నిషేధింప బడి నట్లు కన్పించును. శ-స లకు యతిప్రాసలు చెల్లుట కంగీకరించిన లాక్షణికులు ర—ఱ లకు అంగీకరించక పోవుటలోని యౌచిత్యమింతకన్న వేరే కన్పించదు. ధ్వని సామ్యమేమాత్రము కన్పించని మవర్ణయతి, ప్రాసమైత్రి ప్రాసలకన్న నీ ర-ఱ యతి ప్రాసలు చెడిపోలేదు. చెడిపోలేదు కావుననే క్రమక్రమముగా నా రెంటికి యతి ప్రాసల చెల్లింపు పాటింపునకు వచ్చినది. ఉభయ రేఫములు గల పదములు రూపొందినవి. ఒక పదమునకు రెండర్థములున్నచో నొకయర్థమందు గుండురా, మరొకయర్థమందు బండిఱా యున్నదన్నచో కొంత సామంజస్య మున్నది. కాని ఏకార్థమునందే ఒకేపదము రెండువిధములయిన రేఫములతో, రెండు రూపములతో నుండుటలోని సామంజస్యము తృప్తికరముకాదు. ఉదాహర ణకు 'వేమరు' అన్న పదము, అర్థభేదమేమియులేకనే వేమఱు-వేమరు అని రెండు విధములుగా నున్నది. 'పఱతెంచు' అని బండిఱాతో నన్నయగారా పదమును (ఆది. 5.256) ప్రయోగించగా, తిక్కనగారు 'పరతెంచు' అని గుండు రాతో నా పదమును (ఉ. రా 6-140) ప్రయోగించినారు. అనగా 'పఱతెంచు' లోని బండిరా ధ్వని తిక్కనగారి నాటికే గుండురా ధ్వనిగా మారిపోయినది. కాని లాక్షణికులు అటు నన్నయగారిని, ఇటు తిక్కన గారిని రేఫ సాంకర్య మునుండి రక్షించుటకు 'పరతెంచు' ను ఉభయ రేఫాత్మకముగా నిర్ణ యించినారు. ఇదిఇట్లుండగా 'అరవిరి' యని యొకచో రేఫలో (ఉ. రా. 6-80), మరొకచో శకటరేఫతో (విరాట. 2-84) తిక్కనగారే ఉప యోగించినారు. కావున 'అఱ' కూడ ఉభయ రేఫాత్మకమై పోయినది. ఈ విధ

ముగా భిన్నకవులు ఒక పదమును భిన్నరేఫలు గలదిగాకాక, ఒకే కవియే ఒక పదమును భిన్న రేఫాత్మకముగా వుపయోగించుట రేఫ శకట రేఫ-భేద శైథిల్యమును స్పష్టపరచును. ఇట్టిస్థితిలో కొందరు కవులు రేఫశకట-రేఫ సాంకర్యము యతిప్రాసలందు చేసినారని లాక్షణికులు కవులను నిరసించుట లాక్షణికాహంకారమును మాత్రమే తెలియ జేయును గాని వస్తుస్థితినిగాదు. ఇంత యెందుకు? రేఫ-శకట రేఫములను నిర్ణయించిన లాక్షణికులే, సాంకర్యమును నిషేధించిన లాక్షణికులే ఈ సాంకర్యము చేసినారు. మరి వారినెవరుగాని యేమనవలెను? 'అప్పకవిగారు కవిత్వమందు గలిపిన 'గురు-లఘు రేఫముల' నెన్నింటినో వేంకటరాయడు చూపినాడు బాలసరస్వతిగారి చంద్రికా పరిణయమున, అహోబల పండితుని పద్యములందు ఈ సాంకర్యము చూపినాడు.

'మహాకవుల ప్రయోగములకు, లాక్షణికులు నిర్ణయించిన రేఫ అకారములకు- సరిగా పరిశీలించనందున వ్యత్యస్తములు గలవు' (4-232).

అన్నాడు వేంకటరాయడు. నిజమునకెంత పరిశీలించినను వ్యత్యస్తముండనే యుండును దానికి కారణము వాటిలోని భిన్నత్వము తొలగిపోవుటయే. మరియు-

'భారతమందే రేఫ అకార సాంకర్యముంచే రేఫ అకార నిర్ణయమే పనిలేదు'. (4-277)

అనియు నన్నాడు. ఎఱ్ఱనగారి హరివంశ ప్రయోగమునుచూపి యీ మాట అన్నాడు. ఎఱ్ఱనగారు కవిత్రయము లోనివారుగాన, కవిత్రయ రచితము భారతమగుటచే, భారతమందు రేఫ అకార సాంకర్యముండదను నిశ్చయముతో నిట్లుచెప్పినాడు. నిజమునకు 'భారతము భారత' మందురేకాని, భారతము ఒక్కరి రచనగాదు కవిత్రయ రచన. ఆ కవులు మువ్వురును భిన్నకాలికులు. వీరి యీ కాల వ్యవధానములో భాషాప్రయోగము లందెన్నో మార్పులు వచ్చినవి. అందువలన భారత ప్రయోగముల నుమ్మడిగా స్వీకరించుటకు వీలులేదు. ఈ ముప్పురిలో ఒకరి ప్రయోగమును మరొకరి ప్రయోగము రక్షింపదు. 'ఈఁగు, నీఁగు' అని అజాదిగా హలాదిగా భారతమున ప్రయోగము కన్పించును. మొదటిది నన్నయగారిది కాగా, రెండవది తిక్కనగారిది. నన్నయగారుకూడా 'నీఁగు' అని హలాదిగానే ప్రయోగించినా దనుటకు తిక్కనగారి ప్రయోగముచూపి లాభములేదు. ఇట్లే తిక్కన గారిది చూపి ఎఱ్ఱనగారి ప్రయోగమును నిర్ణయించుటకు వీలులేదు. అందువలన ముప్పురి ప్రయోగములను విడివిడిగా చూడకొనవలసినదేగాని ఉమ్మడిగా 'భారతప్రయోగ' మనుటవలన ప్రయోజన మంతగా నుండదు.

ఏదెట్లున్నను వేంకటరాయడన్నట్లు 'రేఫ అకారములపట్ల పరిశీలించుటలో అందఱికిని లోపమే' (4-211) కలిగినది. ఈ లోపముల నన్నిటిని కాకపోయి నను అనేకములుగా వేంకటరాయడు బయటపెట్టినాడు కాని, రేఫ-అకారముల యతి ప్రాసలను వేంకటరాయడు అంగీకరించునా? అంగీకరించడా యన్నది మాత్రము కంఠోక్తిగా నెక్కడను చెప్పలేదు. తత్వ పరిశీలనగా మాత్రమే ఈ రేఫ-అకార విషయికముగా పరిశీలనాత్మక చర్చ చేసినాడనిపించును.

## వేంకటరాయని
## విమర్శ తీవ్రత - సహృదయత

మహాకవులు ప్రయోగించిన పలు శబ్దరూపములను సంధిరీతులను గ్రామ్యములని, అలాక్షణికములని అప్పకవి పలుచోట్ల నిరసించినాడు. 'కనియె ననవలసిన భూతార్థ క్రియా పదైక వచనము నందు వర్ణలోపము చేసి 'కనెనట' అని గ్రామ్యపదముగా వాగనుశాసనులు ప్రయోగించినారు' (అ. క. 1-129) అని నన్నయగారినే అప్పకవి ఆక్షేపించినా డనగా ఇతర కవులను గూర్చిన ఆయన ప్రవృత్తి యెట్లుండునో తెలిసికొన వచ్చును. నిజమునకు 'కనె' నను ప్రయోగమున్నట్లుగా భారత పద్యమని చూపబడినది భారతములోనిది కాదు. నన్నయ గారు 'కనె, చనె' ఇత్యాది రూపములను ప్రయోగించలేదు. అసలు నన్నయగారా రీతిగా ప్రయోగించినారా లేదా యన్నది ప్రశ్నకాదు, ప్రయోగించినా రనుకొన్న తరువాత ఆ ప్రయోగమును గ్రామ్యమని అప్పకవి యనుట మాత్రము మహా సాహసము నన్నయగారి ప్రయోగమే అలాక్షణికము, గ్రామ్యమయినచో తెలుగు లక్షణమున కసలు గతిలేదు. నన్నయగారిని పరమ లాక్షణికుడుగా, ఆయన రచించిన భారతములోని రెండున్నర పర్వములలోని ప్రయోగములను పరమ ప్రమాణములుగా అనంతర కవులెల్లరు స్వీకరించి గౌరవించినారు. అట్టి నన్నయ గారి ప్రయోగమును గ్రామ్యమనుట అప్పకవి పరిశీలనా లోపమే. నన్నయగారి భారతమును సుష్ఠుగా పరిశీలించినట్లు వ్రాయు నప్పకవి పరిశీలనా రాహిత్యమును వేంకటరాయడు పలుచోట్ల బయటపెట్టినాడు. అప్పకవి శ్రీనాథాది మహాకవుల ప్రయోగములలో చూపిన లక్షణ వైరుద్ధ్యమును పలు లక్ష్యములతో ప్రమాణీ కరించినాడు. కవుల ప్రయోగముల విరివిని బట్టి, కవుల శక్తియుక్తులను బట్టి లక్షణము కల్పించ దగినదిగాని, ప్రయోగముల నిరసించరాదు. లాక్షణికులకు కవుల ప్రయోగములే ప్రమాణములుకాగా, కవులకు లోకములోని వ్యవహారము ప్రమాణము. కవులు నిరంకుశులు. కాని లాక్షణికులు వారికి తామంకుశము లను కొందురు. లాక్షణికులు దోషములను నిరూపించ గూడదని కాదు, కాని ఆ నిరూ

పణములో మరల కవి ప్రయోగములే ప్రమాణములు కావలయునుగా స్వేచ్ఛ కాగూడదు. జీవద్భాషా ప్రవాహములోని యనేక ప్రయోగ పరిణామరీతిని గుర్తించి లక్షణము నిరూపించ వలసి యుండును. అందువలన లక్షణ గ్రంథములు పూర్వపూర్వముల కన్న ఉత్తరోత్తరములు విశేషాంశములతో గూడి యుండును. లాక్షణికుల కుండవలసిన మహాకవి ప్రయోగ ప్రామాణ్యనిష్ఠ అప్పకవిలో పలుచోట్ల మృగ్యము ఈ నిష్ఠ కలిగిన వేంకటరాయడు అప్పకవిని ఇతర లాక్షణికులను నిరసించుటలో - తీవ్రతయున్నను దోషములేదు

ఒక యంశమును దోషమనుట సులభమే. ప్రతాపరుద్రీయమున విద్యానాథుడు దోషప్రకరణము వ్రాసి పలుదోషముల నిర్ణయించినాడు సంస్కృతమున పాదాంత లఘువు వికల్పముగా గురువగును. కాని పాదాంతమున గురువుండవలసిన చోట లఘువుండుట ఛందోభంగమన్న దోషముగా చెప్పబడినది. మరి ఇది దోషమే యయినచో, నిట్టి దోషము చేయని సంస్కృత కవియే యొక్కడు నుండడు. ఈ యంశమును సోదాహరణముగా వేంకటరాయడు నిరూపించినాడు, ఇట్లే 'అతిమాత్ర' మను దోషమొకటి 'యత్సర్వ లోకాతీతం తదతిమాత్ర' మని దోషలక్షణము. అతిశయోక్త్యలంకారమున్న ప్రతిచోట అంతో యింతో ఈ దోషమేర్పడనే యేర్పడదు.ఈ విధముగా దోషములు నిత్య-అనిత్య రూపముగా నుండును. కొన్ని దోషాభాసములు. ఇట్టి వాటిని నిరూపించునప్పుడు లాక్షణికులు ఎంతో పరిశీలన చేయవలసి యుండును, సంయమము ప్రదర్శించ వలసియుండు నన్న యంశము. ఈ విధమైన కొన్ని దోషముల స్వరూపమును, వాటి అదుష్టతను పలు ప్రయోగములతో వేంకటరాయడు నిరూపించిన రీతి మరింత బలపరచును.పంచమాశ్వాస మంతయు ఈ విధముగా లాక్షణికులుపడిన తొందరపాటులను, పొరపాటులను నిరూపించుటకే వేంకటరాయడు తీర్చినాడు.

### ఉపసంహృతి

'సుకవి మనోరంజనము' నాద్యంతము చూచినచో వేంకటరాయని అనంతమైన పరిశ్రమ, అగాధమైన పాండిత్యము, విశాలమైన ప్రయోగపరిశీలన అడుగడుగున అబ్బురపాటు కలిగించును. లాక్షణికులకు ప్రధానమయిన విశాల ప్రయోగప్రామాణ్యాపత్తి, సహృదయత కన్పించును. అప్పకవిని విమర్శించుటలో ప్రదర్శించిన 'దురుసుతనము' అన్య లాక్షణికులను విమర్శించుపట్ల కనిపించదు. అప్పకవి విషయికయయిన 'దురుసుతనము' నకు కారణము అప్పకవి ప్రదర్శించిన దుస్సాహసమే తప్ప మరొకటి కాదు. మరియు అప్పకవినే పరమ ప్రామాణ్యముగా గ్రహించిన పలువురు పరిష్కర్తలు, పండితులు పూర్వ ప్రయోగముల విషయమున ప్రదర్శించు తీరుగూడ కొంత కారణమనవచ్చును. శ్రీ గిడుగు సీతాపతిగారు చెప్పినట్లు—

'లక్షణ గ్రంథములన్నిటిలోను అప్పకవీయము మాత్రమే ముందు అచ్చు పడి ప్రచారములోనికి వచ్చియుండుటచేత చాలామంది తక్కిన లాక్షణికుల అభిప్రాయము తెలియలేదు. స్వతంత్రించి, లక్ష్యములు పరిశీలించి లక్షణము సరి చూచుకొనుట సుకరము కాదు; గనుక, అప్పటికి ముద్రితమై ప్రచారములో నున్న అప్పకవీయము మాత్రమే చదువుకొని అప్పకవి లక్షణములు వేదవాక్యములుగా పండితులు శిరసావహించినారు. గ్రంథములు అచ్చు పడుట ఎక్కువయిన కొలది వ్రాతప్రతులు పరిశీలించుట తక్కువయినది ఏలక్ష్యములను చూచి సరియైన లక్షణము వ్రాయవలసియుండెనో ఆ లక్ష్యములను ఒకానొకరు ప్రమాదవశమున చెప్పిన దుష్టలక్షణమును బట్టి దిద్దుటవల్ల సత్యము దూరమై పోవుచున్నది. అసత్యము బలపడి స్థిరమగుచున్నది.'

ఈ స్థితియే వేంకటరాయడు ఇంత విస్తృత లక్ష్యప్రదర్శన పూర్వకముగా 'సుకవి మనోరంజన' రచనకు పూనునట్లు చేసినదనవచ్చును.

అయితే, అప్పకవి ఎంత దుస్సాహసము ప్రదర్శించినను, లక్షణ నిర్మాణములో నెన్నిపొరపాట్లుచేసినను, ఒకయంశమును మాత్రమంగీకరించక తప్పదు. తెలుగునందు లక్షణ శాస్త్రనిర్మాణములో, వివిధాంశముల వర్గీకరణలో, ప్రతిపాదనలో, వివరణలో, విచారణలో,అప్పకవీయము తత్పూర్వోత్తర గ్రంథములకన్న నెంతో 'శాస్త్రీయము'గా రూపొందినది. దాని ఒరవడి, ఆకర్షణ, విశిష్టతలు మాత్రము నిజముగా అభినందనీయములు. ఈ యంశమును వేంకటరాయడు గుర్తించకపోలేదు. అనేకసందర్భములలో అప్పకవిని తీవ్రముగా విమర్శించినను, పలుచోట్ల అప్పకవి లక్షణములనే యథాతథముగా స్వీకరించినాడు లక్ష్యములను గ్రహించినాడు. వేంకటరాయనిలో సహృదయత. సులాక్షణికత, సువిమర్శకత కొరవడలేదు. ఇది మరింతగా అభినందించి అలవరచుకొనవలసిన ఉత్తమ లక్షణము.

ఈ ఉత్తమ విమర్శక పూర్వక లక్షణ గ్రంథము-'సుకవిమనోరంజనము' ఆం. ప్ర. సాహిత్య అకాడమీ ముద్రించి, ప్రచారించి సహృదయవిమర్శక పండితుల పరిశీలన కవకాశము కల్గించినది. అందుకు అకాడమీ అభినందనీయము.

'సమాలోకనము' లో 'సుకవి మనోరంజన' మందలి విమర్శరీతి స్వరూపము, వివిధాంశములు స్థాలీపులాక న్యాయముగా ప్రదర్శించుటకు ప్రయత్నము చేయబడినది సహృదయులగు విమర్శకుల పరిశీలనలు-సూచనలు సర్వధా శిరోధార్యములని వినయ పూర్వకముగా మనవి చేసికొనుచున్నాను.

—కోవెల సంపత్కుమారాచార్య

# సుకవి మనోరంజనము

## ప్రథమాశ్వాసము

—:o:—

-: అ వ తా రి క :-

శ్రీమహిళాధినాథ సరసీరుహజాత శచీకళత్ర ము
ఖ్యామరసార్వభౌమ మకుటామితరత్నవిభా ఝురీ పరీ
షామలపాదపద్ము మిహికాంశుకిరీటు ధర్మాత్మజామిల
త్కోమలమూర్తి పీఠపుర కుక్కుటలింగవిభుం దలంచెదన్. 1

చ. వలిమలఁ బుట్టి విన్ను[సిగవాని] యొడల్ సగ మాక్రమించి ని
చ్చలు ప్రియమందఁగాఁ బ్రియుఁడు సామజవక్త్రకుమారులం గుమా
రులఁ గని పన్నమన్నరుల రూఢిగఁ బ్రౌఢిగఁ బ్రోచు సర్వమం
గల కృప సర్వమంగలనికాయము లేయెడ మాకు సేయుతన్. 2

శా. శ్రీలానీలలఁ గేలులం దనుపుచుం జేజేల జేజేల క
ల్యాలాపధ్వనులం గ్రహింపుచుఁ గృతోద్యన్మద్యదింద్రాది శి
క్షాలక్షుండును [సర్వవి]శ్వపరిరక్షాదక్షుఁడౌ గోపకాం
తాలోలుండు కృపామృతామితనిపానంబై మముం బ్రోచుతన్. 3

ఉ. కల్యసముజ్జ్వలజ్జలజ గర్భదశోపమమున్ శుభాలిసా
కల్యవదాన్యతాపరమకారణముల్ నిజపాద భక్త హృ
చ్ఛల్యనివారణంబులు సుధాకరసోదరి చూపులెల్ల మాం
గల్యము లిచ్చు గావుత నికామకృపారసభాసితంబులై. 4

చ. తలపుకొలంకుసాహిణము తామర యవ్వని బువ్వు బాస వా
ల్గల రతనంపు కూన మెఱుఁగు దాల్చు మెకంబులు తాటియాకు దా
క్లల కవికోటి నోటి సరు లంతిపురంబులుగాఁగ లోకముల్
దలఁచిన మాత్రఁ జేసెడు విధాత చిరాయువు మా కొసంగుతన్. 5

చ. వలపులు గ్రుమ్మ బ్రహ్మ నలు వౌ నలువాలన మించు మంచెలం
జెలఁగుచు విప్పు కన్నులవే నుడిగంబులు గొంచు[నుండి రా]
చిలుకను గేలఁ బూని దయ నిచ్చలు గొల్చిన వారికెల్ల వి
ద్దెల నిడి మంచు పల్కుపొలఁతిన్ వలతిన్ దలపోయుదున్ మదిన్ 6

మ. అవనీభృత్తనయా పదాంబురుహ సేవాయాత దేవాంగనా
శ్రవణీక్లృప్త విపుల్ల నిర్జరధునీ సంజాత నీలోత్పల
ప్రకరచ్ఛన్నకరండలుబ్ధ మధులిట్సంఘాత జంబూఫల
ప్రవణత్వోద్ధృతహస్తునిన్ గజముఖున్ బ్రార్థింతు నశ్రాంతమున్. 7

సీ. ఖస్థలీ నటదురుగ్రావ వీక్షోద్ధృత
విబుధేట్పవ్రజ ప్రవేష్టకంబు
లతిరయ భ్రమిత విధ్వంసమత్ క్షణదిష్ట
కృత శతకోటి రాత్రిందినములు
గగన జృంభిత సప్తకంధి జలైక కా
లాప్లుతి ప్రీత దివ్యర్షికులము
లుపరిభాగ విలంబితోరగేభ్యపటాల
కాయమానిత దివౌకఃపథములు
కుంభినీధ్ర విరోధి నిమ్నలు కుటాగ్ర
... ప్రసూన ప్రవర్ష ముఖ్యా
... ణంబులు గరుడపక్షజమరుత్తు
... జము బాటి విసరుగాత. 8

సీ. దక్షిణామన వేగతానిల పాతితాం
బరచరవరవనీ తరులతాంతు
సమధిక నిజభుజాస్ఫాలన ... సం
వ్యక్త మంగళసూత్ర దనుజ కాంతు

కాలపాశాభీల వాలకీలి జ్వాల
పరిదగ్ధ దశకంఠపుర నిశాంతు
కాకుత్స్థ పట్టాభిషేక సీతా దత్త
ఘనహార కలిత వక్షఃస్థలాంతు
శాంతుఁ గాలుష్యరహితసుస్వాంతు బుద్ధి
మంతు మంతుకృదసురకృతాంతు దాంతు
సంతత జగద్ధితోదంతు శాతనఖర
దంతు హనుమంతు నాదు చిత్తమున నెంతు. 9

సీ. కూచిమంచ్యన్వయాకూపార చంద్రుల
శివకేశవాంఘ్రి రాజీవ భక్త
జాతాగ్రసరుల కంజాత సముద్భవేం
దిందిరవేణి మంజీర నినద
ప్రత్యర్థి వరకవిత్వ సుధారసానంది
తాసేతుశీతధరాంతరాధ
రాతల స్థిత కవిరాజుల మత్పితా
మహ పితామహుల తిమ్మకవి జగ్గ
కవి సమాఖ్యుల కాశరాట్కాశహార
తార నీహార కుంద మందార చంద్ర
హీర హీర సమాఖ్యులఁ బృథు ప్రబంధ
కర్తలఁ దలంతు మది భక్తి గ్రమ్ముకొనఁగ. 10

చ. అనుదినమున్ భజింతు నకలంకపు భక్తి దలిర్ప భోగికం
కణపదభక్తియుక్తు సకలార్యనుతున్ సరసాగ్రగణ్యు జ
గ్గన తనయున్ శరజ్జలద కైరవ నారద శుభ్రకీర్తి మ
జ్జనకునిఁ దిమ్మసత్కవి సుధాకరు సద్గుణజాలశోభితున్. 11

సీ. ఏ కోవిదుని జనిచే కులం బంతయు
ననుపమ ప్రఖ్యాతి నలరుచుండె
నే కవి సుకవితా [హేవాక] వాణి కో
మల విపంచీ ధ్వని నాదరించు

నే పురాణవిదుని మృదువాక్యపటలి కై
లాసంబునకును సోపానపఙ్క్తి[1]
యే మహాత్ముని దయా దృష్టి యించుక సోక
స్థాణువై నను జూడ స్థాణువగును
నట్టి ప్రథిత వంకయలపాటి వేంకట
రాయ విబుధవరు నరాయణాం[2]ఘ్రి
భక్తు సుగుణయుక్తుఁ బంచాక్షరీ ప్రదు
వీక్షణములు కృతుల వెలయ సేయు. 12

శా. శ్రీమద్దేవులపల్లి వంశజలధిశ్రీసోదరున్ గుంద తా
రా మందార హరీంద్ర చందన శతారాబ్రాశ్వగోస్రష్టృ కాం
తా మందాకిని చంద్ర పారద మరున్నాగప్రభాంచద్యశో
ధామంబౌ గురునిం దలంతు మతి సీతారామ విద్వన్మణిన్. 13

సీ. ఏ విబుధుఁడు నాటకావలియు నలంక
రణ శాస్త్రములను బాల్యమునఁ దెలసె
నే మహనీయుండు కౌమారముననె సి
ద్ధాంతకౌముదిని సాంతముగఁ జదివె
నే సూక్ష్మబుద్ధివరేంద్రుండు నాంధ్ర శా
స్త్రరహస్యమును తనంతట నెఱింగె
నే పండితుని కృపాదృష్టి నన్ లక్షణ
నిధివరులందుఁ బండితునిఁ జేసె

1. కైలాస సోపాన పదములు నిత్యసమాసములు. (చూ. ఇదే గ్రంథమున నిత్యసమాసయతులు). వాటి స్వరములు ఇక్కడ యతిచెల్లినవి. ఇట్లు చెల్లుట 'సౌభాగ్యయతి' అని సులక్షణసారము. (యతి ప్రకరణము. 138).

2. నారాయణ - నరాయణ పదములు రెండునున్నవి. చూ. ఇదే గ్రంథమున నిత్యసమాసయతులు

నట్టి దేవులపల్లి వంశాబ్ధి పూర్ణ
శశధరుండైన బుచ్చయశాస్త్రి చక్ర
వర్తి పదపద్మముల కతి భక్తి దనర
వందన మొనర్తు మది వేడ్కఁ గ్రందుకొనఁగ. 14

## -: గ్రంథకర్తృ వంశావతారము :-

కం. కౌండిన్య గోత్రజాతులు
పండితకవివర్యు లగుచుఁ బరగగ ధర నా
కౌండిన్యు మహిమఁ బొగడఁగ
కుండలిపతికైనఁ దర మగునె గనుఁగొనన్. 15

శా. చండాంశుప్రభుఁ డన్యదుష్కరతపశ్చర్యా[సప]ర్యోదితా
ఖండాఖండలతుండిపాదపగవీ కాండాసి లేఖాపగా
డిండీరాంబుజ భూకలత్ర శర కంతేకాల సత్కీర్తియై
కౌండిన్యుం డలరెన్ ద్వితీయవృషకంఖాజాకృతి న్మేదినిన్. 16

శా. ఆ కాండిన్యమహర్షి గోత్రమున నుద్యత్కూచిమంచ్యన్వయ
శ్రీకి న్మూలమునై శరద్ఘన శర శ్రీచందన శ్రీగలా
స్తోక గ్లౌక సమీక భక్త మరుదంధోభవ్యకీర్తుల్ దెసల్
బ్రాకన్ బయ్యన మంత్రిశేఖరుఁడు శుంభల్లీలఁ గ్రాలెన్ ధరన్. 17

ఉ. ఆ య్యనలాక్షభక్తికి గృహంబన సత్కృపఁ దుంటవింటిదం
టయ్యన బాంధవాలుల కహర్ముఖపద్మ మనంగఁ గుయ్యెడన్
సయ్యన దీనుల న్మనుప జానకి భర్తన మించె నెంచఁగా
బయ్యనమంత్రిశేఖరుఁ డహంపతియై గుణరత్నపాలికిన్. 18

కం. సనయుఁడు తిమ్మామాత్యుఁడు
తనయుఁ డతని కుద్భవించెఁ దగ నాతని కా
ర్యనుతులు గంగన జగ్గన
లును సింగన నరస మంత్రులు జనించి రొగిన్. 19

కం. ఆ గంగామాత్యు ఘన
త్యాగంబున సేతుహిమధరాంతరభూమీ
భాగాగత నిర్గత ధర
జీగీర్వాజులు రవిసుతునిన్ మెచ్చ రిలన్. 20

చ. ఇనకుల రత్నమౌ దశరథేంద్రుఁ డతంద్రితులైన రామల
క్ష్మణభరతారిహంత లనఁగా సుతులన్ గడు వేడ్కఁ గన్న రీ
తిని ఘనగంగమంత్రియును దిమ్మన సింగన జగ్గనార్య సూ
రన లను పుత్రులం బడసె నంచితమూర్తుల భవ్యకీర్తులన్. 21

వ. అం దగ్రజుండు 22

సీ. రాజశేఖరచరితము రుక్మిణీపరి
ణయము నీలాపరిణయము సింహ
శైలమాహాత్మ్యంబు సప్తసాగరచరి
త్రంబును సారంగధర చరిత్ర
రామాయణంబు సర్పపురమాహాత్మ్యంబు
సర్వలక్షణసారసంగ్రహంబు[1]
రసికజనమనోభిరామంబు శ్రీశివ
లీలావిలాసంబు లాలిత శత
కములు శ్రీకృష్ణదండకం బమలమతి ర
చించి నట్టి మహా ప్రతిభాంచితుండు
రమ్యకీర్తి తృణీకృతబ్రహ్మజిష్ణు
వైభవుఁడు తిమ్మసత్కవీశ్వరుఁడు దనరు. 28

---

1. ఇక్కడ 'సర్వలక్షణ సార సంగ్రహ' మని పేర్కొన్నను ముందు ముందు గ్రంథమందంతట 'తిమ్మకవిగారి లక్షణసార సంగ్రహ' మనియే 'సర్వ' పద విరహితముగా వేంకటరాయకవి పేర్కొన్నాడు. నిజమునకు అది 'లక్షణసార సంగ్రహ' మే. చూ. ఆం ప్ర. సాహిత్య అకాడమీ ప్రచురించిన 'లక్షణసార సంగ్రహ' మునకు నా వ్రాసిన సమీక్షణము.

చ. అతఁడు సమస్త పండితవరావలి దగ్గొనియాడునట్లుగా
నతుల గవి ప్రబంధ శతకాలి నొనర్చి నిరూఢభక్తిచే
గుతుక మెలర్పఁ బీఠపురకుక్కుటమూర్తికి నర్పణంబుదా
రతఁ దగఁ జేసినట్టి కవిరాజశిఖామణి గాడె చూడఁగన్. 24

సీ. శ్రీపీఠికానగరీపతి రావు నీ
లాద్రిమాధవమహారాజ దత్త
కవిసార్వభౌమ విఖ్యాత బిరుదభాస
మానుఁడు నన్యరామావిముఖుఁడు
పంచాక్షరీమంత్ర పఠనశీలుండును
సహజపాండిత్య విశారదుండు
నఖిల వేదాంత విద్యారహస్య విదుండు
శ్రీకుక్కుటేశ కృపాకటాక్ష
వీక్షణ ప్రాప్త కవితా విజృంభితుండు
సకల రాజాధిరాజ మస్తక కిరీట
మణి విరాజిత పాదపద్మయుగలుండు
తిమ్మకవిరాజమౌళి యెంతే చెలంగు. 25

గీ. విజితకాముఁడు తోషితవిబుధవరుఁడు
రాజపూజితుఁ డార్యానురాగుఁ డమల
మూర్తి పుణ్యజనేశ్వర ముఖ్యసఖుఁడు
నింపెసఁగుచుండుఁ దిమ్మ కవీశ్వరుండు. 26

కం. శ్రీమత్కమలాసన కాం
తా మృదుకర నఖర ముఖరిత మణిఖచిత వీ
ణా మధురారావ శ్రీ
కోమల గోవిదుఁడు తిమ్మకోవిదుఁ డలరున్. 27

గీ. సకల కవివరులు నవీన శబ్దశాస
నుండటంచును గొనియాడుచుండు కతనఁ

దిమ్మకవిసార్వభౌమున కిమ్మహీత
లమున నిదియు నొక బిరుదు సార్థముగఁ దనరె 28

చ. సకలకలాకలాపు సురసాల రసాల రసారసత్వ సూ
చక సుకవిత్వతత్త్వవిదు శాంత హృదంతర చింతితాంత కాం
తకు నకలంక కీర్తిజిత నారద శారద నీరదేందుఁ ది
మ్మకవీంద్రుఁ నెన్నఁ దరమా పరమామరమానవాలికిన్. 29

గీ. మరియు నమ్మహాత్ముని మహిమ వచియింపఁ
దరమె మూఁడవనాఁడు నీ తనువు విడుచు
ననియు సన్యాస మొనరించి యటుల విడిచి
దివ్యపద మొందె 'శివరామ తీర్థు' లనఁగ. 30

గీ. ఆమ్మహాత్ముని కతనఁ గాదా ప్రసిద్ధి
గలిగెఁ గూచిమంచి సమాఖ్య కులముకెల్ల
గావునను గవిరాజశేఖరుని కేవ
ల కవిరాజ శేఖరుఁ డనరాదు బుధులు. 31

చ. అతని సహోదరుండు చతురబ్ధి పరీత మహా మహీతల
స్థితి కవిరాజ రాజమణిశేఖర పంకజ రాగపుంజ దీ
ధితి లసమానపన్నలుఁ దధీత సమస్త కళారహస్యుఁ డా
ర్జిత వరకీర్తిశౌర్యుఁ డలరెన్ భువి జగ్గకవీంద్రుఁ డెంతయున్. 32

సీ. ప్రతిభమై జానకీపరిణయంబును నర్మ
దాపరిణయము రాధాకథాసు
ధానిధానము ద్విపదమ్ము సుభద్రాప
రిణయ ముమాసంహితయును దండ
కములును బహుశతకములును గీత ప్ర
బంధముల్ ఖడ్గాది బంధములును
గద్యలు రగడలు ఘనతర మంజరుల్
బహుసువృత్తంబులు భాసురముగఁ

జెప్పె శ్రీ పురుషోత్తమ క్షేత్రపతికి
శ్రీ జగన్నాయకునకు నర్పించి మించె
ధైర్య గాంభీర్య చాతుర్య శౌర్య ముఖ స
మిద్ధ గుణపాలి జగ్గకవీంద్రమౌళి. 33

గీ. భారతీ పద పద్మ విభ్రాజమాన
రత్న మంజీర మంజులారావ తులిత
వాగ్విలాసుని జగ్గరాడ్వరకవీంద్రు
నెన్న నెంతవారికి శక్యమే యొకింత. 34

సీ. శ్రీవత్సవయ తిమ్మ పృథ్వీశరాడ్దత్త
'బేబదల్' బిరుద జృంభితుడు, హరిప
దాంబుజ భక్తవరాగ్రణి శ్రీ జగ
న్నాథ కటాక్ష లబ్ధ కవితా వి
రాజమానుఁడు కవిరాజ పూజితుఁడును
యాచక నికర మందారతరువు
రిపురాజ మత్త కరీంద్ర పంచాస్యంబు
ననుపమ సత్కరుణాకరుండు
దైవభక్తి నిరంతర సేవితాగ్ర
జాత తిమ్మకవీశ్వర చరణ సరసి
జాత యుగలుండు దనరు నిజ్జగము నందు
ప్రకటగుణపాలి జగ్గ మంత్రికులమౌళి. 35

గీ. శ్రీవిజయరామభూమిపాలావతంసు
దత్త శిబికా సమృద్ధితోదార కీర్తి
జగ్గ కవిచక్రవర్తి సమ్యగ్గుణప్ర
వర్తి వర్తిలు పరిహృత బాంధవార్తి. 36

స్రగ్ధర. జనులెల్లన్ సన్నుతింపన్ సకల భువన ర
క్షా సుదీక్షాతిదక్షున్
గణనాథుం గ్రౌంచభేదిం గని చెలగెఁడు గం
గా జటాజూటు భంగిన్

ఘనుఁడౌ శ్రీ జగ్గ కవ్యగ్రగణి తనయులఁ దా
గాంచెఁ దిమ్మప్రధానున్
వినుతుండౌ గంగమంత్రిన్ విపుల నృపసభా
విశ్రుత స్వచ్ఛ కీర్తిన్. 37

లయగ్రాహి. కమ్మ విలుకాని సల తమ్మి చెలికాని చెలు
వ మ్మెనయు రూపము ఘనమ్మయిన తేజం
బు మ్మఘవ భూరి విభవమ్మ భవ భక్తి కల
నమ్మ కరుణామృత రసమ్ము చెలువారన్
నెమ్మి కవిచంద్రులకు ముమ్మరముగాగ నిర
తమ్ము జిగి కుందనపు సొమ్ములును కంఖా
ణమ్ములును నిష్కనికరమ్ములు నొసంగుచు గొ
నమ్ములకు నిమ్మనఁగఁ దిమ్మ విభుఁ డొప్పున్. 38

క. కలనైన నన్య భామలఁ
తలఁపఁడు నెల్లపుడు వేడ్కఁ ద్యాగము సేయున్
కులవృత్తి వదులఁ డన్నృతము
వలుకఁడు తిమ్మ ప్రధానవర్యుం డెపుడున్. 39

గీ. అతని తమ్ముఁడు గంగరాజాఖ్యుఁ డలరు
జానకీపతి పల్కు లక్ష్మణుని రీతి
నన్న గారన్న వచన మన్నన్న దాట
కెప్పుడును సత్పురుషుఁడు గాఁడే యతండు. 40

సీ. తన పెదతండ్రి తిమ్మనమంత్రి గారవం
బునఁ బెంచి శాస్త్ర సమూహమెల్ల
నెఱిఁగింపఁ గల విద్యలెల్లను నేర్చి ని
రంకుశ కవన విఖ్యాతి నొంది
దండకంబులును శతకములు తారక
బ్రహ్మ రామాయణ రమ్యకావ్య
మును రచియించి శంభునకు సమర్పించి
దనరు వాని నుతింపఁ దరమె కీర్తి

నిందిత పటీర మఁదార నందనఁద
నాగ్రజ పురఁదర రాశ్వ నీహార హార
హీర హీరాఢ్య తారకా తారపూర
కాశ దర రాజుఁ డెన్న శ్రీ గంగరాజు. 41

గీ. రావు వేంకటరాయ ధరావరాగ్ర
గణ్య దత్తమహైశ్వర్య కలితుఁ డతుల
సుగుణలలితుఁడు యాచకసురమహీజు
నతని నుతియింపఁ దరమగునా దలంప. 42

భుజంగ ప్రయాతము: వలద్రాజరాణ్మౌళిపాలీ నితాంతో
జ్జ్వలద్రత్న రత్నప్రభా భాసమానా
వలీ ధాత్ముఁడై శాస్త్ర పాండిత్య సంప
త్త్యలంకారుఁడై గంగానామాత్యుఁ డొప్పున్. 43

గీ. ఆతనికిఁ దిమ్మకవి పుత్రుఁడై జనించె
నించె దెసలను నసము నెన్నిక గడించె
డించె నింద్రియ మదము పండితులఁ బెంచె
మించె హరిభక్తి నతని వర్ణించ దరమె. 44

మ. శతశస్తుత్యగుణుం డతఁడు గనియెన్ సన్మిత్రులం బుత్రులన్
ప్రతిభాఖండలమంత్రి గంగవిభు దీవ్యత్కావ్య నిర్మాణ మ
ర్మతరాంవేత్తను భాగయప్రభు సభాప్రఖ్యాత శశ్వద్యశో
ప్రతిము న్వేంకట రాజమంత్రివరునిన్ బద్మాక్షసేవాదరున్. 45

కం. అల తిమ్మకవికిఁ దనయుఁడు
లలిఁ బుట్టెం జగ్గకవి కలాపూర్ణుండై
జలనిధికి జలజవైరియు
జలజాతాక్షునకు జలజజన్ముఁడు వోలెన్. 46

శా. పారావారగభీరుఁ డంబుజముఖీ పంచాస్త్రుఁ డబ్జారి మం
దారేందూపల శుభ్రకీర్తి కరుణా ధామం బుమానాథ పూ

జా రాజీవ విలోచనుండు జనతా సన్మోద కృత్యత్వ సం
ధారాముం దన మించె జగ్గవిభుఁ దేతన్మాత్రుఁడే చూడగన్. 47

గీ. సాహితీ గాన విద్యా విశారదుండు
శారదా దయార్ద్రేక్షణ జనిత కవన
భాసమానుండు దనరారె భాసమానుఁ
డఖిల సుగుణాకరుండు జగ్గన విభుండు. 48

కం. ఆ జగ్గకవికి జోగమ
కాజి ధనంజయుఁడు తిమ్మనార్యుఁడు రాజ
తేజుండు పానకాలున్
రాజనిభుఁడు కామరాజు ప్రభవించి రిలన్. 49

కవిజ్ఞాంహితము

అమ్మవురు సచివాగ్రమణులకు నగ్రజుండు గుణరత్న పుం
జమ్ములకు జలరాశి జనహిత జాగ్రదురు కరుణాకరుం
డు మ్మదభరిత వైరి నికర కఠోరతర హృదయుండు నౌ
తిమ్మసుకవికి సాటి బలుక సుధీప్రవరుఁ డిలఁ గల్గునే. 50

మదన దర్పణము.

దాన గరిమ సూతపుత్రు నిందసేయు సీ యనున్
మానపటిమ బొబ్బవెట్టు నమ్మతంగజారి స
ద్గాన మహిమఁ జంచలాత్మ పంకజాత జాతునిన్
దాను పరిహరించుఁ దిమ్మసత్కవీంద్రుఁ డెంతయున్ 51

మంగళ మహాశ్రీ

హీర దర సీరధర హీరశర సౌరకరి హీరవర ముక్తా
హార ఘనసార వనజారి ఘనతార కళతార హిమవారనిధి కాంతా
తార హర కైరవ సుధారస ఝరీ శరదుదారశరదభ్రపకర భూరి
స్ఫార సితకీర్తిరుచి బర్వఁగ జగంబులను భాసిలెను తిమ్మకవి ధాత్రిన్. 52

కం. త్రైదశ భాషా కావ్యము
మోద మలర సరసహృత్కుముద చంద్రిక నా
నాదగ వాసనదత్తా
కాదంబరు లెఁసఁగ దిమ్మకవి రచియించెన్. 53

మ. స్ఫుట వంకాయలపాటివంశ విలసద్భాషాయమానుండు వేం
కటనారాయణ మంత్రివర్యుఁ డలరెన్ గంజాత జాతాంగనా
తటినీనాథ తనూభవామరధునీ తారాశతారామరే
ట్కుట ధిక్కారి యశస్సితీకృత దిశాకుంభీంద్రుఁడై కుంభినిన్. 54

కం. లలి వేంకటనారాయణుఁ
డల కామాంబను వివాహ మగు రీతిని ని
య్యల వేంకటనారాయణు
డల కామాంబను వివాహమయ్యె ముదమునన్. 55

గీ. ఘనుఁడు వేంకటనారాయణునకుఁ గామ
మాంబకు జనించె సుబ్బాంబ యనెడు తనయ
తన యనూనాభిజాత్య శాంత నయ వినయ
ధన యశంబులు బుధులు మెచ్చ నయలీల. 56

కం. తన మేనయల్లుఁడగు తి
మ్మనార్యునకు భార్యగా సమర్పించెఁ బ్రియ
మ్మున వేంకటనారాయణు
డనూన విభవమున సుబ్బమాంబను బ్రీతిన్. 57

కం. ఆ సుబ్బాంబను బెండిలి
యై సెలఁగుచుండెఁ దిమ్మనార్యుఁడు విభవో
ద్భాసి గృహస్థాశ్రమ ధ
ర్మాసక్తిన్ సకల జనము లభినుతిసేయన్. 58

సీ. అతిథి పూజావిధి ననసూయ ననసూయ
భర్తృ శుశ్రూషణ పరమరక్తి
పతికృప సుకృతాభిరతి కరుంధతి యరుం
ధతి మనోనాయక వితతభక్తి

సకలగుణాకూర జననంబునకు సీత
సీత పాతివ్రత్యశీలమునకు
ఖలజననికరశిక్షకు దక్షపుత్రిక
దక్షపుత్రి పతివ్రతాత్వమున క
టంచు సజ్జను లెంచంగ మించె సంత
తాన్నపాన సువర వస్త్రాదికాళి
తర్పితానేక విబుధబాంధవకదంబ
సుమహిత కృపావలంబ శ్రీసుబ్బమాంబ. 59

సీ. పతిభక్తి నింతయు వదల దెల్లప్పుడు
పరుష వాక్యంబులు పలుకబోదు
సాధ్వీమణులతోడ సఖ్యంబు గావించు
నతిథుల బిడ్డల యట్ల చూచు
గురుసేవ గావించు గొఱకొఱ నింతైన
మానసం బందైన నూన దెపుడు
కుత్సిత స్త్రీ జన గోష్ఠికి నడువదు
కలనైన కల్లలు పలుకఁ బోవ
దత్తమామల సెలవుల కడుగు దాట
దట్టి సుబ్బాంబను నుతింప నలవియగునె
వేయినోళ్లు గల భుజగ విభున కైనఁ
బలుకు కలికికిఁ జెలువుఁడౌ నలువకైన. 60

మత్తకోకిల.
వీటి కుంకుమ కంచుకంబును వేడ్కఁ బాల్పు హరిద్రయున్
కాటుకెప్పుడు సుబ్బమాంబ యఖండభాగ్య సమేతయై
సాటివారలలోన మెచ్చగ సంతతంబును శ్రీదివా
కాటి పాటల గంధి పూజలు సల్పు నాథుని యానతిన్. 61

సీ. పతియేమి వల్కిన నతిభక్తితోఁ జేయు
నాత్మమందిరముల యందె మెలఁగు
మఱఁదులఁ బుత్రుల మాడ్కి భావించును
పలుకుల నొవ్వఁగఁ బలుక దెపుడు

గురుజనం బేమన్న గోపంబు తాల్పదు
    విందులు వచ్చిన విందుసేయు
మంచి కృత్యములె గావించు నెల్లప్పుడు
    నోర్మిని వదలకనుండు నట్టి
మహిత గుణమణి నికురుంబ శహరవః ప్ర
వర్థిత యశో విజిత శ్వేత భాను శార
దాంబుద కదంబకా సుబ్బమాంబ కెన్న
సతులు సవతు గలరె జగత్త్రితయమందు. 62

గీ. కలశ జలనిధి పుత్రినిఁ గలసి చెలఁగు
నంబుజాక్షునివలె సుబ్బమాంబఁ గూడి
నిరుపమానంద భరిత హృన్నీరజుఁ డయి
తిమ్మయామాత్యవర్యుండు దేజరిల్లె. 63

క. తిమ్మకవిరాజ మౌళికి
కొమ్మల తలమిన్న యగుచుఁ గొమరారెడు సు
బ్బమ్మ యనఁగఁ బరుగు సతికి
నెమ్మి కుమారుండనై జనించినవాఁడన్. 64

సీ. మజ్జనకుండు తిమ్మకవి జల్దంకి రా
    మయకుఁ బుత్రికయును నుదంచితగుణ
[రంజి]త భాగ్య శక్రాణియు వితతక్ష
    మాక్షమ పతిహిత మధురవాణి
పరమ పతివ్రత పావనతా గంగ
    యైనట్టి శ్రీ గంగమాంబికను వి
వాహమై యా సతివలన జగ్గనమంత్రి
    శేఖరు రామసచివ సుధాంశుఁ
గనియె నస్మత్సహోదరులు నమవిదులు
రాముని సెంవు లక్ష్మణస్వామి శత్రు
హంతయునుఁ జేయుగతి మదీయాజ్ఞ నివ్వ
రు నొనరింతురు గడుభక్తి దనరుచుండ. 65

సీ. శ్రీ కుక్కుటేశ్వర పృథు కరుణార్ద్ర క
టాక్ష సంప్రాప్త విద్యాకలాప
సరస విద్వత్కవి సంశ్లాఘనీయ బృం
దారక కేవలాంధ్రాంధ్ర లలిత
వాగ్గద్యపద్య కవన రచనా జాత
జాతరూప నగేంద్ర చాప తార
తారకావార శతార మందార నీ
హార హార పటీర హీరహీర
చంద్ర చంద్ర తటాగ్రగజ శారదాభ్ర
శుభ్ర విభ్రాజమాన యశో లసితుఁడ
కూచిమంచి కులాబ్ధి చకోరహితుఁడ
సుకవి వేంకటరాయఁడ సుజనహితుఁడ. 66

-: పీఠాపుర వర్ణన :-

క. పటుతర కరుణామృతరస
తటినీశ మదిష్టదేవతా పరివృఢ కు
క్కుట పతి సంపుట పీఠా
పుట భేదన మహిత మహిమము వర్ణింతున్. 67

(క. శరదిందు శరకుసుమ దీ
ప్తి రమా శోభిత మదిష్ట దేవాస్పదమౌ
వర పీఠాపుర సురుచిర
తర చిరతర మహిత మహిమఁ దగ వర్ణింతున్[1]) 68

మ. క్షితిపైఁ బీఠపురీవరం బలరు నచ్ఛిన్నాచ్ఛ రత్న ప్రభ
ద్దీత కార్తస్వర సౌధ జాలక గతోడ్డీనత్వఖాకాస్వరభో
గి తమామర్త్య వధూ రతోత్సవ విధాకృత్ కుట్టనీ భావ సం
తత రాజన్మధుజిత్ప్రదీపద మదోద్యజ్జాల పాదాఢ్యమై. 69

1. మూల ప్రతియందే ఈ పద్యము కుండలీకరింపబడియున్నది.

గీ. తత్పురీకృత చంద్రమస్తరణి రోధ
సౌధ జల నిర్గమన నీలజాలకముల
గగన గాంగేయ హంసార్భకములు దూఱు
క్రౌంచ బిలవేశనాభ్యాస గరిమ దోప. 70

మ. జలజాతాక్ష పదీ సమాన ధనదాశాక్ష్మాంచ దేలా నదీ
జలసిక్తోపవనస్థ పుష్పఫలపుంజ వ్యాప్త కుంజ ద్రుమ సం
వల దున్మత్త షడంఘ్రి కీర మధుర ధ్వానంబులం దే తఱిం
దలమై పర్వు పురి న్మనోజ రణగాథల్ దెల్పఁగా నేటికిన్? 71

ప్రాససీసము :-
శ్రీకేళికా గృహ వ్యాకోచ మృదుల నా
లీక సంకీర్ణ పద్మాకరంబు
పాకారి కుంభి శంకాకర మత్త మ
హా కరివ్రాత సమాకులంబు
ప్రాకార మణిమయ ప్రాకారకాంచనై
దూక గేహాదిక ప్రాకటంబు
రాకాసుధాకరానేకసద్రుచిర వి
లోకనాచిర రుగ్విభాకరంబు
లోకనుత సింహ నీకాశ నైక నవ్య
చాకచక్యాఢ్య కుంచగదా కలిత స
మీక పటు వీరభట ఝూట భీకరంబు
నాకసంనిభ పీఠికాఖ్యాకపురము. 72

శా. జారుల్ చోరులు ఘోరపాతకులు మత్సంరక్షచే నిచ్చలున్
లేరెవ్వార లటంచు సౌరభట పాలిం జేరఁగానీక దా
వారింపన్ వసియించెనో యనఁగ దివ్యత్తత్పురీ దక్షిణ
ద్వారంబందునఁ గుంతిమాధవ పరబ్రహ్మంబు భాసిల్లెడున్. 73

గీ. రాక్షసాదిక పీడ లత్రత్య జనుల
కేను గల్గనీనని వ్రత మూనినట్టు

లాపురికిఁ గోణపదిశాముఖాంతరమున
భూతపతి కుక్కుటేశుండు ప్రీతి నుండు. 74

గీ. కుక్కుటేశ నదేశ ప్రాక్షోణిదేశ
పాద గయవారి మునిగెడు పంచజనుఁడు
ఘోర భూరి జవంజవాపార వార్ధి
మజ్జనము సేయఁ డిఁక ధరామండలమున. 75

గీ. తత్పదాయుధపతి సముద్యచ్ఛిరత్న
రత్నవలయ గేహఘంటికారవము జనుఁడు
వినిన వినకుండు మహిషవాహన లులాయ
కంఠభాగ్ఘంటికా ఘలంఘలరవంబు. 76

గీ. భుజగభూషణు మందిరంబునకు భక్తి
[1]తో ప్రదక్షిణములు సేయు నాప్రపూజ్యు
చుట్టునెపుడు దిరుగుదురు సూరిసుకవి
సుజన రాజరాజులు ప్రగమ్మి సురుచిరముగ. 77

గీ. కుక్కుటేశ్వర మందిర క్షోణిరజము
వక్షముల సోక మ్రొక్కు నా భవ్యతముల
వక్షములు చెలువొందు దేవాంగనా కు
చ లికుచాంచిత మృగమదచర్చచేత. 78

గీ. విధుకలాపుని దివ్యసంనిధి వెలుంగు
తైల దీపాలిఁ గాంచు నా ధన్యతముఁడు
రత్నమణిదీపరాజి విరాజితోరు
శర్మ హర్మ్యాంతరంబుల వఱలుచుండు. 79

---

1. 'తోన్' అనునది ద్రుతాంతము. ద్రుత సంధి ప్రకారము ఇక్కడ "తోఁబ్రదక్షిణ' అని యుండవలెను. కాని అట్లున్నచో ఈ పాదమం దుప యుక్తమైన ప్రాసయతికి భంగము కలుగును.

గీ. భక్తి దైవారఁ గుక్కుటేశ్వరుని నుతులు
వీను లలరార వినువాఁడు వినుచునుండు
గరుడ గంధర్వ యక్ష కింనర నిలింప
సిద్ధ విద్యాధరోరగశ్రేణి నుతులు. 80

సీ. విశ్రుతాష్టాదశ పీఠంబులను బురు
హూతి కావాసమై ఖ్యాతిఁ గాంచెఁ
బంచమాధవులలోపలఁ గుంతి మాధవు
సదనమై మిగులఁ బ్రశంస కెక్కెఁ
ద్రిగయల లోనఁ బాదగయకు భవనమై
ధాత్రిఁ బవిత్రాత్పవిత్రమయ్యెఁ
గుతల స్వయం వ్యక్త కుక్కుటేశ్వరరాజ
రాజేశ్వరీస్థితిఁ దేజరిల్లె
వ్యాసమునివర వినుత ప్రభావ భరిత
భాస్వదేలానదీ పరిప్రాప్తి నలరె
నట్టి శ్రీపీఠపుర మహిమాతిశయము
వశమె వర్ణింప శేషవాక్పతులకైన. 81

చ. మలయ తుషారశైలముల మాటుగఁ బుట్టిన వౌటఁ గారణం
బుల గుణము ల్వహించె నన భూరి సుగంధన మాధు సంపదల్
గలిగి మహోన్నత స్థితులఁ గాంచి సముద్ర గభీర వేదితా
కలన బలంబు లుప్పతిలఁగా నగరిం గరిరాజరాజులున్. 82

చ. చెలు వలరారు నట్టి బహుచిత్రగతుల్ గురువర్ణ కంకణం
బులు సుడులున్ గనుంగొని సుబుద్ధులు సింధుభవంబులే యటం
చు లలిఁ దలంచఁగా జటలు శుభ్రమరీచులు మానవైఖరుల్
దెలుప హరిత్వ లక్షణము ధీరతురంగము లొప్పు లప్పురిన్. 83

చ. పురిఁ గల భూసురుల్ సవనముల్ బహుభంగుల సేయఁ బుట్టి ని
ర్భర తర హోమధూమము నభశ్చర పుష్కరయానభా జ్నభ

శ్చర తరుణీమణీ వదన సంతతిపైఁ బ్రసరించు నిచ్చలుం
బోరిఁ బోరిఁ బంకజంబులకుఁ బోవు మధువ్రతపుంజమో యనన్. 84

చ. కరి తురగాది దానము లఖండముగా సమరాంగణంబులం
గరితరగాది దానము లఖండముగా సమరాంగణంబులం
బోరి బోరి సేయుచు న్విమల పుణ్యచరిత్రములుం బ్రతాపము
ల్కర మరుదారఁ గీర్తిజిత రాజులు రాజులు పొల్తు రప్పురిన్. 85

గీ. సరసగుణరత్నగణ పరీక్షా విశేష
చణులు సకలాభినందిత చరిత యతులు
పరమ సౌష్ఠవకలిత సువర్ణపదులు
వణిలుచుంద్రు వరార్యు లప్పట్టణమున. 86

క. అతుల గుణమణి కలాపులు
క్షితిసురసమ్మోదకర సుశీలాలాపుల్
గతపాపులు హృతతాపులు
సితరోపులు సమితి నందుఁ జెలఁగెదు కాపుల్. 87

సీ. తగటు-బంగరుగిండ్ల దుగఁ దెగడఁగఁ దగు
పొగరు గుబ్బల నిగన్నిగలతోడ
వెకురు బేడిసమీల బెడఁ గడరెడు గడు
సొంపు చూపుల తళత్తళలతోడ
మొగి నిద్దమగు నద్దముల సొంపులు గల
జిగి చెక్కుగవ ధగద్ధగంతోడ
వక్త్రాబ్జ కలిత భంభర సురుచిరతర
చికురపాలిక చకచ్చకలతోడ
వెలసి బలసిన వలపుల బలసి తమ్మ
గలసి యలసిన విటులతోఁ గలసి మెలసి
పొలసి సొక్కించి రతితంత్ర విలసితముల
బలుసిరుల నొప్పు నప్పురి పణ్యసతులు. 88

సీ. వేదండయాన నే నీ దండకై వచ్చి
తది వెలవెట్ట కెట్లబ్బు నీకుఁ
జనుబంతు లొసఁగుము సకియరో యవి యెట్లు
కరము సేర్పక యుండఁగా లభించు
వలపుగల్గుట చెలి తెలుపు మీ జాతికి
ముఖవికాసము చూచి పోల్పవచ్చు
నలరారు కలువగావలె నిప్పు డది యెట
సమకూరు తమ్మి యుజ్జ్వలత నుండ
ననుచు రసికులౌ విటులు వల్కిన సరసపు
పలుకులకుఁ దగ నాసలు గొలుపు నుత్త
రములతోఁ గూడఁగాఁ బ్రసూనము లొసఁగుచు
పుష్పలావిక లుందు రప్పురమునందు. 89

సీ. పరభటోద్భటధైర్య పాటన పాటవ
ప్రహతోగ్రభేరికా భాంకృతులును
భీకరశాత్రవానీక కుట్టాక ఘ
టాచ్ఛటాఘంటికా టాంకృతులును
ప్రావృడారంభ శుంభదమోఘ మేఘగ
[1]ర్జాతుల్యమర్దల ఝుంకృతులును
పరిఫుల్ల హల్లక భరిత సరోవర
ఖేలచ్ఛితచ్ఛద కేంకృతులును
గలిగి దివ్యభవన జాలక మరు ఫణిత
రంగబాడబ కవిమన భ్రాజమాన
ఘూర్ణమాణ రత్నాకరాక్షుద్రసరణిఁ
బొసఁగుఁ బురి శ్రీరమా జన్మభూమి యనుచు. 90

వ. మఱియు నప్పుటభేదనం బభేద వేదవాదామోదమేదుర వేదశాస్త్రా
ధ్యయన భాసుర భూసుర ప్రసంగభంగీతరంగిత ప్రతిసభాంగణంబై

1. ...'ర్జితతుల్య మర్ధల ఝుంకృతులును...' అని మూలప్రతి.

మార సుకుమార కుమార వీరభూరమణకుమార సమారూఢ ప్రౌఢారట్టఘోట్టాణ ప్రపంచ పంచధారా ప్రచార ప్రచలిత చటుల కుటల ఖుర పుట పటల సముద్ఘాతోద్ధూత ధరాపరాగ రేఖా యవనికానికాయ లాసకీ విలాస కర్ణార్ణోజపాతద్యుతి మంజరీపుంజ సారంగ రంగదుత్తుంగ సౌధ వీధికా సజాలకజాలక విశాల చంద్రశాలాంతర కేలికాలోల బాలికా చూలికా పాలికా నీలకాంతి సంపతి దంతురిత ద్యుక్ప్రసారపూర పూరితంబై, పురాధిరాజ రాజదౌదార్యధుర్యతా సమాఖ్యాతాసమ సమాఖ్యావమానితుండగుట బహులార్తిఁ గృశించు శుభ్రదీప్తిని సనామ సౌహార్దంబున నంతఃకలహంబువలనం దొలంగించు చెలువునఁ జలి నెలవుపాపలయేపునఁ జాపలంబునొందు కుంద విశదేందు మణీరమణీయ కమనీయోచ్ఛ్రాయ గేయప్రసాద నికాయ శిఖర నికర సంస్థాన సంస్థాపిత కేతనవ్రాత దండాగ్ర జాగ్రత్పటంబుల పటపటాత్కారంబులు దర్పకదారక దర్శన కౌతుకాయాస్యచ్చతురాస్య స్యందన సందానిత హంససంసద్భ్రాంతి నొసంగ నెసంగుచుఁ జొక్కంపు జింక పొక్కిలి బొట్టుల వగగులుకుఁ జిఱునగవు వన్నెలల తలతలలకు నెలవులగు తమ ముద్దుమొగంబుల చెలిమికిఁ బలె సోరణగండ్లదారి దాఁటి పాఁటి సారెసారెకు దూఁటివచ్చు పచ్చ విలుదారి మాను ప్రేముడిం బూజల నోఁజలఁ దేలించుటకై నిగనిగని జిగినెగడు మగరాల జగతులఁ దళుకొత్త గ్రొత్తనెత్తమ్మికెంపు కెంపు కెంపుగుంపుల రూపుల చెంగలువలని చిదుమఁ బోవు ముగుదల ముగుదతనంబుల కెద మెచ్చి క్రచ్చలెచ్చ నచ్చిగురాకుబాకు సాదనకాని చేయువులకై మచ్చికం గ్రుచ్చి కౌఁగిలించి యంచతూలంపు సెజ్జల పజ్జలకుం దార్చెదు నెదపొదము న ప్పతంతుల యడుగుడెండమ్ములందుఁ జెలువొందు రతనంపు గుందనంపు టందియలఁ గ్రందుకొను జిలుగు బలుకులకు మారువలుకు తెలిపులుఁగుఱేఁడుల పువుబోదు గూడులకు వాడలగు పైడిమేడలకుఁ దానకంబగుచు; దానవాంతకుపురంబునుం బోలె సుపర్ణ వర్ణాకీర్ణంబై, సత్యలోకంబునుం బోలె సుకవి సంభాషణ మనోహరంబై, గ్రహమండలంబునుం బోలె మహితనయజ్ఞసూర్యాది మేదురంబై, పురందర పురంబునుంబోలె సుమహిత సౌరభవన పరిపూరితంబై ప్రావృట్కాలంబునుంబోలె రుచిరశిశిర కరకాంతంబై, కమలాకరంబు గావున సారసవనోపశోభితంబై, రత్నాకరంబు గావున రాజశేఖర కలాపంబై, నిగమశేఖరంబు గావున

సదానందప్రతిపాదకంబై, కల్యాణ ధర్మనిలయంబుగావున సర్వమంగలాభిరామంబై, బ్రహ్మాస్పదంబుగావున వాణీవిలాస భాసమానంబై, రాజరాజనివాసంబు గావున గంధర్వ విలసితంబై, పరమార్యాన్వితంబు గావునఁ జంద్రరుచిసాంద్రంబై, శూద్రధరంబు గావున సానుచర భద్రేంద్రంబై, మహేశ్వరనివాసంబయ్యును గుసుమ కదంబోపేతంబై, శ్రీపతి నికేతనంబయ్యును బుణ్యజనసంబాధంబై, భూతల ప్రఖ్యాతంబయ్యు భోగవతీలాలితంబై, ద్విజరాజరాజితంబయ్యును గంచుకిగణోదంచితంబై, గజాయుతంబయ్యు నగజాయుతంబై, లీన పంకజాతంబయ్యు నలీనపంకజాతంబై, బలావలీరమ్యంబయ్యు నబలావలీరమ్యంబై, వనిమణీవలయితంబయ్యు నవనీమణీ వలయితంబై వెలయుచుండు. 91

సీ. సరస విద్వత్కవి సన్నుతౌదార్యజ
కీర్తి జితామర క్షితిరుహుండు
ప్రత్యర్థి పృథ్వీశరా డ్బాహు గర్వత
మోంబుజ మిత్ర భుజార్గలుండు
సకల కలా కలాప కలానులాప వై
దగ్ధ్య ధిక్కృత భోజ ధరణివిభుఁడు
శ్రీరావు వంశవారిధి సుధాధామ గం
గాధరరామావనీధవుండు
పాలనము సేయఁ జిరయశోభా సమాన
పరమ శోభాసమానమైఁ బరగుచుండు
రాజమాహేంద్రవర దేశ రాజితంబు
భౌమనాకంబు పీఠికాపట్టణంబు. 92

-:షష్ఠ్యంతములు:-

క. ఏ తత్పుర సద్మునకున్
బాతక సంఘాత హంతృ పదపద్మునకున్
ధూతారిచ్ఛద్మునకున్
శాత శరీ భవదురోవసత్పద్మునకున్. 93

క. సేవధిపతి నుత గుణికిన్
సేవక జన భావితార్థ చింతామణికిన్
భావ భవతమో ద్యుమణికి
భావిజిత శతాయుతాబ్జ బాంధవఘృణికిన్. 94

క. పద నమ్ర సుపర్వునకున్
గదన శరీకృత ఖగేంద్ర గంధర్వునకున్
మదనోదభ్యార్యునకున్
మద భద్రార్వుపకర్షఖర్వునకు శర్వునకున్. 95

క. కోపార్జిత హంకృతి హృత
పాపాట నిశాట ఝూట బహుళార్భటికిన్
ద్వీపి పటుకరట కృత్తి ప
టీ పరివృత విపుల కటితటికి ధూర్జటికిన్. 96

క. చరణాంబుజ సేవా త
త్పర ధిషణాయాత శరభవ తురంగ శిఖీ
శ్వర నిరుపమాన సమ్మద
కర క్రమ మరీచినామ కచభారునకున్. 97

క. శర దర హరిణాకృతికిన్
సరస గుణోన్నతికి స్వర్గసమ పీఠపురీ
వర మందిరాభిరతికిన్
చరణాయుధ పతికి శైలజాహితమతికిన్. 98

వ. సమర్పణంబుగాఁ బురాతన సుకవి నికర విరచిత గ్రంథ గుణదోష పరిశీలన లక్షణ లక్షితంబుగా నా యొనర్పం బూనినఁ 'సుకవి మనోరంజనం' బను లక్షణగ్రంథంబునం దాద్యంబగు పంచాశద్వర్ణ నిర్ణయం బెట్టిదనిన- 99

# సుకవి మనోరంజనము

## పంచాశద్వర్ణ నిర్ణయము

——:o:——

క. శాంభవి కలితోత్సంగా
జృంభిత నాట్య ప్రసంగ ధృతసితగంగా
శుంభద్దంభ నిగుంభిత
కుంభిదనుజ భంగ సంగ! కుక్కుటలింగా! 100

వ. అవధరింపుము. 101

### -:సంస్కృతాంధ్ర వర్ణ నిర్ణయము:-

"ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతే స్తుతే దశోనాస్స్యుః
షట్త్రింశదత్ర తేఽన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్"
(ఆం. శ. చిం. సం. 6 కారిక)

దీనికి కాకునూరి అప్పకవిగారి 'ఆంధ్రశబ్ద చింతామణి'-

"గీ. అయిదు పదులగు సురభాష కక్షరమ్ము
లందుఁ బది ప్రాకృతమునకు నడఁగిపోవుఁ
దొలఁగి చనుఁ బదమూఁడును దెలుఁగు బాస
నెసఁగుఁ దత్సమ పదముల నేఁబదియును. (2-47)" 102

వరరుచి వచనము:-

ద్వ్యధాక ఏచోనుస్వారో విసర్గ షోడశ స్వరాః
స్పర్శా అంతస్థశోష్మాణ శ్చతుస్త్రింశద్ధలస్స్మృతాః.

ద్విధా = రెండువిధములైన, అకః = అక్ ప్రత్యాహారంబును, అక్కు-లనగా- 'అ, ఇ, ఉ, ఋ, ఌ'- ఈ అయిదక్షరములకుఁ బేరు. అది యెట్లనగా-పాణినీయ సూత్రములు:

'హలన్త్యమ్'- 'ఉపదేశే న్త్యం హలిత్ స్యాత్'

ఉపదేశే = సూత్రమునందు, అన్త్యమ్ = కడపటిదయిన. హల్ = వ్యంజనాక్షరము; ఇత్ = ఇత్తను సంజ్ఞకలది, స్యాత్ = అగును, ఇందుచేత ఇత్తనగా సూత్రము కొననున్న పొల్లనుట.

'ఆదిరన్త్యేన సహేతా- అంత్యేన ఇతాసహితః ఆదిః మధ్యగానాం, స్వస్య చ సంజ్ఞా స్యాత్'

అంత్యేన = కడపటనున్న, ఇతా = ఇత్తుతో, సహితః = కూడుకొనిన, ఆదిః = మొదటి అక్షరము, మధ్యగానాం = నడుమనుండెడు నక్షరములకును, స్వస్యచ = తనకును, సంజ్ఞా స్యాత్ = పేరగును. అన్నందుచేత తుదనున్న కకారమునకు పొల్లు పనిలేదాయె, గనుక-

'తస్యలోపః'
తస్యేతో లోపస్స్యాత్

దాని కొననున్న ఇత్తునకు లోపమవును. ఇందున్న క వర్ణము పొల్లు లోపించగా జిక్కిన యయిదక్షరములును హ్రస్వములు, దీర్ఘములుగాను నుచ్చరింపగా, అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ అని పది యక్షరములయ్యెను.

ఏచః = ఏ, ఓ. ఐ, ఔ,

'చ్' అను ఏచ్ ప్రత్యాహారమునందు మునుపటివలె కొననున్న చకారము లోపించగా, మిగిలినవి నాలుగాయెను.

'ఏజ్ హ్రస్వో నా స్తి'

అను సూత్రముచేత నీ ఏచ్చునకు హ్రస్వములేదు. ఏ; ఓ కారములు గీర్వాణభాషయందు కుఱచలు లేవు, అనుస్వారః = పూర్ణబిందు వొకటి. సంస్కృతమునందు అర్ధానుస్వారములేదు. విసర్గః = విసర్జనీయ మొకటి-ఇవన్నియు గూడగా, స్వరాః = అచ్చులు; షోడశ = పదియారు. స్వర్యాః =

స్పర్శములు ఇరువదియైదు. అంతస్థశోష్మాణః = అంతస్థములు నాలుగు, దొడ్డ శకారమును హలః = వ్యంజనములు, చతుస్త్రింశత్ = ముప్పదినాలుగు, అచ్చులు పదాఱు. హల్లులు ముప్పదినాలుగు, ఉభయములుగూడ నేబది వర్ణము లాయెను. 103

గీ. అచ్చు లొక పదియాఱును వ్యంజనములు
పాండుపుత్రసహాయ ! ముప్పదియుమూఁడు
దొడ్డ ళా యందులోపల దొరలనయ్యె
నమరభాషకు నేఁబది యక్షరములు (2-49) 104

సీ. ఏళ నీళము దేవ హేళనంబు నటంచు
యాజుషామ్నాయంబు నందు లేదొ
కాళ నాళ వ్యాళ గోళ హింతాళంబు
లనుచు సంస్కృత భాష యందు లేదొ
గయ్యాళి త్రుళ్ళు నగళ్ళు వజ్రపు తళ్కు
తాళికి నంచు నాంధ్రమున లేదొ
పాళం బెఱుంగని కూళ విరాళి పి
సాళించు ననియు దేశ్యమున లేదొ
యాగమజ్ఞులు దొడ్డ బీజాక్షరంబు
లందు లేకున్కి సన్నంబు నదియుఁ గూడ
నొకటిగాఁ జేసి బీజోపయోగిఁ గాన
ఙాను జేకొని రది శబ్దసరణి గాదు (2-50) 105

ఆగమజ్ఞులు పంచాశద్వర్ణంబులలో నున్న క్ష కారమును గూర్చుకొన్నందుకు మహావిద్యలోని శ్లోకంబులు. 106

మూలాధారం గుదస్థానం, స్వాధిష్ఠానం తు మేహనమ్
నాభిస్తు మణిపూరాఖ్యం హృదయాబ్జ మనాహతం
తాలుమూలం విశుద్ధాఖ్య మాజ్ఞాఖ్యం నిటలాంబుజం
సహస్రారం బ్రహ్మరంధ్ర మిత్యాగమవిదో విదుః. 107

ఆధారస్తు చతుర్దళారుణరుచి ర్వాసాంత వర్ణాశ్రయః
స్వాధిష్ఠాన మనేక వైద్యుతనిభం బాలాంత షట్పత్రకం,
రత్నాభం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకం
పత్రైర్ద్వాదశభిస్త్వనాహతపురీ హైమీకఠాంతాన్వితా. 108

ద్వ్యష్టారం స్వరషోడశైశ్చ సహితం జ్యోతి ర్విశుద్ధాంబుజం
హంక్షేత్యక్షర పద్మపత్రయుగళం రత్నోపమాజ్ఞాపురీ
తస్మా దూర్ధ్వ మధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం
నిత్యానందమయీ సదాశివపురీ శక్తే నమశ్శాశ్వతం" 109

గీ. కాకు షా జడ్డయైన క్షకారమగుట
దలఁప కేఁబది లిపులలో దాని గూర్చి
తొలుత భిన్నాక్షరంబైన దొడ్డ శాను
విడిచిపెట్టె ననంతుండు వెట్టిగాఁడె (2-52) 110

ఛందమునందు ననంతుఁడు చెప్పిన విధము:-

క. యరలవ లంతస్థలు నాఁ
బరగును శషసహలు దేటపడు సూష్మలనన్
సొరిది క్షకారము గూడుక
సరి నేఁబదియయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్. 111

క. ల ళ లకు భేదము లేదను
పలుకున శా దొఱగి యైదు పదులగు వర్ణం
బులు సంస్కృత భాషకు, మఱి
తెలుఁగున ఱ ళ లనఁగ రెండధికమగుఁ గృష్ణా(అనం.ఛంద.4.47-55)112

అని 'ఆద్యాయాః పంశాశద్వర్ణాః' అను సూత్రమునకు (అప్పకవిగారు) 113
వ్రాసినారు.

అప్పకవిగారి ముఖ్యాభిప్రాయము, ళ కారము కలుపుకుని ౫౦ వర్ణముల నిన్ని, అనంతుడు క్ష కారము కలుపుకుని ౫౦ వర్ణము లన్నాడు. క్షకారము కషయోగమునైన వర్ణముగావున నాగమజ్ఞులు నిలిపినారన్నంత మాత్రమున

నిది యొక్క వర్ణ మనరాదనిన్ని అనంతుడు వెట్టివాడు గనుక క్ష కారమును నిలిపి ప్రత్యేకవర్ణమైన ళ కారమును విడిచినాడని అనంతుని నాక్షేపించినారు. 'ఏళ నీళము దేవ హేళనము' అని యజుర్వేదమం దున్నదని వ్రాసినారు. కుమారవ్యాకరణముచేత డ కారమునకు ళ కారము వచ్చును. 114

హేమపూర్వే సహప్రశ్నే, దుత్వ మేధాంభసోర్నని
ప్రాకటే పద మధ్యస్థో, డకారో ళత్వమాప్నుయాత్. 115

ఆదేశమైతే నేమి, స్వతస్సిద్ధమైతే నేమి, వేదమందు ళకార మున్నదని లోకమందుకూడా కల దనరాదు. లోకమందు ౫౦ వర్ణములు చెప్పితే, వేద మందు ౬౦, ౬౩, ౬౪ వర్ణములని యున్నది, కుమారవ్యాకరణమందు:-

'అనేన క్రమేణ యాజుర్వేదిక వర్ణానాం షష్టిసంఖ్యా సూత్రతత ఏవ విస్పష్టం ద్రష్టవ్యా. నను త్రిషష్టిర్వా చతుష్షష్టిర్వా వర్ణాః శంభుమతే మతాః'

ప్రాకృత వ్యాకరణముచేత ప్రాకృతమందు, ఆంధ్రవ్యాకరణముచేత నాంధ్రమందున్ను ళ కారము గలదని స్పష్టమైయున్నది. పాణినీయ సూత్రము చేత సంస్కృతమందు ళ కార మున్నదని శాబ్దికులెవరు నంగీకరించలేదు. కాళ, నాళ, వ్యాళాదులు ల కారములంటే వచ్చిన దోషము కనిపించదు. అవి ళకారములని సిద్ధాంత మేమిటో తెలియదు. ఏ యాకరము నవలంబించి యనం తుని 'వెట్టి' యనిరో ఆ సాహసము తెలియదు. 116

ఈ సూత్రమునకే 'కవిశిరోభూషణము' నందు-

సంస్కృత భాషా శబ్దానాం పంచాశద్వర్ణైః సిద్ధిః భవతి అత్ర కేచిత్— అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ఏ, ఐ, ఓ, ఔ అనుస్వార విసర్గౌచ అచః స్వరా ఇతి చ కథ్యంతే.స్పర్శా, అంతస్థా క్ష ళ వర్ణసహితా ఊష్మాణశ్చ హల ఇత్యుంచతే,మిలిత్వా పంచాశద్వర్ణా భవంతీతి వదంతి. తేషాం మతే 'ప్రకృతే స్తుతే దళోనా' ఇత్యత్ర- ఋ, ౠ, ఌ, ఐ, ఔ, ఙ, ఞ, ళ, ష (క్ష) వర్ణా, విసర్గశ్చ న్యూనా భవంతి. కేషాంచిన్మతే ఌ వర్ణస్య దీర్ఘగ్రహణం, ళ వర్ణస్యాగ్రహణం చ సమ్మతం.

అత్ర సంప్రదాయాభిమానినః వదంతి- 'అది క్షాంతా స్మృతా వర్ణా' ఇత్యాగమజ్ఞ వ్యవహార మాత్రేణ న క్షకారస్య వర్ణాంతరత్వేన గణనా అన్యథా సంయుక్తత్వా విశేషాత్ స్త్రాదీనామపి వర్ణాంతరత్వేన గణనా స్యాత్, క్షస్య వర్ణాంతరత్వా భావే, ధాతు పారాయణికైః భిక్షాది ధాతూనాం షాంతమధ్యే పాఠ ఏవ మానం.

న చైవం ళకారస్యా ప్యవర్ణాంతరత్వం, తస్య మహేశ్వర సూత్రాను క్తత్వేఽపి లడయో ర్లళయో శ్చైకత్వమితి శాబ్దిక శిఖావతంసై రుక్త త్వాత్. 'ళోళ', ఇతి వాల్మీకిభిరుక్తత్వాత్, ళలయో రుచ్చారణస్య లోక వేదయోః భిన్నత్వేన ప్రతీయమానత్వాచ్చ న ళస్య వర్ణాంతరత్వం వక్తుం వార్యతే.

యద్య ప్యనుస్వార విసర్గ జిహ్వామూలీయోపధ్మానీయ యమానామకారో పరి శర్షుచ పాఠస్యోపసంఖ్యాన మితి కాత్యాయన వ్యవహారా దనుస్వార విసర్గయోః హల్త్వం చాప్యస్తి తథాపి వర్ణ పరిగణన దశాయాం తయోః అత్త్వేనైన ప్రామాణికైః వ్యవహారః కృతః అత ఏవ హరిం వందే హరిః కరోతీత్యాదౌ త్రిపాదిగతత్వేన అనుస్వార విసర్గ కార్యయోః అసిద్ధత్వాత్ న యణాదేశ ప్రసక్తిః ఇత్యాద్య వ్యాకరణ పారీణాః ఫేణుః.

జిహ్వామూలీయోపధ్మానీయయోస్తు నోభయత్రాపి పరిగణనం, తయోః విసర్గాదేశత్వేన వర్ణాంతరత్వాభావాత్. ళస్య గ్రాహ్యత్వే, క్షస్య అగ్రా హ్యత్వే, ఌ వర్ణస్య ద్వైవిధ్యేచ-

"ద్విధాక ఏచోనుస్వారో, విసర్గః షోడశస్వరాః
స్పర్శా అంతస్థశోష్మాణః, చతుస్త్రింశత్ హలః స్మృతాః
సిద్ధి స్సంస్కృత భాషాయాః, భవేత్ పంచాశదక్షరైః
ప్రాకృతాయాశ్చ సిద్ధి స్స్యాత్, త్రిశ్చత్వారింశ దక్షరైః
ఋ ఌ వర్ణౌ, వినై కారౌకారాభ్యాం చ దశ స్వరాః
శషౌ వసంయుక్త జ ఞౌ వినైవాన్యే హలో మతాః
ఋ ఌ వర్ణౌ హ్రస్వదీర్ఘౌ ఐజాద్యా వనునాసికౌ
శషౌ చేతే దశ న్యూనా ప్రాకృతోక్తిషు సర్వతః."

ఇత్యాది వరరుచి హేమచంద్రాది వ్యాకరణ ప్రవీణోక్తిః మానమితి.

ఌ వర్ణస్య ద్వైవిధ్య మిత్రత్య తస్య దీర్ఘాభావాత్, ప్లుతేన ద్వైవిధ్యమితి కేచి దూచుః. తస్య సాక్షాత్ దీర్ఘాభావేపి ఋ వర్ణ సవర్ణత్వేన తద్దీర్ఘత్వ మితి కేచి దవదన్.

అత్రేయం చింతా- హ్రస్వస్యేవ దీర్ఘస్యాపి సిద్ధత్వేనద్వయోః పార క్యేన గణనా, ప్లుతస్యతు విధి విషయత్వాత్ న పరిగణనేతి సంప్ర దాయః. ఏవం స్థితే ఌ కార ప్లుతస్యైవ విశిష్య గ్రహణమిత్యప్రామా ణిక మేవ, న వా తేన ప్రయోజనమితి. ఋ వర్ణ దీర్ఘేణైవ దీర్ఘత్వం ప్రామాణికం. 'అణు దిత్సవర్ణస్య చాప్రత్యయ' ఇతి గ్రహణక శాస్త్రా నుగమాత్ ఋ కారః త్రింశత స్సంజ్ఞా ఌ కారశ్చ తథావిధ ఇతి సిద్ధాం తాత్, అతఏవ హోతౄకార ఇతి రూపం సిద్ధం.

అత్ర, 'కేషాంచిద్వర్ణానాం క్వచి దభిన్నతా వ్యవహారః
లడయో ర్లళయో రలయో ర్వబయోర్భిదా'

ఇత్యుక్తే, తత్రాపి, లడయోః, లళయోః అభేదస్తు వైయాకరణ వ్యవ హారేణ గరీయాన్. వబయో రభిన్నత్వంతు ప్రాకృత వ్యాకరణ రూఢం తథాహి- 'నీ వీ స్వప్నే' త్యత్ర [వస్యమాదేశో విధీయతే. తత్ర చ వస్య సానిత్వం మస్యాదేశత్వం 'బోమశ్శబ్ద' ఇతి పూర్వ సూత్రాదున్నే తవ్యం. ఏతచ్చ వబయో రభేదం వినా దుర్ఘట మితి స్పష్టమేవ. తేనాబ్ధ మిత్రత్య][1] 'దవలా మథశ్చ'ఇతి బ లోపః ఫలం. ప్రపంచస్తు చంద్రి కాదేః అవగంతవ్యః. రలయో స్త్వ భిన్నతాతు (చింతామణౌ)

'శ్రీరామచంద్ర సూర్యేణ తమః పౌరస్త్యదేశజమ్'

ఇత్యాదౌ కవిభిరేవ వ్యవహృతే త్యవగంతవ్యం.

తదుక్తం శ్రీ భోజేన-

'రలయో ర్లడయో శ్చైవ లళయో శ్శసయో రపి
వబయో ర్నణయో శ్చాంతే, స విసర్గా విసర్గయోః
సబిందుకా బిందుకయోః, స్యాదభేదేన కల్పనం.

ఇతి. (క. శి. భూ. పు. 161 - 166) 117

1. ఈ కుండలీకరణములోని భాగము మూలమునలేదు. అహో బల పండితీయము (ఆంధ్ర రచయితలసంఘ ప్రచురణ)నుండి గ్రహించబడినది

అని అహోబల పండితులవారు వ్రాసినారు. ఈయన తాత్పర్యమున్ను ళకారమునే కల్పుకొని ౫౦ వర్ణములని స్పష్టముగా నున్నది. ఆయన గ్రంథముల వలననే కొందఱు క్షకారము గ్రహించినా రనిన్ని, ధాతువు యొక్క షాంత మధ్య మందు క్షకార ముండుటవలన, క్షకారము ప్రత్యేక వర్ణ మనరా దనిన్ని, మాహేశ్వర సూత్రములందు లేకపోయినప్పటికీ, కాత్యాయనులవారు వర్ణ సమామ్నాయమందు చెప్పక పోయినప్పటికిన్ని, ళకారము మాత్రము ప్రత్యేక వర్ణ మనిన్ని, క్షకారమువలె ళకారమును నెవరికి తప్పించ శక్యముగా దనిన్ని కనుపించుచున్నది. శబ్ద శాస్త్రమునందు లేని ళకారము (విషయమున) 'లళయోః' అని అభేదమున్నంత మాత్రమున నేమి కార్యము ? 'లోళః' అని వాల్మీకి సూత్రము వ్రాసినారు. సంస్కృతమందు ళకారము లేదు గనుకనే, వాల్మీకుల వారు ప్రాకృతమందు 'కమళం' అని ళకారమే కాని లకారము లేదని చెప్పినారు. ఈ సూత్రము వలననే, సంస్కృతమందు ళకారము, ప్రాకృతమందు లకారము లేవని స్పష్టముగా నున్నది. ౠకారము ద్వైవిధ్యమునకు కొందఱు దీర్ఘము లేదన్నారు గనుక, ప్లుతముచేత ద్వైవిధ్య మనిన్ని, కొందఱు సాక్షాద్దీర్ఘాభావ మైనప్పటికి, ఋకార సవర్ణ మగుటచేత, నా ఋకార దీర్ఘమునుబట్టి దీనికి దీర్ఘమన్నా రనిన్ని వ్రాసినారు. అయితే, 'రయోస్తు నిత్యం స్యాత్' (చిం. సం. 22) అన్న సూత్ర వ్యాఖ్య యందు:-

'కశ్చి ద్వదతి సాంగత్యం యతా వేవానయో స్తదా
అవద చ్చాత్ర సాంగత్యం ప్రాసేష్వపి చ కశ్చన'

(అను) ఈ కారిక వ్రాసి, యతి కొకడు, ప్రాస కొకడు నంగీకరించుట వలన నుభయమతము కూడదని కశ్చిచ్ఛబ్ద ప్రయోగముచేత నక్కడ ఖండించినారు.[1] ఇచ్చట ఏ మాత్ర మా న్యాయము ఎందుకు కలుగదాయెనో

1. "కశ్చిద్వదతి... కశ్చన" ఇత్యుక్త్వా కయోశ్చాత్ర నైత్రిక కల్పకయోర్మత ముభయత్ర కశ్చిచ్ఛబ్ద ప్రయోగేణ అత్యంత పండిత మ్మన్యతా ధ్వనన ద్వారా పరాకృత్య, ద్వితీయాచార్యేణ- "అనయో స్సంగతిం యస్తు, కరోతి కవితాకృతౌ. అస్యా అత్యంతదోషత్వాత్, దుష్కవి స్సహి కథ్యతే" (అథర్వ సం 29 కా)ఇతి స్వమతం ప్రకాశితమ్.
(క. శి. భూ. పు. 195-196)

తెలియదు. ఋకారమునకు హ్రస్వ దీర్ఘములు రెండును గలవు. ఌ కారమునకు హ్రస్వమే కాని దీర్ఘమెచ్చటను కనుపించదు. 118

'కౘకరోతి' అనుచోట కకారమునకు ముందున్న యర్ధవిసర్గాకృతిచే నుచ్చరింపబడుచున్న (దానికి) 'జిహ్వామూలీయ' మనిపేరు. 'కౘపచతి' అనుచోట, ప వర్ణముకు ముందున్న అర్ధవిసర్గాకృతిచే నుచ్చరింపబడు (దానికి) 'ఉపధ్మానీయ' మనిపేరు. పాణినీయ వ్యాకరణమందు శిక్షాకారకులు :-

"అ క హ విసర్జనీయానాం కంఠః
ఇ చ య శానాం తాలూ
ఋ టు రషాణాం మూర్ధా
ఌ తు లసానాం దంతాః
ఉపూపధ్మానీయానా మోష్ఠౌ
ఞ మ ఙ ణ నానాం నాసికా చ
ఏ దైతోః కంఠ తాలూ
ఓ దౌతోః కంఠోష్ఠం
వకారస్య దంతోష్ఠం
జిహ్వామూలీయస్య జిహ్వా మూలం
నాసికానుస్వారస్య"

(అని) జిహ్వామూలీయమునకు జిహ్వామూలము, ఉపధ్మానీయమునకు ఓష్ఠములు (ఉత్పత్తి) స్థానములని స్పష్టముగా చెప్పినారు. స్థానములుగల జిహ్వామూలీయోపధ్మానీయములను, విసర్జనీయమున కాదేశములు గాని, ప్రత్యేకవర్ణములు కావనిన్ని, అచ్చులుగావు, హల్లులుగావు అని పరిహరించుటకు అహోబల పండితులవారి సామంత మేమో తెలియదు. రేఫ కాదేశమైన విసర్జనీయము నెటువలె నచ్చులందు స్వీకరించుకొనిరో తెలియదు. శాస్త్రమందు లేని శకారము నిలుపుటకు శాస్త్రమందున్న జిహ్వామూలీయోపధ్మానీయములను పరిహరించుటకు నాకరము కనుపించదు. ఒకానొకచోట నన్నయభట్టు, సోమయాజి, పెద్దన్నగారలను అకరము లేదని ఆక్షేపించిన అహోబల పండితులవారు తమ యిష్టమే ప్రధానమనుకున్నారు కాని, పూర్వోత్తర సందర్భము పరిశీలించినారు కాదు 119

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ఏ, ఐ, ఓ, ఔ
ం (అనుస్వారము), ః (విసర్గ) = 15
జిహ్వామూలీయోపధ్మానీయములు = 2
మొత్తము ౧౭ అచ్చులు. ఇవియే స్వరములు
క, ఖ, గ, ఘ, ఙ, - చ, ఛ, జ, ఝ, ఞ, -
ట, ఠ, డ, ఢ, ణ, - త, థ, ద, ధ, న, -
ప, ఫ, బ, భ, మ - ఈ ౨౫ స్పర్శలు
య, ర, ల, వ - ఈ ౪ అంతస్థలు
శ, ష, స, హ - ఈ నాలుగు ఊష్మలు
ఈ 33 హల్లులు. ఇవియే వ్యంజనములు
అచ్చులు ౧౭ + హల్లులు 33 = 50

పంచాశద్వర్ణము లివి యని మా మతము. బుద్ధిమంతులు ఈ మూడు మతములందు నెవరి మతము బాగుంటే దానిని స్వీకరించవలెను. బాలసరస్వతులవారు ఏబదివర్ణములన్నారుగాని, వివరించలేదు. ఆయనే బుద్ధిమంతులు. 120

ఆంధ్రభాషకు :-

సూ. ద్వివిధా దిదు దే తోచో
వక్రతమా వనుస్వారౌ
క గ చ జ యుగ ట డ ణ త ద న
ప బ మ - య ర ల వ - స హ శ ం తు హల్వర్గః'
(ఆం. శ. చిం. 6)

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఒ, ఓ, ఐ, ఔ, ం (అనుస్వారము) ఁ (అర్ధానుస్వారము) - ఈ పదునాలుగున్ను అచ్చులు. క, గ, చ, చె(చ), జ జె ( ), ట, డ, ణ, త, ద, న, ప, బ, మ, య. ర, ల, వ, స, హ, శ - ఈ ఇరువది రెండు హల్లులు. అచ్చులు (౧౪) హల్లులు (౨౨ మొత్తము ౩౬. 'షట్త్రింశత్' అని వ్యాఖ్యాకారు లందఱు వ్రాసినారు. ఆంధ్ర ందు సుప్రసిద్ధమైన ఱకారమును చెప్పలేదు. శాలు, కాశ, ఱఱభి, భశీ, ఱెం ( ం) ఝాటము, ఖడ్గము - ఈ మొదలయిన పదములందు శ, ఝ, భ, ఖ (అను) నాలుగు వర్ణములున్ను, ఠవర, ఠీవి, ఠేవ, ఠావు, ఢాక,— ఈ పదము లప్పకవిగారే

వ్రాసినారు. వీటియందు ర, థ రెండు వర్ణములున్ను గలవు. (ఈ యీ వర్ణము లను కలుపుకుని) ౪౩ వర్ణములుండగా 'షట్త్రింశత్' అన్నారు.

ఇందుకున్ను—

'అద్దంత్యస్తాలవ్య శ్చుర్వ్యక్రస్యాన్మిథ స్సవర్ణశ్చ'

(ఆం. శ. చిం. 23 సూ.)

చలి, చమరు, చాన, చప్పుడు- ఇత్యాదులు దంత్యము లనిన్ని, చెలి, జేవురు, చెమట, చెలువు- ఈ మొదలైనవి తాలవ్యములనిన్ని నిర్ణయించినారు. ఇవి- 'మిథస్సవర్ణశ్చ'- యతి ప్రాసములందు సవర్ణము లంటారు. వీటికి మాత్రమేమి? కకారాదులకు (ను) గలదు. కలికి, కెరలి, కాన, కేరుచు- ఈ మొదలైనవిన్ని రెండు విధములని యెందు కనరాదు? ఇందుకున్న వారి తాత్పర్యము తెలియదు. 121

చలము = కూపకము, చలము = పాత్రవిశేషము, చాఋ, చామకూఱ. ఈ మొదలయినవి గీర్వాణ వర్ణములైన చారు, చారిత్రము—ఈ మొదలయిన పదములవలె నుచ్చరింపబడుట భేదమైయున్నది.

చామ చేను చామలు = స్త్రీలు, చామనార ఈ మొదలయిన పదము లుచ్చరించుట భేదమైయున్నది.

కూజా, కేజా, జాఱ—

ఈ మొదలయినవి, జాగరూకుడు, జామిత్రము—ఈ మొదలయిన గీర్వాణ పదములవలె నుచ్చరించుట భేదమైయున్నది.

జాము, జావ, జారిచెంబు

ఈ మొదలయిన పదము లుచ్చరించుట భేదమైయున్నది. ఇవి రెండు విధములు. వీటికి యతి ప్రాసములు చెల్లునని చెప్పితే, యుక్తముగా నుండును. 122

సూ. 'క్వచిదపి న స్త ఉదోతౌ
దంతోష్ఠ భవస్య వికృతి శబ్దాదౌ'

తెలుగున వకారమునకు కొమ్ము నోత్వమును లేదన్నారు. 'వోత్ర' శబ్దముకు వకారోత్వమని అహోబలపతి మొదలయినవారు వ్రాసినారు. ఓర, ఓల, ఒంటరి - ఈ మొదలైనవి అజాదికములుగాని. వకారాదులుగావు.' 123

సూ. సిద్ధ స్సాధ్యశ్చానుస్వారః
పూర్ణార్ధ భేదతో ద్వివిధః
హ్రస్వాత్ పూర్ణోపి భవేత్
దీర్ఘాచ్చేత్ ఖండ ఏవ స జ్ఞేయః
(ఆం. శ. చిం. 7 కా.)

దీర్ఘాక్షరమందు నర్ధబిందువే యని నిశ్చయించినారు. అహోబలుడు కవి శిరోభూషణమందు—

'పూంచెన్, పూనిచెన్, పూన్చెన్ ఇతి రూపత్రయం.
బుద్ధరాజు రామభద్రకవినా—

క. 'పూంచెన్, మంచెన్, మన్చె న
టంచుఁ బ్రయోగింప నమరు, నమర శ్రేణిన్
మంచి మనోరథనికరము
పూంచె రమాధిపుఁడు భక్తపోషణుఁ డగుచున్'

ఇతి లక్షణ ముక్త్వా—

క. 'కాంచన మాలాలంకృత
చంచత్తనులీల మెఱయ జవనాశ్వములన్
పూంచిన రథమున మణిమయ
పంచానన కేతువెత్తె బంధుర ఫణితిన్'
—భార. విరాట, 4-45

ఇతి తిక్కయజ్వవచన ముదాహృతమ్' అని వ్రాసినారు. 124

సూ. 'ఆద్యః క్రియాసు భూతార్థ
ద్యోతిత మాద్యగం వినా సర్వః.'
(ఆం. శ. చిం సూ. 20)

దీనికి బాలసరస్వతిగారి వ్యాఖ్య :—

క్రియాసు = క్రియలయందు, భూతార్థద్యోతితం = భూతార్థములను గనిపించేదిన్ని, ఆద్యగం = నామాదినుండెడిదిన్ని, వినా = వినాగాను,

సర్వః = సమస్తమైన, యః = యకారము, అత్ = అకారము, అకారమనగా తలకట్టనుట, చనియె, వినియె మొదలయినవి క్రియాభూతార్థస్థిత యకారైత్వాలు. యెప్పుడు మొదలైనవి నామాది యకారైత్వాలు. ఈ రెండు విడిచిపెట్టి కడమ యకారములన్ని తలకట్టుగా తెలిసేది. 125

ఆధునిక వ్యాఖ్య :—

"క్రియాసు = క్రియలయందు, భూతార్థద్యోతినం—భూతార్థ = భూతార్థములను, ద్యోతినం = ప్రకాశింపజేయు యకారమును, ఆద్యగం = పదాదిగత యకారమును, వినా = తప్ప, సర్వః = సమస్తమైన, యః = యకారము, అత్ = అకారము, తాత్పర్యము :—అనగా. చనియె, వినియె, కనియె ఇత్యాది క్రియాపదములందున్న యకారమును, యెవ్వడు, యెలమి ఇత్యాదులందు పదాదిగత యకారమును ఎకారాంతము. కాయ, చాయ, బయలు మొదలయిన సమస్త శబ్దములందున్న యకారము అకారాంతమనుట. సూత్రకారులు పదాదియందు యకారముగలదని చెప్పిరి. అథర్వణాచార్యులు మొదలయిన పండితులు పదాది యందు యకారము లేదని చెప్పిరి. కావున నా పక్షమందు ఎవడు, ఎలమి అని అజాదికమే యుండును." 126

మరియు అహోబలుని కవిశిరోమణి వ్యాఖ్య :—

"క్రియాసు భూతార్థ ప్రకాశకం నామాద్యగం చ వినా యః యకారః అత్ అకారవాన్ భవతి. తయోస్తు నిత్యమిత్యర్థః. యెవ్వడు, యెప్పుడు, చనియె, వినియె నిత్యాద్యుదాహరణం. తత్ర క్రియాయాం 'క్త్వా భూతయోః క్రియాం తస్యేది'తీత్వం. 'వర్ణాగమో విశేష' ఇతి యత్వం. 'ప్రథమైకస్యేదృవేచ్చ భూతార్థే' ఇతి ఎత్వం. చనెన్, వినెన్, కనెన్ ఇత్యాది క్రియాప్రయోగోపి ప్రబంధేషు వర్తతే. తత్ర 'ఎదంతతాచ నామ్నా మన్యతరస్యా మియాంతానాం' ఇతి సూత్రం న ప్రవర్తతే. నామ్నామితి నామమాత్రస్యైవ గ్రహణాత్, కింతు వికృతివివేకసూత్రేణ తన్నిర్వాహః.

'యస్యాద్దేశ్య క్రియాంత్యే తు, భూత ఏకత్వవాచకః' ఇతి యః
'ఇత్స్యాత్ భూత బహుత్వే తు, దేశ్యే తూభయతో భవేత్' ఇతి ఇత్వం.

'ఉద్ద్యాదివర్ణే భూతార్థే చాపి తస్యైద్భవేత్సదా' ఇతి ఎత్వం. చనియెన్, వినియెన్, కనియెన్ ఇత్యాది.

'ఇయాంతా స్సాధవశ్శబ్దాః క్వచిదేదంతతాపి వా' ఇతి వా ఎత్వం.

'అచోఽచి కుత్రచిల్లోపో, బహులం స్యాత్ ప్రయోగతః' ఇతి ఇకారస్య లోపః. చనెన్ ఇత్యాది.

అత్రేయం చింతా :—వాడెవ్వడు ఇత్యాదౌ సర్వత్రాఽజంశేన సంధి శ్రవణాత్.

'ఎవ్వని వాకిట నిభమదపంకంబు'

ఇత్యాదౌ ఎకారం ప్రత్యేవ ఇకార వలేః ప్రయక్తత్వాత్ ప్రయోజనాభావాచ్చ ఆద్యగ యకారస్య ప్రాణ్యంశోఽనుపపన్న ఇతి తత్త్యాగో వక్తవ్యః వికృతి వివేకేఽపి, శ్రీకవి మతేఽపి ప్రాణ్యంశత్యాగ ఏవ విహితః'

'వికృత్యాది గతో యోఽత్ర స్యాచ్ఛబ్దాంతర యోగతః
ప్రాణమాత్రావ శేషస్స్యా దత్ర శ్రీకవిసమ్మతే'

వి. వి. సం. 22 కా.

(క. శి. భూ. పు. 189-90)

అని (ఇట్లు) సకల పండితులును పదాదియందున అచ్చేకాని యకారము లేదన్నారని వ్రాసినారు. బాలసరస్వతిగారు, సూత్రార్థము మాత్రము వ్రాసినారు. మిగిలినవారు సూత్రార్థము వ్రాసి వెంటనే పదాది యకారము లేదని ఖండించినారు. 127

అప్పకవీయమునందీ సూత్రార్థమే—

సీ. ఆంధ్రోక్తి మొదల నాద్యంతస్థ ముండదు
ప్రాణమై యది గనుపట్టుగాని
నుడువుల నడుమను కడను యా కెందును
తలకట్టు దక్క నెత్వంబు లేదు
యాకు భూతాది క్రియాద్యోతితములఁ జూ
పట్టు నెత్వము తలకట్టుగాదు
తలకట్టు వక్రముల్ దొలుదు నీ రెండును
నలఘు యకారంబు లనఁగ బరఁగు

నిప్పుడీవంకఁ గనుగొంటి నింతలోన
నెచ్చటికి నేగెద వన నాద్యచ్చు లయ్యెఁ
గయ్యమయ్యెను గానిమ్ము గాయకమున
గాయపలె శౌరి ననఁ దలకట్టు లయ్యె. (2-175)

సీ. ఎక్కడ గనబడియెడు చక్రి చెలులార
యింత నెవ్వరు చని యెవరు వెదుక
నీ వేళ నెటకుఁ బోయెదవన్న మిన్నక
నేగెద నన్నే మని యెదరు మీరు
హేమాంగదము లిడియెదఁ జెప్పరే వాని
నేరీతిఁ బొడఁగనియెదము మనము
హితము దలంప డాయెను నన్నుఁ గని నగి
యెడు సవతుల కిది హేతువయ్యె

ననుచు నిట్లు భూతాది క్రియాపదాంత
ముల విశేషణ భావి క్రియలను దక్క
మొదలి యంతస్థముల కేత్వములు త్రిలింగ
దేశ భాషను బుట్టవు దితిజభేది! (2-176) 129

ఆదియకారమునకు నుద్యోగపర్వమునందు:—

గీ. కొంచెమైనను దగఁ బంచి కుడువ మేలు
పనులయెడ దుఃఖమోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము శత్రునకునైన
నిచ్చుటయె లెస్స యడిగినయెడ నృపాల! (2-47) 130

అని వ్రాసినారు.

సూ. 'అద్యః క్రియాసు భూతా
ద్యర్థసముద్యోతితం వినా సర్వః'

అని, 'ఆద్యగం' అను పదములను తీసివేసి, 'సముద్యోతితం' అను పదమునుంచి దిద్దినారు. మునుపున్న పాఠము అంతటను "అద్యః క్రియాసు

భూతార్థ ద్యోతిత మాద్యగం వినా సర్వః" (అని, దీనిని) దిద్దుటకు కారణ మేమంటే, పదాదియందు యకారములేదు. సూత్ర మందున్నది, సూత్రము కొట్టుబడి పోకుండగా నుండుటకు దిద్దినారు. ఈ దిద్దినదైనా నిలువదు. ఏమి హేతువనంటే-కనబడియెడు, చనియెదరు, చనియె—ఈ మొదలయిన పదము లందు యకారముల కేత్వము లన్నారు. సరే, కయ్యము, సయ్యన-ఈ మొద లయిన పదములందు యకారమునకు తలకట్టు లన్నారు, సరే, కనియె, వినియె-ఈ మొదలైన క్రియా పదాంతములందు యకారమున కేత్వములని చెప్పలేదు. కాని, ఏత్వములును ప్రసిద్ధి. "ఉయ్యాలా"ది పదములందు తలకట్టులును గలవు. కావున, నచ్చట కొట్టుబడి పోయినది. అయితే ఉయ్యాలాది పదములను గురించి విస్తరించి, వ్యర్థ శ్రమపడి వ్రాసినారు. కాని అందువలన పాండిత్యాతి శయము పోవుటకు కారణ మైనది. 131

కాకునూరి (అప్పకవిగారి) ఆంధ్ర శబ్ద చింతామణి :—

గీ॥ ధరణి నుయ్యేల పయ్యెద తాయెతులను
గల యకారంబులకు వక్రములు నిజంబు
ముద్దరాజు రామన వాని మూఁటినిఁ బద
మధ్య యాలని చెప్పె నమ్మాట మిథ్య. (2—184) 132

అప్పకవిగారి తాత్పర్యము:—ఉయ్యేల, పయ్యెద, తాయెతులు అను నీ పద మధ్యమందున్న యకారములకు ఏత్వములు నిజంబనియును, "ముద్ద రాజు రామన్న పద మధ్య యకారము లంటాడు, ఆమాట అబద్ధము" అని అర్థము. అయితే, యకార మనిన్ని, ఏత్వమనిన్ని తమ రంగీకరించియు, రామన్న మాట మిథ్య, అనగా అప్పకవిగారు పద మధ్యద్వయ విభాగము చేసినారు. ప్రత్యేక పదములుగావు, రెండు అచ్చులు కలుసుకొని, వచ్చిన యకారమని అప్పకవిగారి తాత్పర్యము. అందుకు అప్పకవిగారు చెప్పిన పద్యము. 133

గీ॥ ఊయ నెలకా కగుటచేత నుయ్యేలయ్యెఁ
బయిని యెదకున్కి వక్రోక్తిఁ బయ్యెదయ్యెఁ
దల్లి కావునకై కట్ట దగిన సరులు
తేలఁ బల్కఁగఁ దాయెతు ల్దేత్యమునను. 134

వ. హేలా శబ్దమునకు తద్భవము 'ఏల'. అది కుఱుచకాకు చే(యగా), హ్రస్వముగా బలుకగా "ఎల" అయినది. ఊచు నెల కనుక 'ఉయ్యేల' హృదయ శబ్దమునకు తద్భవము "ఎద" ఆయెను. దానికి పైనుండేది గనుక వక్రసమాసమున "పయ్యెద" ఆయెను. "ఎత్తు" అనగా దక్షిణ దేశీయముగా దండలకు పేరు. దాని జడ్డలను తేల బలికితే 'ఎతు' లాయెను, తాయి అనగా తల్లి. ఆ తాయి శిశువులకు శరీర రక్షణగా గట్టినవి ఎతులు గనుక "తాయెతులు". అటుగనుక, శబ్దాదినున్న అచ్చులుగాని హల్లులుగావు. సంధిచేతను లఘు యకారము లైనవి, ఇవి మూడును ప్రత్యేక పదములుగాని యేకపదములుగావు. వీనిని దెలియక ముద్దరాజు రామన "కవిలోక సంజీవని"యందు చెప్పికొనిన పద్యము :— 135

గీ॥ "తాయెతులు నుయ్యేలయుఁ బయ్యెదయును దక్కఁ
గలుగ దెత్వంబు మధ్య యకారమునకు
తుదినిఁ గ్రియఁ దక్క నెత్వంబు గదియ, దాది
నత్వ మొందదు దెనుఁగున నబ్జనాభ ! (2-185, 186, 187) 136

అని వ్రాసినారు. ఈ వ్రాసిన గ్రంథములో నొక పదమైనా తాము నిర్ణయించిన మూడు పదములకు పదద్వయ విభాగమును నిలువ బట్టెడు సూత్రములు మొదలైనవి లేవు. సరికదా, ఊచు ఎల = ఉయ్యేల అయినందున కేలాగు ద్విత్వయకారము సిద్ధమాయెనో? తాయి యెతులు = తాయెతులు అని యిక్కడ ద్విత్వము లేకపోవుటకు కారణ మేమో? తోచినటుల వ్రాయవలసిన దౌను. అసందర్భములో నసందర్భము సంభవించినది. నుడువుల నడుమను కడను యాకెందును తలకట్టు తక్క నేత్వంబు లేదని సిద్ధాంతము చేసినందుకు తదర్థమై యింత ప్రయాస పడితే, పాండిత్య గురుత్వ మనుకున్నారు.

ఇందుకు :—

అథర్వణ గ్రంథే తు, పోయెద నిత్యాదౌ-
'భావి క్రియాసు యస్య స్యా దెత్వమేవ ప్రయోగతః'
ఇతి భావిక్రియావ్యవహారేణ ఎత్వం విహితం. పయ్యెదఇత్యాదినా నుగతస్యాపి

'డోలా భూషోత్తరీయాణి వినైత్వం నాస్తి మధ్యయే'

ఇతి పృథగేత్వం విహితమేవ, అప్పకవిస్తు పయ్యెద ఇత్యాదౌ అత్వం యద్రుతిత్వం చాహ. ఏతత్సూత్ర ప్రామాణ్యాత్ స్వకపోలకల్పితమేవే త్యనుసంధేయం.
(క. శి. భూ. పు. 190)

అనగా— ఉయ్యెల, తాయెతులు, పయ్యెద— ఈ మూడు పదములు వినాగా మిగిలిన పదమధ్యయకారములకు తలకట్టులనిన్ని వీటికిమాత్ర మెత్వము లనిన్ని అథర్వణాచార్యులవారి కారిక యున్నది గావున, నప్పకవి చేసిన పదద్వయ విభాగము స్వకపోల కల్పితమని అప్పకవిగారి మతమును (అహోబలపతి) పరిహరించినారు. 187

వసుచరిత్ర వ్యాఖ్యయందు సోమనాథ పండితులు వ్రాసిన గ్రంథము—

సీ. ఎదలపైఁ బొవలు పయ్యెదలు జాఱగఁబాఱు
బిబ్బీలకు ముసుంగు లబ్బఁజేసె..........

దీని వ్యాఖ్యయందు అహోబలపండితులవారి గ్రంథమును వ్రాసి ఇందు చేతనే (పయ్యెద) ఏక పదమనియున్ను, పదమధ్య యకార మెత్వయుక్తమని యున్ను గ్రహించవలెనని వ్రాసినారు. 188

అప్పకవిగారి ఆంధ్రశబ్ద చింతామణి అచ్చు పుస్తకములందు 'అద్యః క్రియాసు భూతాద్యర్థ సముద్యోతిత మాద్యగం వినా. సర్వః'అని యున్నది. అది అచ్చువేసినవారి పాండిత్యము. ఆర్యావృత్త లక్షణ భంగమైనది.[1] కనినారు కాదు అర్థవిమర్శ లేకపోయినది. 189

---

[1]ఆర్యాపూర్వార్ధమందు ఏడు చతుర్మాత్రాగణములు మరియు నొక గురువుండవలెను. ఇందు ఒక చతుర్మాత్రాగణ మెక్కువైనది. "అద్యః। క్రియాసు। భూతా। ద్యర్థస। ముద్యో। తితమా। ద్యగంవి। నాస। ర్వః" ఇది ఆర్యాగీతియు కాదు. ఆర్యాగీతియందెనిమిదిమాత్రమే చతుర్మాత్రాగణములుండును. ఇందొక గురువెక్కువ. మరియు 'ఆద్యగ'మని యుండుట అప్పకవి ఉద్దేశ్యమునకు భిన్నముగూడ.

(ఇక) ఉయ్యాల, ఉయ్యెల, ఊయెల, ఉయ్యెల అని నాల్గు విధములు గలదు. 140

ఉయ్యాలకు చేమకూర వేంకటకవి సారంగధర చరిత్ర: (1-48)

క. జోలల్వాడిరి యమృతపు
జాలున్ జోకొట్టఁజాలు సరసపు చూపుల్
డోలాయమానముగ ను
య్యాలో జంపాల యనుచు నా లోలాక్షుల్. 141

ఎఱ్ఱనగారి హరివంశము: (6-88)

సీ. తొదలఁ జదలేటి లేఁదరగలు వాలుఁ
దగు చందమామ నుయ్యాల లూప. 142

చాటుధార:

శా. శ్రీలోలాత్మజ కృష్ణరాయ సమరోర్వి న్నీదు వైరి క్షమా
పాలు ర్వేఁగి హయాధిరూఢులగుచున్ బాఱన్ వనిన్ శాఖిశా
ఖా లగ్నాయత కేశపాశులయి తూగన్ గేకిసల్ గొట్టి యు
య్యాలో జంపము లంచు నాడుదురు భిల్లాంభోజపత్రేక్షణల్. 143

తిక్కనగారి ఉత్తరరామాయణము (6-11)

క. తా సొబఁగున నున్మత్తుం
డై శంకింపక కడంగి యాతం డింతల్
చేసెగదె లేడి తమి పులి
మీసలు నుయ్యాల లూగి మెయిమెయిబోయెన్. 144

కృష్ణరాయల ఆముక్తమాల్యద: (7-16)

సీ. (కటినుండి చనుమల గడిగాగ బిగియించి
కట్టిన నిడునీలికాసె మెఱయఁ)
బిల్లిగడ్డము మించఁ బెరిగి మీసలు కుక్షి
గోలంబు మీఁద నుయ్యాలఁ లూగ...... 145

ఊయెల

తిమ్మకవి అచ్చ తెలుఁగు రామాయణము : (అరణ్య-కి9)

సీ. గీ. మఱియుఁ దక్కిన కడల ఱేండ్లుఱక మంచి
సేయుటకుఁ బంచు నపరంజి యూయెలలును
(గద్దియలు మేలిసెజ్జలు పెద్దతొడవు
లెపుడు నాయింటఁ గొదలేక యెనసియుండు.) 146

'ఊయల' అనవచ్చును. 'ఉయ్యల' కు
శ్రీనాథుని భీమేశ్వరపురాణము (3-52)

గీ. ఆడుచున్నవి పింపిళ్ల నంబరమున
చేయుచున్నవి త్రిభువనాశ్లేషకంబు
లజ్జనాథుని తూగుటుయ్యలలు గంటె
వేనవేలు పయోరాశి వీచిఘటలు. 147

కళాపూర్ణోదయము : (6-163)

క. పలుమరు దలయంటి దగన్
నలుగిడి దోయిళ్ల జలమునం బోర్కాడిం
చి లలిం జన్నిచ్చుచు ను
య్యల నూపుచు బెనుప దొడగె నాఱవశిశువున్. 148

'పయ్యద' కు

భాస్కర రామాయణము : (యుద్ధ. 2357)

చ. కదిరిన వేడి బాష్పములు గ్రమ్మి పయిం బయిఁ బర్వ భీతిమై
నదరుచు విన్ననైన హృదయంబునఁ బొల్పగు హారయష్టి ప
య్యద దడియంగఁ గానఁబడె నంచిత నిర్మల[1]రత్నభూస్థలిన్
(దదుచిత దృశ్యమాన మణిధామ సముజ్జ్వల భాతి దోఁపగన్) 149

—ఈ మహాకవి లక్ష్యములవలన పదద్వయ విభాగము చేసిన అప్ప కవిగారి సిద్ధాంత మెగిరిపోయినది. 150

1. ము. పు. రత్నభూషలన్.

ఉయ్యెల ఎత్వమునకు అరణ్యపర్వము : (2-79)

చ. కలి దమయంతిఁ బాప సమకట్టి పొరింబొరిఁ బాయనోపఁ డా
లలనను దీర్ఘసౌహృద బలంబున నిట్టులు రెంటియందున
న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగత కారియయ్యె ను
య్యెలయునుబోలె నూరకయ యెంతయుఁబొద్దు వినిశ్చితాత్ముఁడై. 151

పయ్యెదకు యయాతి చరిత్ర : (3-84)

సీ. వలఁబడ్డ జక్కవల్ వలె నున్న జిల్గు ప
య్యెదలోని గబ్బపాలిండ్లు మెఱయ... 152

కవుల షష్ఠము:

మ. పదముల్ దొట్రిలఁ గౌఁను దీఁగె చలియింపం గేశముల్ దూల ప
య్యెద వక్షోరుహపాలి జేరఁ కనుదోయిన్ బాష్పముల్ గ్రమ్మ (గ
ద్గదకంఠంబున వాక్యముల్ దడబడన్ దగ్దేహముం జొచ్చి యా
సుదతీరత్నముఁ గాంచె బాలుని మనశ్శోకానలజ్వాలునిన్) 153

—ఈ మహాకవుల లక్ష్యములచేత పదమధ్య యకారములకు తలకట్టు దక్క నెత్వము లేదను సిద్ధాంత మెగిరి పోయినది.

తాయెతులకు, తల్లి శరీర రక్ష కొఱకు చుట్టిన దండలని అర్థము చెప్పుట నన్ని విధములను జెడిపోయినది. అప్పకవిగారు వ్రాసిన లక్ష్యము "చంద్రభాను చరిత్ర" సీస పాదము (1-39)

"ఒక యింత యొరగిన సికమీది ముడి పువ్వు
చెత్తులు దొరయ తాయెతులు జుట్టి"

వ్రాసినారు, పువ్వుచెత్తు లనగా పుష్పమాలికలుగదా! తాయెతు లనగా తల్లి చుట్టిన పుష్ప మాలికలుగదా! యీ యర్థము సరసముగా నున్నదేమో సరసు లాలోచించ వచ్చును. 155

"దోలా భూషోత్తరీయాణి విన్నైత్వం నాస్తి మధ్యయ" ఇతి, కారికకు, డోల అనగా ఉయ్యాల, భూషా అనగ నగ, ఉత్తరీయ మనగా పయ్యద, ఇది యర్థము సుప్రసిద్ధి. భూషా శబ్దమునకు దండ లర్థమనుట యొకటి. తాయి

చుట్టిన యెతులనుట రెండు. తకార ద్విత్వము లేకపోవుట మూడు శంకలు సాధారణముగా గనుపించు చున్నవి. భూషలనగా నగల కర్థము. నగలనగా బంగారు, వెండి మొదలయిన వాటిచేత గుండ్రగాను, కోలగాను చేసిన వస్తువులు. ఆ వస్తువులలో శరీర రక్ష కొఱకు వృక్షాదుల వేళ్లు మొదలైనవి వేసి సికను, కంఠమందు, భుజముల, మొలను కట్టు (ట) లోక ప్రసిద్ధము. ఆ వస్తువులను తాయెదలని కొందఱు, తాయెతులని కొందరు తావేజులని కొందరు ననుట కలదు. తిమ్మ కవిసార్వభౌముడుగారు లక్షణ సార సంగ్రహమందు తాయెద అని వ్రాసినారు. పామరులు తావేజు లంటారు. అప్పకవిగారికి ఉయ్యాల మొదలయిన శబ్దములకు లేని పదద్వయ విభాగము సేయుటకు పొసగని అర్థము వ్రాసుటకు సూత్రములు దిద్దుటకు నింతసామర్థ్యము కలుగుటకు కారణ మాయనే గ్రంథాదియందు స్పష్టము చేసినారు. భగవంతులు స్వప్నమందు ప్రత్యక్షమగునప్పటి పద్యములు:— 156

క. కరములు రెంటను దాల్చిన
పరికరములు చూచి యతనిఁ బరమేశునిగా
బరికించి లేచి వలగొని
మురియుచు సాష్టాంగ దండము లొనర్చి వెసన్. 157

గీ. మోడ్పుకేలు ఫాలమున జేర్చుకొనియున్నఁ
గరుణ నతఁడు నన్ను గాంచి పలికె
నన్నెఱింగి వందనం బొనర్చితి వాత్మ
మెప్పుపుట్టె నీదు మెలకువకును. 158

ఉ. ఈ యువతుల్ రమాధరణు లేను పయోరుహపత్రనేత్రుఁడన్
నీయెడఁ గూర్మికల్గి ధరణీదివిజోత్తమ వచ్చినాద స్వ
శ్రేయస మబ్బు నీకు నిక సిద్ధము నన్నయ భక్తి యాంధ్రముం
జేయుము మా యనుగ్రహముచే కవు లచ్చెరువంది మెచ్చగన్. 159

క. వినియును గనియును నెఱుఁగని
ఘన భక్తిం దెలుఁగు సేయఁగా నెట్లగు నా

కనవలదు దాని లక్షణ
మును నీకది కల్గు చందమును విను మింకన్
(అ. క, పీఠి. 38-41) 160

క. ఇల నెనుబదిరెం డార్యులు
గలిగి పరిచ్ఛేద పంచకంబునఁ దగు నీ
విలసిత పక్కి మతంగా
చల విప్రుని వలన నీదు సదనము చేరున్. 161

క. మును నారాయణ ధీరుఁడు
దనకు సహాయుఁడుగ సంస్కృతము వాగనుశా
సనుఁడు రచియించె దానిం
దెనిఁగింపఁగ నీకుఁదోడు నేనిపు డగుదున్.
(అ. క. పీఠి. 52-58) 162

క. తాతనయు నూత్న దండియు
నీ తెనుఁగుల లక్షణం బొకించుక యైనన్
జేతః ప్రౌఢిమ చెప్పిరి
క్ష్మాతలమున దీని తెలుఁగు గావవి యెల్లన్. 163

గీ, ఆంధ్ర భాషా మహాకాననాంతరమున
సంతసంబున శబ్దాపశబ్దసరణు
లెఱుఁగ నేరక మది సంశయించు తెలుఁగు
కవులు సుపథంబు లిందును గాంతు రింను
(అ. క. పీఠి 59-60) 164

అని భగవంతులే చెప్పినారని అప్పకవిగారు చెప్పినారు. భగవద్గీత లెటువంటివో, అప్పకవి గీతలు నటువలె సకలజనములకు తోచగలందులకు చెప్పుకొన్నారు. భగవదప్పకవు లిద్దఱు నేకమై రచించిన గ్రంథమందు నిటువంటి సిద్ధాంతములు బహూలములు గలవు. అక్కడక్కడ ప్రసక్తమైనపుడు వ్రాసుతాము. 165

అహోబల పండితులవారు ఉయ్యాల, పయ్యెదకు అధర్వణ కారికే ప్రధానము చేసి యకారములకు ఏత్వము లేదన్నారు. కాని తలకట్టుగలదని పరిశీలించినారు కారు. అప్పకవిగారికి నన్నయభట్టు గారి కారికలు ప్రధానము. అహోబల పండితులవారికి నన్నయభట్టుగారివి, అధర్వణాచార్యుల వారివి రెండును ప్రధానము. "డోలా భూషోత్తరీయాణి" అను అధర్వణాచార్యులవారి కారిక నెఱింగితే, ఆ కారికను తెనిగించిన ముద్దరాజు రామన్నగారి నప్పకవిగా రాక్షేపించరు. అంత కష్టపడి లేని పదద్వయ విభాగమును చెయ్యరు. 166

ఇంచుకంత సంస్కృత మందు నించుకంత యాంధ్ర మందు తెలిసీ తెలియని పండితంమన్యులు నన్నయ భట్టుగారి సూత్రముల ననుసరించిన ప్రయోగములే సాధువులుగాని, సూత్రముల ననుసరించనివి అసాధువు లంటారు. 167

పదాది యకారము లేదాయెను. పదాది వకారముకు వోష్ఠ్య శబ్దమందు నోత్వ ముండెను. పూంచెన్–దీర్ఘమందు పూర్ణ బిందు వుండెను. 36 వర్ణములే కాకుండగా మఱియును గలిగి యుండెను. 168

ఇటువలెనే సూత్ర మొకరీతినుంటే, మహాకవి ప్రయోగము లోకరీతి నున్నవి బహుళములు గలవు. ముందు ప్రసక్తమైనచోట వ్రాసుతాము. 169

ఆంధ్ర వ్యాకరణ మందేకాదు, పాణినీయ వ్యాకరణమందును కొన్ని సూత్రములు ప్రవర్తించవు. అంత మాత్రమున వారి మహత్త్వమునకు లోపము రాదు. 170

సంస్కృతాంధ్ర వర్ణ నిర్ణయము సేయుటకునై యిదివరకే గ్రంథ విస్తరమైనందున (ఇక) ప్రాస నిర్ణయమును చేయుచున్నాము. 171

## -: ప్రాసములు :-

1. ఉభయ ప్రాసము :—

గీ. శసలు నొకదాని కొకటి బొల్పెసఁగు, నటుల
నణలు రెండుఁ బ్రాసంబులై దనరుచుండు
సత్కవీశ్వర కావ్యాలిఁ జంద్రమౌళి
పృథు దయాపాంగ! శ్రీ కుక్కుటేశ లింగ! 172

లక్ష్యము, హరిశ్చంద్రోపాఖ్యానము: (1-129)

ఉ. కౌశిక మౌనివర్య! కడఁకన్ నను ధన్యుని జేయఁగోరి వేం
చేసితివే, గృతార్థమతి చెందితి సాంగమహాధ్వరక్రియా
కౌశల పుణ్యసంపదలు గాంచితి మించితి రాజకోటిలో
వాసికినెక్కి మీకుఁదగు వాంఛితి సిద్ధియు వేడుఁ డిచ్చెదన్. 173

అందే: (1-162)

శా. కాశాకాశధునీ తరంగచయ సీకాశద్యుతిం దట్టమై
కాశం బొందఁగఁ జక్కఁగా సకల దిగ్భాగంబుల న్మన్మథుం
దేసెన్ పాంథజనవ్రజంబులపయి న్నేపార లీలాధను
ర్వైశారద్యము నివ్వటిల్ల ప్రసవాస్త్ర శ్రేణులన్ బెల్లుగాన్. 174

పద్మపురాణము :

ఉ. ఆ శతమన్యువైభవుఁ డహర్పతితేజుఁడు చంద్రచంద్రికా
కాశనమానకీర్తి యగు గౌరన మల్లన మంత్రి దిక్కులన్
వాసికినెక్కి భక్తి ననివారణమై గుడికట్టి గట్టురా
మేశుఁ బ్రతిష్ఠచేసె నుతికెక్కఁగ నా మొలగూరి వాకిటన్. 175

అప్పన్న పరమ భాగవత చరిత్ర :

క. ఆశీర్వదించి శుకుఁ డుచి
తాసీనుం డగుచు రాజు నంద నునిచి యా
వేశకృపామతి శాప
క్లేశ విషాదాత్ముఁడగుచుఁ గృత నిశ్చయుఁడై. 176

భాస్కర రామాయణము: (యుద్ధ. 1447)

ఉ. వ్రేసియుఁ జీరియుం బొడిచి వ్రేసియు గ్రుచ్చియు చించి నొంచి బి
ట్టేసియుఁ గూల్చియుం బగుల నెమ్ములు రాల్చియు వ్రచ్చి నుగ్గుగాఁ
జేసియుఁ గంతము ల్దునిమి చిందరవందరగాఁగ మోదినన్
గీశులు భీతినొంది తలకింపుచు రాఘవు మర్వ సొచ్చినన్. 177

చివర (పాదమున) అఖండయతి.

కృష్ణరాయల ఆముక్త మాల్యద: (2-65)

గీ. అట్టి వేసవి బెడిదంపు వెట్టకతన
హస్తము చెమర్చి సారెకు లస్తకంబు
దునికిలంగఁబోవ సవరింప వశముకాక
పుష్పబాణుని చెఱకువి ల్పుడమిఁ బడియె. 178

తిక్కనగారి ఉత్తర రామాయణము: (6-11)

క. తా నొౘగున నున్న కుం
డై శంకింపక (కదంగి యాతం డింతల్
చేసెగదె లేడి తమి పులి
మీసలు నుయ్యాల లూగి మెయిమెయిఁ బోవన్) 179

స్త్రీ పర్వము: (2-57)

క. ఆ సభ నమ్మెయి నీ దు
శ్శాసనుఁ దప్పొందు పుత్రసతిఁ గ్రూరాత్మం
డై శంకలేక పెద్దయు
గాసిం బెట్టంగఁ జూచి కలగిన మదితోన్. 180

రంగరాట్ఛందంబునందు "అధర్వణ చ్ఛందము":

క. తొలుత శకారంబులు తిగ
గలిగి సకార మొకటైనఁ గాక సకార
మ్ములు తిగ శకార మొక్కటి
కలిగిన శషాసమంద్రదు కంజదళాక్షా? 181

అని మూడు వర్ణములు చెప్పినారు. కాని ఆ నియమము లేదు. (పయి)
హరిశ్చంద్రోపాఖ్యాన లక్ష్యమున ౨-౨ వర్ణము లున్నవి :— 182

రంగరాట్ఛందము: (1-102)

క. వసునగ సమ ధీరుండై
పొసగిన యానందరంగ భూపతిసభ నిం
పెసఁగెను తారల లోపల
శశిభాసిలురీతి సకల జనులు నుతింపన్. 183

శసలకు ప్రాసములు మహాకవి ప్రయోగము లనేకము లుండగా అప్పకవి "ఆంధ్ర శబ్ద చింతామణి" (2-259) యందు:—

సీ. వికృతి పదాదిని వెలయు నాఱవ హల్లు
మొదలి విభక్తి పైఁ గదిసెనేని
యరయఁ దృతీయోష్మమగు శౌరి సీరలు
దాచిఁ గోప స్త్రీల నేఁచె ననఁగ
ప్రథమోష్మ వర్ణంబు పరికింప తద్భవా
ద్యంధ్ర దేశోక్తుల యందు లేదు
సింగంబు, సింగిణి, సెవమును, సెలగోల
పీసెదు పసిగొనఁ జేసి రనఁగ

భీష్మ సన్నుతః యివి తృతీయోష్మలిపులు
గాని ప్రథమోష్మ వర్ణము ల్గావు, దీని
దెలియక రచించు కృతులు ధాత్రీతలమును
బ్రాస భంగంబులై నగుబాటు చెందు. 184

అని చెప్పినారు. మహాకవి ప్రయోగములు పరిశీలించనందున స్వపాండిత్యమునకు నగుబాటనుకోక, శసలు ప్రాసలుగల కృతులు నగుబాటనుట గొప్ప సామర్థ్య మగును.

(ఇక) న ణ లకు లక్ష్యములు

రుక్మాంగద చరిత్రము: (4–43)

ఉ. ఏనుఁగు నెక్కి భేరి మొఱయించుచు నిస్సహణాది [1]భూరిని
స్నాణము లుల్లసిల్ల జలజాప్త కులేంద్రుని యాజ్ఞ వీథులన్
మానుగఁ జాటువాక్యములు మానవనాయకుఁ డాలకించి బి
ట్టూనిన భీతిఁ గేల్వదలి యుగ్మలి కౌఁగిలి వాని గ్రక్కునన్ 186

రెండవ చరణమందు నఖండయతి

1. '...భేరిని, స్నానము లుల్లసిల్ల జలజాతహితేందు విశాల వీథులన్...'

పారిజాతాపహరణము: (4-9)

మ. విను మింతుల్ తిలకంబు చంపకము గ్రోవిన్ సిందువారంబుఁ బ్రేం
కణమున్ మామిడి గోగు పొన్నపొగడన్ గంకేలి నూహించి గ
న్గొన మోంమెత్తగఁ, గౌఁగిలించుకొన, మూర్కొ౯ఁ, జాడ, జేనంట, బ
ల్కఁ, నగం, గల్లుమియంగఁ, దన్ననునుచున్ గల్పాగమయ్యె విరుల్.187

ఇందులో (మూడవ చరణమందు) "మూర్కొ౯న" నకారలోపమై, (పూర్వాచ్చునకు) దీర్ఘము వచ్చినది. ప్రేంకణపదము తెలుగు. శ్యామా, కారంభా ప్రియంగు వృక్షము. పేరుగాన రేఫవచ్చిన ణత్వముగాదు. 'ప్రేంకన' మని వాడుక లేదు. 188

శ్రీనాధుని కాశీఖండము: (7-20)

సీ. కుదియించునది నెట్టుకొని యింద్రియవ్యాప్తి
మనసు చాంచల్యంబు మాన్పునదియు
మదిలోన మోక్షకామము వీడుకొనునది
ప్రాయంగ నిడునది ప్రాణభయము
వ్రతదాన ధర్మ సంరక్షణార్థంబుగాఁ
గావించునది యాత్మకాయరక్ష
తత్కాల దేహయాత్రా మాత్రమునకుఁగా
సమకూర్చునది ధాన్య సంగ్రహంబు

నణచునది దంభ ముజ్జగించునది యీర్ష్య
యుడుగునది రాగలోభ గర్వోదయముల
శాంతి దాంతి తితీక్షా నృశంస్య సత్య
నిరతుఁడగునది కాశిలో నిలుచు నరుఁడు 189

— నడచుట — డకారమన్నారు. ణత్వమునకు ప్రయోగమున్నది. 190

శ్రీనాథుని కాశీఖండము: (2-150)

క. త్రినయనుని రాణివాసము
నణిమాద్యైశ్వర్య వితరణామరతరువున్
మణికర్ణిక ముక్తి వధూ
మణికర్ణికఁ దలఁచుఁ దపసి మానసవీథిన్. 191

నణలకు సాధారణముగా ప్రాసము చెల్లుచుండగా, అప్పకవి మొదలయిన (వారి) మతములు వేరువేరై యున్నవి. 192

కాకునూరి అప్పకవి 'ఆంధ్రశబ్ద చింతామణి': (3-328)

గీ. 'ధాత్రిఁ బాణినీయ సూత్రములను దృతీ
యోష్మమును ద్రుతంబు నొక్కచోట
క్రమత షాక్షరము ణకారమునై ప్రాస
ములకు నుభయసంజ్ఞ బొసఁగ రెండు' 193

అనగా—నకారమునకు వచ్చిన ణత్వము, సకారమునకు వచ్చిన షత్వము నణలకున్ను, సషలకున్ను క్రమముగా చెల్లునని అప్పకవిగారి తాత్పర్యము, 194

రంగరాట్ఛందము (3-35)

గీ. "ప్రాదియైన నకార శబ్దములు మూఁటి
కొక నకారంబు, రేఫ సంయుక్తమగు న
కార మొకటుండి మూఁడు ణకారములును
బ్రాసములు చెందు నానందరంగధీర! 195

అనంతుని ఛందము :— (1-48)

గీ. ప్రాదియైయన శబ్దంబు ప్రాణమగుట,
బరగ నణలకు వేర్వేఱఁ బ్రాసమయ్యె
(క్షోణిధరుఁ డెత్తె నేనుఁగు ప్రాణమనఁగ
దానవారాతి వ్రేతల ప్రాణమనఁగ) 196

ఇందులో "ప్రాణ" పదముకేగాని, మిగిలిన పదములకు చెల్లవనిన్ని, మూఁడు వర్ణము లనిన్ని — యీ భేదములు స్పష్టమై యున్నవి. 197

మధుసేనము :

క. పో నుద్యోగము చేసిన
ప్రాణంబా ! యింక నీకు పాథేయంబా
మానిని మందస్మిత మధు
రానన చంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్. 198

—ఇటువంటివి ప్రాణపదములున్నవి మాత్రమే లక్ష్యములు వ్రాసినారు. వారివారిమతానుసారముగా చెప్పినారేకాని, పూర్వ మహాకవి లక్ష్యములు పరిశీలించలేదు. శ్రీనాథాది మహాకవుల ప్రయోగము లేమనికొనిరో తెలియదు. అప్పకవిగారు కాశీఖండమందలి 'క. త్రిణయనుని రాణివాసము' (2-150) అను పద్యము (లక్ష్యము) వ్రాసినారు. త్రిశబ్దము రేఫయుక్తమయినది గనుక 'నయన' శబ్దమును (ఆది నకారముకు) ణత్వమనుకున్నారు. త్రినయన, త్రినేత్ర పదములకు వికల్పముననైనా శాబ్దికులు ణత్వము లేదన్నారు. ణత్వము ఏకపదమందున్నది, 199

'రషాభ్యాం నోణ స్సమానపదే'

ఈ సూత్రముచేత కృపణః, భ్రూణః, రమణః, వారణః, భూషణం. దూషణం—ఇత్యాది (ఏర్పడును). భిన్నపదములైనను సంజ్ఞయందు ణత్వం నిత్యం.

'పూర్వపదాత్సంజ్ఞాయా మగః'

నారాయణః, రామాయణం, చాంద్రాయణం (వ్రతవిశేషం), అగః కిం? ఋగయనం. అసంజ్ఞయందు ణత్వము రాదు. రఘునాథః, త్రినేత్రః, త్రినయనః, రామనామ ఇత్యాది.

అసంజ్ఞయందు, సంజ్ఞయందు నిత్యముగా ణత్వమువచ్చెడు సూత్రము :— 'ప్రనిరంతర శ్శరేక్షు ప్లక్షామ్ర కార్ష్య ఖదిర పీయూక్షాభ్యో- సంజ్ఞాయా మపి'

ప్రవణం. నిర్వణః—వనాన్నిర్గత ఇత్యర్థః, వనస్యాంతః అంతర్వణం, శరాణాం వనం శరవణం, ఇక్షూనాం వనం ఇక్షువణం, ప్లక్షవణం, ఆమ్రవణం, కార్ష్యవణం, ఖదిరవణం, పీయూక్షావణం.

కొన్నిచోట్ల వన శబ్దము (నకారమునకు) ణత్వము వికల్పము.

'విభాషౌషధి వనస్పతిభ్యః'

దూర్వావణం-దూర్వావనం. శిరీషవణం-శిరీషవనం,

కొన్నిచోట్లరాదు. దేవదారువనం, సిందువారవనం. పానశబ్దమునకు సమాసము చేత దేశమర్థమైతోచునపుడు ణత్వము నిత్యము.

'పానం దేశే.'

సురాపాణాః ప్రాగ్దేశీయాః. క్షీరపాణాః ఉశీనరదేశీయాః.

పానశబ్దముకు పానపాత్రము, పానము సేయుట అర్థమగునపుడు ణత్వం వికల్పము. వీరపాణం-వీరపానం-త్రాగుట-గిన్నెయును. గిరి, చక్ర, నితంబ—ఈ శబ్దములందు వికల్పము. గిరినదీ—గిరిణదీ. చక్రనితంబా-చక్రణితంబా. ప్రాణి వహించియున్నపుడు వాహన శబ్దమునకు నిత్యం. ఇక్షువాహణం. ఉపసర్గలకు పరమైయున్న ధామ నకారముకు నిత్యం. ప్రణయం, పరిణయం, నిర్ణయం. కొన్నిచోట్ల ఉపసర్గకు పరమైయున్న 'ని' అను ఉపసర్గకు నిత్యము. ప్రణిపాతః, ప్రణిధానం. కొన్నిచోట్ల వికల్పము. ప్రణిభవనం. ప్రనిభవనం. 200

ఈ ప్రకారముగా (ణత్వము) నిత్యమైన పదములు, వికల్పమైన పదములు మరియును గలవు. త్రినయన, త్రినేత్ర పదములు వికల్పముననైనా ణత్వములు (గలవి) కావు. అప్పకవిగారు ణత్వమని యేయాకరమునుబట్టి వ్రాసిరో తెలియదు. శాబ్దికులు ణత్వ మంగీకరించలేదు. 201

'త్రినయన' పదము ణత్వము (గలది) అగుగాక, ఆ కాశీఖండమందే సీస పద్యమున్ను, రుక్మాంగద చరిత్రము (నందలి) ఉత్పలమాలయున్ను, పారిజాతాపహరణము (నందలి) మత్తేభమున్ను (చూడవలసినది.) ఈ గ్రంథ

ముల (నుండి ఇతరత్రయు) లక్ష్యములు వ్రాసిరి. ఈ పద్యముల నుదాహరించక పోవుటకు కారణము తెలియదు. 202

(ఇక) శబ్దశాస్త్రమున సకారము చెడిన షకారము సకార, షకారములకు ప్రాసమగును. లక్ష్యములు :—

త్రైశంకోపాఖ్యానము :

క. ఝుష కేతు ద్విషునకు కి
ల్బిష పర్వత వృషున కమృత విషనిధి జామా
త్రిషునకు ఋషి పూజితునకు
విషమాక్షున కింద్రముఖ దివిజ పక్షునకున్. 203

సాంబవిలాసము :

క. వసుధా కలత్రునకు సా
రసదలనేత్రునకు మరుదరాతి మదతమో
విసరాంబుజ మిత్రునకున్
విషమ శిలీముఖ సహస్ర నిభ గాత్రునకున్. 204

ఇది "ఉభయప్రాస" మంటారు. 205

## 2. ఋప్రాసము :

లక్షణము :—రేఫ ఋకారములకు ప్రాసమగును.

తిమ్మకవిగారి లక్షణ సార సంగ్రహము: (2-68) 206

క. స్వరగణ మయ్యు ఋకారము
పరికింపఁగ రేఫతోడఁ బ్రాసం బగుచున్
గర మొప్పు వ్రటసుడి య
క్కరమును బ్రాసమగు హల్లుగదిసి మహేశా! 207

లక్ష్యములు :—అరణ్య పర్వము: (3-104)

క. ఆ ఋషికుమారు గట్టిన
చీరలు మృదులములు కడువిచిత్రములు మనో
హారము లుడని బృహత్కటి
భారమునం దొక్క కనక పట్టము వ్రేలున్. 208

(మొదటి పాదమున) "కుమారుడు" అని "డు" వర్ణము లేదు గాన, నసాధువనుకొని "పుత్రుఁడు" అని కొన్ని పుస్తకము లందున్నది. డు వర్ణము లేకుండుటకు చతుర్థాశ్వాసమందు తెలియపరచు తున్నాము. 209

లాక్షణికు లందఱు (లక్ష్యముగా) పై పద్యమే వ్రాసినారు. (కాని) ఋషి పదము రేఫమున్ను గలదు. ద్విరూప కోశమందు—ఋషిః, రుషిః అని యున్నది.

"విద్యా విదగ్ధమతయః రుషయః ప్రబుద్ధాః"

అని "భాకందుని" ప్రయోగమని గురుబాల(ప్రబోధిక) ఋషిః = మునీశ్వరుడు. రుషిః = మునీశ్వరుడున్ను, దిగంబరుడున్ను, వేదమందున్ను, జ్ఞాన వృద్ధునియందున్ను, ఋషి మతప్రవర్తకుని యందున్ను అర్థమూ గల దని "శబ్దార్థ కల్పతరు"వందున్నది. కావున నీ పద్యముచేత చెల్లదు. 210

హరిశ్చంద్రోపాఖ్యానము (4-230)

ఉ. నీ ఋణ మెల్లఁ దీర్చి యవనీపతిఁ గింకరుఁగాగ నేలుదున్
కోరుము నీదు విత్తమునకు న్మితమెయ్యది, యన్న, సమ్మదం
బారగ వల్కె మౌనినుతుఁ డంత్యజుఁ గన్గొని యెంతవట్టు నీ
పేరుగఁజేసి నానుదికి ప్రీతియొనర్పుము నీవు దాతవై. 211

—ఈ లక్ష్యము చేతచెల్లును.

కాకునూరి అప్పకవిగారు 'ఆంధ్రశబ్ద చింతామణి'(2-72)యందు—

సీ. ఋష్యమూకాద్రియు ఋశ్యశృంగుండును
ఋక్ష మృగేంద్రుడు ఋక్షపదము
ఋతము ఋత్విక్కు నైఋతి ఋతుషట్కము
ఋతుపర్ణ భూపతి ఋతుమతియును
ఋషభవాహుండును ఋషియు ఋగ్వేదంబు
ఋభురాజు ఋణమును ఋద్ధి ఋజువు
నను నీపదంబుల కాదివర్ణంబులు
సప్తమ స్వరమునై జగతిఁ బరఁగుఁ

(గృష్ణ వృత్తాంతకా హృషీకేశ మదన
జనక పృథ్వీకుమార భంజన యటంచు
హల్లులందును వట్టువ లమరియుండు
సంస్కృతంబున యదువంశ సార్వభౌమః)

అని నిశ్చయించినారు కాని, ఇందులో ఋషిః = రుషిః, ఋశ్యః = రిశ్యః అని రెండును గలవు. మఱియునుగలవు. ఋష్టిః = రిష్టిః = ఖడ్గమును, సమృద్ధియును, ఋక్థం = రిక్థం = సొమ్ము. 214

కొందఱు లాక్షణికులు ఋత్వముగల హల్లులు మూడు. లేని హల్లు ఒకటి, లేనివి మూడు, కలది ఒకటి అని చెప్పినారు. కాని, 215

ఉద్యోగపర్వము : (3-351)

క. ఈ కృష్ణుని సారథ్యము
నా కృష్ణుని గాండివంబునై దోఁపక ము
న్నికొలఁది చక్కఁబడి నీ
వీ కురువంశంబు నిలుపు మిభపురనాథా! 216

అని యున్నది గావున తన్నియమము లేదు. 217

## 3. సంయుతాసంయుతప్రాసము :

ఇది ఋప్రాసమంటారు 218

లక్షణము : క్రాముడి గల హల్లులకు, వట్రసుడిగల హల్లులకు ప్రాస మగును. 219

లక్ష్యములు-ఆదిపర్వము: (2–175)

ఉ. క్షత్రియ వంశ్యులై ధరణి గానఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్య శూద్రులనఁగాఁ దగు నాలుగు జాతులన్ స్వచా
రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితుఁ గాచిన యట్ల రామ మాం
ధాతృ రఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబునన్. 220

శాంతి పర్వము : (4-374)

క. శత్రుజనులఁ జెఱచుటయును
మిత్రులఁ బ్రతికించుటయును మిన్నక యాస
త్పాత్రత సంపదయనఁగ వి
ధాతృఁడు చెందించుఁజూవె తఱితోఁ బురుషున్ 221

క్రాముడి గల హల్లులు లేని హల్లులు ప్రాసమగును. 222

లక్ష్యములు – భాస్కర రామాయణము :

క. నాకింకను దిక్కెవ్వరు
శోకాంబుధి నెట్లు గడతు శూరతమై భూ
లోకాధిపసుతు ననిలో
నే క్రియ నిర్జించు వాఁడ నెట్టిది వెఱవో? 223

నాచన సోముని హరివంశము :

శా. నాతో మార్కొనలేరు నిర్జరపురీ నాగేంద్ర బృందారకా
రాతుల్ మున్నుగ దేవసంఘములు ఘోరం ధీర సాంగ్రామికం
డీ త్రైలోక్యమునందు గల్గఁడు రణం బెచ్చోట లేకుండఁగా
చేతుల్ వేయు వృథాభరంబగుచు వచ్చెన్ దేవ యీ మేనికిన్. 224

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము :

క. భూపతివై యటఁ బుట్టిన
నీ ప్రెగడల మగుట మాకు నిక్కము వాంఛా
రూపం బని వలుక తదా
లాపం బా పక్షి సముపలాలన జేసెన్. 225

దేవీ విజయము :

గీ. వాక్త్రినేత్రాంగనా శచీ శక్తు లధిక
సంభ్రమంబున కుంభ నికుంభ దైత్య
హంత్రిఁ బూజింపుదురు త్రయీ మంత్రములను
(స్తోత్రములుచేసి మంగళారాత్రిక లిడి.) 226

ఇది సంయుతా సంయుత ప్రాసమంటారు. 227

(అయితే) కాకునూరి అప్పకవిగారు 'ఆంధ్రశబ్ద చింతామణి'యందు :

గీ. రలలు తమక్రింద జడ్డలై గ్రాలు వ్రాలు
ప్రాసవర్ణంబులై వానిఁ బాసియైన
గూడియైననుఁ బెఱయడుగులను నిలుచు
నవని సంయుతాసంయుతప్రాస మనఁగ. 228

గీ. పాఁడి ద్రచ్చఁగనిమ్ము నా తండ్రి కృష్ణ
వేఁడుకొనియెద నందాక పండ్లు దినుము
దుండగపు చేష్టలును నోటి గాంద్రతనము
మెండుగాఁజొచ్చె నీకు నైదేండ్ల కనఁగ. (3-314, 315) 229

—అని లక్షణము చెప్పినారు. ఇందులో, 'దుండ-గాంద్ర' - ఇది మాత్రము బాగున్నది. 'వేఁడు - పండ్లు' ఇది మంచిదిగాదు. 'పాడి - తంద్రి' 'పాండి' అని పదమునందు బిందువులేదు. తండ్రి బిందువున్నది. ప్రాస మెక్కడ నుండదు. అర్ధబిందు ప్రాసముకు భారతాది లక్ష్యము లనేకములు. పనిలేనిది వ్రాసిరి. అర్ధబిందు వున్నదానికి, లేనిదానికి సాధారణముగా ప్రాస ములు గలవు. 'మెండు - ఏండ్లు'. ఎక్కడను లకారమున్నదానికి, లేనిదానికి ప్రాసములేదు. 'మెండు' బిందువు. 'ఏఁడ్లు' అర్ధబిందువు. బిందువుకు నర్ధ బిందువుకు (ప్రాసము) లేదు. రెండుపొరపాటులు. క్లిష్టపదమందున్న ళకారమును లకార మనుకొని భ్రాంతత్వమొంది యీ లక్ష్యము వ్రాసినారు. ఇది యనగా 230

లకార శ్లిష్టమునకు రాఘవ పాండవీయము: (1 - 3)

శా. లోకత్రాణరతిం దదాదిమ మహీలోక ప్రవేశోత్క భా
షాక్లిష్ట ప్రథమ ద్వితీయ పదగుంఙ న్మంజు మంజీర గ
ర్జా కల్పామల రామభారత కథాసర్గంబులన్ మించు వా
ల్మీకి వ్యాసులఁ గొల్చెదన్ దదుభయ శ్లేషార్థ సంసిద్ధికిన్. 231

—క్లృప్త పదమందున్నది, శుక్ల - విక్లబ - శ్లేషాది పదములందున్న లకారము వంటిది గాదు. లాక్షణికులందఱు—

గీ. కబ్బముల క్లృప్తియను స్వరల్కార మితర
హల్లుతోఁ బ్రాసముల గూర్పఁజెల్లు...

నని లక్షణముచెప్పి, లక్ష్యమీ పద్యమే వ్రాసినారు. అప్పకవిగారు మాత్రమే లకార మన్నారు. 'క్లృప్తిపదము లకారమేమో ? ఆ లాక్షణికులకే భ్రాంతతఁ మనుకోరాదా ?'- అంటే,

చేమకూరవారి విజయ విలాసము (1 — 43)

మ. ఒక భూమీదివిజుండు చోరహృత ధేనూత్తంసుఁడై వేఁడుకొం
టకుఁ దా ధర్మజు కేళిమందిరము దండంబోయె కోదండ సా
యకముల్దెచ్చుట, పూర్వక్లృప్తసమయ న్యాయానుకూలంబుగా
నొకయే డుర్విప్రదక్షిణం బరుగు నుద్యోగంబు వాటిల్లఁగన్.

'క్లృ' లకారమైతే 'ర్వ' గురువుకావలె. ఛందోభంగమగును.

కావ్యప్రకాశిక :

కర్పూరధూళిధవలద్యుతిపూరధౌత
దిఙ్మండలే శిశిరరోచిషి తస్య యూనః
లీలా శిరాంశుక నివేశ విశేష క్లృప్తి
వ్యక్తస్తనోన్నతి రభూ...నా వనేసా

...'విశేష' యనుచోట షకారము గురువుకావలె.

శ్రీనాథుని కాశీఖండము : (5-281)

సీ. ఘృతపయోరాశి సంక్లృప్తావధికమైన
ఛంచత్కుశ ద్వీప జగతిఁ జేరి—

—లకారమైతే యతిభంగము కావలె. క్రాముడిగల హల్లుకు దాపలి వర్ణము లఘువున్ను నగుటవలన, క్రాముడిగల వర్ణము లేని వర్ణము ప్రాస మగును. స్వరమైనప్పటికిన్ని ఋకారము మాత్రము వ్యంజనమైన రేఫముతో యతి ప్రాసములు చెల్లును. స్వరమైన ఌ కారమును వ్యంజనమైన లకార మనుకొనుట మాత్రమే భ్రాంతత్వముగాదు. బిందువున్న వర్ణముకు లేని వర్ణ ముకు ప్రాసము గూర్చుట—ఇది శుద్ధ ఛాందసత్వము. ఈ గ్రంథమందు నెవరును శంకలు లేకుండగా భగవంతుడుగూడా తమకు సహాయుడై చెప్పినట్లు మొదటనే (అప్పకవిగారు) చెప్పినారు. మరియును (తమ 'అం. శ. చి. యందు) 233

క. ఇది చదివిన పిమ్మట మరి
యెదియేనియుఁ జదువుబుద్ధి యేలా పొడమున్?
పదపడి గ్రంథము లన్నియు
వెదకి వెదకి సారమెల్ల వివరింపంగన్? 234

గీ. పర్వతము లెల్ల నొక్క దర్పణమునందు
చూపడు తెలుంగునను కవిత్వోపయోగ
లక్షణము లన్నియును సరలంబుగాగ
నెఱుఁగఁబడు నిందు తెలియ నూహించిరేని. 235

గీ. సౌరభాషకు శబ్దశాస్త్రంబు పగిది
తెనుఁగునకు నవశ్యంబిది దీనిఁ జదివి
జెప్పిన ప్రబంధము జగత్ప్రసిద్ధి నొందు
నుఱక రచియించినది యప్రయోజకమగు. (1.7-9) 236

—(అని) తమ మహిమను, తమ గ్రంథమహిమను విశేషముగా (అప్పకవిగారు) ప్రకటము జేసినారు. 237

## 4 ప్రాసమైత్రి ప్రాసము

లక్షణము: క్ష కారము దాపల బిందువుగలిగి ద్విత్వ మకారముకు ప్రాసమగును. 238

లక్ష్యములు: ఆది పర్వము : (1–77)

ఉ. ఇమ్ముగ సర్వలోక జను లెవ్వనియేని ముఖామృతాశుబిం
బమ్మున నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణరం
ధ్రమ్మను నంజలిం ధవిలి ద్రావుదురట్టి మునీంద్ర లోక వం
ద్యుం బరముం బరాశర సుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్ 239

పిన వీరభద్రుని జైమినీ భారతము : (7–145)

ఉ. అమ్మఖవాజి పాండుతనయాధ్వర వాహ మెదిర్చి మోముమో
వం బసివెట్టి ఘోషిత రవంబున (వక్షముఁ బూర్వపత్తురా
గ్రంబున వ్రేయజేసి మది కంధము వట్టి విదల్పఁబో నమి
త్రంబయి కేలికిం గడఁగి దంతములన్ గళ మప్పళింపఁగన్.) 240

ఇది ప్రాసమైత్రి ప్రాస మంటారు.

(అయితే) కాకునూరి అప్పకవిగారి "ఆంధ్ర శబ్ద చింతామణి" (3–343) యందు— 241

గీ. గట్టి బిందువుమీది బకారమునకు
జమిలి మా ప్రాస మైత్రినాఁ బరగుచుండు
కమ్మతావులు వెరజల్లు నంబుజములు
శంబరారాతి చేతి వాలమ్ములనఁగ 242

(కాని) లక్షణ సార సంగ్రహమందు (2–78) :—

గీ. బమలు బిందు పూర్వకముగ, ప్రాసంబుల
నిలుపఁజెల్లు, ల శల కిల నభేద
మొదవుచుండుఁ గృతుల నుదురాజ కోటీర
దురితదూర! పీఠపుర విహార! 243

—అని తిమ్మకవి సార్వభౌముడు గారు చెప్పినారు. కావున బిందువు లేకపోతే జమిలి మా లేదు. కంమ్మ, ఇంమ్మ, అంమ్మ—ఈ మొదలైనవి బిందువులు గలవని తెలియ వలయును. 244

## 5 స్వవర్గజ ప్రాసము :

లక్షణము :—

గీ. వర్గు మొదటి వర్ణము మూఁడవదియునైన
వర్ణమును మఱియును రెండవదియునైన
వర్ణము చతుర్థ వర్ణంబు ప్రాసమగు స్వ
వర్గజ ప్రాసమన, రిపువర్గ శమన ! 245

ప్రథమ—తృతీయ వర్ణములకు లక్ష్యములు :

ఆది పర్వము (8-259) :—

చ. పెఱిలి సువర్ణ పర్వతము పెక్కు తెఱంగుల వయ్యునట్టు ల
ప్పుడు వివిధప్రకారముల భూరి శిఖావలి ఖాండవంబు న
ల్గడఁ గడుఁ బర్వఁగాఁ బెరసి కాల్పఁదొడంగె హుతాశనుండు చే
ట్పడఁగ వనంబులోని మృగపక్షి భుజంగమ భూతసంఘముల్. 246

విరాట పర్వము : (1-185)

ఉ. ఎండకు వానకోర్చి తన యిల్లు ప్రవాసపు చోటునాక నా
కొంటి నలంగితిన్ నిదురకుం దటి తప్పెను దప్పిపుట్టె నా
క్కుండును నెల్లరో యనఁగ కార్యముగల్గిన నేలనేలు నా
తం డొకచాయ జూపినను దత్పరతం బని సేయు టొప్పగున్. 247

—అచ్చు పుస్తకములందు 'నా, కొండు నలంగుదు' అని వ్రాసినారు. స్వవర్గజ ప్రాసముకు లక్ష్యము వ్రాసిన పద్యము (ఇది,) నాలుగు చరణములందు డకార ములే ఉంటే యీ పద్యము లక్ష్యము (గా) వ్రాయ పని లేదు, 248

ద్రోణపర్వము : (4-89)

క. అటుకులు తిన్నట్లగునే
కడుపున కుట్లెత్తినపుడు కడు బఱచితి నా
దొడ లెఱుఁగక పాండుసుతుల
నుడిగి నుడుగ వలసె నిప్పు డొక సాత్యకిచేన్. 249

(ఇక) ద్వితీయ చతుర్థ వర్ణములకు లక్ష్యములు :

ఆదిపర్వము : (2-201)

ఉ. కాదన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁ జేసిచేసి నృపపుంగవ ! నీవు ననేక భూసురా
సాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
కోదర సంహతిన్ హుతవహోగ్ర సమగ్ర శిఖాచయంబులన్. 250

విరాటపర్వము : (1-301)

క. ముదమొదవ రమ్యహర్మ్యము
మదినిలుపున నిష్టసఖులతోడ విహారా
స్పదమగు నెలవున మెలఁగెడు
సుదేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్. 251

ద్రోణపర్వము : (5-170)

క. వింధ్యాద్రిఁ బోలు నాపతి
వింద్యుఁ డచలితోగ్రమూర్తి వెలయ నిలచి గ
ర్వాంధ్య మెదలఁగను దీప్తి
వంధ్యాస్త్రము లక్కుమారవరుపైఁ బఱపెన్. 252

అలసాని పెద్దకవి హరికథాసారము (ఆనందరంగరాట్ఛందము 3-66) :

క. ఆదేవోత్తముఁడు సుధాం
భోధి వటైకాగ్రిమ దలమున బాలుండై
చేదోయిచేత దక్షిణ
పాదముగొని నోటఁజేర్చి పకపకనగుచున్. 253

ఎఱ్ఱాప్రెగడ సంక్షేపరామాయణము :

క. ఆ దశరథసూనుండు ప
యోధి జలం బింకఁ జేసి యొకశరమునఁ గ్ర
వ్యాదవిభుఁ దునిమి సీతను
మోదంబునఁ జేకొనె సురపుంగవు లెన్నన్. 254

(అయితే) కొందఱు లాక్షణికులు

ఆదిపర్వము (1-70) నందలి ;

శా. ఏ డక్షోహిణు లెన్నఁ బాండవబలం బేకాదశాక్షోహిణుల్
రూఢిం గౌరవసైన్య మీ యుభయమున్ రోషాహితాన్యోన్యమై
(యీడన్బోవక పీఁకమైఁ బొడువఁగా నేపారు ఘోరాజి న
ల్లాడెన్ ధాత్రి శమంతపంచకమునం దష్టాదశాహంబులున్) 255

అంగర బసవయ్య ఇందుమతీ కల్యాణము నందలి ;

ఉ. బీదశచీవిభుండు దితిబిడ్డ లవార్యులు వారు పల్మరున్
బాదలు పెట్టఁగాఁ జెఱలువట్టఁగ నుండుట భారమంచు రం
భాది మరున్నివాసలసదప్సరసల్ చనుదెంచి వచ్చిరో
నా, దళపుల్ల పద్మవదనల్ విహరింపుదు రప్పురంబునన్. 256

కర్ణపర్వము (3-55) నందలి :

క. కాదేని బిరుసులాడక
సాదులమై వినయమొప్పఁ జని కురునాథుం
దేది పనిచినం జేసి ద
యాదృష్టి నతండు సూచు నట్లుండదగున్. 257

స్త్రీ పర్వము (2-40) నందలి :

క. విదురుఁడు తండ్రియుఁ దనకుం
బది వేల్విధములను జెప్పఁ బాటింపఁడు దు
ర్మదమునఁ దగియెడు బుద్ధులు
విది మూడిన మర్త్యుఁ డేల వినును హితోక్తుల్? 258

—అని యీ పద్యములందు, రూఢి, బీద, సాదు, విది—యీ పదములు తద్భవములని తద్భవప్రకరణమందు వ్రాసినారు.[1]

---

1. వీటిని తద్భవములందు వ్రాసినవాడు కూచిమంచి తిమ్మకవి. (చూ. లక్షణసార సంగ్రహము 1.60-64.)

అంతేకాని, ప్రాసప్రకరణమందు తృతీయ చతుర్థ వర్గములు, కూడదని వారి తాత్పర్యము. దిద్దశక్యముగాని లక్ష్యములు వ్రాసినాము గావున ప్రాసము లందు నుంచవలసిన వవును. 259

(ఇక) ద్వితీయ చతుర్ధ వర్ణములు ప్రాసములకు లక్ష్యములు :

అరణ్యపర్వము : (4-159)

ఉ. అంధక వృష్ణిభోజ కుకురాన్వయ భూపతులెల్ల సీదెసన్
బాంధవ సౌహృదప్రణయ భక్తివిశేషము లొప్ప నీ మనో
గ్రంథియడంగఁ జేయు నెసకంబునఁ బూనినవారు లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు నయంబు మెయి న్మన కుర్వి యిత్తురే ? 260

గంథిశబ్దము (నందు) ద్వితీయ వర్ణము

విరాటపర్వము : (1-833)

ఉ. బాంధవ శాస్త్రవాకలిత భావభవా భవపాశ బంధ సం
బంధి విరామ కామపరిపక్వ వివేక నిరూఢభక్తి హృ
ద్గ్రంథి విభేదనా పరమ కారుణికా పరిమాణదూర దుః
ఖేంధన పావకాయిత సమీక్షణ శైత్య మహాద్భుతాత్మకా ! 261

ద్రోణపర్వము (1-88)

క. సింధురము మహోద్రేక ను
దాంధంబై వచ్చునోజ నాచార్యునిపై
గంధవహసుతుఁడు గవయఁగ
మంథరగతి నెవ్వఁడాగు మనయోధులలోన్ ? 262

మంథర శబ్దము (నందు) ద్వితీయవర్ణము. మరియును బహులములుగలవు. 263

## 6. బిందుప్రాసము :-

లక్షణము : నకారము గలిపిన హల్లున్ను బిందువు దాపలగల హల్లున్ను ప్రాసమగును. 264

లక్ష్యములు : చేమకూరవారి సారంగధరచరిత్ర : (3-15)

క. కన్దోయి చల్లఁగా నిడు
కన్దోయి నృపాల లెస్సఁగా నిఁక నొక మా
టందఱ ముందఱ నీవని
చిందఱ వందఱల గుట్టు చిట్టాడంగన్. 265

ఆంధ్రలక్షణ చక్రవర్తి బమ్మెర పోతరాజుగారి దశమస్కంధము :
(పూర్వభాగము)

ఉ. కిన్కలు ముద్దుపల్కులును గెంపుగనుంగవ తీయమోవియున్
జంకెన దేరుచూపు లెకసక్కెములు న్నెలవంక బొమ్మలున్
గొంకక వీడనాడుటలు కూరిమియుంగల కాంతఁగూడుటల్
అంకిలిలేక జన్మఫలమబ్బుట కాదె కురంగలోచనా। 266

రంగరాట్ఛందము : (3-39)

గీ. రహినిఁ బ్రాసాక్షరాది వర్ణంబు గిలుక (పొల్లు)
నమరియుండిన ఫది బిందువగును, బిందు
వర్ణములఁజేరి ప్రాసమై వన్నె కెక్కు
సున్దరీ మోహనాంగ యానందరంగ. 267

అనంతుని ఛందము : (1-51)

గీ. పేర్చి పొల్లు నకారంబు బిందువగుట
మీఁదినున్న ధకారంబు నూది ప్రాస
బంధమగుఁ గృష్ణుఁ డుదయించిన న్ధరిత్రి
యంతయును నిరుపద్రవంబయ్యె ననఁగ. 268

అరణ్యపర్వము (3-113)

మత్త. అమ్మునీంద్రు నివాసశక్తిఁ దదంగ రాజ్యమునందు మే
ఘమ్ము లెల్లఁ గెలంకులం గడు గ్రమ్మి సర్వజన ప్రమో
దమ్ముగాఁ బ్రబలద్ బృహజ్జలధారలొప్పఁగ వృష్టిచే
సెం మహానదులుం మహాసరసీచయంబులు నిండఁగాన్. 269

ఇది బిందుప్రాస మన్నారు. 270

## ప్రాసభేద విమర్శ

కాకునూరి అప్పకవిగారు ఆంధ్రశబ్ద చింతామణియందు :

శా. సింగం బాకటితో గుహాంతరమునం జేడ్పాటు మైనొంది మా
తంగ స్ఫూర్జిత యూధ దర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతార నివాస ఖిన్నమతి యస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్. 271

(అని విరాటపర్వము నందలి (4-95) పద్యమందు సంధిగత ప్రాసముని వ్రాసి నారు. (మఱియు)

సీ. అర్ధబిందు సమాహ్వయము, పూర్ణబిందు, ఖం
డాఖండములు, సంయుతాక్షరంబు,
ధర సంయుతాసంయుతము రేఫయుత, లఘు
ద్విత్వ, వికల్పముల్, వెస నుభయము
ననునాసిక ప్రాసమును, ప్రాసమైత్రియుఁ,
ప్రాసవైరంబు, స్వవర్గజంబు,
ఋప్రాస, లఘు యకారప్రాసములు, నభే
దంబును, సంధిగతంబు ననఁగ

ఁబదియు నేడు దెఱంగులఁ బరిఢవిల్లు
ప్రాసములు పూర్వ సుకవిప్రబంధములను
గ్రమత లక్షణ లక్ష్యయుక్తంబుగాఁగ
దేటపఱచెద వాని నిశాటదమన ! 

(కా. ఆం. 3-298) 272

అవి 17 విధములు చెప్పినారు. వీటిలో ప్రాసమైత్రి, స్వవర్గజము, ఋప్రాసము— ఈ మూడున్ను భేదములు కనుపించుచున్నవి గాన గ్రాహ్యంబులు. ప్రాసవైర మని పేరుమాత్రమేకాని, యొక్కడనైనను లేనందుననున్ను, తమరు లక్ష్య మొకటైనా వ్రాయనందుననున్ను, పూర్వసుకవిప్రబంధములయందు నున్నవన్ని

చెప్పుటవలన నున్న- ఇంత సందర్భముగా రచించుటకు గగనారవింద, శశ విషాణ, వంధ్యాపుత్రుల వంటిదిగా నెంచి సంతోషించినాము. విశ్రమ ప్రకరణ మందును 'విశ్రమమైర' విశ్రమమని చెప్పవలసినదౌను. పరాకు నొందినారని తోచుచున్నది. (ఇక) సంయుతాసంయుత ప్రాసములో రేఫశ్లిష్టమునకు మహా కవి ప్రయోగములు గలవు. లకారశ్లిష్టములకు లేవు. ఉభయప్రాసమందు విషమపదము సషలకు రెంటి (కిని ప్రయోగ) ములున్నవి. చెప్పవలసినదౌను. నణలకును సాధారణముగా నున్నవాటికి నకారముకు వచ్చిన ణత్వము మాత్రమే ఉభయములకు చెల్లుననుట పరిశీలించనిమాట. వీఁక దాఁకి – ఇది అర్ధబిందు ప్రాసము. పొందింప బృందావనము – ఇది బిందుప్రాసము, నాకౌఅత- చీఁకటి- ఇది ఖండాఖండ ప్రాసము. 273

క. సంగ్రామ రంగమున పెలు
చంగ్రుమ్మరుచున్న సాల్వజగతీపతి మే
నంగ్రుచ్చి పార నాటిం
చెంగ్రూరాస్త్రములు నాల్గు శ్రీకృష్ణుఁ డొగిన్
(కా. ఆం. 3-324) 274

—ఇది రేఫయుత ప్రాసము.

'గీతపాదము. వ్రిదుచె వినతాత్మజుండు దిక్కు లద్రువ ననఁగ
(కా. ఆం. 3-326) 275

—ఇది లఘుద్విత్వ ప్రాసము.

'గీ. ప్రాజ్ఞగ నమానధృతి సుధారుఙ్నిభాస్య...'
(కా. ఆం. 3-328) 276

—ఇది వికల్ప ప్రాసము

'క. మిన్నేఱు పాదమున ధా
తం నాభిని, (గుసుమశరు నెదం గాంచిన నీ
సాంనిధ్యము దొరకుటకై
సంనుతి సేయుదురు నిన్ను సనకాదు లజా!)' 277

—ఇదియును

‘క. తమ్ములను మల్లికాకుసు
మమ్ముల మరువాది పత్రమాలికలను భ
క్తిం మురహరు (పూజలు
సంమదమున సలుప(గలుగు సకలార్థంబుల్)’ 278
(కా. అం. 3-341, 2)

—ఇదియును అనునాసిక ప్రాసము. ఏయెడ — ఆయత = ఇది లఘు యకార ప్రాసము. ‘శా. సింగం బా(కటితో...వ, చ్చెం గుంతీసుత...’ = ఇది సంధిగత ప్రాసము— ఈతొమ్మిది విధములును సాధారణమైనవి గనుక నామనిర్దేశము మాత్రమే ఫలము. ఇన్నిప్రాసము లప్పకవిగారు చెప్పినారను గొప్పకేకాని, మరేమియు లేదు. 279

(ఇక) అభేద ప్రాసముకు చెప్పిన లక్ష్య లక్షణములు :—

లక్షణము :—

గీ. పెద్దలాకు(నుక్తిదనకు నభేదమగుట
లళలకు నభేదమట్లును గలుగుకతన
క్షితిని మూ(డవ సరళంబు యతుల( బ్రాస
ములను లఘ్వలఘు లకారములకు నిలుచు.
(కా. అం. 3-366) 280

లక్ష్యములు, ప్రభావతీ ప్రద్యుమ్నము (1-57) :—

క. జలనిధియను తెరమఱు గటు
వెడలి నిలిచినట్టి యాటవెలదియపోలెన్
గడు నింపులు గులుకుచు( దన
రెడు పురలక్ష్మి నవధరించితె యధిపా। 281

౪వ చరణమందు లక్షణభంగము. ‘పురవరలక్ష్మి’ సుష్ఠు 282

భీష్మపర్వము : (1-93)

క. కొడుకులు దానును గుఱ్ఱపు
దళములు కరిఘటలు భట రథ వ్రాతములుం
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు
గడు వేడుకఁ దోడుసూపె కౌరవ్యునకున్. 283

—అని లడలకు, శడలకు, లక్ష్యములు వ్రాసినారు అచ్చు పుస్తకములందు, 'జడనిధి'—'దడములు' అనివ్రాసినారు కవిత్వ మచ్చుపుస్తకములందున్నటులనే సుష్ఠువు. అప్పకవిగారి మత మదికాదు. 'జలనిధి'—'దళములు' అని నిశ్చయము. అటులనే కాకపోతే లక్షణ లక్ష్యములకు విరోధము. నిశ్చయించుట అప్పకవి గారిదిన్ని, వ్రాసుట అచ్చువేసిన వారిదిన్ని పొరపాటు. 284

నైషధము : (4-24)

చ. చిలుకలు కూయునో చెవులు చిల్లులువోవఁగ నంచు నెన్నడున్
వెడలఁడు నందనోపవన వీథులకై యట, మౌళిభాగ ని
ర్మల శశిరేఖచేయు నపరాధమునన్ గజదైత్యశాసనున్
గొలువఁడు పాకశాసనుఁడు కోమలి నీదెసఁ గూర్మి యెట్టిదో. 285

కూర్మపురాణము :

తోటక. తాలిమి దూలిన తాపసపత్నుల్
వ్రీడ మనంబున వీడ్కొని జాఱున్
లోల మదాలస లోచన పఙ్క్తుల్
జాల దలర్చిరి శంకరు లీలన్. 286

అని (అప్పకవిగారు) వ్రాసినారు

(అయితే) తిమ్మకవి సార్వభౌముడుగారు లక్షణసార సంగ్రహము నందు (2-82)

క. లడలకు నభేద మనుచున్
వెడఁగులు గడు ప్రాసములను విశ్రమముల ను
బ్బడరఁగఁ గలుపుదు రది యె
య్యెడలను సౌష్ఠవముగాదు హిమకరమకుటా! 287

ఆ. మొసలి మొసడి వ్యాళమును వ్యాడమును క్రీళ
క్రీడ వెలుడుటయును వెడలుటయును
దళము దడము నాఁగ జలము జడము నాఁగ
లడలు రెండుఁ జెల్లు నుడుపభూష ! (2-83) 288

ఆ. వెలుడె నన్పదంబు వెడలుటయంచు ల
క్ష్యంబు నైషధమున నరసి లడల
కిల నభేదమనుచు నల ముద్దరాజు రా
మన్న వలికెఁ దలఁప నది హుళక్కి. (2-84) 289

ఆంధ్రనామ సంగ్రహము (నందు) :

క. కలవు వివరింపఁగా నా
ఖ్యలు వరుస న్నిర్గమించె ననుటకు ధరలో
వెలువడియె, వెళ్లె, వెడలెను
వెలుడెననం జిత్రకాళ విశ్వాధీశా (మానవ. 63) 290

అని పైడిపాటి లక్ష్మణకవి చెప్పినాడు గనుక 'వెలుడె' నునిన్ని కలదు.

ఉదాహరణము – నైషధము :

"చిలుకలు కూయునో..................' 291

రామాభ్యుదయము : (8-54)

క. వెలుడి చనుదెంచె నపుడ
ప్పలభుక్కుల కన్యవన్యఫలభుక్కులకుం
గలనయ్యెఁ నందుఁ జేకొని
గెలుపున గపివీరు లొడ్డగిల దొరకొనినన్. 292

దడమనుటకు భీష్మపర్వము :

'క. కొడుకులు దానును..............' 293

వ్రీళ యనుటకు భీమఖండము : (3-193) :—

క. బాలోన్మత్త పిశాచ ద
శాలంబనమునఁ జరించు నంగడివీథిన్
వ్రీళా శూన్యత కంతే
కాలుని పాదములమీఁద గల్గు విరాలిన్. 294

అని చెప్పినారు. గనుక, జలము - జడము, దళము - దడము, వ్రీళ - వ్రీడ, ఈ మొదలైనపదము లాంధ్ర గీర్వాణములందు బహుళములు రెండు విధములు గలవు. అప్పకవిగారున్ను 'ఆంధ్రశబ్ద చింతామణి' యందు .

సీ. క్ష్వేళంబు క్ష్వేడంబు, చోళుండు చోడుఁడు
తాళంబు తాడింబు, దళము దడము
క్రోళంబు క్రోడంబు, నాళంబు నాడంబు,
నీళంబు నీడంబు, గౌళి గౌడి,
వ్యాళంబు వ్యాడంబు, చూళిక చూడిక,
వళి వడి, హేళి సర్వజ్ఞ హేడి,
జళకేళి జడగేడి, వెలుదడు వెడలడు,
కేళంబు కేడంబు, పాళి పాడి,

నేవళము నేవడం బిట్లు నిర్జరాంధ్ర
భాషలను రెండు గొన్ని శబ్దంబులందు
నరయ 'ళడయోరభేద' యటన్న సూత్ర
మున ళకారంబునకు డతేములు ఘటించు. 295

సీ. డిండిర దీప్తి పోడిమి మీరు నీ కీర్తి
దిండీర పాండిమఁ దెగడు నవ్వు
దంభ మిచ్చుటను గూడదు కృష్ణ నీ వేగి
దంభంబు మిత్రవిందకడఁ జేయు
దాడిమీఫల మియ్యేడకు నేం కౌనిపొమ్ము
దాడిమీఫలము సుదంత కిమ్ము
దోలికనూగు వేడుక నీకుఁ గల్గిన
దోలిక లక్షణతోడ నెక్కు

మంచు నీపద్యమునఁ జరణాదులందు
నిలుపు పదముల మొదలను గలుగు వ్రాలు
దత్వ దత్వంబులందు రెంటను బొసంగు
శాబ్దికమయంబునను వనజాతనయన ! 296

గీ. డంభ డిండీర డోలికా డాడిమాది
శబ్దముల కాదివర్గముల్ సంస్కృతమున
నపరివర్గ తృతీయమై యొప్పునట్లు
తెనుఁగున డకారము దవర్గ మొనర్చుచుండు.
(కా. అం. 2-146, 7, 8) 297

—అని శడలే కాకుండా, దడలున్ను రెండు విధములు గలవని చెప్పిరి. ఇందులో 'జళకేళి — జడకేళి'; దళము - దడము, వెలుదఁడు — వెడలఁడు',- ఈ పదములు రెండువిధములు చెప్పినన్ని, ఆ లక్ష్యము లెందుకు (అప్పకవిగారు) వ్రాసిరోతెలియదు. (మరియు) విశ్రమప్రకరణమందు నైషధమందలి (1–110):

క. కేళాది రాయ యభినవ
లీలామకరాంక చంద్రరేఖాంకుర (చూ
డా లంకార పదాంబురు
హాలింగిత సుఖిత నిర్మలాంతఃకరణా !) 298

—అని (రెండవ చరణమున) 'దల' లకు విశ్రమము 'లేఖా-రేఖా' అని రెండు విధములున్నవి గనుక పనికిరాదని '...చంద్రలేఖాంకుర...' అని వ్రాసిరి. ఇచ్చటమాత్రము తత్పాండిత్య మహిమ ఏమయిపోయెనో తెలియదు. లడలకు ప్రాస మెక్కడనున్ను లేదు. 'జలంచ జడమిత్యపి' అని ద్విరూపకోశమం దున్నది గనుకనే— 299

మహాప్రస్థానిక పర్వము (1-32) నందు :

క. పడమర మొగమై పశ్చిమ
జడనిధి తీరంబుసేరఁ జని యుత్తర మె
క్కుడు నియతి నడిచి వారిధి
పొడవడిగిన యాదవేంద్ర పురిచేరవగన్. 300

(అని 'జడనిధి' ప్రయోగము జరిగినది).



# సుకవి మనోరంజనము

## ద్వితీయాశ్వాసము

—:o:—

శ్రీ రమణీప్రియ శయనా
గార నిషంగా కరాబ్జ కలిత కురంగా
[గౌరీ కలితోత్సంగా]
క్రూరాహితపటలభంగ కుక్కుటలింగా ! 1

### యతిభేద విచారము

అవధరింపుము, విశ్రమ నిర్ణయం బెఱింగించెద : 2

కాకునూరు అప్పకవిగారు తమ ఆంధ్ర శబ్దచింతామణి యందు :

గీ. విరతి విశ్రాంతి విశ్రామ విశ్రమములు
శ్రాంతి విరమణ విరమ విరామ యతులు
ననఁగ నివి తొమ్మిదియు వలి కాఖ్యలయ్యె
భవ్య సత్ఫలాయామ్యభాగగేహ! 3

క. భీమన పదిచెప్పె, ననం
తామాత్యుఁడుఁ జేసె వెనుక యతు లిరువదినా
ల్గామీఁద గొందఱు కవి
గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్. 4

గీ. పూర్వ కవుల లక్ష్యములుగూర్చి సత్కవి
జనము లవు నటంచు సంనుతింప
విశ్రమంబు లేను వివరింతు నాలుగు
పదులమీఁద నొకటి విదితముగను. 5

యతి భేదములు :

క. స్వరయతులు వ్యంజనాక్షర
విరతు లుభయవళులు ప్రాస విశ్రాంతులు నాఁ
బరకింప నాల్గు తెఱఁగుల
విరమణములు వరలుచుండు విహగతురంగా ! 6

గీ. రసను స్వరమైత్రివళులు స్వరప్రధాన
వళులు లుప్త విసర్గక స్వరవళులును
ఋవళియును ఋత్వసంబంధి ఋత్వసామ్య
వృద్ధులన స్వరవళు లేడు విధములయ్యె.
(3-6, 7, 8, 9, 10) 7

సీ. క్రమమునఁ బ్రాణి వర్గజ బిందు తద్భవ
వ్యాజ విశేష సమాహ్వయములు
మహి ననుస్వార సంబంధానునాసికా
క్షరము విభక్తి ముకార యతులు
మొగి నువర్ణ విరామములు ఋజుప్రత్యేక
భిన్నైక తరము లభేద విరతు
లోలి నభేద వర్గోష్మ విశ్రాంతులు
సరస సంయుక్త విశ్రామములును

గరిమ నంత్యోష్మసంధి వికల్పసంధి
విరమములు నాఁగ వ్యంజనాక్షర విరతులు
నిఖిల సుకవిప్రయోగము ల్నెమకి చూడ
నేకవింశతి భేదంబు లెఱుఁగవలయు. (3-43) 8

సీ. సర్వేశ యుష్మదస్మచ్ఛబ్దయతులును
బరరూప విరతులు ప్రాదియతులు
వెండి నిత్యసమాస విశ్రాంతి దేశ్యని
త్య సమాస నిత్యాభిధానములును

రాగమసంధి విభాగ నామాఖండ
పంచమీ వికృతి విభక్తి యతులు
కాకు స్వర ప్లుతాక్షరయుగ విశ్రామ
ములు నన నుభయాఖ్య వెలయు వళులు

క్రమత శబ్దానుశాసన ప్రభృతి పూర్వ
కవిజనంబుల కృతుల లక్ష్యముల కలిమి
బదియు రెండువిధంబులై పరగుచుండు
దద్విధంబులు తెలియంగఁ దగు ముకుంద. (3-121) 9

—అని స్వర యతులు౭ వ్యంజనాక్షర యతులు ౨౧, ఉభయ వళులు ౧౨, ప్రాసయతి (౧) లోఁగూడ నలుబదొకటి (యతిభేదములు) అప్పకవిగారు చెప్పినారు. పది మొదలుకొని ముప్పది పర్యంతమున్ను కొందఱు కొందఱు లాక్షణికులు చెప్పినారు. అందఱికన్న అప్పకవిగారే యెక్కువ చెప్పినారు గాని, ఈ నలువదొకటిలోను స్వరమైత్రి, ప్రాణి, ఋజు, ప్రత్యేక, భిన్న, ఏకతర, అంత్యోష్మ, మవర్ణ, యుష్మదస్మచ్ఛబ్ద - ఈ ౯ యతులు పరిహరించబడినవి. [1] ఏమి హేతునంటే 10

1. ఈ 9 యతులు పరిహరింప బడుటకు 'ఏమి హేతువనంటే-' అని కారణములు చెప్పుటలో 'యుష్మదస్మచ్ఛబ్దయతి'ని పరిహరించుట కారణము చెప్పబడలేదు. మరియు 'ఉభయముల'లో వేంకటరాయకవి 'యుష్మదస్మచ్ఛబ్ద'యతి నొకభేదముగా కూడా చెప్పినాడు. ఉభయయతులలో ఈయతి లక్ష్య లక్షణములు ప్రదర్శించి 'అప్పకవిగారఖండయతి నొప్పఁగాన నిచ్చట దిద్దశక్యముగాక యుష్మదస్మచ్ఛబ్దయతులని పేరుంచినారు. ఇంతమాత్రమువు చేత నఖండయతికి లోపము రానేరదని ఉంచినాము'అని వ్రాసినాడు, అఖండ యతిలో నిది అంతర్భవించు ననుకొని మొదట పరిహరింపబడినదని చెప్పి 'లోపము లేద'ని ఉంచుటచే నిక్కడ 8 యతులే పరిహరింపబడినవని భావించ వలెను. మరియు ఈ 8 లో 'అంత్యోష్మ'మని పేర్కొనబడినది. 'అంత్యోష్మ సంధి'యతి ఉభయయతులలో వేం. రా. కవి అంత్యోష్మసంధి యతిని చెప్పి నాడు. మరియు వీటిని నిరాకరించు వరుసలో అంత్యోష్మసంధి నిరాకరణ హేతువు చెప్పబడలేదు. యుష్మదస్మచ్ఛబ్ద, అంత్యోష్మసంధి' తప్ప మిగిలిన వాటినే నిరాకరించి 'ఈ సప్తవిధములు నామనిర్దేశములు మాత్రమే...' (2-17)అని చెప్పినాడు. కాన ఇక్కడ 9 అని చెప్పుటకు హేతువు కన్పించదు.

'గీ. అబ్జపత్త్రనేత్ర యార్తావనచరిత్ర...'

ఇటువంటివి—అనగా, అకారముకు, ఆకారముకు, ఐకారముకు, ఔకారముకూ యతి అకారయతులనిన్ని—

'గీ. ఇందు వంశసోమ ఈశ్వరీనుతనామ...'

ఇటువంటివి ఇద్విరామములనిన్ని—

'గీ. ఉరగరాజశాయి యూర్ధ్వవిష్టపదాయి...'

ఇటువంటివి ఉద్విరామము లనిన్ని— ఇవన్నియు స్వరమైత్రి వలులనిన్ని (అప్పకవిగారు) వ్రాసినారు. లాక్షణికు లందఱును స్వరయతులని నిర్ణయించి నారుగాని ఈ భేదము నెవరు నంగీకరించలేదు. (ఇక) ప్రాణియతులనగా—

'సీ. కలశాబ్ధి గంభీర కాంచనాచలధీర
కాలియోరగ వైరి కైటభారి......'

(అని వ్రాసినారు). వర్గాంత్యాక్షరమును విడిచి మిగిలిన నాలుగు నొకదాని దొకటియైనా, యే యక్షరమున కాయక్షరమైనా నిలిపితే వర్గయతులని ఆది నుంచిన్ని సుప్రసిద్ధిగా నున్నది. కావున వర్గయతిని సర్వమైత్రి ప్రధానము చేసి 'ప్రాణియతి' యని క్రొత్తపేరుంచు టించుకంతైనా వినియోగములేదు. వర్గ యతులకు తమరు చెప్పిన లక్షణ లక్ష్యములు 11

క. తమతమ యనునాసిక వ
ర్ణములు విడిచి వెనుకలిపులు నాల్గును దమలో
తమకు నరలేక నిలిచిన
నమరాహితదమన వర్గయతు లనఁబరగున్. 12

గీ. కంధిమధ్యగేహ ఖండితారి సమూహ
ఖంజనాభదేహ గానమోహ
గరుడపక్షివాహ ఘనవాహజ స్నేహ
భర్గవినుత యనిన వర్గయతులు." (3-349,50) 13

ఇక్కడ మాత్రము వర్గయతులేమి? కకారముకు కకారముంటే ప్రాణియతి యేమి? నాలిగింటిలో నరలేక నిలిచిన అని తమరే స్పష్టముచేసిరి. ప్రాణియతు లని పేరుమాత్రమే గొప్పకాని, విశేషము లేదు. (ఇక) ఋజుయతులనగా, యకార హకారములకు వ్రాసినారు. ఇవియును, అంత్యోష్మయతులు-అనగా' శవర్ణ షకారములకు వ్రాసినారు, ఇవియును 'సరసయతు'లని సుప్రసిద్ధములై యున్నవి. (మఱి) ఏకతరయతులనగా, రేఫముకు రేఫము అకారముకు అకారము ఏకతరయతులని వ్రాసినారు—ఈ రెండును, య-ల-వ ఈ మూడు ఏ యక్షరమున కాయక్షరము యెక్కటి యతియని పండిత పామర సాధారణ మైన యతి. అటువంటిదానికి, రేఫమునకు రేఫము. అకారమునకు అకారము ఏకతరయతి యనుటయు, య-ల-వ—ఈ మూడక్షరములు నేయక్షరమున కాయక్షరము యతియగునపుడు ఏ యతో నలుబదొకటి యతులలో చెప్పక పోవుటకు వారి సామర్థ్య మేమనుకోవలె? (ఇక) ప్రత్యేకయతులనగా— 14

గీ. అరయ శార్ఙ్గంబు హరిచేతి యది యనంగ
దివ్యచాపంబు శూలి చేతిది యనంగ...' 15

అని వ్రాసినారు. మొదటి (చరణమున) స్వరయతి. రెండవ (చరణ మున) వర్గయతి. (మఱి) భిన్నయతులనగా :—

"గీ. ఎదను లచ్చిని హరి ధరియించె ననఁగ
రిపుల నెల్లన బోర హరించె ననఁగ..." 16

(అని వ్రాసినారు.) మొదటి (చరణమున) సరసయతి. రెండవ (చరణ మున) ఎక్కటియతి. (కావున) ఇటువలె క్రొత్తపేరు లుంచుటకు పనిలేదు. ఈ సప్తవిధములు నామ నిర్దేశములు మాత్రమే క్రొత్తగాని, దశవిధయతులలో సుప్రసిద్ధములై పండిత పామరసాధారణముగా నందఱు నెఱింగినవవును. (ఇక) మవర్ణ విరామము :— 17

సీ. మర్దిత దైత్య సంయమి మనోజ్ఞాదిత్య
మహితమేఘాభ సంరక్షితేభ
మాయా ప్రవృత్తి సంలబ్ధ నిర్మల కీర్తి
మణిహార స్ఫురవశంవద విహార

మందరధైర్య వంశ నినాద చాతుర్య
మా భూపయువతి పుంషండ రూప
మంజుల స్వాంత కంసధరావర కృతాంత
స్మర హరారాధ్య సింహనిభమధ్య

యనుచుఁ జరమానునాసికంబునకు నిట్లు
గ్రాలుఁ గృతులను వర్ణ విరామములన
దండి సున్నలు దాపల నుండెనేని
పెలుచ నంతస్థములు నూష్మములఁను గృష్ణ॥" (8-76) 18

అని బిందువు దాపలగలిగిన య,ర,ల,వ,శ,ష,స,హ—ఈ యెనిమిది వర్ణములు మవర్ణముల యతి చెల్లునని చెప్పినారు.

లక్ష్యము-భీమనచాటుధార :

చ. గరలపు ముద్ద లోహ మవగాఢ మహాశనికోట్లసమ్మెటల్
హరు నయనాగ్ని కొల్మి యురగాధిపు కోరలు పట్టుకార్లు ది
క్కరటి శిరంబు దాయి లయకాలుఁడు కమ్మరి వైరివీర సం
హరసుగుణాభిరాముఁడగు మైలమ భీమన ఖడ్గసృష్టికిన్. 19

ఈ పద్యము భీమకవిగారిదే అయితే—(కవిజనాశ్రయము సంజ్ఞా 62)

"క. స్వరవర్గాఖండ ప్రా
ద్యరుబిందుప్లుతములుం బ్రయుక్తాక్షరముల్
బరువడి యెక్కటి పోలిక
సరసమనం బదివిధములు జను వళ్లరయన్." 20

అని యీ పద్యము భీమకవిగారు చెప్పినదని సమస్త లాక్షణికులు నంటారు. భీమన పది (యతిభేదములు) చెప్పినాడని తమరున్నూ చెప్పిరి. ఈ పది యతులలో మవర్ణ విరామము లేదుగదా॥ లక్షణము చెప్పేవరకు (భీమకవిగారు) మవర్ణ విరామము నెఱుగరనిన్ని, పిదప కొంతకాలముకు ముఖ్యముగా మవర్ణ విరామమును జెప్పక వల్లగాదని తోచి ఈ పద్యము చెప్పినారనుకోవలెను. మంచిదే. మకార హకారములకు (లక్ష్యమున యతి చెల్లింపు) ఉంటే, (మకార

ముకు) య ర ల వ శ ష స లకు కూడా యతి చెల్లుతున్నదనుటకంటే, కకారాది యిరువదైదు వర్ణములకున్ను చెల్లునంటే మిక్కిలియు బాగుండును. (నిజమునకు భీమకవిగారు)

'...సం, హర సుగుణాభిరాముఁడగు నైలము...'

అని సరసయతి రచించియుందురు. 'ఐలము' అనుచోట 'మైలము' అని వాడుక కలిగియుండవలె. 'లేములవాడ భీమకవి' అనియుంటే, 'వేములవాడ భీమకవి' అని వాడుక కలదు. 'లేములవాడ' న్నందుకు :-

ఉ. లేములవాడ భీమ నవలీలఁగఁ జూచి కలింగగంగు 'ఈ
జాముననగాదు తేపకడ సందడి దీరినవెన్క ర' మ్మనెన్
మో మటుచూచి పల్కెనిటు ముప్పదిరెండు దినాల మీఁదటన్
జాము తదర్థమందు తనసంపద శత్రులపాలు గావుతన్.

అని చాటుధార. కావున నొకరీతిగానుంటే నొకరీతి వాడుక కలదు అయినా 'మైలము' అనే ఉండుగాక. నన్నయభట్టుగారు చెప్పినదేగాని, మిగిలినది అగ్రాహ్యమని తమరే చెప్పిరి. నన్నయభట్టుగారు అఖండయతి చెప్పితే దిద్దినారు. నన్నయభట్టుగారి లక్ష్యములేని మవర్ణ విరామము నిలిపినారు, అయనగారి స్వతంత్ర పాండిత్యమహిమ అస్మదాదుల కవాచ్యము.

(ఇట్లు) నలుబదొకటిలోను నెనిమిది (యతిభేదములు) పోగా మిగిలిన ముప్పది మూడు యతులలో అభేదయతి (యందు) వబలకు, లళలకు, లదలకు— మూడువిధములు చెప్పినారు. లదలకు లక్ష్యమొకటియు నెవరిదియు లేనందున నదియును మంచిదికాదు. కాకుస్వరయతులు, ప్లుతయతులు నేకముచేసి ఆరు విధములు చెప్పినారు. కాకుస్వరయతులయొక్క, అభేదయతులయొక్క అంతర్భేదములు కలుపుకుంటే ముప్పది తొమ్మిది విధములు నిలిచినవి. (ఇక) ప్రకృత మనుసరించుచున్నాము. 22

## యతిభేదములు

గీ. అవనియందు స్వరప్రధాన వలులును ఋ
వలియు ఋత్వసంబంధ యతులును ఋత్వ
సామ్య లుప్తవిసర్గక క్రాంతి వృద్ధి
వలు లనఁగ నాఋవిధముల వలన మీఱు. 23

సీ. క్రమమున వర్గవిరామములు నఖండ
విరతు లనుస్వార విశ్రమములు
సంయుక్త మెక్కటి శ్రాంతులు పోలిక
సరస విరామముల్ చక్కటి యతు
లనునాసికాహ్వాయ యతు లనుస్వారసం
బంధాఖ్య తద్భవ వ్యాజములు న
భేద విశేషాఖ్య విశ్రాంతులు నభేద
వర్గాగమ యతులు బదియు నైదు

వ్యంజనాక్షరయతులు బొల్పారు చుండు
నెల్ల కవిరాజ రాజ సత్కృతుల యందు
సరస దరహాస పీఠికా పురనివాస
గోధునీకాశ నీకాశ కుక్కుటేశ! 24

సీ. అంత్యోష్మసంధి నిత్య వికల్పసంధి రా
గమ సంధులును విభాగములు భిన్న
ప్రభునామ ప్రాది విశ్రామంబులును చతు
ర్థీ పంచమీ నిత్యదేశ్య నిత్య
సమసన పదరూప శ్రాంతులు యుష్మద
స్మచ్ఛబ్ద ఘఙ్ విరామములు మఱియు
ఆదేశవలి ససమాసమును నఙ్ స
మాస నిత్యసమాస యతులు ప్లుత వి

రామములును కాకుస్వరశ్రాంతులు ప్లుత
యుగయతులనగ ద్వివింశతి యుర్వి నుభయ
వలులు సత్కవి కావ్యాలిఁ జెలఁగు చుండు
గోధునీకాశ నీకాశ కుక్కుటేశ! 25

అంత్యోష్మ సంధి, నిత్యసంధి, వికల్పసంధి, రాగమసంధి—అని తెలియ
వలయును.

స్వరయతులు ౬, వ్యంజనాక్షర యతులు ౧౫, ఉభయవలులు, ౨౨, ప్రాసయతితో నలుబది నాలుగు యతులు వీటిలో నభేదయతులు నాలుగు భేదములు, ప్లుతయతులు నాలుగు భేదంబులు, కాకుస్వరయతులు నిరువదియైదు భేదంబులు—ఈ అంతర్భేదంబులతో గూడా డెబ్బది నాలుగు విధంబులును మహాకవి లక్ష్యములతో నేర్పరించుచున్నాము. 27

*1.* స్వర ప్రధానములు :—

**లక్షణము :—**

సీ. ధారుణియందు నకారయుగంబును
 నైఔలు నొక్కటై యలరుచుండు
నటుల నికార ద్వయంబు నెఏలు ఋ
 కారంబు నొక్కటై గలయుచుండు
నరయ నుకారద్వయంబు నొఓలు న
 భేదమై దమలోన వెలయుచుండు
నచ్చును హల్లును నై ఋకారం బెన్న
 వరకవితలయందు వఱలు చుండు

రియతియనఁజెల్లు హల్లులకు యతియైనఁ
దక్కినను స్వరయతులని తనరుచుండు
సరస దరహాస పీఠికాపుర నివాస
గోధుసీకాశ నీకాశ కుక్కుటేశ ! 28

అర్థము :—అ ఆ ఐ ఔలు నొకటి. ఇ, ఈ, ఎ, ఏలు, ఋకారము నొకటి. ఉ, ఊలు, ఒ, ఓలు నొకటి. ఋకారము మాత్రము ఇ, ఈ, ఎ, ఏలకు యతి యగునపుడు స్వరయతి. హల్లులైన రి, రె యను హ్రస్వ దీర్ఘవర్ణములకును, గుడి, యేత్వముగల హల్లులకున్ను, క్రాముడికి చెల్లునపుడు 'రియతి' యని కొందఱు, ఋవలి యని కొందరు నందుఱు. ఋకారమునకు 'వట్రసుడి' సంజ్ఞ కూడా గలదు. కావున వట్రసుడులున్న హల్లులున్ను ఇ, ఈ, ఎ, ఏలున్ను యతులైనపుడు ఋత్వసంబంధయతి. ఏ హల్లులైనను—రెండు హల్లులకున్ను వట్రసుడులుంటే, ఋత్వసామ్య యతులని నామధేయములు గలవు. కొందఱు ఈ భేదములు చెప్పలేదు. 29

కొందఱు లాక్షణికులు స్వరయతి లక్షణము వ్రాసిన పద్యము :—

క. అ ఆ లైఔలకు మరి
ఇ ఈలు ఋకార సహిత మె ఏలకు నౌ,
ఉ ఊల్ దమలో నొడఁబడి
ఒ ఓలకు వళ్లగున్ నయోన్నత చరితా![1]

ఈ పద్యచరణములందు ఆదిని నున్న అ ఆ ఇ ఈ—ఈ నాలుగున్ను, ఎ ఏలను చోట ఎకారమున్ను గురువులు, ఏది హేతువుననైనవో తెలియదు. పామరులు బాలురకు చెప్పెడుపట్ల దగ్గిరనున్న ఆ ఈ ఊ ఓ—ఈ నాలుగక్షరముల నూతగా నుచ్చరించుట మాత్రముచేత గురుత్వమొందవు. ఎకారమునకు ఆ పామరోక్తియు లేదు. పరిశీలించనందున లక్షణ భంగమైనది. 30

స్వరప్రధానవలులకు లక్ష్యములు :

శ్రీనాథుని కాశీఖండము : (4-200)

గీ. ఆది గర్భేశ్వరుండౌట అనుచితంబు
మిగుల చక్కని వాఁడౌట మేలుకాదు
పాప మభినవ యౌవనోద్భాసి యగుట
యరయ మంచి గుణంబులే యవగుణములు. 31

రెండు యతులు.

అందే : (7-95)

గీ. ఈశ్వరద్రోహి గర్వాంధ ఋషివరేణ్య
బంధనాకైకకారణ పాపకర్మ
చావు మని యొక్కపెట్టున చక్రధార
దక్షుతలఁ ద్రెళ్లనేసెఁ ఫాలాక్షసుతుఁడు. 32

---

1. ఇది కవిజనాశ్రయమున కన్పించును. సంజ్ఞా, 63.
కస్తూరి రంగకవి 'భీమనచ్ఛందము'లోనిదిగా నీపద్యము నుదాహరించినాడు. (ఆనందరంగరాట్ఛందము. 3-114)

చేమకూరవారి విజయవిలాసము : (2-167)

ఉ. ఎచ్చట(గంటిరా విజయు నిక్కువ నిక్కువమౌనె రా(డుగా
యిచ్చటి కంచు( గోరికలు నేకట యేకట(బెట్టి పల్క(గా
నొచ్చెములేని బీర మెద నూఱ(గ నూఱ(గ సాగె వెంటనే
పచ్చని వింటివా( డపుడు పైదలిపై( దలిరాకు(గ్రొ దువుల్.

మూడు యతులు: -

చేమకూరవారి సారంగధరచరిత్ర : (2-41)

గీ. ఔర! వీని మోహనాకార రేఖ వే
మారు మారు హరికుమారు మారు
(వీని-కన్నుదోయి విరిదమ్మితొగల తీ
రేపు మాపు బాపు! రేపు మాపు) 34

ఇటు వలెనే తెలుసుకొనేవి. 35

## 2. ఋవళి :-

తిమ్మకవి లక్షణసార సంగ్రహము : (2-221)

క. భావింప ఋకారమునకు
రీ విశ్రమ మిష(గ( జెల్లు( గృతుల( గవీంద్రుల్
ధీ వైఖరి విలసిల్ల(గ
భావజ దుర్గర్వహరణ! పర్వత శరణా! 36

లక్ష్యములు:-

సభా పర్వము : (2-11)

సీ (ఈతని వృద్ధని యెఱ(గి పూజించితే
వసుదేవు( డుండంగ వసుమతీశ)
ఋత్విజుండని విచారించి పూజించితే
ద్వైపాయనుం డుండ ధర్మబుద్ధి... 37

ఋకార మనగా వట్రసుడికి సంజ్ఞ కలదు గావున- 38

మనుచరిత్ర : (2-36);

సీ. ప్రతిఘటించు చివుళ్లపై నెత్తి వారిన
రీతి నున్నవి వీని మృదు పదములు... 39

చేమకూరవారి విజయ విలాసము : (1-18)

ఉ. ఆణిమెఱుంగు ముత్తెపు టొయారపు ముగ్గులు రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు హృద్య నిరంతర వాద్యఘోషముల్
(రాణఁబొసంగఁ బ్రోలు మిగులం గనువిందొనరించు నిత్య క
ల్యాణము పచ్చతోరణము నై జనులందరు నుల్లసిల్లఁగన్). 40

'గోపికా హృదయలోల, శతకము :

సీ. శ్రీ పద్మవాసినీ పృథుతర కుచ శిత
కుంభ కుంభ విలిప్త ఘుమఘుమాయ
మాన చందన మృగమద సంకుమద కుంకు
మా గురు పంక సమన్వితోరు
బాహాంతరాల విభ్రాజమానామూల్య
కౌస్తుభ మణిఘృణి కలిత లలిత
మౌక్తికహార శుంభదుదర భరిత లో
కనికురుఁడవు నీవు కనికరంబు

మీఱ భక్తజనాలి కమేయ దివ్య
భాస్వదనపాయ సకల సంపద లొసంగి
సాగి కొనుమయ్య నిరతంబు సరసముగను
మదనగోపాల గోపికా హృదయలోల! 41

3. ఋత్వ సంబంధవలి :-

కాకునూరి అప్పకవి ఆంధ్ర శబ్ద చింతామణి : (3-26)

గీ. సౌరిదిఁ గాదుల వట్రువ సుడుల కెల్ల
ఋత్వమిత్రంబులగు నచ్చు లెనయ నైదుఁ
జెల్లు హాయలును స్వరమైత్రిఁ జెందునపుడు
వెలయు నివి ఋత్వసంబంధ వలు లనంగ. 42

అర్థము:— కృ, గృ మొదలైన వట్రసుడి గల హల్లులన్నియు ఇ, ఈ, ఎ, ఏలు ఋకారము- ఈ అయిదచ్చులకు వడి చెల్లును. 43

లక్ష్యములు:—

సుభాషిత రత్నావలి :

గీ. నృపులు పండితులగు వారి యెడల గర్వ
కలన మానుఁడు వారి మీ కలిమి తృణము
లీల వారింపలేదు మృణాల గుణము
భూరి మదవారణములకు వారణంబె. 44

తిమ్మకవి రసికజనమనోభిరామము :

క. వృద్ధునకు యువతి విషమగు
వృద్ధాంగనకు యువజనుండు వెలయఁగ సుధయౌ
సిద్ధమని కొంద అపుడా
వృద్ధా గౌతముల నెగ్గు తెన్నిరి పెలుచన్. 45

మనుచరిత్రము (1-57):-

సీ. తీర్థ సంవాసు లేతెంచినారని విన్న
నెదురుగా నేగు దవ్వేంతయైన
నేగి తత్పదముల కెరగి యింటికిఁ దెచ్చుఁ
దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులుగాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ జేరవచ్చు
వచ్చి యిద్ధరగల్గు వనధి పర్వత నదీ
తీర్థ మాహాత్మ్యముల్ తెలియ నడుగు... 46

కృష్ణరాయల ఆము క్తమాల్యద: (4-273)

ఉ. హితులు భిషగ్గ్రిహజ్ఞ బుధబృంద కవీంద్ర పురోహితుల్ హితా
హితులు ధనార్జనాది నృప కృత్య నియుక్తులు వెండి కేవలా
హితులు దశాదశార్పిత సమృద్ధరమా చరణేచ్ఛులౌట నా
హితమున నట్లు కాఁ జతుర వృత్తిఁ జరింపఁగ నీతి తేనికిన్ 47

4. ఋత్వా సామ్యావలులు :-

కాకునూరి అప్పకవి 'ఆంధ్రశబ్ద చింతామణి' : (3-34)

గీ. వట్రువలు జెంది తమలోన వ్యంజనములు
నన్నియునుగూడ ఋత్వసామ్య వలులగును
వృష్ణివంశాబ్ధి సోముఁడై పృథివిఁ బుట్టి
మృతునిఁ గావించెఁ గంసునిఁ గృష్ణుఁ డనఁగ. 48

ఆము క్తమాల్యద : (2-91)

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగార పల్యంకికా
వహనంబో వనమాలికా కరణమో వాల్లభ్య లభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ప్రాగ్దీపికారోపమో
నృహరీ! వాదములేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్. 49

అందే : (1-41)

గీ. తిరుగు హరిపురి సురతరు సురల మఱిగి
బహుల హలహల భరిత కల్బరిగ నగర
సగర పురవర పరివృఢ జవన యమన
పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ ! 50

తిమ్మకవి రసికజనమనోభిరామము :

సీ. వనములఁబడి మాధవ ప్రసాదము గోరు
కృష్ణవేష ద్విజ బ ందములును...... 51

### 5. లుప్తవిసర్గక స్వరయతి :-

లక్షణ సారము :

గీ. స్వరము తుదనుండి లుప్తవిసర్గ కోత్వ
మైన గూఢస్వరయతి దాసోహ మనఁగ
నచ్యుతాశ్రితు లుర్వి నన్యోన్య మిత్రు
లనఁగ నమ్మాధవుండు యశోబ్ధి యనఁగ.[1]

(లుప్తవిసర్గక స్వరయతినే) కొందఱు 'గూఢ స్వరయతి'యని అంటారు. రెండు పేరులును గలవు.

లక్ష్యములు :-

చేమకూరవారి విజయ విలాసము : (1-49)

శా. తా సైరింప కపర్ది యుండఁగ భవద్గర్భంబునం దాల్చి తే
జోఽసహ్యున్ శరజన్ము గాంచి యల నీహారక్షమాభృత్కుమా
రీ సాపత్న్యము గన్నమోహపుఁ బురంధ్రీరత్న మౌటీవ కా
వే సర్వజ్ఞుఁడు నిన్ను నేల తలపై నెక్కించుకో జాహ్నవీ ॥ 54

—రెండవ చరణమందు లుప్తవిసర్గక స్వరయతి, నాలవ చరణమందు కాకు స్వరయతి.

---

1. నన్నయ లక్షణసారము నందలి దీ పద్యమని కస్తూరి రంగకవి తన 'ఆనంద రంగచ్ఛందము'న ఉదాహరించినాడు. కాని ఇవి అనంతుని ఛందమందు స్వల్పమైన మార్పులతో కన్పించును. రెండవ పాదమున 'గూఢ స్వరయతి'కి బదులు 'స్వరవిరామంబు' అని నాల్గవపాదమున 'యశోబ్ధి'కి బదులు 'యశోర్థి' యన్నవా మార్పులు (చూ. అనం. ఛం. 1-85) వేంకట రాయకవి రంగకవిని చూచి ఉదాహరించినట్లున్నది.

మను చరిత్రము : (3-77)

చ. అపరిమితానురాగ సుమనోలసయై చిగురాకు చేతులం
దపసినిఁ గౌఁగిలించె వనితాః యిది రంభ దలంప......దా
నపరిమితానురాగ సుమనోలసయై చిగురాకు చేతులం
దపసినిఁ గౌఁగిలించు టుచితంబె కదా యని నవ్వె రంభయున్. 56

—ప్రథమ తృతీయ చరణములందు గూఢ (లుప్తవిసర్గక) స్వరయతి. ద్వితీయ చరణమందు గాన ప్లుతము. 57

## 6. వృద్ధి వలులు :-

తిమ్మకవి లక్షణసార సంగ్రహము : (2–166)

క. పూని యకారాంతంబుల
పై నే ఓ లదుక నవియె పన్నుగ నై ఔ
లై నిలిచి వృద్ధివలులనఁ
గా నిరు దెఱఁగులఁ బొసంగు గౌరీరమణా! 58

అకారాంతములైన రస,బిడ-మొదలైన పదముల చివర, ఏక, ఓజః-మొదలగు పదములు సంధి చేయగా, రసైక, దానైక. శుభైక, పుణ్యైక, బిడౌజ—అని (ఏర్పడును). 'వృద్ధి రేచి' అనుసూత్రము చేత వృద్ధివచ్చినందున వృద్ధివలులని పేరు. సంధియందు ఐకారము ప్రధానమై, అ ఆ ఐ ఔలు చెల్లును. ఎకారము ప్రధానమై ఇ ఈలు ఏలు ఋకారము, వక్రసుడిగల హల్లులన్నియును, గుడియైనా ఏత్వమైనా గలిగిన హకార యకారములును చెల్లును. 'బిడౌజ'అను సంధియందు ఔకారము ప్రధానమై అ ఆ ఐ ఔలున్ను, ఓకారము ప్రధానమై ఉ ఊ ఒ ఓలును చెల్లును.

లక్ష్యములు :—

శ్రీనాథుని కాశీఖండము : (7-111)

సీ. శైలాది వాగ్భుజా స్తంభం బొనర్చుట
నజ్ఞాన విరహితుం డయ్యెనేని
ముక్తిమంటప మధ్యమునఁ బురాణంబులు
శైవంబు లేపొద్దు జదివెనేని

భాగీరథీ తటోపాంతస్థలంబున
లింగ ప్రతిష్ఠ గల్గించెనేని
పుణ్య పంచక్రోశ భూతీర్థ మహిమంబు
నెరవుగా సర్వంబు నెఱిఁగెనేని

తపములకు బాధకములు క్రోధంబు లగుట
తెలిసి యొక్కింతయేని తితీక్ష లేక
నేల శపియించెఁ గాశిఁ బుణ్యైకరాశి
గంధవతిపట్టి యానవీ కార్తికేయ! 60

పుణ్య-ఏకరాశి అని పదవిభాగము. ఇచ్చట ఏకారము ప్రధానము. 'ఉపాంత' (అనుచోట) ప్రాదియతి. 61

పారిజాతాపహరణము : (1-12)

సీ. ఎవ్వాని సత్యదానైక విలాసంబు
లారూఢతర తులా పూరుషములు... 62

దాన-ఏక అని పదవిభాగము. ఇచ్చట ఏకారము ప్రధానము 63

చేమకూర వారి విజయవిలాసము : (1-105)

ఉ. అంతె యెఱింగి యా సరసుఁడంత వివాహ విధిజ్ఞుఁడైన మీ
నాంకుఁ డొనర్చి నాఁడిది శుభైక ముహూర్తము రమ్మటంచుఁ బ
ర్యంకముఁజేర నెచ్చెలి కరగ్రహణం బొనరించె తన్మణీ
కంకణ కింకిణీగణ వికస్వర సుస్వరముల్ చెలంగఁగన్. 64

శుభ - ఏక అని ఇచ్చట ఏకారము ప్రధానము. 65

వసుచరిత్రము : (5-28)

చ. సతినడిగించు భవ్యగుణశాలి వసుం డఁట, వేఁడ వచ్చువాఁ
డతులిత దేవరాజ్య భరణైక ధురంధరుఁడైన యా శత
క్రతువఁట సత్కృపామహిమఁ గన్నియ నిచ్చుట సర్వదేవతా
హితమఁట యింతకన్న శుభ మెయ్యది తొయ్యలిఁగన్నవారికిన్. 66

భరణ - ఏక అని. ఇచ్చట ఐకారమే (ఇక) ఉభయముకు :

రామచంద్రశతకము :

సీ. ఆరీతి నాతఁడి తార తా రమణుని
ప్రార్థింప వినకయ యరుగు టరయ
నతనికిఁ బాడిగాదా యెవరైన రా
జత్వాభిమానులు జగతియందు
హిత సుబుద్ధిని వినిరే స్వేచ్ఛ కింపైన
నర్థము నొప్పదు రా పిపీలి
కయు రాజగురుచేత ఖట్వాంగమును దొల
గించ నాజ్ఞయొసంగె నంచు శాస్త్ర

ము లెఱిఁగింప కపియు రాజు తలఁపగ భువ
నైక శూరుండు నగువాలి యెట్టుల విను
నమల దరహాస భక్తచిత్తాబ్జ వాజి
రమ్యగుణసాంద్ర జానకీ రామచంద్ర ॥ 87

భువన-ఏక అని. ఏకారము ప్రధానము. రెండవ, మూడవ చరణము లందు మూడు కాకుస్వరయతులు.

అందే :

సీ. గ్రక్కున వాలి పేరక్కున నక్కొంల
దగిలి నంతనె హరిధ్వజము భంగి
వరరత్న భూషణ సురుచిర గాత్రుఁ డా
బలహూతి సూతి భూతలమునందు,
బడియున్న తఱిని యా సజ్జకు మెల్లనఁ
జని నీవు నిలుచున్నఁ గని సురేంద్ర
తనయుఁ డహో యేమి తపము గావించెనో
యనుపమ వరభువనైక వీరు

నురుదయా రసోజ్జ్వలు ధర్మనిరతుపుత్రు
బడయుటకు దశరథజనపాలవరుఁ డ
టంచు పలుకఁడె నిను గూర్చి యలుక బేర్చి
రమ్యగుణసాంద్ర జానకీ రామచంద్ర ! 69

భువన-ఏక అని. ఇచ్చట ఐకారము ప్రధానము. 70

అయ్యపరాజు రామభద్రుని చాటుధార :

క. రాజ బిడౌజా విద్యా
భోజా దీనార్థికల్పభూజా రిపుసం
ఙ్ఞాజా వైభవ విజిత బి
డౌజా రవితేజ గుత్తి యప్పలరాజా ! 71

బిడ-ఓజ అని. ఇచ్చట ఔకారము ప్రధానము

భాస్కర రామాయణము : (సుం. 450)

శా. నీ కంఠార్పిత కాలపాశము శిరో నిర్ఘాత పాతంబు లం
కౌకస్సంచయ కాలరాత్రిగల బద్ధోదగ్ర కాలాహి క
న్యా కారాగత మృత్యువున్ జనకకన్యన్ వేగ నొప్పించి లో
కైక త్రాణుని రాము నిం గనుము నీకీ బుద్ధిగా కుండినన్. 72

ఇచ్చట, లంక-ఓక అనుచోట ఓకారము ప్రధానము. లోక-ఏక అను చోట ఏకారము ప్రధానము. ఇటువలెనే తెలుసుకునేది. 78

'ఓత్వోష్ఠయో స్సమాసే వా'

అను సూత్రముచేత ఓత్వోష్ఠ శబ్దములు ఇతర శబ్దములతో సమాసము చేయునపుడు గుణవృద్ధులు రెండు నగును. గుణమైతే ఓత్వము, వృద్ధి అయితే ఔత్వము. పల్లవోష్ఠీ, పల్లవౌష్ఠీ; స్థూలోతుః, స్థూలౌతుః-ఈ మొదలైనవి రెండు విధములుగలవు, ఔత్వము గలుగునపుడు వృద్ధియతిగావున అ ఆ ఐ ఔలు, ఉ ఊ ఒ ఓలు చెల్లును.

'అక్షా దూహిన్యా ముపసంఖ్యానమ్'.

అను సూత్రముచేత 'అక్షోహిణీ, అక్షౌహిణీ'అని గుణవృద్ధులు రెండును గలవు. కొందఱు లాక్షణికులు అక్షౌహిణీ శబ్దము వృద్ధియతులందు వ్రాసినారు. తిమ్మకవి 'లక్షణ సారసంగ్రహ' మందు 'నిత్యసమాసయతు' లందు (2-296) వ్రాసినారు. వృద్ధియతికి అథర్వణ చ్ఛందమున :

గీ. హరియె పరమాత్ముఁడును త్రిలోకైకనాథుఁ
డిందిరాదేవి సర్వలోకైక జనని
యుష్ణకరసూనుఁడయ్యె న క్షౌహిణీశుఁ
డట్ల శల్యుఁడు నాథుఁ డక్షౌహిణులకు. 74

(అని ఉన్నది.) నిత్యసమాసయతికి తిమ్మకవి 'లక్షణ సారసంగ్రహము' నందు (2-266) :

క. అక్షౌహిణి యనఁగా మఱి
యక్షోహిణి యనఁగఁ గృతుల నైత్వోత్వంబుల్
లాక్షణికులు యతు లిడుదురు
దక్షాధ్వర భంగ! పాణితల సారంగా! 75

(అని వ్రాసి)

జైమినీ భారతము : (1-84)

సీ. సందడించుచు దశాక్షౌహిణీసైన్యంబు
లనిశంబు గొలగొల మనుచు నుండ...... 76

ఉద్యోగ పర్వము : (1-226)

క. బాహా బలఘనుఁడు భీముఁడు
సాహసరసికాత్ముఁ డైన సాత్యకియు మహో
గ్రాహవ భూమి సహస్రా
క్షౌహిణు లట్లగుట మీరు చూడరె యెందున్. 77

అని హల్లులకు లక్ష్యములు వ్రాసినారు. అచ్చుకు సుప్రసిద్ధమే. కావున.

'.....సహస్రా, క్షౌహిణి లట్లగుట మీకు నూహకు రాదే'
అని అచ్చుకును యతి చెప్పవచ్చును. ఇవి స్వరయతులు. 78

## -: వ్యంజనాక్షరయతులు :-

### *1*. వర్గయతులు :-

లక్షణము :-

క. అడరఁగ కచటతపంబుల
కడ నొక్కొక వర్ణముడుపఁ గడమవి నాల్గుం
దొడరి తమ తమకె వలులవు
మృడః పీఠపురీ విహారః మృత్యు విదూరాః 79

లక్ష్యములు :-

శ్రీనాథుని కాశీఖండము : (4-202)

సీ. ఘనతరాహంకార కాలకూట విషాన
లాభీలములు కటాక్షాంచలములు
దుర్వార తర తీవ్ర గర్వగల గ్రహా
కలిత గాద్గద్య ఘర్ఘరము మాట
లస్మితా సంభూత విస్మయాపస్మార
విస్మృత ధైర్యంబు వినయగరిమ
యుద్దామ దర్ప భారోష్మదాహ జ్వరా
రంభ సంభృత వికారంబు మనసు

చరణచంక్రమ మభిమాన సంనిపాత
జాత సర్వాంగ భంగంబు జనపతులకు
భూభుజుల తప్పె యది వారిఁ బొందియున్న
ధరణి సామ్రాజ్యభూతంబు తప్పగాక. 80

నాలుగు వర్గయతులు.

అందే : (4-203)

సీ. భువనైక ధన్వియౌ పుష్పాయుధునిచేతఁ
బ్రసవాస్త్రమున వ్రేయఁబడని వాఁడు
యతిగాఢమైన క్రోధాంధకారంబునఁ
గన్నులఁ నంధుండు గానివాఁడు
నిర్బింధ నిరోధ నిద్రాభరంబునఁ
బారవశ్యంబు చేఁబడని వాఁడు
లక్ష్మీకటాక్ష లీలా సీధుమదమున
మనములోపల నన్ను గొననివాఁడు

లేఁడు నరపతి కలిగె నెవ్వాఁడు నృపతి
విశ్వధాత్రీజనులపాలి వేల్పు గాఁడె
బాహ్యశత్రులఁ బరిహరింపంగ వచ్చు
నంతరరుల విసర్జింప నలవిగాదు. 81

నాలుగు వర్గయతులు.

కావ్యాలంకార చూడామణి : (7-37)

సీ. కమనీయ రాజశిఖామణి కవిరాజు
గర్వమహీధ్ర నిర్ఘాతమునకు...... 82

ఇటువలెనే తెలుసుకొనేది. 83

## 2. అఖండవడి :—

లక్షణము :

కవిజనాశ్రయము : (సంజ్ఞా. 66)

ఉ. మానుగ విశ్రమాక్షర సమన్వితమై స్వరమాదినం దదీ
యానుగుణాక్షరంబు గొనియైనను జెప్పఁగ నొప్పు నీ క్రియన్
భాను సహస్రభాసి వృషభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవడి పొల్పగు నాదికవి ప్రణీతమై. 84

తిమ్మకవి లక్షణసార సంగ్రహము : (2-120)

గీ. హల్లునకు హల్లు వడి యిడునపుడు దాని
తుదిని స్వరము ఘటిల్లిన నది యఖండ
వడి యనగఁ బొల్చుఁ గృతుల దేవాదిదేవ
యనుచుఁ జెప్పిన శైలకన్యా సహాయ. 85

లక్ష్యములు :

నూత్నదండి ఆంధ్రభాషా భూషణము : (16)

క. ఆదులు స్వరములు నచ్చులు
కాదు లొగిని వ్యంజనములు హల్లులనంగా
మేదిని నెల్లెడఁ జెల్లును
[1]కాదులు నైదైదుఁ గూడఁగా వర్గంబుల్. 86

శ్రీనాథుని నైషధము : (4-90)

గీ. కాంత! యశ్రుబిందుచ్యుతి కైతవమునఁ
దివిరి బిందుచ్యుతక కేలిఁ దవిలె దీవు
సారె సారెకు నాదు సంసారమునను
పారముగఁ జేయవే సారపాఠనయన! 87

అందే : (6-76)

శా. వైదర్భీ బహుజన్మ నిర్మల తపో వర్ధిష్ణు తల్లోచన
స్వాదుప్రౌఢ విలాస మీ వసుమతీ సంజాత తృష్ణాయుధం
బాదిత్యాన్వయ సార్వభౌమ సుకృతా హంకార [2]దుష్ప్రాభవం
బీ దాంపత్యమునం జిరాయువయి నెమ్మిం బొందుగా
కెంతయున్. 88

1. ము. ప్ర '...కాదులు నైదైదు గూర్పనగు వర్గంబుల్'.
(వావిళ్ల ప్రచురణ. 1949.)
2. ము: ప్ర. '...దుష్ప్రాప ఖై,
మీ దాంపత్యమునం జిరాయువయి నెమ్మిం...'

అఖండవడిలక్షణమందు (కవిజనాశ్రయమున) '...తదీయానుగుణాక్ష రంబుఁ గొనియైనను జెప్పఁగ నొప్పు......' అనగా, ఏ యక్షరమున కా యక్ష రము సరే, లేని పక్షముకు ఆ యక్షరముకు చెల్లిన యే యక్షరమైనా చెప్పవచ్చు నని తాత్పర్యము. గనుకనె, బిందువు దాపలగల బకారము మకారముకు (పై పద్యమున నాల్గవ చరణమందు) యతియైనది. 'ఈ దాంపత్య' మని స్వరము న్నందున నఖండవడి, స్వరము లేకపోతే బిందుయతి. ఇదే '...తదీయాను గుణాక్షర...' మనుట. ఈ రహస్యము తెలియలేరు. మరియును— 89

శ్రీనాథుని నైషధమునందే : (7-194)

ఉ. [1]క్రిక్కిరి సున్న చన్నుఁగవ క్రేవలఁ గాంతియుఁ బంచబాణు క్రొ
వ్వెక్కఁగఁజేయు హస్తయుగ మెత్తిన హారభరంబు [2]పేర్మి గై
పెక్కి ప్రసూనముల్ గురియు వేనలి పీడిచి కొప్పు వెట్టుచో
చొక్కుల పెట్టి భూవిభుని చూపుల కోమలి బాహుమూలముల్

కైపు-ఎక్కి-కై పెక్కి. స్వరము వ పలకు అభేదమునైన అఖండయతి. 91

శ్రీనాథుని కాశీఖండము : (1-63)

క. అంభోధి వలయితావని
[3]సంభరణ ప్రౌఢ నిజ భుజార్గల యుగలీ
సంభావిత కిటి కచ్ఛప
కుంభీనస సార్వభౌమ కులకుధరునకున్. 92

అందే : (6-141)

ఉ. కైటభదైత్యవైరి యధికంబగు నేర్పున మన్నుతేని కు
చ్చాటన మాచరించి తన జక్కి ఖగేంద్రుని బంచెఁ గ్రమ్మఱన్
హాటక లేఖ దానును గజాస్యుఁడు లక్ష్మియుఁ జేసినట్టి కై
లాటమునన్ ఘటిల్లె సకలార్థము దేవర యాజ్ఞ పెంపునన్. 93

---

1. ము. ప్ర. 'క్రిక్కిరి చన్నుదోయి యిరు గ్రేవల'...
2. ము. ప్ర. '...పేర్మికిన్
విక్కి ప్రసూనము ల్గురియు వేనలి వీడిచి...'
3. ము: ప్ర. సంభరణ ప్రౌఢ నిజ భుజయుగ యుగళీ'

అందే : (8-60)

క. చాకున్న నీదు ముక్తులు
శ్రీ కాశీక్షేత్ర మెవ్వరికి నే నిక్కం
బీ కుధరమిచ్చు శిఖరా
[1]లోకన మాత్రమున ముక్తు లుల్లసిలంగన్. 94

చాకున్న—వకార లోపము.

అందే : (5-304)

ఉ. యంత్రిత భక్తిభావమున నగ్నిసమింధన సామిధేని రు
జ్మంత్రము లుచ్చరించుచు సమగ్రతరారణి మంధనక్రియా
తంత్రము లాచరించి వసుధావర ముఖ్యులు వీతిహోత్రు నా
మంత్రణ సేయలేరయిరి మచ్చరికించియుఁ గాశికాపురిన్. 95

పారిజాతాపహరణము : (5-68)

ఉ. దానవ భేది సత్యయును దాను యథోచితవృత్తి మంగల
స్నానమొనర్చి శుభ్రవసనంబులు గట్టి యనర్ఘ రత్న భూ
షానివహంబుఁ బూని హరిచందనచర్చ వహించి బంధు వృ
[2]ద్ధానుమతిన్ సులగ్నమునఁ దద్వ్రతదీక్ష వహించె నయ్యెడన్. 96

నంది మల్లయ కవిన్ని, ఆయన మేనల్లుడు ఘంటా మలయమారుత కవిన్ని రచించిన 'ప్రబోధ చంద్రోదయము':

శా. శ్రీ నిత్యంబుగ నిచ్చుగాత కరుణా శ్రీమత్సుధారాశియై
నానాజీవులలోన రత్నములలోనన్ సూత్రముంబోలెఁ దా
లీనుండయ్యు జగత్కరండక నిచోలీభావముం దాల్చు బో
ధానందైకమయుండు శంకరుఁ డనంతస్వామి గంగయ్యకున్.

---

1. ము. ప్ర. '...లోకన మాత్రమున ముక్తులు కురంగాక్షీ.'
2. ము. ప్ర. '...వృద్ధస
ఖ్యానుమతి న్సులగ్నమున నావ్రత దీక్షవహించె నయ్యెడన్.
(ఎమెస్కో ప్రచురణ)

హరిశ్చంద్రోపాఖ్యానము : (2-180)

ఉ. నేరవు సౌఖ్యమందు ధరణీశ! యజీర్ణముఁ బొందునంచు నా
హారము మాని పెల్లొదవు నాఁకటిచే కృశమై చరించుటల్
సార వివేకమా తలఁప సయ్యన నీ యెలదీఁగెబోఁడులన్
గౌరవశీల! గైకొనుము గాదుసుమీ మది సంశయింపఁగన్. 98

అందే : (3-158)

చ. అలుక జనింపఁ గౌశికమహాముని యేమరిపాటు భీమ భం
గులఁ జనుదెంచి మాధనము గొబ్బునఁదెమ్మని యానవెట్టినన్
గలుగుచు నే యుపాయమును గానక నిన్నును నీ తనూజుఁ గొం
[1]దలమున విక్రయించు వసుధాధిపుఁ డెవ్వరినైనఁ జెచ్చెరన్. 99

అందే : (4-20)

సీ. కుముదమిత్రోపల గోపురంబుల చేత
విద్రుమ ప్రాకార వితతి చేత
మరకత హరినీల మండపంబులచేత
బహుశాత శాత కుంభములచేతఁ
జాల దీపించు ముత్యాల ముగ్గులచేతఁ
గనుపట్టు పట్టు మేల్కట్ల చేతఁ
గమనీయ పద్మరాగ చ్ఛత్రములచేత
వృషరాజ కేతన శ్రేణి చేత

మహిత కర్పూర ధూప ధూమముల చేత
నన్య మాణిక్య నీరాజనములచేత
శంఖ భేరీమృదంగ ఘోషముల చేత
[2]వెలయు నవ్విశ్వనాథు దేవేశుఁగాంచి. 100

---

1. ము. ప్ర. '...కొం, దలమున విక్రయించు వసుధాధవు...'
(వావిళ్ల ప్రచురణ. 1916)
2. ము. ప్ర. 'వెలయు నవ్విశ్వనాథు దేవళముఁగాంచె'
(వావిళ్ల ప్రచురణ. 1916)

అందే : (4-111)

చ, అతిశయ రోషసంయుత మహోహి భయంకర మండలాగ్ర ఖం
డిత రిపుదంతి కుంభతట నిర్గత మౌక్తిక రాజిఁబూని యా
[1]తత జయలక్ష్మికిన్ పరిణతాంగముగాఁ దలఁబ్రాలు వోయు బా
హ్రతతగల క్షత్రవంశజు కరంబులు హాలికవృత్తి కోర్చునే. 101

అందే : (5-88)

చ. [2]పరహిత మార్గవర్తన శుభాకర నన్నొక కొంత సత్కృపా
సరణి గనుంగొన న్వలయు సంపద గల్గిన దానవోలె ని
ష్ఠురగతి మాటలాడెదవు చూడఁగ నే నిరుపేదరాల నె
వ్వరు మరి దిక్కులేరు తగవా నను శోకపయోధి ముంపఁగన్.

చతుర్థచరణమందు కాకుస్వరయతి.

రుక్మాంగద చరిత్రము : (4-132)

క. తెలుపెక్కె దశల వెన్నెల
బలుపెక్కె చకోరములకుఁ బంధువులయ్యెన్
బొలుపెక్కెఁ గలువలకు మఱి
నలుపెక్కెం జక్కవలకు నల విరహులకున్. 103

అందే : (4-134)

క. ఆఁకటఁ జిక్కె జలంబుల
కేకరి పెను దప్పిఁ బెదవు లెండఁగ నేడి
ట్టి కలములోన నూరక
[3]నాఁకటికిని నవయనని మనం బురి యాడన్. 104

1. ము. ప్ర. '...యా, యత జయలక్ష్మికిన్ బరిణ యాంగముగా...'
(వావిళ్ల ప్రచురణ. 1916)
2. ము. ప్ర. 'పరహిత మార్గవర్తన శుభంకర...'
(వావిళ్ల ప్రచురణ. 1916)
3. ము. ప్ర. 'నా కేటికి నవయ నని మనం బురియాడన్'
(వావిళ్ల ప్రచురణ 1954)

అందే : (4-48)

ఉ. ఏనుఁగు నెక్కి భేరి మొఱయించుచు నిస్సహణాతి ఘూరి ని
[1]ష్వాణము లుల్లసిల్ల జలజాప్త కులేందుని యాజ్ఞ...' 105

అందే : (5-195)

సీ. అక్కథకుఁడు శౌనకాది సన్మునులకు
రుక్మాంగదుని కథ రూఢిగాను
జెప్పి, యో మునులార చిరతర భక్తితో
మది మెచ్చి యీ కథ చదువువారు
పుస్తకంబు లిఖించి పూనిక వినువారు
కలశాంబునిధిశాయి కరుణచేత
ధనధాన్య పుత్రపౌత్రాయు రైశ్వర్య వై
భవ శత్రుజయము సద్భక్తి గలిగి

యంత మీఁదట సిద్ధ విద్యాధరోర
గులకు దుర్లభమైన వైకుంఠపురము
నందు నిజపుత్ర పౌత్ర దారాన్వితముగ
నూర్జిత ప్రాభవంబున నుందు రనుచు. 106

చేమకూరవారి విజయ విలాసము : (2-84)

క. [2]చనుఁ దచ్చోటికి నిపుడిం
పెనయ నగ నదుఃఖ పంచ ఖిస్సహ యనుటన్
వినియుందురెకద యేటికి
మనమున నుమ్మలికనొంద మదవతులారా! 107

---

1. ము. ప్ర. '...ని, స్వానము లుల్లసిల్లఁ జలజాత హితేందు
విశాలవీధులన్' (వావిళ్ల ప్రచురణ. 1954)

2. ము. ప్ర. 'చనుఁ డచటికి నిపు డింపెన
య, 'న దుఃఖం పంచఖిస్సహా' యనంగా మున్...,'

అందే : (1-147)

చ. ఒకచిగురాకుకొమ్మ పిక మొక్క ప్రసూనలతాగ్రసీమఁ దేం
[1]ట్లొక ఫలశాఖ రాచిలుకలున్ రొదసేయఁగ గాడ్పువొందు వా
యక పయివెన్నెలల్వొలయ నామని యొప్పులఁ జాల నందమౌ
నొక యెలమావిక్రింద మరుఁడో యనఁగా నరుఁడుండె వేడుకన్.

చేమకూరవారి సారంగధర చరిత్రము : (2-195)

క. ఈరీతి శిరసు మజ్జన
[2]మారోగణమైన సుమణి మయపాదుక లా
య్యారగముగ మెట్టి యుడిగపు
నీరజముఖి కేలుపట్టి నృపుఁ డింపెసఁగన్ 109

అందే : (2-261)

చ. మిగుల దృఢంబుజేసి దగ మీరడుగం దగఁ బంపఁజెల్లు ని
మ్మగువనె యింక నిక్కమగు మాటకు సందడగింపు డూరకే
బెగడకు మారు నాఅడిని బెట్టఁగఁ జెల్లదు వింటలేదె యిం
టి గెలిచి రచ్చగెల్వుమను నానుడి నానుడి నిశ్చయంబుగన్. 110

చివరి (చరణమందు) అనునాసికయతిచేత వచ్చిన యఖండయతి.

అందే : (2-144)

ఉ. కావక రాజుచిత్తము వకావకలై తెగఁ జూమనట్టు లా
హా, విపరీతమైన పలుకాడెద నంటివి మున్వినాశకా
లే విపరీతబుద్ధి యని లెస్స బయల్పడఁ జెప్పినారె కా
నీ విధియాడు మీయనఁగ నీ విధి యాడెదుసుమ్మి భామినీ! 111

చివర (చరణమం దఖండయతి)

---

1. ము. ప్ర. '...దేం, ట్లొకఫలశాఖ రాచిలుకయున్ రొదసేయఁగ...'
2. ము. ప్ర. 'మజ్జన, మారోగణమయి మణిమయపుఁబాదుక...'

అందే : (3-257)

గీ. కాంచి యపుడ ప్రమోదించి మంచి దింక
నడవగాలేక యుఁడెడు నాతనికిని
దనకరము లిచ్చి హరిపట్టి యొసర పట్టి
యల నడుగిడఁగ జేసెఁ బాలుడుఁగఁజేసి. 112

శ్రీరంగమాహాత్యము :

ఉ. ఆకులవృత్తి రాఘవు శరాగ్రమునందు తృణాగ్నలగ్నసీ
రాకృతి వార్ధి నిల్చుట దశాననుఁ డీల్గుట మిథ్యగాదె వా
ల్మీకులు చెప్పకున్నఁగృతిలేని నరేశ్వరు వర్తనంబు ర
త్నాకరవేష్టితావని వినంబడ దాతఁడు మేరువెత్తినన్. 113

జైమిని భారతము : (6-249)

క. ఘోర దురితావహంబగు
[1]శ్రీరామాయణము చదివి రీవిధమున నా
నా రాగరచనఁ దుంబుర
నారదు లన నఖిల జన మనః ప్రమోదమునన్. 114

శ్రీనాథాది మహాకవి లక్ష్యములు పైఁ వ్రాసినాము. మరియును గలవు గాని, కొందఱు భారత లక్ష్యములేదని, అఖండయతి మంచిదిగాదని, కనుకనే, అప్పకవిగారొప్పినారు కారని తలంతురు. భారత లక్ష్యము లనేకములు గలవు. అప్పకవిగారు దిద్దినవి వ్రాసుతున్నాము. 115

కాకునూరి అప్పకవిగారు "ఆంధ్రశబ్ద చింతామణి" యందు (3-202)

ఉ. నన్నయముఖ్య సత్కవిజనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాఠకాధములు గొన్నియుఁ బోకడవెట్టి తక్కువై
యున్నెడఁ గాంచిజానపదు లోదక దిద్దినఁ దప్పుత్రోవ లె
ల్లన్నిజమంచుఁగైకొనిన లక్షణకర్తలు సమ్మతింతురే. 116

1. ము.ప్ర. '...శ్రీరామాయణము చదివిరి వివిధమగు నా నారాగ రచన...
(వావిళ్ల. 1958)

వ. అది యెట్లనిన, సులక్షణసారంబునందు లింగముగుంట తిమ్మన వ్రాసిన యప్రశస్తంబులగు లక్ష్యంబులకు నాశ్చర్యంబు నొంది, బహు పుస్తకంబులు నిరీక్షించి, వాని నెల్లను బ్రక్షిప్తంబులుగా నెఱింగినవాఁడనై లక్షణవంతంబులగు పురాతన కవి ప్రోక్తంబులు వివరించెద :— 117

అదిపర్వము : (5-131)

క. నా వచనమున నసత్యము
గావిలచుచుం గుంతి నీకుఁ గడునెయ్యమునన్
నీ వగచిన యీ యర్థమ
సూవె మనంబునఁ దలంచు సుందరి ! యెపుడున్. 118

అని వ్రాసినారు.

అయితే, 'మునుపున్న పాఠమిది, మధ్యవారు చెప్పిన పాఠమిది' అని వ్రాయలేదు. శ్రోత్రియుడు చండాలుని పేరుచ్చరించనటుల ఆ పాఠమే వ్రాసినారుగాదు. తమరు దిద్దినది ఇదియని యెవరికి తెలియగలదు? మునుపున్న పాఠమని లింగముగుంట తిమ్మన్న మాత్రమే గాదు, లాక్షణికు లందఱును లక్ష్యము వ్రాసినది.

'...సూవె మనంబునఁ దలంచు చుండెద నేనున్'

అని యున్నది. ఇటుల నుండుటే, శ్రీ వ్యాసకృత శ్లోకార్థము ననుసరించి యున్నది.

'మమాప్యేష సదా మాద్రి, హృద్యర్థః పరివర్తతే'

'నా యొక్క హృదయమందున్న యీ యర్థమే యెపుడు నుండుచున్నది' అని అర్థము గదా! 'సదా స్మరామి, ధ్యాయామి, చింతయా' మిత్యాది క్రియా పదములు లేవు. 'తలంతు' నని సకర్మకము గాదు. 'ఏ షోర్థ స్సదా పరివర్తతే' అని నందు వలననే, 'తలంచుచుండెద' నని నన్నయభట్టు గారున్ను రచించినారు. కవితాశయ్య నాలోచించితే, యే పాఠము సాఫుగా నున్నదో కవిత్వకలా ధురంధరులకు స్పష్టము కాగలదు. 'అప్పకవి గారు మాత్రము కవితాశయ్య నెఱుంగనివారా?' అనరాదు. కవితాశయ్య నెఱింగినా, అఖండ

వడియందు నఖండద్వేషముగావ, కామక్రోధములు గ్రమ్మితే నెంత వారికిని తత్త్వము పట్టుపడదు. కామమే కాకపోతే, ఏ మహాకవి ప్రయోగములున్నవని 'మవర్ణ విరామము' నిలిపిరి ? ఏ మహాకవిప్రయోగములు లేవని యఖండ యతిని ఖండించిరి ? ఇంత మాత్రమున నఖండయతి ఖండితమగునా !

(ఇక) ఉద్యోగపర్వము (4-140) నందు దిద్దినది :—

చ. అని తగ నిశ్చయించి తగునందఱఁ బిల్వఁగఁ బంచి వారితో
ననిచిన మాటలాడి వినయంబునఁ బ్రార్థనఁజేసి మీరు మా
కొనరిన సైన్యముల్ పదునొకొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ
చ్చిన సకలంబు నొప్ప నభిషేకము గైకొనుఁ డుత్సవంబునన్.

దీని మూడవ పాదంబునందు పదునొకొంటికి ననియున్న చోట సంధిని గూర్చి— "స్వరప్రధానవడిగాను సోమయాజులు గారు ప్రయోగించినారు. ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్యనిత్య సమాసవడియని యనుకొందురు" అని వ్రాసినారు.

'ఒకొంటికి' అను పదమందు సంధిలేదు. రెండు పదము లయితే సంధి యుండును. ఇది యఖండవడి. ఇచ్చట దిద్దుటకు శక్యముగాక పదద్వయ మన్నారు. ఉయ్యేల, పయ్యెద- ఎట్టివో, ఇది యున్ను నేకపదమే. ఒకటి- ఒకొటి అని ఒత్వమున్ను తలకట్టున్ను రెండు విధములు గలవు. అప్పకవిగారు 'ఆంధ్ర శబ్దచింతామణి' (2-92) యందు :—

గీ కాంచు హ్రస్వద్వితీయ వక్రంబునంద
యొక్కఁడను దీని రెండవ యక్కరంబు
హ్రస్వమగు చోటను పదంబునందు మొదటి
వర్ణమును గబ్బములను గావలసినపుడు." 120

అని, అందఱు-అందొఱు, ఒక్కఁడు-ఒకొక్కఁడు రెండు విధములు చెప్పి లక్ష్యములున్ను వ్రాసినారు. ఒండు. ఒకటి, ఒక్కటి, ఒక్కండు, ఒకొక్కటి ఒకొటి, ఒకొండు— అని ఉన్నందున, 'పదునొకొంటికి' అనుచోట నకారమందు స్వరమున్నదిగాని, కకారమందు స్వరములేదు. కకారము యతిగాని, నకారము

గాదు. 'ఇంత భ్రాంతత్వ మప్పకవిగారి కుండునా?' అని పండితంమన్యకవులకు భ్రాంతత్వము గలదు. 'ఒకొంటి' కనుచోట స్వరముంటే, స్త్రీపర్వము (1-83) నందలి—

'క. పాండవుల వలన గీడొ
క్కొండును లేదధిప నీదు కొడుకులు ధరణీ
మండల మంతయు గ్రింగిరి
పాండు నృపతి భాగమునకుఁ బాపిరి వారిన్' 121

(అను పద్యమందు) 'కొడుకు' లనుచోట స్వరము లేక పోవుట పామరులకును స్పష్టమే గనుక ఇచ్చట అప్పకవిగారి మతమున (గూడ) నఖండవడి యనక వల్లగాదు. అయితే, వాస్తవమునకు నిచ్చట వర్గయతి. అచ్చట నఖండ యతి. ఈ పద్యము నప్పకవిగారు చూచితే, అచ్చట స్వరప్రధాన వడియని సోమయాజిగారు తమతో చెప్పినట్టు వ్రాయరు. 'ఒకొంట' కనుచోట స్వరమయితే లేదుగాని, మూఢు లవలంబించిన మార్గము తమరు అవలంబించితే, దేశ్యనిత్యసమాసము ఉభయవడి గనుక తమ మతము నిలువబట్టును. సుప్రసిద్ధమైన యఖండవడిని ఖండించబోతే, అప్పకవిగారి పాండిత్య మహిమకు చెప్పరాని మహిమ సంభవించినది. మరియును భారతమందు ఖండించిన పద్యము లిటువంటివే కలవు అవి యన్నియు నెన్నియని వ్రాయము? 122

అచ్చు పుస్తకములందు '...మీరలీ, యొనరిన సైన్యముల్...' అని దిద్దినారు. అర్థ మెఱుగలేదు, సరే కదా, యతిభంగమును గానరు. 123

అప్పకవిగారు ('ఆంధ్రశబ్ద చింతామణి' యందు) :

క. వీఁకఁ బఱతెంచి నల్గడ
దాకినఁ గడునలిగి ఘోరతర శరతతి న
మ్మూకలు విరియఁగ నర్జునుఁ
డా కరమున నేసె నుగ్రుఁడై రణభూమిన్' (ఆది. 8.200) 124

అని అర్థబిందు ప్రాసముకు లక్ష్యము వ్రాసినారు. 'అర్జునుడు ఆ కరమున నేసె' అని అర్థము చెప్పవలెగదా. 'ఆ కరమ'నగా, నదివరకు నొక కర

ముతో యుద్ధము చేసినట్లు లేదు. కావున 'ఆకరము' అనుట పొసగదు. ఈ పద్యముకు పైనున్న పద్యము (ఇది).

ఉ. వీరుఁడు వీఁడు పాండవుఁడు వృష్ణికులోత్తములైన సీరి దై
త్యారు లెఱుంగకుండగ మహారథుఁడై తరుణిన్ సుభద్ర నం
భోరుహనేత్రఁ దోడ్కొనుచుఁ బోయెడు నీతని బోవ నిచ్చినన్
ధీరుఁడు మాధవుండు బలదేవుఁడు నల్గుదు రంచు నడ్డమై 125

క. 'వీఁకఁ బఱతెంచి......'

అని పద్యమున్నది. 'కవ్వడి డాకరమున నేసె' అని యుండవలె గాని అర్జునుడంటే కుదురదు. ఇదియు నఖండయతి. 126

(ఇక) భాస్కర రామాయణమందు దిద్దినవి :—

ఉ. అన్నను తండ్రియట్ల విను మంతియకా దటమీద రాజ వే
మన్నఁగొ అంతలేదు మణిమండన ముఖ్యములైన కానుకల్
మున్నుగ సీతనిచ్చి జనలోకవిభున్ శరణంబు వేడుమీ
సన్నపు కార్యముల్ వలదు సంధియె మే, లటుగాక తక్కినన్.

ఈ పద్యము నప్పకవిగారికి పూర్వలాక్షణికులును, నవీనలాక్షణికులును నఖండవడికి లక్ష్యము వ్రాసినారు. "...మణి హారము లాదిగ బెక్కు కానుకల్..." అని ఎనిమిదక్షరములు దిద్దినారు. మఱిన్ని— 128

ఉ. ఓ కపివీరులార! కరుణోదధి నీ రఘురాము సర్వలో
కైక శరణ్యునిం గొలువఁగా నిటు వచ్చితి నొండుగాదు నా
రాక మహాపరాధియగు రావణు తమ్ముఁడ నే విభీషణా
ఖ్యాకుఁడ వీరు నాసచివు లర్కకులాగ్రణి తోడఁ జెప్పరే. 129

అను ఈ పద్యమందు "లోకైక...గొలువ నిప్పుడు వచ్చితి..." అని దిద్దినారు. దిద్దిన దేకవి కవిత్వమో, మునుపున్న పాఠము లేకవి కవిత్వమో సుకవు లాలోచించితే స్పష్టమే కాగలదు. ఒకచోటనైనా, మునుపున్న పాఠ మిది అని వ్రాయలేదు. అఖండవడియందు నఖండద్వేషముగలవారు, కవి జనాశ్రయ మందలి "మానుగ విశ్రమాక్షర సమన్వితమై..." అను నీ పద్యము

ఉపసర్గ సంధివడికి లక్ష్యము వ్రాసినారు, అనేక లక్ష్యము లుండఁగా, తమకు విరోధమైన ఈ పద్యము నుదహరించి నందున ఛాందసత్వముకు సంతోషించినాము. 130

ఇటువలెనే దిద్దినవి మరియును గలవు. భారతమందు దిద్దినవి ౩, రామాయణమందు దిద్దినవి ౨ (పైన చూపినాము.) ఆయన దిద్దుటకు శక్యము కాకనో, లేక చూడకనో దిగనాడిన పద్యములు నన్నయభట్టు గారివి, ఎఱ్ఱా ప్రెగడగారివి, సోమయాజిగారివి అనేకములు గలవు. వ్రాసుతున్నాము. 131

అది పర్వము (5-151) :—

ఉ. వీరలు దైవశక్తిఁ బ్రభవించిన వారనుచేమి [1]సందియం
బీ రమణీయకాంతి నుపమింపఁగ వేల్పులెగాక యిట్టి యా
కార విశేష సంపద ప్రకాశిత తేజము పేర్మిఁజూడ సా
ధారణ మర్త్యులే యని ముదంబునఁ జేరుట తమ్ముఁ జూడఁగన్. 132

---

1. '......సందియం
బే, రమణీయ కాంతి నుమమింపఁగ ......" అవి వ్రాతప్రతులలో కనుపించు నొక పాఠాంతరమని శ్రీ చిలుకూరి నారాయణ రావుగారు 'నన్నయ యతులు' అను వ్యాసమున (భారతి జూన్ 1927) వ్రాసినారు. అప్పుడిది బిందుయతి యగును గాని యఖండయతి కాదు.

"ఉదయించిన..." "కాంతిని వహింపగ..." అని ఉ, వి. వ, ప్రతియందు పాఠాంతరములు చూపబడినవి. 'మరియు ఈ పద్యము ప్రథమ ద్వితీయ చరణములలో 'నిత్య సమాసపడి'

'పదము విభజించి చెప్పఁ జొప్పడని యదియు
నన్య శబ్దంబుగొని విగ్రహంబుఁ జెప్పు
నదియు నిత్యసమాసమై యలరుచుండు
నట్టిసంధుల నచ్చు హల్లైన విరతి'

అని లక్షణము. అని భారతము లక్ష్మీపతి కూర్చిన వ్యాఖ్యలో నున్నట్లు చెప్పబడినది, కాని "ప్రభవించు" "ఉపమింపగ" అనునవి నిత్య సమాసములగుట కుదురదు.

—"సందియంబు-ఈ రమణీయ" అని స్వరమున్నది. ఇది బిందుయతిచేనైన యఖండయతి. 'ఉపమింపగ'ననుచోట స్వరములేదు. నైషధమందు పద్యములు రెండు, సారంగధర చరిత్ర యందు నొకటియు, [1]నిదియు నొక విధమైనవి. కొందఱు 'ఉపమ-ఇంపగ'అని స్వరమనుకొందురు. కాని,

సభాపర్వ మందలి : 2-114

ఉ భావిపురాతనాద్యతన పార్థివలక్ష్ములు పొందవేయు ల
క్ష్మీ విభవంబుతోఁడ నుపమింప సమంబులుగా వశేష రా
జావళిలోన నత్యధికులైన సపత్నులపేర్మి సూచియేఁ
జూవె సహింపనోపక కృశుండ వివర్ణుఁడ నైతి నెంతయున్. 133

అను ఈ పద్యమున రెండవ చరణమందు "ఉపమింప"లో ఉపమ-ఇంపగ అని స్వరము లేదని తేలును. 134

ఆదిపర్వము (8-200) నందే:—

ఉ. క్రచ్చఱ నొక్క రక్కసుఁడ కాదు సురాసురులెల్ల నొక్కటై
వచ్చిన నీవ చూడఁగ నవార్య బలోన్నతిఁ జేసి వారలన్
వ్రచ్చి వధింతుగాక యిటు వచ్చి శ్రమంపడి[2]యున్నచోట నే
నిచ్చగ వీరిద్దైన సుఖనిద్రకు భంగము సేయనేర్తునే. 135

చివర చరణమందు అఖండయతి.

అరణ్య పర్వము : (2-248)

క. అమరవరులందుఁ బురుషో
త్తముఁ డెట్లు విశేషమట్ల ధరణిం గల [3]తీ
ర్థములందును పుష్కరతీ
ర్థము గరము విశేషమభి మతార్థప్రదమై. 136

---

1. ఇదే ఆశ్వాస మందలి 88, 90, 117వ పద్యములు.
2. ము. ప్ర. '...యున్న నిచ్చట
నెమ్మెచ్చగు వీరిద్దైన సుఖనిద్రకు...'
3. ము. ప్ర. '...తీ, ర్థములందుఁ బుష్కర త్రితయము, గరము విశేషమభిమతార్థప్రదమై'

అందే : (4-148)

క. వాసవ నందన సఖుఁడగు
భూసురుఁ డొకఁ డరుగుదెంచి భూవినుతగుణో
ద్భాసితు ధర్మజు [1]దీ|ప్రస
భాసీనుం గాంచి పలికెఁ బరమ |ప్రేమన్ 137

అందే (5-289) :—

ఉ. ఒక్కదినంబునందు బలియుండు సురారులనెల్లఁ దున్మి పెం
పెక్కి దయార్ద్రుఁడై యభయమిచ్చె జనంబులకెల్ల షణ్ముఖుం
డిక్కథ భక్తితో వినిన నెప్పుడు కీర్తన చేసినం జనుల్
నిక్కము సర్వదోషముల నీగి భజింతురు భవ్య భద్రముల్. 138

చివర (చరణమునం దఖండయతి)

అందే : (6–1)
క. శ్రీ లలిత మూర్తి సుమహా
చ్చాలుక్యవరేణ్య పుణ్య చారిత్ర విచి
త్రాలంకారో జ్జ్వల[2] కలి
తాలాప కలాప సంతతస్మేరమతీ!. 139

అందే: (7-21)

సీ. అయ్యలార జటాయు వని పల్కెదరు మీర
లెవ్వరు చెప్పరే, యేను వాని
నగ్రజుండ, ననూరు నాత్మజన్ముల మేము
సంపాతి నాపేరు సమ్మదమున
నేనును దమ్ముండు నినమండలమునకుఁ
జన వేడ్క నొకనాడు చదల నెగసి
చనఁ జన తీవ్రాంశు సంతాపమునఁజేసి
కమరె నాఱెక్కలు కమరవయ్యె

---

1. ము. ప్ర. '...విప్రస,
భాసీనుంగాంచి యిట్టు లనియెం బ్రీతిన్'
2. ము. ప్ర. '...కవి, తాలాప కలాప సంతతానందమతీ'

ననుజపక్షమ్ము లే నిమ్మహాచలమునందు
[1]నాటగోలెను నెచటికి నరుగనేర
కున్నవాఁడ నాతమ్ముఁ డెట్లున్నవాఁడొ
యెఱుఁగ, నెఱిఁగింపరే నాకు నిష్టమెసఁగ.

(సీస గీతపు రెండవ చరణమందు) "అరుగనేర" అని స్వరము. 140

అందే : (7-406)

సీ. అపగత జనశబ్దమై యనభివ్యక్తి
మార్గమై యవిరల దుర్గ శైల
తరు గుల్మ వల్లీ వితానమై గజ సింహ
శరభ శార్దూల సూకర లులాయ
బహులమై బహువిధ పక్షికోలాహల
భయదమై కడు పరపైన యడవి [2]
ననుజుల వెదుకుచు ననఘుండు సని కాంచె
కమలాకరంబు తీరమునఁ బడిన
వారిఁజారు వంశవరుల భీమార్జున
యముల నమితబలుల విమలమతుల
ప్రలయ పతిత లోకపాల సంకాశుల
భూరి పుణ్యధనుల వీరవరుల 141

1. ము. ప్ర. 'నాఁటఁగోలె నెచ్చటికిఁ జనంగనేర'

2. ఈ సీసము నన్నయగారి సీసపద్య రచనా పద్ధతి ననుసరించి సీసపాద పూర్వదళమున సరూపాక్షరయతి, ఉత్తరదళమున ప్రాసయతి చెల్లెడు తీరుకు చెందినది, తృతీయపాదమున ఉత్తరదళమున 'పరపైన'అని అన్నచో ఆ పద్ధతి (సరూపాక్షరయతి చెల్లుటవలన) చెడును. సా.అ. ప్రతి. ఉ.వి. ప్రతి యందు పాఠమిట్లేయున్నది. కాని 'భయదమై కడుపర-వయిన యడవి'యని యున్నచో ప్రాసయతి చెల్లి సీసము సరిగానుండును. (ఎఱ్ఱనగారు సీస పద్య రచనలో యతి ప్రాసయతుల చెల్లింపులో నన్నయగారినే భారతమున అను సరించినారు.) అప్పుడు ఈ అఖండయతి చెల్లినదనుటకు వీలుండదు.

(మూడవ చరణము ఉత్తర భాగమున) "పరపు-అయిన" స్వరము.

అందే : (7-412)

చ. పుడమియు నర్థసంపదయుఁ బొల్పఱ వైరుల పాలుజేసి యీ
యడవికి వచ్చి భీకర మృగావలి పొందున నున్న వీరి వె
న్నడికొని యిట్లుసేసెనె యనాథులవోలె విధాతృఁ డింక నె
క్కడి జనువాఁడ నేది కడగాఁ దరియింతు దురంత దుఃఖముల్ 142

విరాట పర్వము : (1–234)

ఉ. ఆయత బాహులు న్వెడదయైన సమున్నత వక్షమున్ [1]సరో
జాయత లోచనంబులు ప్రసన్నముఖంబు నుదాత్తరేఖయున్
(గాయజుఁ గ్రేణిసేయు ననఁ గౌశిక మీఱు ననంగ విభ్రమ
శ్రీయును బెంపునుం గలుగఁగఁజేసి విధాతృఁడు పేఁడిఁజేసెనే)142

అందే : (5-19)

క. వివిధములగు లక్ష్యంబుల
నవలీలం దునియనాట నవయఁగఁ జేయన్
భువనైక ధన్వి నత్యు
గ్రవిచేష్టితు నొర్చి పరశురాముం బోరన్. 144

(రెండవ చరణమందు) "నవియగ" అను పదమందు అచ్చులేదు.

(ఉదాహరణకు) అరణ్య పర్వము (4-118) నందు :

సీ. గీ. కలశభవుఁ డగస్త్యుఁ డలిగి యత్యుగ్రాహి
వగుమ యనుచు శాప మనఘుఁ డిచ్చె.

---

1. 'సరోజాయత' అని పెక్కు ప్రతులయందున్నదని చెప్పుచు ఉ. వి. వి ప్రతిలో 'కాని యతిభంగము' అని కుండలీకరణమున వ్రాయబడినది. కాగా ఇది 'అఖండయతి'యని స్పష్టము.

మునివరేణ్యు శాపమునఁజేసి యప్పాట
నవయు చున్నవాఁడ నాటఁగోలె. 145

(అను పద్యము చివర చరణమున "నవయు"లో అచ్చు లేదని తేలును)

ఉద్యోగ పర్వము : (2-259)

క. దేవత లేటికి పార్థుఁడు
దేవసముఁడెగాఁడు వాఁడు దివిజులచేతం
బోవని దైత్యులఁ జంపడె
[1]నీవును నీవారు నతని నెఱుఁగ (రె. చెపుమా). 146

అందే : (3-165)

క. అనవుడు భీష్ముఁడు ధృతరా
ష్ట్రిన కిట్లను నీవు నీకొడుకు నేమేమి
చ్చిన నొకటి యీఁగి లేకు
న్నను వేరొక్కటి దలంచు నా కేశవుఁడున్ 147

అందే : (3-183)

సీ. నీతిఁ బెరుగుట నీతిమంతులు పుణ్య
పరులు శూరులుగదా పాండుసుతులు
సుఖవృత్తిఁ బెక్కండ్రు సూరెలఁ గొలువ నుం
డెడు వార లిడుమలఁ బడుచు నిర్జ
నంబైన కానలోనన యెట్టులుండిరి
ననుబెట్టి నాయెడఁ గొనుచుఁ జనిరి
[2]నేను వద్దింపంగ నింపారఁ గుడిచి మె
త్తని సెజ్జ నిద్రించి (వినుత) భద్ర

1. ము. ప్ర. 'యీవును నీవారు నతని నెఱుఁగరె చెపుమా'
2. ము. ప్ర. 'యేను వడ్డింపంగ నింపారఁ గుడిచి...'

గాన కరిబృంహితముల మేల్కాంచునట్టి
వారు కందమూలంబు లాహారములుగఁ
బొదలఁబుట్టలఁ బడియుండి పులుఁగుమెకము
లరువ మేల్కను చుండిరే యక్కటకట. 148

(నాల్గవ చరణమందు) "ఇఁపార" స్వరము. "ఏను వర్ధింపంగ" నంటే, విసంధి. అఖండ యతినైనను, విసంధినైన నొకటి నంగీకరింప వలెను.

అందే : (4-161)

సీ. కయ్యంబునకుఁ బెద్దగాలమేనియుఁ జూచి
పట్టిపచ్చితిఁ గడుఁ బరవసమున
సంజయుతో మీరు శంకలేకాడిన
యెక్కుడు మాటలు పెక్కుగలవు
భూమి భాగము గోలుపోయిన యలుకయు
ద్రౌపది బన్నంపు దైన్యమునకుఁ
దగ మంచి బంటవై తఱియిది బాహు బ
లాస్త్రవిద్యలు సూప నని తలంచి
నిలువ వలయు నీకుఁగలవారి నెల్లను
గూర్చి మోహరించి కొని కడంగి
[1]నడుపు సమరమునకు నలికినఁ బోదింకఁ
దప్పఁ గ్రుంకఁ జనదు తఱికిఁ జొనుము. 150

(సీస గీతము మూడవ చరణమందు) "అలికిన" స్వరము.

భీష్మపర్వము : (1-6)

క. కాలంబగుటయు నృపులకు
నాలము సమకూరె దీనికదలకు మది నీ

1. ము. ప్ర. 'నడపు సమరమునకు వెడ జంకఁబో దింక'

వాలోకింపఁగ [1]వలసిన
నీ లోనికి దివ్యదృష్టి నిచ్చెద పుత్రా! 151

అందే : (2-187)

క. పదిటం ధృష్టద్యుమ్నునిఁ
బదియమ్ముల నతని సూతుఁ బటు రయమున ను
న్మదుఁడై నొప్పించిన కెం[2]
పొదవిన మోమల్లనవ్వు పొలుపున నొప్పెన్. 152

ద్రోణ పర్వము (1-64) :—

ఉ. ప్రాయపు కల్మినొక్కట నభవ్యధృతి న్మహనీయ శీలతన్
సాయక పంజరం బటు భుజా విభవంబునఁ గార్యతంత్ర[3] శి
క్షాయతబుద్ధి వృద్ధుఁడవు గావె ధరామరవర్య మున్న గాం
గేయుఁడు మాకు నెల్ల నెఱిఁగింపఁడె నీదు మహానుభావమున్.

అందే : (3-59)

గీ. [4]నఱికి తోడన హరిమేన నతని యొడల
నేయు గురు విల్లు విఱువంగనేయఁ దలఁచె
నక్కిరీటి యాలోనన నతని మౌర్వి
వికలముగఁజేసె నాధనుర్వేది గురుఁడు.

అందే : (4-248)

క. విను మడుగులపైఁ బడియై
నను నెంగిలిఁ గుడిచియైన నరులకుఁ బగ లోఁ

1. ము. ప్ర. '...వలసిన, నే లోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్రా'
2. ము. ప్ర. ...కెం, పొదవినమో మలతినవ్వు నొప్పున నొప్పెన్'
3. ము. ప్ర. '...శి, క్షాయుత బుద్ధివృద్ధుఁడవుగావె...'
4. ము. ప్ర. 'నఱికి తోడన హరిమేన నరుని యొడల'

గొని యరుల పెను పడచి బ్రతు
కన వలయు నిహమ్ము పరము గలుగునె చెడినన్.[1] 155

కర్ణ పర్వము : (2-355)

ఉ. మ్రొగ్గెడు వాహనంబులను మోములు వాడఁగ వాహనంబులన్
డిగ్గి తొలంగు సైనికు లనేకులు కష్టపు చొప్పు చొప్పడన్
దగ్గ సిడంబులున్ గులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి యొంటిమై
[2]మ్రగ్గెడువారునై కురు ధరాధిపు సైన్యము రూపు మాయఁగన్.

అప్పకవిగారు 'కురుధరావరు' అని దిద్దినారు. అందఱు 'ధరాధిపు' అనే అంగీకరించినారు. ఆ పద మతికి యున్నది.

శల్య పర్వము : (1-87)

శా. గంగానందను పోటుమెచ్చక గురుం గాదంచు రాధాతనూ
జుం గీడాడుచు నీతఁడెవ్వఁడొకొ యంచున్ శల్యుఁడే యిట్టివా
నిం గయ్యంబుల మున్ను గాన మనుచున్ వేభంగులం [3]జూపఱె
ల్లం గీర్తింప ధనుఃకలానిపుణ లీలాభీలతం జూపెడన్. 158

అందే : (2-337)

క. గురుకర్ణుల యస్త్రాగ్నుల
[4]నెరసినయది మున్నుదీని నిటుగా నుండున్

---

1. ఈపద్యమున అఖండయతి కన్పించదు. 'బనను' లో 'న' మీద అచ్చు విరుగదు. 'బ్రతుకనవలయు' నన్నప్పుడును 'క' మీద కూడ అచ్చు విరుగదు. 'బ్రతుకనేవలయు' ననియర్థము. 'బ్రతుకు + అనవలయు' అని వేం. రా. పద. విభాగము చేసినట్లు తోచును. గాని అది సరికాదు.

2. ము. ప్ర. 'మ్రగ్గెడు వారునై కురుధరావరు...'

3. ము. ప్ర. '...జూపఱె, ల్లం గీర్తింప ధనుఃకలానిపుణ లీలాఖేలతన్ జూపెడన్'

4. 'నెరయు' హలాదిగా నున్నదనవలెను. 'నెరసినయది' అని ము. ప్ర. 'అగ్నులన్ + ఎరిసిన' అని విభాగము. అప్పు డఖండయతి కాదు.

ఱరువడి రక్షించితి సం
గరము దెగినఁ దొలఁగి యిపుడు కాలవిడచితిన్. 159

(రెండవ చరణమందు) 'ఇటు' స్వరము.

సౌప్తిక పర్వము : (1-61)

సీ. పఱచిన వారికిఁ బగ మారు సలుపంగ
నుత్సహించుట కడు నొప్పుగాగె
దైవయోగంబునఁ దగిన యుద్యోగంబు
నీ మానసంబున నెలవు కొసియె
మాకు నీపూన్కి సమ్మత మది మేమును
నీ తోడివారము నీవు డస్సి
యున్నవాఁడవు నిద్రయును లేకయున్నది
[1]వేగిర పడియెద వేల యింత
నెమ్మి డప్పిదేఱ నిద్రించి వేగిన
తెలివితోడ నత్యుదీర్ణ వృత్తిఁ
గడఁగి మేము తోడ నడతేర నడరిన
యరిగణంబు గెలుతు నక్రమమున. 160

అందే : (2-81)

క. ఏ నొక్కని పాండవ సం
తానార్థముగాగ నిత్తు ధర్మముల మహా
దానంబులఁ గ్రతువుల [2]జన
తా నందితుఁడగుచుఁ బెంపు దలకొనువానిన్. 161

1. ము. ప్ర. 'వెడగర పడియె దీ యడవిలోన'

2. 'జనతా + ఆనందితుఁడు' అని విరిగిన అఖండయతి. జనతా + నందితుడు' అనినచో అఖండయతి కాదు.

అందే : (2-99)

ఉ. [1]నామనమార దీనిఁగను నప్పుడె సంతసమయ్యెఁ జాలు నా
కీ మహనీయ రత్నము వహింపఁగ నర్హుఁ డితండె యంచు నా
భూమిపు చేతఁ బెట్టుటయు భూవర యాతఁడు ద్రౌణి గౌరవ
శ్రీమది భక్తిపెంపుగ ధరించె శిరంబునఁ దాన ప్రీతుఁడై. 162

శాంతి పర్వము : (1-108)

సీ. దక్షుఁడై భూపతి దండనీతి నయింప
కున్న సన్యాసులు నుత్పథ ప్ర
వర్తకులగుదురు వారిరి నన్యోన్య
ధనధాన్య పశుభూమి దారహరణ
మాచరింతురు జను లప్పాప మవ్విభు
నొందు దండము హింసయుగఁ దలంప
వలదు దుర్వృత్తుల వధియించు రుద్రుని
గోవిందు వాసవు గుహునిఁ [2]జూడు
మమ్మహాత్ములు తక్క దుర్మార్గచరులు
దండితుల చేత వినమె యధర్మమడఁగు
ధర్మమెసఁగు దంతమున నర్థమును కామ
మును నదూష్యంబులై సిద్ధిఁ బొందు నధిప. 168

అందే : (4-295)

గీ. అతఁడు కాలకలితమై కర్మమునను సం
సార వర్తనంబు సలుపుచుండు

---

1. ము. ప్ర. 'నామనమార దీనిఁగని నందముఁ బొందితి...'

2. ము. ప్ర. '...చూడు
మా మహాత్ములు దక్క నున్మార్గచరులు...' 'చూడుమా'
అని కం. వీరేశలింగముగారు 1901 ప్రచురణలో ఉభయ
యతిగా దీనిని గుర్తించినట్లు ఉ.వి.వి. ప్రతి.

స్వప్న సంప్రవృత్తి సలిపెడు నరు[1]మాడ్కి
నింద్రియముల తోడ నెఱయఁ బొరసి. 164

చివర చరణమందు అఖండయతి.

అందే : (4—392)

సీ. అనవిని బలదేవతాధీశుతో [2]నీకు
నా విభవంబు గానంగరాదు
గుప్తమైయున్నది గుహాయందు నా కిచ్చ
పుట్టినయప్పుడు పొలిచి తోఁచు
నది యట్టులుండి, నీ వధికుండ, వల్పుల
యెదుర ఱజ్జులు వల్కుటేమి పెంపు
పొమ్ము దుశ్చ్యవన నీ పోయెడు తెఱువున
నావుడు నవ్వుచు నతనిఁ జూచి
మున్ను వలికినట్లు మోమోట లేక ప
ల్కుటయు నతఁడు భూతకోటి మంచు
వోలెఁ దోఁచె విరియు బుద్ధిమంతులు దాని
కిచ్చ వగవ రింత యెఱుఁగవెట్లు. 165

అందే : (6-440)

గీ. [3]నరుఁడు నారాయణుండును ననఁగ లోక
రక్షణార్థంబుగాఁగ ధర్మమున కేను
బుట్టినాఁడఁ గావునఁ బాండుభూపతనయ
నాకు ధర్మజుఁ డనియెడు నామమయ్యె. 166

---

1. ము. ప్ర. 'మాడ్కి, నింద్రియములతోడ నెనయఁబెరసి'

2. 'నీకున్ + ఆ విభవంబు' అని వేం. రా. భావించినట్లున్నది. 'నాయొక్క విభవ'మన్నచో సందర్భమున కనుగుణమగును. అప్పుడు అఖండయతి గాదు

3. ము. ప్ర. 'నరుఁడు నారాయణుండు ననంగలోక...'

అందే : (5-84)

గీ. ధూతపాపుఁడై న పూతాత్మకుండు ల
ఘ్వాశి యగుచు నింద్రియముల గెల్చి
మనములోన కామమును క్రోధమును కోర
నీక బ్రహ్మపదము నిచ్చఁ గోరు, 167

(చివర చరణమందు) 'నిచ్చ'-ఎపుడు అని అర్థము గాని, కోరిక అని అర్థము గాదు.

'...గచ్చ కోరిక తమి కోర్కి యిచ్చ యనఁగ'
అని 'ఆంధ్రనామ సంగ్రహము' (మానవ 27). పౌరాణికులు కోరిక యని యర్థము చెప్పుతారు కాని, పునరుక్తి దోషము సంభవించుచున్నది.

అనుశాసనిక పర్వము : (1-362)

గీ వారు పూజ లొనర్పఁగా గారవంపుఁ
జూడ్కి నద్దేవుఁ డందఱఁ జూచు చరిగె
మఱియునుం దత్ప్రదేశంబు మహితవహ్ని
[1]మయతఁజేసి భయంకరమై వెలింగె. 169

ఆంధ్ర : (6-107)

సీ దాసత్వమొంది యదల్పులఁ దిట్టుల
నాటులఁ బడుచుండు నట్టి నీచు
లప్పాట తొలుమేన నతిగర్వులై ప్రల్ల
దమ్మునఁ బెక్కంద్రఁ దప్పులేక
తిట్టియు నడచియుఁ దిరిగిన వారలా
పౌలువలపైఁ గృపగలిమి మేలు
ధనిక గృహద్వారమునఁ బ్రతిహారి త
మ్మాగంగ నుండి దైన్యమున దుఃఖ

1. ము. ప్ర. 'మయతఁజేసి భయంకరమయి వెలింగె' ఈ పాఠ మందును అఖండయతి తప్పలేదు. పాఠాంతరముగూడ లేదు.

పదు జగంబులు భోగైకపరతఁ దొల్లి
మానసీయుల కవసర మీని వారు
రాజ దండితుఁ డకృతాపరాధుఁ గ్రూర
దండ దూషితుఁజేసి నతండు సూవె. 170

(మొదటిచరణము ఉత్తరభాగమున) 'అట్టి నీచు' స్వరము.

అశ్వమేధ పర్వము : (4-93)

క. నీవును దల్లులు బంధు[1]జ
నావలి పరిజనులు హస్తినగరంబునకున్
రావలయు ధర్మజుని సం
భావనయును బడయుఁ దెసఁగు పరమసుఖంబుల్. 171

ఈ పద్యము పూర్వపు లాక్షణికులు అఖండవడికి లక్ష్యము వ్రాసినారు అచ్చు పుస్తకములందు (పై పద్యము రెండవ చరణము) '...జ, నావలియుం బరిజనములు హస్తినగిరికిన్...' అని వ్రాసినారు. ఇది అతికి నట్లున్నదిగాని సాపులేదు. 172

ఆశ్రమవాస పర్వము : (1-131)

చ. కనకము మేని రత్నములు గ్రామములున్ హయగోవ్రజంబులుం
[2]దనియఁగ నిమ్ము సర్వవసుధామరకోటులకు న్నిజేచ్ఛ నీ
తనయులు పుణ్యలోక సుఖధాములునై విలసిల్లు నట్లుగా
ననుటయు నాంబికేయు హృదయంబున మోదమెలర్చె భూవరా!

వసుధామరులు, గోత్రామరులు, భూసురులు, మహీసురులు—అనవలెగాని, భూమరులు, మహ్యామరులు, (వసుధాసురులు), గోత్రాసురులు, ధరాసురులు-(ఇత్యాదగా) అనరాదు.

---

1. ము. ప్ర. '...జ, నావలియుం బరిజనములు హస్తినగరికిన్.'
2. ము. ప్ర. 'దనియఁగనిమ్ము సర్వవసుధాసురకోటులకున్...'

అందే : (1-141)

క. నరుఁ డనునయించి వెస న
[1]న్నర పతి నెత్తుచును దాను ననయము వనటం
బురబురఁ బొక్కెం గురు భూ
వర యద్దెస తెలుఁగు రాదు వ్రాకువ్వంగన్. 175

స్వర్గారోహణ పర్వము : (1-24)

సీ. ధర్మనందనుఁడు చిత్తమ్మున నుద్వేగ
మావహిల్లగ దైవ మకట యిట్లు
సేసె కీదేమి సేసిరొకో వీర
లి న్నరకములకు నేగుదేర
వలసిన యట్టిది వాసవాద్యమరులు
నీచులువో వీరి నే విచార
మించుకయును లేక యిట్టి కష్టపు టిడు
మలఁ బెట్టి రిది ధర్మమా తెలుంగు
మాలితే నీవు సజ్జన మాన్యులలఘు
సత్యపరులు దయాఢ్యులు నిత్యదాన
రతులు బహుదక్షిణాంచిత క్రతు విధాన
పాలితాత్మ లనర్హంపు పాటువడిరి. 176

భారత ప్రయోగములు రెండు మూడు చాలవా? ఇన్నెందుకు వ్రాసినా మంటే, అక్కడక్కడ భారతమందు నఖండయతి లేకుండగ నప్పకవిగారు దిద్ది నారనిన్ని, ఆయన మతమునే పట్టుకొని కొందఱు కవులు అఖండయతి కూడ దనుటవలననున్ను, ఇన్ని యతులుండగా రెండుమూడు దిద్దినంత మాత్రముచేత నేమి వినియోగమున్నదనిన్ని, ఈ యతుల నప్పకవిగారు చూచినారా? లేదా? ఏలాగునైనా అప్పకవిగారి పాండిత్య మహిమ స్పష్టము కాగలందులకున్ను ఇప్పుడైనా పామరులన్నియు దిద్దుటకు శక్యముగాద నిన్ని సుకవుల కిది విశదము కొఱకున్ను వ్రాసినాముగాని, ఒక లక్ష్యమే చాలును. 177

1. ము. ప్ర. '...నరపతి నెత్తుచును దాన నయమున్ వనటం.'

శ్రీనాథాది మహాకవి ప్రయోగములు ౨౬, భారత ప్రయోగములు ౪౦, (మొత్తము) అరువదియాఱు లక్ష్యములు వ్రాసినాము. 178

భారత తుల్యమే గాన పోతరాజుగారి భాగవతము (నుంచి గూడా కొన్ని ప్రయోగములు చూపుతున్నాము). 179

ప్రథమ స్కంధము : (1)

శా. శ్రీకైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళా సంరంభకున్ దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా
నా కంజాత భవాండకుంభకు మహానందాంగనాడింభకున్. 180

అష్టమ స్కందము : (245)

మ. కదలం బాఱవు పాపపేరు లొడలన్ ఘర్మాంబుజాలంబు వు
ట్టదు నేత్రంబులు నెఱ్ఱగావు నిజ జూటార్ధేందుడుం గందడున్
వదనాంభోజము వాడదా విషము నాహ్వానించుచో డాయుచో
పదిలుండై గడిసేయుచోఁ గుదియుచో భక్షించుచో మ్రింగుచోన్.

అందే : (394)

శా. శ్రీకంఠా నిను నీవు నేమఱకుమీ చిత్తంబు రంజించెదన్
నాకద్వేషుల దాగురించుటకునై నా దేను గైకొన్న కాం
తా కారంబు జగన్నిమజ్జనము గన్నన్ జూచితే చూపెదన్
గైకో నర్మములంద్రు కాముకులు సంకల్ప ప్రభావంబులన్. 182

–'కాంతా'– ఆకారము. బిందుయతిచే నైన అఖండయతి. 183

దశమస్కంధము : (పూ. భా. 689)

ఉ. ఆకులమయ్యె భోగమిదె యాదలలన్నియు వస్సె ప్రాణముల్
రాకల పోకలం బొలిచె రాయిడి పెట్టక మా నిజేశుపై
నీ కరుణా కటాక్షములు నిల్పఁగదే తగుదో సమస్త లో
కైక శరణ్య యో యుభయకారణ యో కమలామనోహరా. 184

అందే : (1706)

సీ. 'ఏనీ శుభాకార మీక్షింపఁ గన్నుల
కఖిలార్థ లాభంబు గలుగుచుండు...' 185

మరియును—

క. స్వర వర్గాఖండ ప్రా
ద్వర బిందుప్లుతములుం బ్రయుక్తాక్షరముల్
బరువడి ఎక్కటి పోలిక
సరసమనఁగఁ బదివిధములఁ జను వడు లరయన్, 186

(అని లక్షణము చెప్పి—)

సీ. [1]అబ్జగర్భ శివ స్వారాధ్య పూజ్యపదాబ్జ
కవివర్గ నుత గుణ గణ కలాప
వైభవాఖండ దేవాది దేవ కృపాబ్ధి
యఖిల విప్రాదిక ప్రాణి నిలయ
నుతపుణ్యహాస బిందుయుతా నవాంభోజ
యతిదయాప్లుత నిజాత్మ మహాత్మ
చారు సంయుక్త నిశ్చల గుణాలంకార
మహిమ నెక్కటి యైన మాన్యచరిత
పోల్ప నీ పోలికకు దైవములును గలరె
సరసగుణ పాత్ర భక్తరంజన చరిత్ర
ప్రాస నిర్భిన్న చండతరామరేంద్ర
యఖిల యతిగమ్య రఘురామ యఘవిరామ. 187

1. ఈ పద్యము 'కవిజనాశ్రయము'న కనుపించదు. ఆం. సా. పరిషత్ ప్రచురించిన క. జ. పు. 23లో అధోజ్ఞాపికయందు 'పదివళ్ళను, వాటి లక్ష్య ములను చెప్పుచు రామస్తుతిగా నున్న భీమనచాటు'వని ఈ పద్యమున్నట్లు వ్రాయబడినది.

(అని లక్ష్యములు వ్రాసిన ఈ పద్యములకు) కవిత్రయము వారికి పూర్వ మహాకవియైన భీమకవిగారు రచించిన లక్షణ (గ్రంథ) మందలి పద్యములని వాడుక కలదు.

భారత భాగవత రామాయణాది మహాకావ్య లక్ష్యములు డెబ్బదినాలుగు వ్రాసినాము. ఇక్కడికే గ్రంథ విస్తరమైనందున నఖండవడిని గురించి గ్రంథము నిలిపి ప్రకృతము ననుసరించుచున్నాము. 188

## 3. బిందుయతి : (అనుస్వారయతి)

లక్షణము: —

తిమ్మకవిగారి లక్షణసార సంగ్రహము (2-152) :—

గీ వరుస టతప వర్గ చతుష్కము
పిఱుద సున్నలూని నెఱయ నంత్య
వర్ణములకుఁ గృతుల వలుఁగు నవి బిందు
యతు లటండ్రు సుకవు లభ్రకేశ! 189

లక్ష్యము

గీ. ణాకు వడిచెల్లు కనకమండప మనంగ
నాకు నడి చెల్లు దివ్యగంధం బనంగ
మాకు వడిచెల్లు విటితశంబరుఁ డనంగ
వరలు నీ చందమున ననుస్వారయతులు. 190

'ఙాకు వడిచెల్లు రత్నకంకణ మనంగ' అని కొందఱు లాక్షణికులు ప్రథమ వర్గముకు లక్ష్యము వ్రాసినారు. (కాని) బిందువు లేకుండగనే ఙకార-కకారములకు యతి చెల్లుచుండగా బిందువుతో పనిలేదు.

'ఙ్ఞాన వేద్యాయ తప్తకాంచన విభూష
ణాయ (మేచక వర్ణకంఠ ప్రియాయ

నగధరాయ నమోస్తు సౌందర్య విజిత
మనసిజాతాయ గోపడింభాయ యనఁగ) 192

అని అప్పకవిగారు (ఆంధ్ర శబ్దచింతామణి—3-63) చెప్పినారు. బిందువు లేకుండగనే చ ఛ జ ఝ లకు జ్ఞ వర్ణము (యతి) చెల్లుమండగా, బిందువు చేర్చుట వ్యర్థము. జ్ఞ కారముకు చకారము (యతి చెల్లుటకు లక్ష్యము):—

వసు చరిత్రము : (3-101)

శా. ఆతన్వంగి యనంగ ఝాంకరణవజ్ర్యాముక్త నారాచ ని
ర్ఘాతం బోర్వక తమ్ములంచుఁ దటినీ గర్భైక సంజాత కం
జాత వ్రాతము మాటు చెందనని యేచం జాగె మున్మున్నగా,
'జ్ఞాతిశ్ఛేదనలేన కి'మ్మనెడు వాచారూఢి సత్యమ్ముగన్. 193

(మఱియు) జ్ఞకారముకు శషసలు సరసయతి (గా) చెల్లును. లక్ష్యము:—
ఆదిపర్వము : (1-157)

ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టిన తోడనె పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహిత సంహిత బుద్ధియుఁ జిత్త శాంతియున్
మానమదప్రహారము సమత్వము సంతత వేద విద్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతముం గరుణాపరత్వమున్.

ఇటువలె మహాకవి ప్రయోగములుండగా, అప్పకవిగారు 'ఆంధ్రశబ్ద చింతామణి' యందు :—

క. పనిఁబూని నిలుచుఁ దమ తమ
యమునాసికములకు బిందుయతులను వెనుకన్
గనుపట్టు నాల్గు లిపులును
వెనుసున్నలు దాసి తమకుఁ బియుదఁ గదియుచోన్. 195

అని లక్షణము చెప్పినారు. జకార, ఞ కారములు కలుసుకుని జ్ఞా యైనది. ఞకారము ద్వితీయ వర్గాక్షరము గావున లక్ష్యమున్ను బాగులేదు. ప్రథమ

వర్గాంత్యమైన ఙ కారమునకున్ను, ద్వితీయ వర్గాంత్యమైన ఞ కారమునకున్ను ప్రత్యేక వ్యవహారోపయోగములు లేవు గావున, ట త ప వర్గములు మూడు మాత్రమే బిందుయతులకు ప్రసిద్ధి.

లక్ష్యములు :—

మనుచరిత్రము (2-11) :—

మ. తలమే బ్రహ్మకునైన నీనగమహత్త్వం బెన్న నేనీ యెడం
గల చోద్యంబులు జెపు గన్గొనియెదం గాకేమి నే డేగెదన్
నళినీబాంధవ భానుతప్త రవికాంత స్యంది నీహారకం
దల చూత్కార పరంపరల్ పయిపయి న్మధ్యాహ్నముం
దెల్పెడున్. 197

రెండు యతులు గలవు.

—'తరమే' అనుటకు 'తలమే' అని లకారమున్ను గలదు. 198

సుభాషిత రత్నావలి :—

చ. సకల కలా విభూషితులు శబ్దవిదుల్ నయతత్త్వ కోవిదుల్
ప్రకటకవీంద్రు లేన్నృపతి పజ్జల నిర్ధనులై చరింతు రా
వికృతపు జాడ్య మాదొరది విత్తములేకయ వారు పూజ్యు లం
ధకజన దూషితంబులు ఘనంబులుగావె యమూల్య రత్నముల్. 199

చేమకూరవారి విజయవిలాసము (2-158) :—

చ. చిలుకలకొల్కి లే యెడమచేముడి గొల్పెడు జాఱుకొప్పు నిం
పులు దులకింపుచుండ భుజమూల రుచుల్ జిలుగుంబయంటలో
కులుకు నొయారి గబ్బిచనుగుబ్బలు చూచుచెకాని క్రీడి క
ర్మిలి మెయిలేదు భోజనము మీఁది యపేక్ష యొకింతనేనియున్. 200

అందే (1-129) :—

సీ. మంగల స్నాన సంభ్రమము దెల్పెడులీల
.................................... 201

## 4. సంయుక్త యతులు :-

లక్షణము :—

తిమ్మకవి లక్షణసారసంగ్రహము :—

గీ. వలుల యెడఁ బ్రయుక్త వర్ణముల్ గూడిన
యక్కరంబు మాత్ర లనువు మీఱ
తమకుఁ దామె విశ్రమములై విరాజిల్లు
ఫాలశతాంగ దక్షసవన భంగ. 202

లక్ష్యములు :—

కవి ధూర్జటిగారి (కాళహస్తీశ్వర) శతకము):—

మ. 'క్షితినాథోత్తమః సత్కవీశ్వరుఁడు వచ్చె న్మిమ్ములం జూడఁగా'
'నతఁ డేపాటి కవిత్వ వైఖరిని' 'సద్యస్కావ్య నిర్మాత', 'తత్
ప్రతిభల్ వింటిమె, తిట్టుపద్యములొ?' 'చెప్పంజాల'ఁ'డై తే మముం
గ్రితమే సూచెను పొమ్మటందు రధముల్ శ్రీకాళహస్తీశ్వరా! 203

అందే :—

శా. రాజన్నంతనె పోవు నా కృపయు ధర్మం బాభిజాత్యంబు వి
ద్యాజాతక్షమ సత్యభాషణము విద్వద్విప్రసంరక్షయున్
పౌజన్యంబు కృతం బెఱుంగుటయు విశ్వాసంబు, కాకున్నదు
ర్బీజ శ్లేష్మల కాగతంబు గలదా! శ్రీకాళహస్తీశ్వరా! 204

ఈ రెండు పద్యములందున్న వన్నియును సంయుక్త యతులు.

స్నాన శబ్దము (నందు) తకారమున్ను గలదని యెఱుంగరు.[1] తకార యుక్తమైనందుకు లక్ష్యములు :—

1. 'స్నాన' శబ్దమున తకార మెట్లుండుటకు వీలున్నది అగమయతి (ఈ ఆశ్వాసము చివర) వద్ద ప్రదర్శింపబడినది.

శ్రీనాథుని కాశీఖండము : (7-115)

సీ. వసియింప వలయు యావజ్జీవ మనురక్తి
పరత వారాణసీ పట్టణమున
చక్రపుష్కరిణి నిచ్చలు తీర్థమాడంగ
వలయు సంకల్ప పూర్వకముగాఁగ
నర్చింప వలయు గంగాక్షతంబుల పుష్ప
ఫల పత్రముల విశ్వపతి మహేశు
నిలుపంగ వలయును నెరసు వాటిలకుండ
నాత్మ ధర్మ స్వవర్ణాశ్రమముల

స్నాన మహిమంబు భక్తి తాత్పర్యగరిమ
వినఁగవలయుఁ బురాణార్థ విదుల వలనఁ
దన యథాశక్తి వలయును దానమిడఁగ
కాశిఁ గైవల్య మింటింటఁగాని లేదు. 206

రుక్మాంగద చరిత్రము : (1-95)

ఉ. స్నానముచేసి ధౌతపరిధానములం ధరియించి యంటగాఁ
గాని మనుష్యులం గనక కల్లలు వల్కక నుగ్రకృత్యముల్
మాని వినిద్రుఁడై నియమమానసుఁడై తమలంబు దక్కి శ్రీ
జాని పురాణముల్ వినుట సంగతి శ్రీహరివాసరంబునన్. 207

ఈ రెండు పద్యములందు అచ్చుపుస్తకములందు తకారము వ్రాయలేదు...
విశ్రమ మేమనుకొనిరో తెలియదు. 208

హరిశ్చంద్రో పాఖ్యానము : (4-18)

శా. తాత్పర్యంబున జాహ్నవీ జలములన్ స్నానంబు గావించి తా
హృత్ప్రీతంబున భక్తినివ్వటిల విశ్వేశున్ మహాదేవునిన్
బత్పంకేజ నతామరున్ గిరిసుతా ప్రాణేశుఁ బూజించు సం
వి త్పారీణుల కబ్బు నెల్లపుడు తన్వీ ముక్తి సామ్రాజ్యముల్. 209

చివర (పాదమున) గాన ప్లుత యతి.

శ్రీనాథుని హర విలాసము : (2-37)

ఉ. (ధీనిధి సెట్టినంబి తనదేహము నిండ విభూతి మంగళ)
స్నానము చేసి ధౌత పరిధానము గట్టి (త్రిపుండ్ర ధారియై
చే నమృతాంశు మౌళిని వశీకృతభక్తి ధరించి సంతత
ధ్యానముఁజేసి యెంతయును దత్పరభావము ప్రస్ఫుటింపగన్) 210

విష్ణు భజనానందము :–

గీ. స్నానమును సంధ్యయును బితృతర్పణంబు... 211

మత్స్య పురాణము :-

సీ. స్నానంబు దీర్చి ధౌతములైన వస్త్రముల్
ధరియించి సాంధ్యకృత్యముల నడపి... 212

జగ్గకవి సుభద్రా పరిణయము :-

గీ. కదలి యంత మాతృగమనాపహారిణి
యును సమస్త కల్మషోగ్ర భుజగ
ఖగవరంబు నైన గౌతమి కేతించి
స్నాన దానవిధులఁ దగ నొనర్చి. 213

ఇవియు సంయుక్తయతులే[1] మరియును—

రుక్మాంగద చరిత్రము : (2-26)

క. హరిపాదభక్తులై యీ
శ్వర నిందయు, శంభుభజన సంసేవకులై
హరి నిందయుఁ గావించిన
దురితాత్ములం లేదు రాళ్లతో నడపగనీన్. 214

1. సీ. 'తరుణికి మంగళ స్నానంబు సేయించి, మనిపెట్టె నింద్రుఁ డనర్ఘ మైన' అని భాగవత ప్రయోగము గూడ కన్పించును (అష్టమ. 270)

## 5. ఎక్కటి యతి :-

లక్షణము :-

తిమ్మకవి లక్షణ సారసంగ్రహము : (2-163)

క. అక్కజముగ మ ర వ ల లా
లొక్కొక్కటి తమకుఁ దమకె యొనరఁగ వడులై
చక్కంబడి కబ్బంబుల
నెక్కటి వడులనఁగఁ దనరు నిభదైత్యహరా! 216

గీ. మరుని తండ్రి లోకమహితుండు యాదవ
రాజ సింహమూర్తి రక్షకుండు
ఆఁగ వేలుపనఁగ అంపిల్లు నెక్కటి
వడులు నాఁగ నిట్లు వనజనాభ. 217

## 6. పోలికయతి :-

లక్షణము :—

కాకునూరి అప్పకవిగారి 'ఆంధ్రశబ్ద చింతామణి' : (3—39)

గీ. పుం నపుంసక తత్సమంబుల కడపల
తత్సమాంధ్ర దేశ్య శబ్దముల తుదలఁ
గదిసిన మకార శృంగముల్ కావ్యములకు
బొసఁగు ము విభక్తి యతులనఁ బు పు బు భు లకు 218

ఇదే పోలికయతి. పుష్కరము, మధ్యమము, వక్త్రము, దరహాసము, ఈ మొదలైనవి తత్సమములు. నిక్కము, కంబము-ఈ మొదలైనవి దేశ్యములు. వీటి (చివర 'ము' విభక్తికి) పు పు బు భు లు చెల్లును. 219

లక్ష్యములు :—

ఆందే : (3-70)

గీ. పుష్కరము సూక్ష్మ మధ్యమ**ము**గ నొనర్చె
పుల్లపంకేరుహము వక్త్ర**ము**గ నొనర్చె
ఖొండు మల్లెలు దరహాస**ము**గ నొనర్చె
భోజ నృప నందనకు నిక్క**ము**గ నజుండు. 220

## 7. సరసయతి :-

లక్షణము :—

తిమ్మకవిగారి లక్షణ సార సంగ్రహము :

క. పరగు న్న ఐ లొండొంటికి
సరవిన్ శ ష స లు దనర్చు చ ఛ జ ఝ ములకున్
పరికింప న హ య లేకము
సరస విరామంబు లివి నిశాకరమకుటా. 221

యకార హకారములకు అ ఆ ఐ ఔ లున్న, యకార, హకారములకు గుడియు నేత్వమైనా ఉంటే, ఇ ఈ ఎ ఏ లున్న, కొమ్మైనా, ఓత్వమైనా ఉంటే ఉ ఊ ఒ ఓ లున్న చెల్లును. ఇవి సరసయతులు. 222

లక్ష్యములు :—

స–జ లకు,

రుక్మాంగద చరిత్రము : (1-53)

క. తరణి నొకటొకటి పావకు
పరసిజభవు రెండు నాల్గు బలశాయిని శం
కరు బదియుఁ గా బురాణము
లిరవుగ వర్ణించుఁ బదియునెనిమిది వరుసన్. 223

అ యహలకు :—

శ్రీనాథుని కాశీఖండము : (7-85)

సీ. తనమీఁద వైవఁగ దంభోలి యెత్తినఁ
జెలఁగి సంస్తంభించె జిష్ణు భుజము
కైటభారాతి చక్రము ప్రయోగించిన
వెసఁ జక్కిలము పోల్కి విఱిచి బొక్కెఁ
బటు చపేటంబునఁ బండ్లు డుల్లఁగ మొత్తి
పూషార్కు వదనంబు బోసి జేసె
చిప్ప ముత్యంబు రాల్చిన భంగి నలవోక
భగుని గ్రుడ్డుల ధరఁ బడఁగ దిగిచె

నర్ధచంద్రబాణంబున యజ్ఞ మృగము
శిరము దెగనేసెఁ గట్టె నంబరము మీఁద
ధాతృసతి ముక్కు శోణంబు దాకఁ గోసెఁ
బ్రకట విస్ఫూర్తి శ్రీ వీరభద్రమూర్తి. 224

అందే : (7-108)

శా. ఎట్టెట్టో వినమైతి మింక నొకమాటేర్పాటుగాఁ జెప్పుమా
భట్టా రాయని నందికేశ్వరుఁడు విస్పష్టంబుగాఁ బల్కినన్
బట్టెం గంఠబిలంబు చెయ్యి దివియన్ రాదయ్యె వారాణశీ
హట్ట స్థానమునందు వ్యాసునకు శిష్యశ్రేణి భీతిల్లగన్. 225

చేమకూరి వారి విజయ విలాసము : (1-99)

ఉ చెప్పెడిదేమి నా వలపు చేసినసేతను గొల్వులోన ని
న్నెప్పుడు గంటి నప్పుడె పయింబడ నీడిచె నిల్వఁబడ్డ పా
టప్పు డదెంతయైనఁగల దట్టి హళాహళి కింతసేపు నీ
వొప్పెడు దాక దాళుట కయో మది మెచ్చవుగా నృపాలకా. 226

మృత్యుంజయ విలాసము :-

సీ. ఉదయాద్రి కరిమీఁద హురుమంజి చౌడోలు...... 227

## 8. చక్కటి యతి :-

లక్షణము :-

కాకునూరి అప్పకవిగారి ఆంధ్రశబ్ద చింతామణి : (3-72)

క. హెచ్చరికన పు ఫు బు భు లకు
నచ్చపు మా కొమ్ములే మహాకవు లాదిన్
మెచ్చులుగ నిలిపి రచ్చట
నచ్చట చక్కటివిరామ మనుచును గృతులన్. 228

అచ్చపు ము కారములనగా, వనము, ధనము, నిక్కము— ఈ మొదలుగా నంతమున (విభక్తి రూపముగ లేని) మువర్ణము లనుట. ఇవి (చెల్లిన) పోలిక యతులు. పదాది మధ్యములందు మువర్ణముగల మురువు, మూలము మొదలు—— ఈ మొదలైన విన్ని, చమురు, నిమిరుట, సమున్నత, సముజ్జ్వల— ఈ మొద లైన విన్ని చక్కటియతులు. పోలిక యతికి, చక్కటి యతికి భేదము తెలియదు స్పష్టముగా నెవరును చెప్పలేదు. కొందఱు 'చక్కటియతి మంచిదిగాదు, కవిత్ర యము వారి ప్రయోగము లేదు'—అంటారు. కవిత్రయము వారి ప్రయోగములేని తద్భవ వ్యాజ యతిని పావులూరి మల్లన ప్రయోగము నెటువలె నంగీకరించిరో తెలియదు. భారత ప్రయోగముతో తుల్యమైన శ్రీనాథుడు గారి ప్రయోగముంచే కవిత్రయము వారి ప్రయోగమెందుకు! 229

శ్రీనాథుని నైషధము : (2-66)

సీ. అతఁడు పాణిగ్రహణార్థుండు విను నీకు
నతనిఁగూర్పగ నేర్తు నతివ యేను
పిన్నపాపవు నీవు పితృపరాధీనవు
కార్య నిర్ణయశక్తి గలదె నీకు
నావల నిషధరా జఖిల లోకేశ్వరుఁ
డీవల పరమేష్ఠి హితుఁడ నేను
సందేహ డోలాధిశాయియైన ప్రసంగ
మిప్పట్టునందు నే నెట్టు లోర్తు

మొదల సంఘటియించినఁ బొందు పిదప
కార్యమ ఘటించెనేని సత్కార మెవలు
ప్రాణమగు నన్ను రమ్మను నా నృపాలు
నెదుర తలవంచికొనియుంచ నెట్టు లోర్తు. 230

శ్రీనాథుని కాశీఖండము : (1-91)

సీ. ఉరగ వల్లీ గాఢ పరిరంభణంబులఁ
బోకమ్రాకుల సొంపు మురువు కొనఁగ... 231

శ్రీనాథుని భీమఖండము : (5-59)

సీ. గీ. భువన బీజంబు కైవల్య మోక్షదాయి
యఖిల కల్యాణకారి విశ్వాద్భుతంబు
(పూజ కొనియెను మురభిదంబుజ భవాది
దేవతాకోటిచే సంప్రతిష్ఠఁ బొంది) 232

భాస్కర రామాయణము : (యు. 1765)

గీ. పెక్కుమారులు వడి పీచి ద్రెక్కొనంగ
వరలి వారిధిలోపల వైవ నతఁడు
ముక్త కేశాంబరోజ్జ్వల భూషుఁడగుచుఁ
బడి రసాతల గతుఁడయ్యె బలము దక్కి. 233

యయాతి చరిత్ర : (1-36)

గీ. అగరు లేలకి విరవాది యాగ దీఁగె
మల్లియలు గొజ్జగులు దాక మొల్ల మొగలి
మొదలుగా నివి యెప్పుడు బూచి కాచి
యుండు తోట లమీను ఖానుండు నిలిపె. 234

అనంతుని భోజరాజీయము : (5-61)

క. అని యతని భ్రమయ నడచును
మునుఁ దత్సతి నిలిపి చనిన భూజము కడకున్
గొనిపోవ నచట నదిలే
కునికి పునశ్శోక వహ్ని నుల్ల మెఱియఁగాన్. 235

నాచన సోముని వసంత విలాసము :-

క. అత్తఱి విట నాగరికలు
చిత్తముల వసంతకేలి చివురొత్తంగా
మొత్తములు గట్టి తీర్చిరి
ముత్తెపు జల్లులకుఁ దోడి బూరట కొమ్ముల్. 236

పోతరాజుగారి భాగవతము-అష్టమ స్కంధము : (886)

సీ. అంగీకరించిన నఖిలంబు వోవుచో
ననృతంబుగాదు లేదనిన నధిప
యాత్మ వృక్షము మూల మనృతంబు నిశ్చయ
మనృత మూలము గల్గ నాత్మ జెడదు
పుష్పఫలం బాత్మ భూజంబునకు సత్య
మా మా ను బ్రతుకమి నదియుఁ జెడును
ఫలపుష్పములు లేక పస చెడి వృక్షంబు
మూలంబుతో వృద్ధిఁ బొందుగాదె

చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ జెందకుండ
నిచ్చు పురుషుండు చెడకుండ నిద్ధచరిత
కాక నంచిత సత్వసంగతి ఘటించి
నిజధనం బర్థి కిచ్చిన నీకు లేదు. 237

శ్రీరంగ మాహాత్మ్యము :-

చ. పరిచయుఁగాఁగ నేలె నిరపాయ చరిత్రుని శత్రుకానన
స్ఫురదురువీతిహోత్రుని సముజ్జ్వల మేరు సమాన గాత్రునిన్
బరమ పవిత్రునిన్ ముని సుపర్వ వరస్తుతి పాత్రునిన్ మనో
హరఫల శేముషీకబలితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్ 238

('సముజ్జ్వల' అనుచోట) సమ్-ఉత్ అని ఉపసర్గలౌను. ప్రాదియతి యన వలసిన దౌను. పువర్ణ మువర్ణములు ప్రధానము చేసి చక్కటి యతియందు లాక్షణికులు వ్రాసినారు. (అ) సందర్భముగా నున్నది.

అరణ్యపర్వము : (8-357)

చ. ఉరమున రెండు కన్నులు పృథూదరదేశమునందు నోరు ప్ర
స్ఫురిత భుజద్వయంబును సముజ్జ్వల దున్నత భావముం గరం
బరుదుగ నుగ్రమైన వికృతాకృతితోడ నశేషసత్వ ఘ
స్మరుఁడగు చున్నవాని దివిజారిఁ గబంధుని గాంచి రచ్చటన్. 240

(అని ప్రాదియతికి) భారత ప్రయోగమున్నప్పటికి పరిశీలించక మంచిది గాదనుట మంచిదిగాదు. (ఇక ఇందే-) '...సత్వసం, హరుఁ'డని అప్పకవిగారు (అఖండ యతిని తొలగించుటకు) దిద్దినారు. ఆయన మాత్రమేకాని, అందఱును '...ఘ, స్మరుడు...' అన్నారు.

## 9. అనునాసికయతి :-

లక్షణము :-

కాకునూరి అప్పకవిగారి 'ఆంధ్రశబ్ద చింతామణి' (3-62) :—

గీ. అంత్రుతంబునకును మధ్యమానునాసి
కమునకును జెల్లు ననునాసిక యతులనఁగ
దాపలను బూర్ణములుగల్గి ట ఠ డ ఢ లును
త థ ద ధ లును గ్రమంబున దానవారి ! 242

దాపల నిండు సున్నలు గలిగిన ట ఠ డ ఢ లు నకారముకున్ను, దాపల నిండు సున్నలున్న త థ ద ధ లు ణకారముకున్ను చెల్లును. లాక్షణికులందఱు ట ఠ డ ఢ లకు నకారము చెల్లునని చెప్పినారు.

అడిదము సూరకవి 'కవిజన రంజనము' :—

గీ. గంధ గజరాజగామిని కనదుదార
హారమణి శర్కరిల కుచాహార్య విహర
ణమున శ్రమ మందఁదయ్యెఁ కందర్పకుండు
భవ్యనిశ్వాసపవన సంప్రాప్తికతన
(అయితే)

క. 'మనుసంతతి మండన భం
డన నిర్జిత కార్తవీర్య నరనాయక ఖం
డన పఙ్క్తి స్యందన నం
దన చందన శక్రవారణ లసత్కీర్తీ' 245

అని అప్పకవిగారు లక్ష్యము (3-63) గా తమరు రచించిన పద్యము మాత్రము దణలకు వ్రాసినారు. ట ఠ డ ఢ లకు మహాకవి ప్రయోగములు కలవు. 246

ట—నలకు :

పారిజాతాపహరణము : (1-18)

శా. శ్రీరంగేశ్వర నాభిపంకజ రజశ్శ్రీ కంటెఁ, జోలేంద్ర త
న్వీరాజత్కుచ పాలి మంజరుల కంటెన్ సహ్యభూభృత్తటీ
నీరంధ్రోజ్జ్వల గైరిక ద్రుమము కంటెన్ వన్నె గావించుఁ గా
వేరీతోయముఁ గృష్ణరాయఁ డహితోర్వీనాథ రక్త ప్రభన్. 247

రెండు యతులు

శ్రీనాథుని చాటుధార :

శా. ధాటీ ఘోటక రత్న ఘట్టన మిల ద్ధాటీష్ఠ కల్యాణ ఘం
టా టంకార విలుంఠలుంఠిత మహోన్మత్తాహిత క్షోణిభృ
ట్కోటీ కోకిత కుంభినీధర మహత్కూటాటవీ ఝాట క
ర్ణాటాంధ్రాధిప సాంపరాయని తెలుంగా నీకు బ్రహ్మాయురా! 248

రెండవ చరణమందు వికల్పయతిన్ని, అను నాసికయతిన్ని రెండు నన వచ్చును. నాలవచరణమందు నిత్య సమాసయతిన్ని గానప్లుతయతిన్ని అన వచ్చును. 249

శ్రీనాథుని హరవిలాసము : (2-73)

ఉ. హస్త గృహీత పుస్తకమునందు లిఖించిన యట్టి నీలకం
ఠస్తవముం బఠించుచు ఘనస్థిర ధీగుణ వైభవోన్నతుల్
విస్తరిలంగ (బాలకులు వేవురిలో సిరియాళుఁడుండె నా
భస్తలిపి ప్రపంచుఁడు గ్రహంబులలో నుడురాజుకైవడిన్) 250

ద-న లకు :

భాస్కరుని రామాయణము : (కిష్కిం 616)

క. బలవంతుఁడైన వాలికిఁ
దలఁకుచుఁ గిష్కింధ వెడలి త్వరలో నలుది
క్కులకుం బాఱి మహీమం
డల మెల్లను జూచినాఁడ నాడు నరేంద్రా. 251

లాక్షణికు లెవరును భారత లక్ష్యము వ్రాయలేదు.

ఆదిపర్వము : (5-66)

క. అమవస గావున నే డ
క్కమలజుఁ గొలువఁగ మహర్షి గణములు పితృసం
ఘములును బోవును బ్రహ్మం
డమునం గల వారలం దొనంగూరంగన్ 252

## 10. అనుస్వార సంబంధ యతి :-

లక్షణము :-

కాకునూరి అప్పకవిగారి 'ఆంధ్రశబ్ద చింతామణి' : (3-58)

గీ. ఆది పూర్ణయుతములై ట త వర్గాక్ష
రములు తుదను గలుగు వ్రాలు తక్కఁ
బొసఁగు నొకటి కొకటి భువి ననుస్వారసం
బంధయతులు నాఁ బ్రబంధములను. 253

ట ఠ డ ఢ లు నాలుగున్ను, త థ ద ధ లు నాలుగున్ను దాపల పూర్ణబిందులు గలిగి పరస్పరము యతి చెల్లును. 254

ట-ద లకు :-

మనుచరిత్రము : (1-55)

శా. శీలంబుం గులమున్ యశంబు శమమున్ జెల్వంబు లేఁబ్రాయమున్
బోలం జూచి యితండు పాత్రుఁడని యే భూపాలుఁ డీ వచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మాన్యక్షేత్రముల్ పెక్కుచం
దాలం బందు నొకప్పుడుం దఱుఁగ దింటం బాడియున్ బంటయున్. 255

'చందాలు' అనుచోట (చందములు) ముకారము పోయి దకారమునకు దీర్ఘము వచ్చినది. 256

కృష్ణరాయల ఆముక్తమాల్యద : (4-9)

మ. పురి నేగించి తదీయమైన నగరంబుం జేర్పుడంచుం బడిం
దొరలన్ రాజకుమారులన్ బనుపఁగాఁ దూర్యస్వనంబుల్ నిరం
తర వంది స్తుతులుం గజేంద్ర హయ ఘంటా వారకాంతాంఘ్రి నూ
పురముల్ మ్రోయఁగఁ గొల్చి వారిరుగడన్ బో మార్గమధ్యంబునన్. 257

అందే : (2-48)

మ. దవధూమంపుఁ దమంబులోఁ దమ రస ద్రవ్యంబుఁ బంకేజబాం
ధవ భానుప్రతతుల్ హరింపఁ గుయి వెంటన్ వెళ్లు ఘూన్యోరు కూ
పవితానంబుల జాడఁ జూడఁ బుడమిం బాటిల్లెఁ బై విప్పులై
యవసం బంచుల నాడఁగా నెగయు వాత్యాలిన్ రజశ్చక్రముల్ 258

ఈ పద్య మప్పకవీయమందు నచ్చువుస్తకమునందు '...కుయివెట్టన్ వెళ్లు...' అని టకారమునకు దాపల బిందువు లేకుండగ వ్రాసినారు. పొరపాటున వ్రాసినా రనుకోరాదు. తప్పులు పరిశీలించి ఒప్పులు వ్రాసిన వాటిలో ఇది వ్రాయలేదు. అను స్వారసంబంధయతికి లక్ష్యము వ్రాసిరి (గదా!). ఒకచోట (బిందు) సంబంధము లేకపోతే విభ్రమ మేమనుకొనిరో, తెలియదు.

ఆముక్తమాల్యదకు వ్యాఖ్యానకర్తలు 'కుయివెట్టన్ వెళ్ల = మొఱపెట్టుకొనుటకు వెళ్ల...' అని అర్థము వ్రాసినారు. విశ్రమ భంగము కానలేదు. అర్థమున్ను కుదరలేదు. 'కుయి = మొఱతో, వెంటనే వెళ్ల = కూడా వెళ్లతున్న' అని చెప్పితే, యతి భంగము కాదు. అర్థమున్ను సందర్భముగా నున్నది. లోకమునందు సొమ్ము దొంగలు పట్టుకుపోవుచుండగా మొఱపెట్టుట ప్రత్యక్షమే. వ్యాఖ్యాకారులు 'సూర్యునివద్దకు మొఱపెట్టుటకు వెళుతున్న' వనుట 'పరిశీలించని యర్థ' మని వ్రాయనక్కరలేదు. కుకవుల నాదరించక, సుకవులకు గౌరవము కలుగునప్పటి కాలమందే ఈ పరిశీలించుట లేక పోయినది. వినిమయము గలుగు నిప్పటి కాలమందు ఇటుల జెప్పుట ఆశ్చర్యము కాదు. ఇప్పటి కవులకు తప్పన్నదే తోచలేదు. 'ఇంత తప్పు ఎవరికి నెందుకు తోచదాయె'ననరాదు. భగవన్మాయచే సత్య మసత్య మసత్యము సత్యము ఎటులైనదో, మూఢత్వముచే నిదియు నటులనైనది. ఇటువంటి కల్పనగల పద్యము కట్టవరపు చిట్టం రాజుగారి ద్వాదశరాజ చరిత్రయందు :- 259

చ. అపుడు సమీరచోరుఁడు గవాక్షపుఁ గన్నపు గండి దూఱి ర
త్యపరిమితాది ఖేద భరితాంచిత కోమల మంచక స్వప
చ్చపల విలోచనావదన సౌరభ విత్తము గొంచుఁ బద్మినీ
విపినముఁజేర వెంటఁ గుయి వెళ్లె మదాళి భటప్రతానముల్ 260

అని ఉన్నది. ఈ పద్యమందు స్పష్టమే. మూడవ చరణ మందు నిత్యసంధి యతి.

## 11. తత్సమ వ్యాజయతి

లక్షణము :-

కాకునూరి అప్పకవి గారి 'ఆంధ్ర శబ్ద చింతామణి' : (3-54)

సీ. విజ్ఞానమునకు భావింప విన్నాణంబు
విజ్ఞాపనమునకు విన్నపంబు
సంజ్ఞకు సన్న యజ్ఞమునకు జన్నంబు
నాజ్ఞప్తి కానతి యాజ్ఞ కాన

యని యిట్లు సంస్కృత వ్యాహార మధ్యావ
సానంబుల ద్వితీయ సరలమునకు
నడుగున గల తాలుజానునాసికములు
తద్భవంబున ద్రుతత్వంబు నొంది

వెలయుటను తద్భవవ్యాజ విశ్రమమున
జరిగి నణలకు ఱేటికి జ్ఞా తనర్చు
జ్ఞాని చేతోంబుజాత శోణకర యనఁగ
జ్ఞాతి విద్వేషి నృపనాశనకర యనఁగ. 261

ఈ పద్యము రెండవ చరణ మందు సకారముకు, గీతపద్య ద్వితీయ చరణమందు జకారమునకు జ్ఞకారము విశ్రమ ముంచినారు. మొదట సరసయతి. తరువాత వర్గయతి. బిందువు లేకుండగ తమరే ప్రయోగించిరి. బిందుయతు లందు సున్న ఉంటే కాని చెల్లదనిరి (అప్పకవిగారు) స్వసిద్ధాంత వ్యాఘాతము కానరైరి. (ఇక) 262

లక్ష్యములు

పావులూరి మల్లన గణితము :-

ఉ. శ్రీనిధియైన శివ్వనను జిమ్మననున్ మఱి సూర్యదేవునిన్
ధీనిధి పోలనార్యులను దేజమునన్ రవితుల్యులైన యా
సూనుల నల్వురం బడసె సూరి జనస్తుత సత్య భారతీ
జ్ఞానులఁ బద్మగర్భ వదనంబులు నాలుగు పోలువారిలోన్. 263

రుక్మాంగద చరిత్రము : (2-63)

క. శ్వానమునకుఁ జండాలున
కైనను నాకొన్న నిడఁగ నగు నన్నము దు
ర్మానసుఁడై పెట్టక య
జ్ఞానంబునఁ గడపెనేని నరకమునఁ బడున్. 264

[1]తద్భవ వ్యాజయతికి కవిత్రయము వారిలో నొకరి లక్ష్యము (గూడ) వ్రాయలేదు. (వ్రాసుతున్నాము). 265

ఎఱ్ఱాప్రెగడ హరివంశము (పూ. భా. 9-47)

సీ. (అవధరింపుము దేవ యాశ్చర్య మొక్కటి
మన విల్లు పూజించు మందిరంబు
లోనికి నిద్దఱు లోకాధికంబగు
తేజంబు గలవారు దేవనిభులు)
నవయౌవనులు మనోజ్ఞ విచిత్ర గంధమా
ల్యాలంకృతాంగులు నీలపీత
వసనులు దివినుండి వసుధపై (కుట్టిప
డ్డట్టు లెవ్వరు వీర లని యెఱుంగ

నేరకుండ నేతెంచిరి వారిలోనఁ
దెల్ల దామతేరకుల ట్లుల్లసిల్లు
కన్నుదోయి నొప్పారెడు కత్తియాతఁ
డొకఁడు వెసఁ బుచ్చుకొనియె విల్లొక్కకేల.) 266

## 12. అభేదయతి :-

లక్షణము :-

గీ. రలలు వపబలు దడలును ళళలు తమకుఁ
దామె విరతులు నగు నభేదాఖ్య నొంది
సుకవి కావ్యములందు నీ క్షోణియందు
హీర హీరాబ్జ చంద్రాంగ వృషతురంగ. 267

1. 'తద్భవ వ్యాజయతికి...' నుండి సీస పద్యోదాహరణము వరకు మూలప్రతియందు వ్రాసి కొట్టివేయబడి ఉన్నది. కాగా తద్భవ వ్యాజ యతికి ఎఱ్ఱన గారి ఈ ప్రయోగము గ్రంథమునం దుండగూడదని వేంకట రాయుడు భావించినట్లు కన్పించును. వివరములకు చూ. ఈ గ్రంథ పీఠిక.

(ర ల ల కనగా) అకారముకు లకారముకున్ను, రేఫముకు లకారముకున్ను (అని అర్థము.) 'రశ్చతాశ్చరౌ' అని ఏకశేషము. వకారముకు ష బ ల కున్ను, ద డ లకు, ల ళ లకు అభేదయతులు చెల్లును. ల ళ లకు, వ ప బ లకు నందఱు లాక్షణికులు నభేదయతి నంగీకరించినారు. కొందఱు ర ల ల కున్ను, కొందఱు ద డ ల కున్ను అంగీకరించినారు. అప్పకవిగారు సుప్రసిద్ధముగా మహాకావ్య లక్ష్యములుగల ర ల లకు, ద డ లకు నభేదమొప్పక, నొకటియు లక్ష్యములేని ల డ లకు నభేద మంగీకరించినారు. వ బ లకు నభేదమనిన్ని వ-ప ఫ భ లకు నభేదవర్గమనిన్ని నిర్ణయించినారు. (అయితే,) 268

క. 'వపయో రభేద'యనియెడు
నెపమున ప ఫ బ భ లు వాకు నిజముగ వడులౌ
(నుపమింపవచ్చుఁ గృతులం
దుపనిషదుచితార్థ సూక్తు లొలసిన చోటన్.) 269

అని లాక్షణికులందఱు 'వపయోరభేద'మే ముఖ్యము చేసినారు. వ ప బ లకు నభేదము. వ ఫ భ లకు, ద ధ లకు ధ డ లకు నభేదవర్గము. 270

లక్ష్యములు :-

శ్రీనాథుని నైషధము : (1-112)

క. కేలాదిరాయ యభినవ
లీలా మకరాంక చంద్ర రేఖాంకుర చూ
డాలంకార పదాంబురు
హాలింగిత సుభిత నిర్మలాంతఃకరణా! 271

భాస్కరుని రామాయణము : (యుద్ధ. 2838)

క. దానవ సుందరు లత్తఱి
జానకి నందలము మీఁద సమ్మద మొదవం
గా నిలుప శారదాభ్రవి
లీనత నేపారు చంద్ర రేఖయ పోలెన్. 272

లాక్షణికులు ర ల లకు లక్ష్యములు వ్రాసినారు. అప్పకవిగారు— సంస్కృతమందు రేఖా, లేఖా శబ్దములు రెండు గలవుగాన నీ రెండు పద్యము లందు చెప్పిన రేఖాశబ్దము మొదలి (వర్ణము) తృతీయాంతస్థమని యెఱుంగునది. తృతీయాంతస్థమనగా లకారమనుట'...

వసు చరిత్రము (3-66) నందు :-

శా. ఓ లంబాలక యోల యోల యన నోలోలంచు మేలంబునన్
లోలంబాలక యోర్తుగ్రుంకి బిసవల్లు ల్దున్మి తూఁటాడి కెం
గేలం బూని తటాలున న్నెగసె నక్షీణాంబునాథాంబుజా
క్షి లోకంబు జయించి వారల యశశ్శ్రీఁ దెచ్చు చందంబునన్. 273

ఈ పద్యము రెండవ చరణము మొదలను 'లోలంబాలక'యని కవి హృదయము. ఇదిగానక కొందఱు "ఇందిందిర శ్చంచరీకో రోలంబో బంభ రోపి చ" అని నిఘంటున నున్నదని 'రోలంబాలక' యని చదువుదురు. ఇట్లని రామరాజ భూషణుని తలంపు గాదు' అని అప్పకవిగారు అన్నారు.

కొందఱు 'ఓ లోలాఁబక' అనిన్ని, లో = నీటిలోను, లంబ = వ్రేలు చున్న, అలక = ముంగురులు గలదనిన్ని రెండు చోట్ల దిద్దినారు [1] ర ల లకు (యతి) నంగీకరించలేదు. (కాని, దిద్దుబాటు కాని ప్రయోగములున్నవి.) 275

శ్రీనాథుని కాశీఖండము : (6-210)

శా. హాలా పాన మొనర్చి యిద్దరును నన్యోన్యంబు మత్తిల్లి రా
కేలీ నృత్త వినోద కందుకమణి క్రీడా విహార క్రియా
లీలా హాస్య కలాప్రసంగముల నుద్రేకించి వర్తింతు రె
క్కాలంబున్ ఘటజన్మ కాశినడుమన్ గర్వించి యద్దేవతల్. 276

శ్రీనాథుని మరుత్త చరిత్ర :—

సీ. శాశ్వత విశ్వ విశ్వంభరా చక్రమీ
రాజకుమారుఁ డేలంగ గలఁడు [2] ... 277

---

1 ఇట్లు దిద్దినవాడు కూ. తిమ్మన. చూ. ల. సా. సం. 2-194.

2. ఈ పద్యపాదము రంగరాట్ఛందమున 'సునందన చరిత్ర' లోనిదిగా ఉదాహరింపబడినది. చూ. రంగ. ఛంద. 3-274.

కొందఱు 'కవిత్రయమువారి ప్రయోగము లేదుగాన, మంచిది కాదంటారు శ్రీనాథుడుగారు కవిత్రయమువారి కన్న తక్కువవారు కారు. అయినా[1]— తిక్కనగారి ఉత్తర రామాయణము : (8-62) 278

క. అని గోకర్ణమునకుఁ జని
యనుజన్ములు తాను నెవ్వ నజు నిల్పి తపం
బొనరించి రత్తెఱంగె
ల్లను జెప్పెద వినుము నీవు రఘుకుల తిలకా! 279

కాశీఖండము, ఉత్తర రామాయణము (నుండి) అప్పకవిగారు లక్ష్యములు వ్రాసినవేను. ఇచ్చట (వారు) దిద్దకపోవుటకు కారణము తెలియదు. (ఇక—) 280

అహోబల పండితులవారు కవి శిరోభూషణము (పు. 167) నందు :-

"అప్పకవినా యదుక్తం – యతౌ రలయోర్మైత్రతాస్తీతి లాక్షణికానా ముక్తి ర్నప్రామాణికీతి. 'లీలా మకరాంక చంద్రరేఖాంకు' రేత్యాదౌ రేఖా శబ్దస్య లాదిత్వమపి నైఘంటుకై రుక్తత్వా న్న రేఫాదిత్వమితి తదవిచారితాభి ధానమే వేతి స్పష్టమేవ. ఏతేన, 'రాయంచ కాళ్ల దౌలకయ మున్నె' ఇత్యాది కవిప్రయోగాణాం నకించిద ప్యసామంజస్య మితి ధ్యేయమ్. ప్రాసే తు తదభిన్న త్వం కవిభి ర్న వ్యవహృతమితి జ్ఞేయమ్"

అని వ్రాసినారు. అప్పకవి తెలివి తక్కువేగాని, ర ల లకు యతిచెల్లును, ప్రాసము చెల్లదని చెప్పినారు. 281

కొందఱు లాక్షణికులు 'రాయంచ కాళ్ల దొరయకమున్నె' అని దిద్దినారు. దిద్దిన వారంతటా దిద్దవలె. 282

ప వ లకు :—

---

1. ఇక్కడ 'అయినా ర ల లకు హరికథాసారము. ఎ. హ. (ఎఱ్ఱా ప్రెగడ హరికథాసారము) రెండు పద్యాలు' అని మూల ప్రతియం దున్నది కాని రెండు పద్యాలేవో వ్రాసిలేవు.

ఆదిపర్వము : (1-125)

ఉ. (ప్రల్లదుఁడైన యొక్క కుల పాంసను చేసిన దానఁ దత్కులం
బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము) గావునన్ మహీ
వల్లభ! తక్షకాధము నెపంబున సర్పము లెల్ల నగ్నిలోఁ
ద్రెళ్లగ (సర్పయాగ మతిధీయుత చేయుము విప్రసమ్మతిన్) 283

వ బ లకు :—

అందే : (4-94)

చ. నుతజల పూరితంబులగు నూతులు నూఱిఁటికంటె నూన్పృత
వ్రత! యొక బావి మేలు, మఱిబావులు నూఱిఁటి కంటె నొక్క స
త్క్రతు వది మేలు, సత్క్రతుశతంబున కంటె సుతుండు మేలు, ద
త్సుత శతకంబు కంటె నొక సూనృతవాక్యము మేలు, భూవరా! 284

ద ద లకు :—

శ్రీనాథుని నైషధము : (7-93)

సీ. కఱుకులై పీడిన కుఱుచ వెంట్రుకలతో
బట్టనొదల కావిపాగ తనర
కుఱుచ పూరేడు బాగుగ గుస్తరించిన
గడ్డంబుతో జొమ్మె గమ్మలింప
బండి కందెనకాయ ప్రతివచ్చు నేచాయ
నీలి పచ్చడముతో మేళవింప
నవ రక్త చందన ద్రవ కల్పితంబైన
నూత్న త్రిపుండ్రంబు నొసల నొప్పఁ

గోఱ మీసాలు మిడిగ్రుడ్లు కుఱుచ పొడవు
దొప్ప చెవులును గొగ్గి పండులును గలిగి
యున్నమద్గ్రీవుఁడై వచ్చు చున్నవానిఁ
గని మహారాజు కనిరి దిక్పాలవరులు. 285

కొందఱు లాక్షణికులు ద డ లకు నభేద మొప్పక ఈ పద్యమందు దొప్ప—డొప్ప అని రెండు విధములు గలవు గనుక, 'డొప్ప చెవులు' అన్నారు. 286

శ్రీనాథుని కాశీఖండము : (7-80)

సీ. వదనంబు దెఱచి మ్రింగుదునె బ్రహ్మాండంబు
బలు మోవకుండఁగ బొండు రాంగ
పిండి పీచంబుగా పృథివీధరంబులఁ
దంతునే కాలదండమున నభవ
దండశూకాధీశు తలలు దండ సిలంగఁ
దాటింతునే కాల ధర మహేశ
వ్రచ్చి వైతునె కేలి వాలారు నఖముల
నఖిల దిక్కులు శశాంకార్ధ మకుట

యేమి సేయుదు నానతి యిమ్ము నాకు
ననుచుఁ గ్రమ్మఱ మ్రొక్కె బాహప్పళించి
తన్మహాధ్వనిఁ కలఁగి యుత్కటము లగుచు
జలధు లేడును ఘూర్ణిల్ల శంభు సుతుఁడు. 287

(ఇందు) దంచుటను డంచుట అని ద్దిద్దలేదు. ఏమి హేతువునో తెలియదు 'బాహావు'లో ఉకార లోపము. (ఇక) కవిత్రయమువారి లక్ష్యము లేదని కొందఱు (అందురు. ఉన్నది.) 288

అనుశాసనిక పర్వము : (4-17)

గీ. దైవ తార్చ లపుడు డాకినీ భూతర
క్షోముఖంబులైన కుత్సితంపు
జాతులెల్ల దీప సన్నిధి నణఁగు, న
ట్లగుట దీపదాన మధిక ఫలము 289

ల ళ లకు (ప్రయోగములు) బహులములు గలవు. (ఇక) కాకునూరి అప్పకవిగారు 'ఆంధ్రశబ్ద చింతామణి' యందు అభేదయతులకు :-

గీ. 'వేద ముఖమున వబయో రభేద యనుట
వలన వబ లొక్కటొకటికి నిలుచు విరతి
కవని ల డ లకు ల ళ లకు నట్ల కలిమిఁ
జేసి తమలోన నవియును జెల్లుచుండు' 290

అని లక్షణము చెప్పి :

గీ. వసుమతీ కలత్ర బకజైత్ర గానక
లా లసత్కలాప డంబ గోప
లలితదేహ పింగళపుర దక్షిణ గేహ
యన నభేద నిరతు లప్రమేయ 291

అని లక్ష్యములు చెప్పి, అనంతుని ఛందమునందు ల డ లకు లక్ష్యము వ్రాసిన :-

క. కాకుస్వరయతి యగు నితఁ
డే కదలక జలధిఁ బవ్వళించె ననం బ్రి
శ్నా కలిత దీర్ఘమున నితఁ
డే కవ్వడి రథము గడిపె నిమ్ముల ననఁగన్ 292

అను పద్యము వ్రాసినారు. (అయితే) పవ్వళించె, పవ్వడించె అని రెండు విధములు గలదు. ఆంధ్ర నామ సంగ్రహమునందు :-

'గీ. ఒప్పు శయనించె ననుట తొన్నుండెఁ బండె
పవ్వళించెఁ బరుండెను బవ్వడించె...' 293

అని యున్నది. రేఖా, లేఖా అని (రెండు విధములు) ఉన్నందున ర లల కభేదము కూడదని (అప్పకవిగారు) వ్రాసిరి. ఇక్కడ మాత్రము తత్పాండిత్య మహిమ ఏమయి పోయెనో తెలియదు. ర ల లకు బహులములు లక్ష్యములు గలవు (కాని), ల డ లకు నొకటియు లేదాయెను. ఉన్నవి కొట్టివేయుటకు, లేనివి నిలుపుటకు (వారు) స్వతంత్రులు. 294

## 13. విశేషవలి :-

లక్షణము :—

కాకునూరి అప్పకవిగారి ఆంధ్రశబ్ద చింతామణి : (3-56)

గీ. ప్రౌఢకవులు కొందఱు జ్ఞకారంబునకును
ప్రథమ వర్గంబు తొలి యక్కరములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్క యెడ విశేష
వడు లనుచు సోమయాజులు వాడు కతన. 295

లక్ష్యము: శాంతిపర్వము : (4-255)

క. జ్ఞానము కేవల కృప న
జ్ఞానికి నుపదేశ విధిఁ బ్రకాశము సేయం
గా నది సకలధరిత్రీ
దానంబున కంటె నధికతర ఫలదమగున్. 296

## 14. అభేద వర్గయతి :-

లక్షణము :-

గీ. అవని దంతోష్ఠజంబైన వ్యంజనముకు
ఫ భ లును, దకారమునకు ధ వర్ణకంబు
యతులగు నభేద వర్గాఖ్య నంది కృతుల
కాళ కాశేశ నీకాళ కలుషనాశ! 297

దంతోష్ఠజ వ్యంజనమనగా వకారము. 298

లక్ష్యములు :—

వ బ లకు—

ఆదిపర్వము : (8-29)

మత్త. ధీరు లీ ధృతరాష్ట్రి పాండు లతిప్రశస్తగుణుల్ ప్రసి
ద్ధోరు కీర్తులు నాకు నిద్దఱు నొక్కరూప తలంపఁగా

వీరు వారను నట్టిబుద్ధి విభేదమెన్నడులేదు గాం
ధారి పుత్రశతంబునందుఁ బృథా తనూజుల యందునున్. 299

ద డ లకు

శ్రీనాథుని కాశీఖండము : (7-84)

ఉ. చంపుదుమే కృతాంతు శిఖిచండమయూఖుల బారిగొందుమే
దంపుదుమే కుభృత్పరివృఢంబుల మొత్తుదుమే యజాండముల్
చింపుదుమే చతుర్దిశలు జృంభిత బాహు పరాక్రమ క్రియా
సంపద సొంపు మీఱఁ బురశాసను నానతి యింత కల్గినన్. 300

ప్రబోధ చంద్రోదయము :-

ఉ. నావుడు తద్ద్విజుం డహహ నాదగు శీలము వర్తనంబునం
బావనమైం గులం బనియు బాగగు వింతలు గౌడదేశరా
ధావర పట్టణంబునఁ గడాని మదీయ గృహంబు తండ్రి ధా
త్రీ వినుతుండు తత్సుతులు శ్రేష్ఠులు నే నధికుండ వారిలోన్. 301

అప్పకవిగారు అభేద వర్గయతుల (విషయమున) పూర్వ లాక్షణికుల నాక్షేపించి వ్రాసిన గ్రంథ (మిట్లున్నది.)

"గీ. భరిత భువనార్ణవంబుతో వ్రంత సరియె
రమ్య మణిరాజ రాజితో లక్క సరియె
లలిత వీణా రవంబుతో ఢక్క సరియె
ననఁగ జెల్లు నభేదాఖ్య నమరు వళ్లు. 303

ఈ మూఁటిలోను భకార వకారములకు నభేద వర్గయతి గనుక, ప్రయోగించ వచ్చును. ల వర్ణ ళ వర్ణములకు నభేద వర్గయతులు గావు కావున ప్రయోగించరాదు. ర వర్ణమునకును లకారమునకును గ్రాహ్యంబుగాదు. వానికి 'లక్షణ విలాసము'వారు తెలియక కొన్ని యుదాహరణలు వ్రాసినారు. అవియును వివరించెద." 304

ర ల లకు దిద్దినవి ఇదివరలో వ్రాసినాము. ల ద లకు నభేదమంటే, ల ధ ల కభేదవర్గమున్ను కలుగును. (అయితే) రెండును అగ్రాహ్యములు. మరియు ర ల లకు దిద్దినదిన్ని, ఆ దిద్దినందుకు పొరబాటున్ను వ్రాసుతున్నాము. 805

"హరిశ్చంద్ర కథ :-

ద్విపద. చీఁకటి విరియించు చిరునవ్వు పసిడి
రేకులతో నెదిరించు చెక్కులును 806

కొందఱు 'రేకులతో మురాళించు చెక్కులును' అని చదువుదురు. అది వ్రాత తప్పుగాని, కవిహృదయము గాదు" 807

అని అప్పకవిగారు పరిష్కరించి వ్రాసినారు. 'ఱేకు' పదము ఱకారము గాని, రేఫముగాదు. కవీశ్వరుడు రేఫమనుకుని 'మురాళించు చెక్కులు' అని ప్రయోగించినాడు. 'మురాళించు' పదమే ముద్దుగా నున్నది. ఇక్కడ దిద్దదలచుకునే (అప్పకవిగారు) ఱేకు పదమును (రేఫఱకారముల నిర్ణయించు చోట) రేఫములందు వ్రాసినారు. అప్పకవిగారికి దిద్దుటంటే తాత్పర్యముకాని, విమర్శించక పోవుట నైజగుణము, కాని తెలియదని ఎన్నిచోటుల వ్రాయము!

'ఱేకు' ఱకారముకు :-

భీష్మ పర్వము : (2-30)

ఉ. ఱెక్కలు చించి కంఠమున ఱేకులు వాపి శిరంబు వ్రచ్చి పే
రుక్కున క్రౌంచి చందమగు నొడ్డణముం గలగంగ భీష్ముఁ డే
దిక్కునఁ దానయై దిశలు దీటుకొనన్ శరకోటి నింప గెం
పెక్కిన కంటిఱేవ చెలువెక్కుడు సేయఁగఁ గ్రీడి కృష్ణుతోన్. 809

శ్రీనాథుని నైషధము : (6-22)

సీ. కబరికా భరముపైఁ గన్నెగేదంగి పూ
ఱేకు తోఁగూడరే ఱేనిఁ ఱెరివి... 810

అప్పకవిగారు 'తెక్కలు', 'తేఁడు'లను అకారములందు వ్రాసినారు. 'రేకు' రేఫములందు వ్రాసినారు. (మరి) ఈ రెండు పద్యములందు నేమి పరిశీలించిరో తెలియదు. తెక్కలు, తేఁడు—ఈ రెండు పదములు కూడా రేఫములందు వ్రాసితే బాగుండును. లేదా, రేకు పదము ఉభయ రేఫములందు వ్రాసినా బాగుగా నుండును. ఈ పద్యములు చూడలేదని తోచుచున్నది. చూచితే మరియొక రీతిని దిద్దుదురు.

## 15. *ఆగమ యతి:-*

గీ. అవని ట త ప వర్గముల నంత్యాక్షరములు
పరమునందున గల యూష్మ వర్ణములకు
మొదలి వర్ణంబు లాగమంబులయి నిలుచు
నాగమ విరామ మనఁగ రామార్థదేహ. 312

అర్థము :- ణ, న, మ-ఈ వర్ణములందుగల శ ష స హ లకు, ట త ప-ఈ వర్ణములు ఆగమముల(గును), అనగా మధ్యను వచ్చుననుట. ఆగమమైనందున 'ఆగమయతి' అని పేరు. ఇందుకు కుమార వ్యాకరణ సూత్రము :-

"అఘోషా దూష్మణః పరః ప్రథమోభినిధాన స్పర్శపరాత్తస్య స స్థానః"

ఈ సూత్రార్థము :- టకారము వచ్చుటకు. 'కృష్ణ' శబ్దమునందు షకారము ఊష్మము, ణకారము స్పర్శము. ణకారము ట వర్గములోనిదిగాన ప్రథమ వర్ణము-టకారము-(ఆగమము) అగును. కృష్ట్ణుఁడు.

'ఏవం విష్ట్ణు, రోచిష్ట్ణు, ధిష్ట్ణ్యాది.'

(తకారము వచ్చుటకు:- స్నాన శబ్దమునందు సకారము ఊష్మము, నకారము స్పర్శము. అది తవర్గములోనిది గాన ప్రథమ వర్ణము-తకారము-వచ్చును. స్త్నానము.

'ఏవం స్త్నానాది.'

(పకారము వచ్చుటకు :-) భీష్మ శబ్దము నందు షకారము ఊష్మము, మకారము స్పర్శము. మకారము పవర్గములోదిగాన ప్రథమ వర్ణము-పకారము-వచ్చును. భీష్ప్మడు.

'ఏవం గ్రిష్ణ్వాది.'

అనుష్టః-మందుడు. అపత్రపిష్ణుః = లజ్జపడు వాడు. ఉష్ణమ్ = వెచ్చన. ఉష్ణికా = కాల్చిన గంజి, ఉష్ణీషః = పాగా, కిరీటమున్ను. కృష్ణః = శ్రీ కృష్ణుడు, అర్జునుడు ఇత్యి, నలుపువర్ణము కృష్ణా = నదీ విశేషము, ద్రౌపదియు. జిష్ణుః = ఇంద్రుడు, అర్జునుడు, జయశీలుడు ...ధృష్ణుః = ధైర్యశాలి. నిష్ణాతః = నేర్పరి షరోష్ణీ, పార్ష్ణిః = మడమ. రోచిష్ణుః = ప్రకాశము గలవాడు. విష్ణుడు = విష్ణుక్రాంతా లతా, వృష్ణిః = ......తృష్ణా = ఆశ. తూష్ణీంశీలః = ఊరకున్న వాడు. తీక్ష్ణః = .

———

# సుకవి మనోరంజనము

## తృతీయాశ్వాసము



శ్రీద శ్రీదా శ్రీదా
మోదర గిరిభేది ధాతృపూజితపాదా!
వేదా వేదిత గుణ! కా
కోదర మణి భూషితాంగ! కుక్కుట లింగా! 1

అవధరింపుము. ఉభయ విశ్రమముల తెఱం గెఱింగించెద. 2

### —: ఉభయ వళులు :—

*1. అంత్యోష్మ సంధియతి :-*

లక్షణము :-

గీ. వ్యంజనంబులు నంత్యోష్మ వర్ణమునకు
సంధి చెందిన నంత్యోష్మ సంధి విరతి
యనఁగఁ దనరారు రెండు వ్యంజనములకును
పృథుదయాపాంగ! శ్రీ కుక్కుటేశ లింగ! 3

అంత్యోష్మ వర్ణమనగా హకారము.

సూ 'ఝ యో హోన్యతరస్యామ్'

అను దీనివలన ఉత్ హతి = ఉద్ధతి, జగత్ హిత = జగద్ధిత, కకుస్, హస్తి = కకుబ్భస్తి—ఈ ప్రకారము సంధులు గలవు. 'ఉద్ధతి' పదముననున్న ధకార ద్వయముకు త థ ద ధ లున్ను, అ య హ లున్ను జెల్లును. 4

లక్ష్యములు ఉద్ధతి తకారముకు :-

శ్రీనాథుని నైషధము : (1-9)

సీ. తన కృపాణము సముద్ధత వైరిశుద్ధాంత
తాటంకముల కెగ్గు దలఁపు చుండ... 5

హకారముకు :-

వసుచరిత్రము : (1-44)

సీ. హరి వీరభట మహోద్ధతి నబ్ధి గంపింప
దురమున నిల్చి తద్దోర్గ్రహిఁ దునిమి. 6

'జగద్ధిత' - హకారముకు.

తిమ్మకవి సార్వభౌముని సర్పపుర మాహాత్మ్యము :-

చ. మతి మఱపూను నుస్సురను మందతచెందు కృశించు కంటికి
న్వెతబడు నీచవర్తనుల వేడఁగఁ జూచు విధిన్ సడించులో
ధృతి చెడి క్రుంగి బెంగగొను నెట్టిమహోన్నతుఁడైన నీ జగ
ద్ధిత కరుణా రసప్లుత నిరీక్షణ మబ్బనివేళ శ్రీసతీ! 7

నిరీక్ష-ప్రాదిగాన ప్రాదియతి (అనియు) అనవచ్చును.

## 2. నిత్యసంధి యతి :-

లక్షణము :-

గీ. వ్యాకరణ సూత్రమున సంధు లతుకునపుడు
నిత్యముగ సంధులుండుట నిత్యసంధి
యతి యనంగను దనరారు నబ్జమౌళి!
శ్లాఘినీ కృత వనమాలి! పరమ శూలి! 8

సూ. తోర్లి.

త వర్ణస్య లకారే పరే పరస వర్ణః స్యాత్.

తత్-లయః = తల్లయః, ఉత్-లాసం = ఉల్లాసం. స్ఫురత్ లీలా-స్ఫురల్లీలా—ఈ మొదలయిన ద్విత్వలకారములకు త థ ద ధ లు, ల ళ లున్ను యతి చెల్లును.

లక్ష్యములు :-

'ఉల్లాస'-లకారముకు :-

పారిజాతాపహరణము : (1-60)

మ. అలి నీలాలక నీవు నీ పతి రహస్య క్రీడ వర్తించు వే
ల లతాంతాయుధు సంగరంబునకు నుల్లాసంబు గల్పించు ను
జ్జ్వల దీపాంకురమై రతిశ్రమ తనూసంజాత ధారాల ఘ
ర్మ లవంబుల్ దొలగింపఁ బూసురటి యై రంజిల్లు నిచ్చాగతిన్. 10

అందఱు దీనిని ఎక్కటి యతి యనుకొందురు. ఎక్కటి యతికాదు.

తకారముకు :-

తిమ్మకవి భర్గశతకము :-

శా. నీలాంభోధర మధ్య సంస్థిత తటి న్నీకాశమై విస్ఫుర
ల్లీలన్ నివ్వరి ముంటి చందమున నెంతే పచ్చనై సూక్ష్మమై
చాలా భాసిలు తేజు నీవ యనుచున్ స్వాంతంబునం దెన్నుదు
ర్వాలెంబున్ ఘనులైన తాపసులు భర్గా! పార్వతీ వల్లభా! 12

రెండవ చరణమందు తకారముకు యతిగాన నిత్యసంధి యతియనవలె. మొదటి చరణమందు వికల్పసంధి యతి. 13

సూ. స్తోః శ్చునాశ్చుః
స్తోః సకార త వర్గయోః శకార చవర్గా భ్యాంయోగే
శకార చవర్గౌస్తః.

సత్-చిత్ = సచ్చిత్. సత్-శంఖం = సచ్ఛంఖః,
ఉత్-జ్వలం = ఉజ్జ్వలమ్

సూ. స్తో ష్టునా ష్టుః

స్తోః ష్టునా యోగే ష్టుః స్యాత్. తత్-టీకా = తట్టీకా. స్ఫురత్-డమ్మృగం = స్ఫురడ్డ మృగమ్. లసత్-ఢక్కా = లసడ్ఢక్కా

ఈమొదలైనవి నిత్యసంధియతులు. 'సచ్చిత్' అను పదమందు (ద్విత్వ చకారముకు) త థ ద ధ లు, చ ఛ జ ఝ లు యతిచెల్లును. తట్టీక అను పదమందు (ద్విత్వ టకారముకు) త థ ద ధ లు, ట ఠ డ ఢ లు యతిచెల్లును. 14

## 3. వికల్ప సంధి యతి :-

లక్షణము :-

గీ. వ్యాకరణ సూత్రమున సంధు లతుకునపుడు
రెండు విధముల రూపంబు లుండు కతన
నట్టి వర్ణంబునకు వ్యంజనములు రెండు
నిలుచు ధరను వికల్పసంధి యతి యనఁగ. 15

సూ. యరోను నాసికేఽనునాసికో వా

యరః పదాంత స్యానునాసికే పరే అనునాసికో స్యాత్. ఏతత్-మురారిః = ఏతన్మురారిః (ఏతద్మురారిః) సరిత్-నికటం = సరిన్నికటమ్ (సరిద్నికటమ్) తటిత్-నీ కాశం = తటిన్నీకాశమ్ (తటిద్నీకాశమ్).

ఈ మొదలైన పదములందు రెండు విధములైన హల్లులు (యతి) చెల్లును. 16

లక్ష్యములు :-'సరిన్నికట'-తకారమునకు

తెనాలి రామలింగము ఇందుధరోపాఖ్యానము :

మ. ఒకనాఁ డిందుధరుండు పార్వతియు లీలోద్యానకేళీ సరి
న్నికటానేక వనప్రదేశముల దైతేయేంద్ర కన్యాప్సరో

నికురుంబంబులు పారిజాతకుసుమానీకంబుపైఁ జల్ల ద
ర్పక బాణంబులకెల్ల నెల్లయగు సౌభాగ్యంబు శోభిల్లఁగన్. 17

మనుచరిత్రము : (2-16)

మ. అకలంకౌషధ సత్వముం దెలియ మాయా ద్వారకావంతి కా
శి కురుక్షేత్ర గయా ప్రయాగములు నే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్ర మిమ్మంచుఁగొం
డకు రాజెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్. 18

(ఈ పద్యమును) వికల్పసంధి యతికి అప్పకవిగారు (లక్ష్యముగా) వ్రాసినారు. అనునాసిక యతికి మిగిలిన లాక్షణికులు వ్రాసినారు. రెండు ననవచ్చును. 19

పై మూడు విధములైన యతి భేదములు వ్యంజన విషయికము లయినప్పటికి సంధివర్ణమైన ద్విత్వా (సంయుక్తా) క్షరపు రెండు విధములైన హల్లులకు యతి చెల్లుటవలన ఉభయ యతులందు నుంచినాము. 20

## 4. రాగమసంధియతి :-

లక్షణము :-

కాకునూరి అప్పకవిగారి 'ఆంధ్రశబ్ద చింతామణి' : (3-215)

గీ. అలను పదంబు మొదలను రాగమంబు
వచ్చుసంధికి నుభయంబు వలి తనర్చు
నతివ జవరాలు బాలింతరాలు ముద్ద
రాలు ధర్మాత్మురాలన రాక్షసారి. 21

ఉభయముకు లక్ష్యములున్నవి.

లక్ష్యములు, హల్లుకు :

చారుదేష్ణచరిత్రము :

క. ఈలలన వేలుపుం జవ
రాలో యచ్చరయొ కిన్నర వధూమణియో

వ్యాలాంగనయో కాకీ
భూలోక స్త్రీల కిట్టి పొంకము గలదే. 22

అచ్చుకు

మనుచరిత్రము : (2-41)

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేడెదు భూసురేంద్ర యే
కాంతము నందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతయకాక నీ వెఱుఁగవే మునువచ్చిన త్రోవచొప్పు నీ
కింతభయంబు లేకడుగ నెల్లిదమైతిమి మాటలేటికిన్ ? 23

లాక్షణికులందఱు 'ఏకాంత' పదమును ప్రధానముచేసి నిత్య సమాస యతికి లక్ష్యము వ్రాసినారు. అప్పకవిగారు రాగమసంధిని ప్రధానము చేసినారు. రెండు నవచ్చును. కాని, మూడవ చరణమందు నేయతియో యెవరును వ్రాయ లేదు. 24

## 2. విభాగయతి :-

లక్షణము :-

గీ. అవ యనంగ నేసి యన నొప్పు పదములు
సంధులందు రెండు జరుగుచుండు
సంఖ్యయును బ్రమాణ సంజ్ఞయుఁ గలచోట
నగు విభాగయతులు నగనివేశ ! 25

అర్థము :- రెండవ, మూడవ ఈ మొదలైన పదములందు 'అవ' అను (దానిలోని ఆది) స్వరము కలుసుకొని ఉన్నందున, డకారముకు అ య హ లు చెల్లును ట ఠ డ ఢ లు చెల్లుట స్పష్టమే. (ఇక) పదేసి, పట్టెడేసి, దోసెడేసి- మొదలైన పదములందు 'ఏసి' అను దానితో సంధిగల్గుదు గాన, ఉభయము చెల్లును. 26

లక్ష్యములు :

'మూడవ' అచ్చుకు :

శ్రీనాథుని కాశీఖండము : (7-60)

సీ సితికంధరునకు నెచ్చెలికాఁడు గాఁడొకో
యటమటీఁడైన యీ యక్షభర్త
అహికంకణునకు మూఁడవ కన్నుగాఁడొకో
ప్రాల్మాలు నట్టి యీ పావకుండు
పురవైరి కవతంస పుష్పంబు గాఁడొకో
నిర్భాగ్యుఁడైన యీ నీరజారి
గంగాధరునకు లెంకల లెంక గాఁడొకో
పెనుగూళ యైన యీ యనిమిషేంద్రుఁ
డేమి కుడువంగ వచ్చినా రిళ్లు వదలి
హరుని వెలివెట్టినట్టి యీ యాగమునకు
పంచవదనుని కను జేవురించెనేని
తత్క్షణమునంద తమయాంత్రద త్రాళ్లు తెగవె. 27

సభాపర్వము : (1-47)

సీ. ఆయంబునందు నాలవ భాగ మొండె మూ
డవభాగ మొండె నం దర్ధ మొండె
గాని మిక్కిలి సేయఁగాదు వ్యయం బని
యవధరించితె బుద్ధి యవనినాథ
ఆయుధాగార ధనాధ్యక్షముల యందు
వరవాజి వారణా వలులయందు
బండారముల యందు పరమ విశ్వాసుల
భక్తుల దక్షులఁ బంచి తయ్య
గురుల వృద్ధ శిల్పి వరవణి గ్బాంధవ
జనుల నాశ్రితులను సాధుజనుల
గరుణఁ బేదఱికము బొరయకుండఁగఁ బ్రోతె
సకలజనులు నిన్ను సంస్తుతింప. 28

పై పద్యములందు మూడవ, నాల్గవ— రెండు పదములున్నవి 'రెండవ' పదముకు :-

పారిజాతాపహరణము : (2-85)

చ. కువలయ పత్రనేత్ర కనుగొంటివె కన్నులపండువయ్యె రెం
డవ వినతాతనూభవుని యందమునం గమనీయ కాంచన
చ్ఛవి కవచీకృతం బకులిశక్షత పక్షము నైకరత్నసా
నువురలు నీదివాకృత వినోదపరాయణు చంద్రభానువున్. 29

హల్లుకు

కాకునూరి అప్పకవిగారి 'ఆంధ్రశబ్ద చింతామణి' : (4 ఆ. 21 వ ఛం.)

కనకలత. జవమున ఖగఖగ యనుచు వ్రజజనముల బొదవినం
దవశిఖి నుడిపిన మధుముర నరకదమన యని పే
లవముగఁ బలువరు నిరువది లఘువులు గము పదమూఁ
డవయెడ విరతి బొసఁగిన బెడగడరు కనకలతన్. 30

లాక్షణికులందఱు ఏసి యను పదమునకేగాని, 'అవ' యను పదముకు చెప్పలేదు. ఈ లక్ష్యములకు నేమి సమాధానము చేసికొనిరో తెలియదు. 31

(ఇక ఏసికి లక్ష్యములు)

'ఇంతేసి' - హల్లుకు :-

హరిశ్చంద్రోపాఖ్యానము : (2-178)

గీ. నీవు చేసిన దోషంబు నీకె యుండె
దీర్ఘరోషంబు మాకు నింతేసి యేల
మొగమునందున్న నీ దైన్య ముద్రఁజూచి
కరుణ జనియింపఁగాచితి ధరణినాథ ! 32

'ఇంతలేసి' -హల్లుకు :-

రాధామాధవము : (4-67)

గీ. కొదమ సంపెంగ పూవుల గుత్తి పుష్ప
లావి యొక్కటె శ్రీవత్సలాంఛనునకు

దర్శనం బిచ్చె మత్ప్రయోధరము లింత
లేసి కలవని తెలిపెడు లీల దోఁప. 33

అచ్చుకు :-

శ్రీనాథుని కాశీఖండము : (2-104)

గీ. అప్పటికి నియ్యఁగొంటిఁగా కబ్జవదన
ఋషుల పాలిటివే యింతలేసి పనులు
కాదుగ కాబోతు నాబోతు క్రుమ్ములాఁడ
నడిమి యాబెయ్యదెస వచ్చె నాకు నిపుడు. 34

## 6. భిన్నయతి[1] :-

(కాకునూరి అప్పకవిగారి లక్షణము) :

గీ. గుడుసుపైఁ గ్రియనడుమ నా గుడుసు వచ్చి
భిన్నయతి యగు రానిచోఁ బెఱయతియగు
నెదను లచ్చిని హరి ధరియించె ననఁగ
రిపుల నెల్లను బోర హరించె ననఁగ

విజయ విలాసము : (3.15)

ఉ చిత్తజుఁడల్లి తూపుమొన చేసినఁ జేయఁగ నిమ్మ పై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్మ వచియించెదఁ గల్గినమాట గట్టిగా

1. 'భిన్నయతి'ని వేంకటరాయడు ఉభయ యతులలోఁ పరిగణించినాడు (చూ. 2 అ. 25 ప.) కాని దానికి ఇక్కడ లక్ష్య లక్షణములు చూపలేదు. మూల తాళ పత్ర ప్రతులు రెండింటియందు నెక్కడను ఈ యతి వివరణ లేదు. 'ఇ' ప్రతియందు మాత్రము వికల్పయతి ప్రదర్శన తరువాత, రాగమ సంధియతి వివరణకు మొదట 'భిన్నయతికి లక్షణము ॥సీ॥ ధరియించె భరియించె వరియించె సుఖయించె' అని మాత్రము కుండలీకరణములో వ్రాయబడియున్నది. గాని ఈ లక్షణ పద్యము పూర్తిచేసి లక్ష్యము లెక్కడను ప్రదర్శింపబడలేదు. అందువలన గ్రంథ సమగ్రతకొరకు అప్పకవీయము నుండి ఈ యతికి లక్ష్య లక్షణములు చూపబడుచున్నవి.

నత్తరలాయతేక్షణ కటాక్ష విలాస రసప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకున్ దలమున్కలు గండుమీలకున్. 34/2

అందే :

ఉ. చెట్టతనంబునం జనకు జీవనమంతయు వెల్లివుచ్చి తోఁ
బుట్టిన యాపె యిల్వెడిచి పుట్టినబిడ్డనికిం బగైన నీ
యిట్టి నిశాట కృత్యమున కెవ్వడు రోయక సమ్మతించు నీ
వెట్టి ప్రదోషవేళ జనియించినవాడవొ గాక చంద్రమా! 34/3

పెఱయతి :

ఆగమము రానందులకు శ్రీరంగమాహాత్మ్యమునందు:

ఉ. గందపుఁగొండ నెత్తములఁ గందువ మేలిమి తీవయిండ్లలోఁ
గెందలిరాకుపాన్పున సుఖించి నితాంతరతి శ్రమంబునుం
జెందిన చెంచు గుబ్బెతల చెక్కులఁ జిమ్ము జవాది వాసనల్
విందులుసేయుచు న్మెలఁగు వేఁకువఁ గోమలగంధవాహముల్. 34/4

## 7. ప్రభునామ యతి :

లక్షణము :

గీ. అవ్వ యమ్మక్క యప్పయ్య యన్న యాయి
యరుసు పదములు సంధుల నడుకుచోట
నచ్చుహల్లులు రెండును నలరు నూదఁ
బడకయైనను ప్రభునామ వలి యనంగ. 35

'ప్రభు' శబ్దముకు నిక్కడ మనుష్యుడని యర్థము గాని, 'రాజు' అని అర్థముగాదు. కావున స్త్రీ పురుష నామధేయులకు (సామాన్యము. ఇట్టిచోట్ల) నుభయమును చెల్లును. కొందఱు లాక్షణికులు దీనినె 'నామాఖండ' మన్నారు. వారఖండయతి నంగీకరించనివారు. కొందఱు లాక్షణికులు, దొడ్డయ్య, దొడ్డమ్మ, రామయ్య, రామన్న, సీతమ్మ, లక్ష్మమ్మ- ఈ మొదలైన పేరులు దొడ్డయ, దొడ్డమ, రామయ, రామన, సీతమ, లక్ష్మమ- అని తేలబలికినపుడు స్వర

వ్యంజనములు రెండును చెల్లునని లక్షణముచెప్పి, అట్టివే లక్ష్యములు వ్రాసినారు. (మరి) పూర్వ మహాకవి ప్రయోగములు ద్విత్వముగల పేరులకు ఉభయముకు (యతి చెల్లింపు) ఉండగా, గురుత్వమొప్పక పోవుటకు వారి తాత్పర్యము తెలియదు, అనంతుని ఛంధము (1-118) నందు :

గీ. ఒరుల నన్నమ్మ యనుచోట నూదఁబడక
ద్వివిధమగుఁ బ్రభునామాంత విరమణమున
మఱి యయోధ్యకు రాజు రామన యనంగ
నతని పట్టపుదేవి సీతమ యనంగ

(అని) రంగరాట్ఛందంబు (3-128) నందు :

గీ. అవనిలో నలమేలు మంగమకు సాటి
యాదిలక్ష్మి, యానంద రంగనకు సాటి
విష్ణు, వటుగాన నోములు వేయు నోచి
మహిని నాతనిఁగన్న లక్ష్మమదె కీర్తి. 37

(అని చెప్పినారు) ఇటువలెనే కొందఱు గురుత్వమొప్పలేదు. గురుత్వమొప్పని వారికి గురుత్వములేదు. 38

గురుత్వముకు లక్ష్యములు :

అచ్చుకు :

తెనాలి మూర్తికవిగారి 'రాజవాహన విజయము' (అవ. 1-22)

ఉ. చెప్పిన పద్యమెల్ల చెవిఁజేర్చి వినున్ విన డెంకు గల్గినన్
దప్పులు గిప్పు లెన్నఁ డొకనాడును, నాడును నాడు వేడుచో
యప్పన వెట్టఁ బోఁడడిగినన్ వివరా లిడు కొండమీఁది తి
మ్మప్పనివంటి కావ్యపతి యబ్బుట యబ్బుర మిబ్బుధాలికిన్. 39

నంది తిమ్మనగారి చాటుధార:

క. ఇప్పటి దాతల సరిగాఁ
జెప్పకురా భట్టకర్ణ శిబిఖేచరులన్

జెప్పుము మూర్తిఘనుని వెం
కప్పకు దానమున నిర్భయంబున సభనన్. 40

పొట్టూరి గోపన్న చాటుధార :

క. అన్నలుఁడు రూపమున సిం
గన్న కళాయుక్తి, భరతు నన్నకరుణచే
నన్నసముద్రపు పెదచి
న్నన్నకుమారుండు వేంగలామాత్యుఁ డిలన్. 41

శ్రీనాథుని కాశీఖండము : (1-18)

సీ. వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసా
భ్యుచిత బంధమున నొక్కొక్కమాటు
పఠియింతువు ప్రబంధ పరమేశ్వరుని తేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు
నైషధాది మహాప్రబంధములు పెక్కుఁ
జెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ
యిపుడు చెప్పంగఁదొడఁగిన యీ ప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్య పేర. 42

మూడుచోటుల వుకారలోపము. రెండు (చోటుల) ప్రాదియతులు. 43

అందే : (1-53)

మ. హరి దాటించెఁ బురోపకంఠమున వాహ్యాలి ప్రదేశంబునం
దరుదే యల్లయరెడ్డినందనుఁడు దొడ్డయ్యక్ష్మాధీశ్వరుం
డిరవైనాలుగు మూర్లమేర యదిపో రెక్కింపగా నేల య
ద్ధరణీనాథుని కీర్తిదాటెఁ గడు నుద్దండించి బ్రహ్మాండమున్. 44

కాశీఖండమందు గురుత్వమునకు నీ రెండు పద్యములుండగా కొందఱు లాక్షణికులు (1-29)

మ. జయధాటీ సమయంబులన్ విలయ ఝుంఝూమారుతాడంబరా
న్వయ రంహః ప్రవిజృంభమాణ ఘన నిస్సాణోగ్ర భేరీస్వనం
బయి యుద్దాది భయంకరోద్ధమరు శౌర్యంబైన శ్రీరెడ్డి దొ
డ్డయ యల్లాడ నృపాల రాహుతకుఁ బిట్టల్లాడ దిక్చక్రముల్. 45

(అను) ఈ పద్యము తేలఁబలుకుటకు లక్ష్యము వ్రాసినారు. ఈ పద్యము, పై రెండు పద్యముల మధ్య నున్నది. వారి కంటికి నిది మాత్రము కన్పించి యా రెండు పద్యములు నెందుకు కనుపించక పోయెనో తెలియదు.

హల్లుకు :—

హాళక్కి భాస్కరుని చాటుధార :

క. అప్పలిడు నతఁడు ఘనుఁడా
యప్పు దొసఁగి మఱలఁ జెందు నాతఁడు రాజా
చెప్పఁగవలె సాహిణి మా
రప్పను దానమున ఘనుడు రాజు నటంచున్. 47

తెనాలి రామ[1]కృష్ణుని చాటుధార.

క. చిన్నన్న ద్విపద కెఱుఁగును
పన్నుగ పెదతిరుమలయ్య పదముల కెఱుఁగున్
మిన్నందిమ్రోసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్య శ్రేణిన్.

శ్రీనాథుని కాశీఖండము : (4-106)

గీ. అనిన విని సోమయాజి కోపాగ్రహమునఁ
దత్తరింపుచు వడి సోమిదమ్మఁ బిలిచె

(1) 'కృష్ణమ్మ' అని మూ. ప్ర. లో ఉన్నది.

నవునె సత్పుత్రజనయిత్రి యవునె సాధ్వి
యవునె సూనృత భాషిణి యవునె భార్య! 49

ఉభయముకు :

ఈవని పెద్దిరాజు చాటువులు :-

క. ఇమ్మహిలో మహనీయగు
ణమ్ముల నీసాటి గలరె నానావిధదే
శమ్ముల శ్రీరాముని సీ
తమ్మా మాయమ్మ నిత్యహర్షము లిమ్మా! 50

క. ఇమ్మా మదభీష్టంబులు
కొమ్మా మామ్రొక్కులెల్ల గుణమతి తా మా
యమ్మా రఘునందనుసీ
తమ్మా సౌభాగ్యసిద్ధిదాయిని వమ్మా! 51

క. ఇక్కలియుగశక్తులలో
లెక్కింపకు భట్ట శంకలేక ధరిత్రిన్
మిక్కిలి మల్లేశునియం
బక్కకు సరివేల్పుగలదె యవనీ స్థలిలోన్. 52

క. చొక్కపు శ్రీగిరి నిలయుని
మక్కువ మదిలో నెఱింగి మనుజులఁ బ్రోవన్
దిక్కయి నిలచిన మా యం
బక్కకు సరిగలదె సకల భాగ్యస్ఫురణన్. 53

'అయి'

వణుకూరి గురవరాజు 'శమతంకమణిచరిత్ర' :

ఉ. కాయవచోమనః (స్థితులఁ) గల్పిత దోషము లెల్లఁ బాయఁగా
నా యెదలోన నిత్యము సనాతన ధర్మముఁబూని నర్మిలిన్
బాయక కొల్తు రామనరపాల నిరంతర సౌఖ్యదాయి సీ
తాయి సమస్త శోభన విధాయి మహాఫలసిద్ధిదాయిగన్. 54

రాచపూడి వెంకయ్య చాటుధార.

క. వ్యాయామ జనిత మాయో
పాయసమస్తాఘుములు నివారణమగు దు
ష్కాయంబు పూతమగు గం
గాయినిఁ బొడగన్నఁ దానమాడిన మాత్రన్. 55

'అరుసు' - అనగా మంత్రికర్థము. 56

అచ్చురు :-

ఆంధ్రకవితాపితామహుని చాటుధార :

క. చేపట్టిన ధృవులవుదురు
కోపించిన రంభఁ గూడుకొందురు జగతిన్
స్థాపింపఁ బొడుపఁ జాలని
యాపందలు సాల్వకోన మరుసున కెనయే. 57

హల్లుకు :-

పలకలూరి గోపన్న చాటుధార :

గీ. గోలకొండ మలక గోవుల భక్షించు
కొండవీటి విప్రకులము నెల్ల
బాచమరుసు చేరి భక్షింపుచున్నాఁడు
మలకమేలొ బాచ మరుసు మేలొ. 58

కోన-అరుసు = కోనరసు, బాచ-అరుసు = బాచరసు అని ఉండ వలసి నందుకు మధ్య మకారము సంప్రాప్తమైనది.

'క్వచిదత్వం క్వచిచ్చాత్వం, క్వచిదిత్వం క్వచిత్ప్రతా
క్వచిన్మత్వం యథాయోగ్య మన్యచ్చ వ్యవహారతః'

అని అథర్వణాచార్యుల వారి కారిక కలదు. కోనమరుసు, బాచమరుసు- సుప్తప్రయోగములు. రామరాజు, సోమరాజు, రామరాయడు, కృష్ణరాయడు- ఈ మొదలగు పదములందు అత్వము, రామానాయఁడు, తిమ్మానాయడు, మల్లా

రెడ్డి, ఎల్లారెడ్డి - ఈ మొదలగు వాటియందు అత్వము. రామిరెడ్డి, సోమిసెట్టి - ఈ మొదలగు వాటియందు ఇత్వము. అయ్యపరాజు, బయ్యపరాజు, సూరపరాజు, నారపరాజు, - ఈ మొదలగు పదములందు పత్వము. కృష్ణమరాజు, కోనమ రాజు, కృష్ణమాచార్యులు, కొండమాచార్యులు - ఈ మొదలగువాటి యందు మత్వము. 'యథాయోగ్య మన్యచ్చ వ్యవహారతః' అనుట వలన, నరసుపండా, వెంకుపండా- ఈ మొదలగు వాటియందు ఉత్వము. రాజు, రావు, రెడ్డి, సెట్టి, శెట్టి, రాయడు, నాయడు, ప్రెగడ- ఈ మొదలగు పదములు కలిసినపుడు పైన చెప్పిన అత్వాదులు వచ్చును. 59

## 8. ప్రాదియతి :—

లక్షణము :

"శ్లో॥ ప్ర పరా ప్రతి ప ర్యత్యధ్యభ్యవానూప సంస్వప
ని వి నిర్దురుద ప్యాఙి త్యుపసర్గాస్తు వింశతిః

ప్ర, ప్రరా, ప్రతి, పరి, అతి, అధి, అభి, అవ, అను, ఉప, సమ్, సు, అప, ని, వి, నిర్, దుర్, ఉత్, అపి, ఆఙ్-ఇవి యిరువదియును ఉపసర్గలు. ప్రకారోపసర్గం బాదియగుటం జేసి ప్రాదులనంబడును.

గీ. ఆంధ్రమునకుఁ జొరని పరాజపులు మూఁడు
గాక తక్కిన యుపసర్గకముల తలల
స్వరము లతికిన వాని కవ్వలను నిలుచు
నచ్చులును హల్లులును బ్రాదియతు లనంగ 60

గీ. అబ్జయోని రజోగుణ ప్రాప్తిఁ దనరు
పద్మనాభుండు సాత్త్విక ప్రాప్తిఁ దనరు
రజతగిరి మందిరుఁడు తమఃప్రాప్తిఁదనరు
ననఁగ నిబ్భంగి ప్రాదుల కలరు యతులు"

(అ. క. 3-332, 3) 61

అని అప్పకవిగారు ఆంధ్రశబ్ద చింతామణియందు చెప్పినారు. ఇందులో పరా, ఆఙ్, అపి- ఈ మూడు వేదమందేకాని లోకమందు లేవనుట. (అయితే) ఆ మూడింటిలో (పరా అను దానిని కూర్చి).

సూ. అహ్నో౽దంతాత్. పరాగత మహః పరాహ్ణః

అని కౌముది యందున్నది. 1[పరాహ్ణ పదమొకటి. (కాగా) పరాగతాః ఆపః అస్మాత్ పరాపః = శుష్కప్రహదము. ఈ రెండు పదములందును పరా అను ఉపసర్గము గలదు. ఎఱ్ఱాప్రెగడ హరివంశమందు.

సీ. పా. అభిగుప్తమంత్రులు నర్థంబులందుఁ బ

రాఙ్ముఖు లార్య భావానుగతులు...]

(అని కలదు) కాని—అఙ్, అపి ఈ రెండు మాత్రము లేవు. 'ప్రాప్తి' పదమున (కొకటికి) మాత్రము ఉభయములకు లక్ష్యము వ్రాసి- ఇటువలె కడమవిన్ని చూచుకొమ్మని (అప్పకవి గార)న్నారు. ప్రాదులు విస్తారము లున్నవి. ఇంత మాత్రముచేత నందఱికి నెటువలె తెలియును? కొన్ని పదములు తెలియ పరుచుతున్నాము—

| | | | |
|---|---|---|---|
| ప్రేక్షణ | వీక్షణ | నిరీక్షణ | ప్రోక్షణ |
| అపాయ | ఉపాయ | ఉపాయన | ఉపేత |
| అపేత | సమేత | ఉపేక్ష | అపేక్ష |
| ఉపేంద్ర | సమంచిత | ప్రాంచిత | ఉదంచిత |
| సమాస | ప్రాస | వ్యాస | వ్యాకీర |
| వ్యాసంగ | వ్యాలోల | వ్యామోహ | వ్యాయామ |
| వ్యాకుల | వ్యాపార | ఉదార | ఉదాహరణ |
| ఉపోద్ఘాత | ప్రోద్భూత | అభ్యుదయ | ప్రత్యాలీఢ |
| ప్రాంత | ప్రత్యంత | పర్యంత | ఉదంత |
| సమాకీర్ణ | సమస్త | సమగ్ర | అత్యుగ్ర |
| ప్రత్యుప్త | ప్రత్యగ్ర | అన్వర్థ | దురంత |
| అపాదృత | వ్యపగత | అత్యుష్ణ | నిరాతంక |
| నిరాధార | నిరపేక్ష | ఉదంచిత | ప్రాణ |
| అపాన | వ్యాన | ఉదాన | సమాన |

1. 'పరాహ్ణ పద మొకటి'అను దగ్గరి నుండి ఎఱ్ఱాప్రెగడ సీ:సపాదాంతము వరకున్న [ ] లోని భాగము మూల ప్రతియందు 'మార్జిన్' వ్రాయబడి యున్నది.

ఈ మొదలైనవి ప్రాదులు మరియును-

సమ్ = సమ్యక్, ఈరితుం = గంతుం శీలమస్య సమీరణః - గాలి.

సమ్ ఈరయతి ఆమోదం (ఇతి చ) సమీరణః-మరువమరుపరిమల యుక్త భూజము.

విశేషేణ ఈరయతీతి వీరః = శూరుడు.

విశేషేణ వీరయతీతి వీరం = కుంకుమపూవు

అభితః గాః ఈరతీతి ఆభీరః = గొల్లవాడు

సమ్యక్ ఈరతి గచ్ఛతీతి సమీరః = గాలి

సమ్ = సమీచీనాః, ఉద్రాః = జలచరవిశేషాః యస్మిన్ సః సముద్రః = (సంద్రము).

ప్ర అస్యతే శత్రుష్వితి ప్రాసః ('ప్రాస' పదమందలి 'స' ఊష్మములోని) ద్వితీయాక్షరము = బల్లెము.

సం సంసక్తం అంతో యస్యా స్సా సమంతా, సమతాయా ఇమే సామంతాః

సమితిః, సమిత్, సమీకం, సమాధూతః, సముదాయః అభ్యాగమః- ఈ ఆరు యుద్ధ పర్యాయములు.

సమజ్యా, సభ, పర్యంకః, దురితం, ఉపాధిః, ప్రతీకః, ప్రతీక్ష్యః, ప్రతీతః, సమృద్ధిః, సమృద్ధః- ఈ మొదలైనవి ప్రాదులు. 64

ఉభయముకు లక్ష్యములు :—

విక్రమార్క చరిత్ర[1]:—

సీ. ప్రమదా జవేక్షణ ప్రార్థిత సౌందర్య
యాచక సంతత ప్రార్థనీయ
పృథివీసురవ్రజా భీష్టసంధాయక
యుభముఖ్య సైనికా భీష్టయాత్ర

1. ఈ పద్యము 'సింహాసన ద్వాత్రింశిక' (కొరవి గోపరాజు) లోనిది. 4-210.

పరమధర్మ క్రియోపాయ సంచితకీర్తి
యరిదుర్గ సాధనోపాయవేది
వివిధ శాస్త్రాగమ వీక్షణ తాత్పర్య
యిందిరా సత్కృపా వీక్షణీయ
ప్రబల తరగుణా నిరంతర వైభవ
యష్టసిద్ధి బల నిరంతరాయ
పరగుచుండు నివియ ప్రాదుల యతులన
విద్వదంబుజార్క విక్రమార్క. 65

రుక్మాంగద చరిత్రము : (2-70)

క. ఏ గృహపతిచే న
భ్యాగతుఁడు తిరస్కరింప బడుఁ, దన దురితం
బా గృహపతి కిడి చను న
భ్యాగతుఁడు తదీయ సుకృతమంతయుఁ గొనుచున్. 66

హల్లులకు :-

శ్రీనాథుని నైషధము : (8-56)

ఉ. దానకలా కలాప సముదంచిత సారవివేక సంపదన్
మానిత యాచమాన జనమానస వృత్త్యభిపూర్తిబుద్ధి యె
వ్వానికి లేదొకింతయును వాఁడొకరుండు భరంబు ధాత్రికిన్
గానలు గావు శైలములు గావు పయోధులు గావు భారముల్. 67

మనుచరిత్రము : (2-68)

శా. ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు పొంగార మై
యంచుల్ మోవఁగ గౌఁగిలించి యధరం బాసింప హా శ్రీహరీ
యంచున్ బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయంబంటి పొ
మ్మంచున్ ద్రోచెఁ గలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్

వసుచరిత్రము : (4-90)

శా. మాయాశీలురు చంచలాత్మ లనుకంపాశూన్య లాత్మైక కా
ర్యాయత్తుల్ సమయానుకూల హృదయ వ్యాపార గోపాయనో

పాయజ్ఞుల్ మగవార లాపయి మహీపాలు ల్మహా వైభవ
శ్రీ యోగాంధులఁ జెప్పనేల మరి వారిన్ నమ్మఁగా వచ్చునే. 69

కృష్ణరాయల ఆముక్తమాల్యద : (1-58)

మ. స్ర. స్వనిలింపావాస దత్తాశన దతల మిథ
స్తారతమ్యంబు లీరెం
డును దీనుల్ గొంచు నమ్మాడుగుల యడంగ
న్దోచు నుద్యద్రతోన్మే
లన సిద్ధద్వంద్వ బృందాలయ బిలగత క
ల్యాణ మంథాద్రులోనా
వనజాక్ష స్యందన ద్వంద్వము లిఖితనరా
వాప్త దాంపత్య మొప్పన్. 70

చివర (పాదమున రెండవది) ప్రాదియతి. రెండవ చరణ మందు రెండవది అను నాసికయతి.

అచ్చులకు :-

శ్రీనాథుని నైషధము : (4-83)

క. ఈరీతి నాతలోదరి
సారతరసుధారస ప్రసవ...రసా
సారసరసోక్తి సరణి మ
హారాజకుమారునకు నుపాయన మొసఁగెన్. 72

మనుచరిత్రము : (1-79)

క. ఆ మందిడి యతఁ డేగిన
భూమీసురుఁ దరిగెఁ దుహిన భూధర శృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీ ఝరీ నిరీక్షాపేక్షన్. 73

రాఘవ పాండవీయము (1-12) :

సీ. గంభీరవేది లక్షణ లక్షితంబులై
తనరారు భద్రదంతావలములు
నారట్టసింధుగాంధారాట్టభవములై
కొఱలు శ్రీవృక్షక ఘోటకములు
పదునాల్గు జాతుల త్రిదివకాంతల మీఱు
పద్మినీజాతి సౌభాగ్యవతులు
కడునద్భుతములైన కనకరత్నాంశుక
చందనాది సువస్తుసంపదలును

నఖిలదిగ్దేశ భూపసమర్పితంబు
లగుచు శరణంబుగతిఁ దోన నరుగుదేఁ
దను వరించు జయశ్రీలఁ గొనుచు నతఁడు
పురికిఁ జనుసొంపు వాగగోచరతఁ బరఁగె. 74

సమర్పితము - ప్రాదియతి.[1]

ప్రాణపదము హల్లుకు :-

పోతరాజుగారి భాగవతము (అష్టమ-285) :

క. ప్రాణేచ్ఛ వచ్చి సొచ్చిన
ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లన్
ప్రాణుల కిత్తురు సాధులు
ప్రాణంబులు నిముషభంగురము లని మగువా! 75

1. ఇక్కడ 'ఈ పద్యార్థము తెలియుటకు ముద్దరాజు రామన్నగారు రచించిన వ్యాఖ్యానము వ్రాసుతున్నాము' అని ప్రారంభించి ఆ పద్యవ్యాఖ్య వ్రాసి, వ్యాఖ్యలో—'పదునెనిమిది జాతులు పేరులు మాత్రము వ్రాసినారు. ఏ జాతివలన నేజాతి పుట్టినదో అది వ్రాయలేదు. ఈ నిర్ణయము ముఖ్యముగా తెలియవలసినదౌను' అని 'స్కందపురాణము'నుండి 11½ శ్లోకములు వ్రాయబడినవి. చివరి శ్లోకార్థభాగమిది'—ఏవం సంకర వర్ణానాం జనానాం జన్మలక్షణమ్.'

అచ్చుకు :-

అడిదము సూరకవి 'కవిజనరంజనము' :

సీ. అనుగుబిడ్డల భంగి ననుజీవులను బ్రోవు
 మిలవేలుపులను గొల్వు మేమరకను
పతికి ముం దనుభవింపకు మే పదార్థంబు
 జవదాటకుము నిజేశ్వరుని మాట
మగఁడు గావించిన మన్నన కుబ్బకు
 మఱి కృశింపకు మవమానమునకు
నవనిసురాభ్యాగతార్థికోటుల నెల్ల
 నాప్త బంధువులయ ట్లాదరింపు

కరుణగల్గుము బంధువర్గములకెల్ల
గురజనంబుల సద్భక్తి గొలువు మెపుడు
దైవమన్నను గురువన్న ధర్మమన్న
ప్రాణనాథుండు సుమ్ము మాయమ్మకాన. 76

ఇటువలెనే తెలుసుకునేది. 77

## 9. చతుర్థీ విభక్తి విరామము:-

లక్షణము :-

గీ. తనరు నచ్చు హల్లులకుఁ గై యను విభక్తి
తివిరి పదముపై నిడఁ జతుర్థీ విరామ
మంజలి యొనర్తు శశిమౌలికై మురారి
కై సమర్పింతు విరులనఁ గలుషదమన. 78

ఆంధ్ర శబ్ద చింతామణి యందలి :—

సూ. కొఱకు కై చతుర్థ్యాస్తః
అను సూత్రము వలన చతుర్థికి 'కై' యను వర్ణము సిద్ధము. ఆ వర్ణము అచ్చుకు చెల్లునని కొందఱి మతము. హల్లుకు చెందునని కొందఱి మతము రెండును గలవు. హల్లుకు సులభము. 79

అచ్చుకు:—

శ్రీనాథుని నైషధము : (8-150)

ఉ. కాంత మెఱుంగుఁజన్నులకుఁ గ్రమ్మఱి క్రమ్మఱి వచ్చి వచ్చి యం
గాంతర సన్నివేశములకై యట నేగియు నేగలేక భూ
కాంతుని దృష్టి దిగ్భ్రమము గైకొనఁబోలు బలెం దదీయ ప
ర్యంతము నం దలందిన కురంగమదంబను చిమ్మఁజీకటిన్. 80

చివర (పాదమున) ప్రాదియతి.

శ్రీకృష్ణరాయల ఆముక్తమాల్యద (1-63) :—

క. ఆలి వచః కార్పణ్యం
బా లేమల చెవులుసోక దథమాన్వయ జీ
ర్ణా లావణ్యుల పిల్పున
కై లాభము దెల్పిరేని యవి శ్రీలగుటన్. 81

'ఏని' పదముకు 'యద్యర్థమే' కాని, ఇక్కడ 'అప్యర్థము' చెప్పవలెను. 82

మనుచరిత్రము (3-132) :

క. కావున వారలఁ జూడం
గా వేగమె చనఁగవలయుఁ గమలదళాక్షీ
నీ వెఱుఁగని ధర్మాధ
ర్మావస్థలుఁ గలవె దీనికై యదలకుమీ. 83

తిమ్మకవి అచ్చ తెనుఁగు రామాయణము(అయో. 94) :

క. కైకా నీపూనిన పని
కై కాకై కందినట్టి యనుఁగుంగొడు కి
ట్లై కానం తేగెడు నిఁక
నే కడ నీవంటి తులువ లేరీ పుడమిన్. 84

శాంతి పర్వము (2-23) :

గీ. అరణి నగ్ని బొడము కరణి దేవకియందు
విప్రయజ్ఞ కర్మ వేద గుప్తి
కై జనించె నెవ్వఁ డవ్వసుదేవ నం
దను భజింతు నేకతానిరూఢి. 85

(హల్లుకు :-)

బ్రహ్మోత్తర ఖండము :

ఉ. అంతయు నాత్మలో నరసి యల్లన నవ్వుచు నా నృపాల కుం
డింతికి సర్వముం దెలిపి యెల్లరకుం గతజన్మ వాసనా
క్రాంతిని బాపపుణ్యముల కై వశమౌ మది నట్టుగాన నే
కాంత శివార్చనా నిరతి గైకొనుమంచు వచించె నేర్పడన్. 86

జైమినీ భారతము (2-51) :

ఉ. నావుడు వాయునందనుఁడు నందన! పొమ్ము చమూవధూటి నీ
కై వశమైన లెస్స యటుగాక నినుం దల మీఱెనేని దా
దావున నిల్చి మద్ఘన గదా పటు విక్రమ తాడనంబు లం
జేవ యడంతు నెందు గురుశిక్షఁ గదా నుతిగాంతురంగనల్. 87

10. పంచమీ విభక్తి విరామము :-

లక్షణము :-

కాకునూరి అప్పకవి 'ఆంధ్రశబ్ద చింతామణి' (3-288) :

గీ. తత్సమంబు సేయు తఱిని పంచమి నన్న
నంటె ననువిభక్తు లదుకు సంధి
మెంఁగుఁ గృతులఁ బంచమీ విభక్తి విరామ
మనఁగ నచ్చునకును హల్లునకును. 88

లక్ష్యములు :

ఉభయముకు :-

చమత్కార రామాయణము :

క. నిన్నుఁ జెఱఁగొన్న హైహయు
కన్నను దోర్వీర్యమెక్కుడగు భార్గవు లీ
ల న్నిర్జించిన రాముని
కన్నను శూరుండు ముజ్జగంబులఁ గలఁడే॥ 89

(హల్లుకు :-)

ఆదిపర్వము (4-224) :

చ. వితతమఖ ప్రయోగ విధివిత్తము లుత్తమ ధీయుతుల్ జగ
న్నుత సుమహా తపోధను లనుగ్రహ నిగ్రహ శక్తియుక్తు లీ
క్రతువున ఋత్విజుల్ కమలగర్భసమానులు పూర్వదిక్పతి
క్రతువున యాజకోత్తములకన్నఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్. 90

అరణ్యపర్వము (7-489) :

చ. విను మగుడంగ నాఁడు పృథివీపతిఁజూచి ధరిత్రికంటె వే
గన యగుదాని నాకసము కంటెఁగడుం బొడవైన దాని గా
ద్పునకును నెక్కుడై జవము పొంపిరి వోయెడుదానిఁ బూరికం
టెను దఱచైన దానిని ఘటింపఁగఁ జెప్పుము నాకు నావుడున్. 91

## 11. నిత్యాయతి :-

లక్షణము :-

తిమ్మకవి లక్షణసార సంగ్రహము (2-126) :

క. విదితముగ నేని యనియెడు
పద మన్యపదంబుతోడఁ బద్యంబులలో
నదుకునెడ నిరుదెఱంగులఁ
బొడవున్ నిత్యయతియనంగ భుజగవిభూషా॥ 92

లక్ష్యములు :-

ఉభయముకు :-

శేషధర్మములు :-

క. మెట్టఁడు నారక మార్గం
బెట్టి మహాక్రూరకర్ముఁ డేనియుఁ దుది ని
ట్టట్టనక నెమ్మనంబున
నెట్టన హరిఁదలఁప గలిగెనేని మహాత్మా. 93

మొదటి 'ఏని'కి అప్యర్థము. 94

అచ్చుకు :-

ఆదిపర్వము (6-48) :

గీ. రాజవరుఁడైన పార్థుతో రాజుగాని
యాతఁ డని సేయఁగాఁ దగఁడేని వీని
నెల్లవారలు జూడఁగ నీక్షణంబ
రాజుఁ జేసెద నే నంగరాజ్య మిచ్చి. 95

అందే (7-142) :

మత్త: (మానితంబగు నాతపోమహిమం ద్రిలోక పరాభవం
బేను జేయఁగఁ బూని చేసితి నిట్టి దొక్క ప్రతిజ్ఞ మున్)
దీని నెట్టులఁ గ్రమ్మఱింతు మదీయభాషిత మెన్నఁడు
న్నేని మోఘముగాదు దిగ్ధరణీరవీందు లెఱుంగగాన్. 96

శ్రీనాథుని కాశీఖండము (4-249) :

గీ. ఎట్టి యపరాధ మొనరించెనేని తల్లి
కొడుకు శపియింప దిబ్బంగిఁ గ్రూరబుద్ధి
(నతివ సత్యంబు చెప్పు మెవ్వతెవు వీవు
నావుడును శాపభీతి నన్నలిననేత్ర). 97

భాస్కరుని రామాయణము (అయో-337)

శా. వానప్రస్థునిఁ జంపి యొక్కవడితో స్వర్నాధుఁడుం ద్రుంగు ధా
త్రీనాధుండన నెంతవాఁడఁట విచారింపంగ నీకెంత నే
ర్పేనింబోవు శిరంబు వ్రక్కలయి దప్పెం దప్పె నీ కృత్య మ
జ్ఞానంబుం గదు నోడిచెప్పితివి పశ్చాత్తాప తప్తుండవై. 98

## 12. దేశ్యానిత్యా సమాసయతి :-

లక్షణము :-

కాకునూరి అప్పకవి 'ఆంధ్రశబ్ద చింతామణి' (3-191) :

క. 'రూపఱఁ బెంపఱఁ బెల్లఱ
నే పఱచుట క్రిక్కిఱియుట నిలఁ గ్రచ్చఱయున్
జూపఱి యుక్కఱి మొదలుగ
క్ష్మాపతి దేశీయ నిత్య సమసన పదముల్. 99

'కొందఱు దీని దేశ్యాఖండవడి యందురు.' (అని వ్రాసినారు ఇది) స్వత
స్సిద్ధమైన అఖండవడి నంగీకరించని వారి మతము. 100

అనంతుని ఛందము (1-100) :

గీ. అఱ యనంగను బోవుట కర్థమైన
సంధి నిత్యసమాసోక్తి జరుగురెంట
నసురవీరుల నెల్ల నుక్కఱవధించె
భానుకులుఁడు రావణుని నేపఱచెననఁగ. 101

తిమ్మకవి లక్షణ సారసంగ్రహము (2-128) :

క. అక్కఱ తెమ్మెఱ రూపఱఁ
గ్రక్కదలగ నోలమాస క్రచ్చఱ యన నీ
పెక్కుపదము లిరుదెఱఁగుల
నిక్కముగ నఖండవడి గణించిరి సుకవుల్. 102

అథర్వణ ఛందము :-

గీ. దేశ్యతెనుఁగు నందుఁదెలియ నొక్కొకచోట
వాల్గులోన నచ్చు నడఁగియుండు
నట్టిచోట రెండు నమరు వళ్లకుఁ జెప్పె
నాదిసుకవివరుల యనుమతమున. 103

లక్ష్యములు :

'ఉక్కఱ'-హల్లుకు :-

విరాటపర్వము (5-143) :

చ. చిఱునగ వొప్ప గాండివముఁ జెచ్చెర సజ్యముఁజేసి సేనలు
క్కఱ రభసంబుమై నడువఁ గవ్వడి ద్రౌణియు పీడఁబోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు దందడిఁ దార్కొని మండుచుండె చి
చ్చఱ పిడుగు ల్వడిం దొఱఁగుచాడ్పున నంబరవీధి నుగ్రమై. 104

అచ్చుకు :-

అరణ్యపర్వము (6-345) :

క. ఎఱకలుగల కులశైలము
తెఱఁగున మై రయము మెఱయ దివికి నెగసి బి
ట్టుఱుము జలధరము క్రియ ను
క్కఱఁ దద్వనమెల్ల నదుద నాప్పచుఁ గడిమిన్. 105

'క్రచ్చఱ' - హల్లుకు :-

నందితిమ్మకవి వాణీవిలాసము :

క. తెఱవా తరువాతను క్రగ
చ్చఱ నీ నాయకుఁడు సౌమ్యసంగు నెటంచే
మఱువక మినుకులఁ గాంచిన
తెఱఁగెల్ల నటంచు తేటతెల్లముగాఁగన్. 106

అచ్చుకు :-

ఉద్యోగ పర్వము (1-176) :

చ॥ తఱియగు నంతకున్ రిపు నుదగ్రత సైచుట నీతి నీవు నా
కఱపిన యట్లు సేయుము తగం జని యాతనిఁ గాంచి నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందఁగ మదిం గల దేనియు నింత యేల క్ర
చ్చఱ ముని వర్గవాహనుఁడవై చను దెమ్మను మంతఁ దీరెడున్

'అక్కఱ' —హల్లుకు (క్రచ్చఱ-అచ్చుకు):— 107

అరణ్య పర్వము (7-367) :

చ॥ ఎఱిఁగితి నిన్ను నేను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు క్ర
చ్చఱ భవదీయ రక్షణము నంద వెలుంగుచు నుండె నట్టి ని
న్నుఱవుగ నేను వేడుకొన నొప్పునుగాక మొఱంగి నిన్ను న
క్కఱపడి నీవు వేడుటిది కర్జమె నిర్జిత దైత్య చెప్పుమా॥

అచ్చుకు :- 108

పారిజాతాప హరణము (1-49) :

సీ॥ (ప్రామినుకులదొంగఁ బాతాల కుహరంబుఁ
జొరఁబాఱి చీఱిన చోఱ వీవ
తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పుల గూటి
చవి దేల్చినట్టి కచ్ఛపమ వీవ
నీటిలో మునిఁగిన నేల చేడియఁ గొమ్ము
కొన నుబ్బ నెత్తిన ఘోణి వీవ)
మునిమాపు బలుగంబమునఁ బుట్టి బంటు న
క్కఱను బ్రోచి నృసింహంబ వీవ... 109

కొందఱు విశ్రమభంగ మనుకొని ('అక్కఱను' అను దానిని) 'నెయ్య
మున' అని దిద్దినారు. (వారు) స్ఫూర్తిగా విశ్రమములు తెలియనివారు. 110

'ఓలమాస' -హల్లుకు

అనుశాసనిక పర్వము (1-68) :

క. అతిథి నినుగోరె నేనియు
మతి కింకిరి పడక నోల మాసగొనక నీ
వతనికిఁ బ్రియంబు నలుపుము
సతికిం బతి పనుపుసేయఁ జను నెల్లవియున్. 111

అచ్చుకు

శ్రీనాథుని నైషధము (4-97):

గీ. (అని విచారించు చుండె నయ్యవనినాథుఁ
దంతకయమున్న నలునిగా నతని నెఱిఁగి)
ఎదురుగద్దియ డిగ్గి పృథ్వీశతనయ
యవనికాంతరమున నోలమాసగొనియె. 112

ఆంధ్రశేషమందు :

"గీ. ఆహవోన్ముఖతకు నోలమాసగొనక
పిఱుదివియ కీడఁబోకన పేళ్ల దనరు". 113

అని యుద్ధమందు విఱుగుటకు చెప్పినారు. (పై శ్రీనాథుని పద్యమున) సిగ్గుచేత మాటుకు వెళ్లుట స్పష్టమైనది. 114

(ఇక) రంగరాట్ఛందమునందు :

క. దొర చొరయనఁ బరగెడుఁ గ్ర
చ్చఱ విజయానంద [రంగ) హంపీరునియ
బ్బురపు నగరివాకిటఁ గ్రి
క్కిఱిసి కవుల్గాచి నా రహీనప్రౌఢిన్. 115

(అని ఉన్నది 'క్రచ్చఱ' 'క్రిక్కిఱిసి' అనువాటి అచ్చుకు లక్ష్యమిది) అయితే ఈ పద్యమందు 'దొర' 'అబ్బురము' రేఫములు. 'కచ్చఱ' 'క్రిక్కిఱి యుట' అకారములు కవీశ్వరునిది పొరపాటు. 116

'క్రక్కఱదలు' - హల్లుకు

శల్యపర్వము (1-102):

సీ. గీ. (చారుభీషణరేఖల భూరిమద భ
రాభిరామ యానంబుల వాహనోచి
తోగ్ర కల్పనాభంగుల నుల్లసిల్లఁ)
గరులు ధాత్రీతలంబు గ్రక్కఱదల నడిచె. 117

పెద్దిరాజు కావ్యాలంకారంబున తెమ్మెఱ, ఆఱడి,పీఱడి-దేశ్యనిత్య సమాస యతులందు వ్రాసినారు. మరియు కొన్ని పదములు గలవు. 118

ఉన్నది :-
శ్రీనాథుని కాశీఖండము (2-71) :

గీ. అమ్మ కుశలంబె, సాధ్వీ యనామయంబె,
దేవి భద్రంబె లెస్సలా పూవుబోడి
సార పరమ పతివ్రతాచార వైభ
వాధిరాజ్యంబు జరుగుచున్నదియె తరుణి ! 119

శల్యపర్వము (1-388) :

క. అది కొంతఁ బుడమిఁబడు ను
న్నది పాటినఁ గని యదల్చి యవనీశుఁడు బె
ట్టిదముగ నెలుంగు సూపెను
మదమారగ నబ్బలంబు మగుడు విధమునన్. 120

కన్నది :—

విరాటపర్వము (2-99) :

క. అది లాతివిల్లె నిను దమ
హృదయంబున నెల్లవారు నెఱుఁగరె యే జె
ప్పుదు నీదు పెంపును గ
న్నది మొదలుగ నెల్లవారి కయ్యయి భంగిన్. 121

అన్నవి, చిన్నవి - మొదలయినవి యిటువలెనే తెలుసుకునేది. 122

కన్నాకు :-

తిమ్మకవి అచ్చతెనుఁగు రామాయణము (సుందర. 169) :

గీ. అనుచుఁ జేదోయి మోడ్చి యోయంటరాని
వేల్పు నీ సంగడీఁడగు విన్నుచూలి
కనుఁగు కొడుకగు కోతి కన్నాకునందు
నుడుకుసూపక చల్లనై యుండుమయ్య. 123

ఎప్పటి :-

భీష్మపర్వము (3-36) :

సీ. దనుజేంద్రు నిలుచుట గని వారి సైన్యమె
ప్పటి యట్ల పురికొని యనికిఁజొచ్చె. 124

అప్పటి, ఇప్పటి- ఇటువలెనే తెలుసుకొనేది. 125

ఆంధ్ర భాషాభూషణమందు :-

క. అమి లేమికి నిమి కల్మికి
నమరంగాఁ దనము చందమగుట నగుంగా
నమి వినమి తాల్మికూరిమి
తమ మంచితనంబు లోభితనమనఁ జనుటన్. (166) 126

అని యున్నదిగాన, కొనమి, అనమి, వినమి- ఈ మొదలైనవిన్ని చెలిమి, కలిమి, బలిమి, ఓరిమి, కూరిమి, తాలిమి- ఈ మొదలైనవిన్ని (పదములలోని) మధ్యమవర్ణ ముభయముకు చెల్లును. మరియును-

గీ. ఆఁడు నదియును నధమకార్యములఁ దెల్పు
బొంకులాఁ డోగులాఁడును అంకులాఁడు
పెంట పెనపరి ముందరి తుంటరియును
కల్లరియు నన నెల్లెడఁ జెల్లుఁగాన (165). 127

అనియున్నది గాన, బొంకులాడు మొదలైనవి ఉభయముకు చెల్లును. పేదఱికము, ఇల్లఱికము- ఈ మొదలైనవియు ఉభయముకు చెల్లును. 128

గీ. ఈఁడు బాసఁ దెల్పు నీఁడు గుణముఁ దెల్పు
నీఁడు కులముఁ దెల్పు నెల్లయెడల
కన్నడీఁడు నాఁగ, కపటీఁడు నాఁగ సా
లీఁడునాఁగ వేఱులేక చనుట (168). 129

కొండీఁడు, దుండగీఁడు, సాలీఁడు మొదలైనవిన్ని ఉభయముకు చెల్లును. 130

ఆంధ్రశేషము :-

సీ. పదముపై 'నేది' నిల్పఁగ నఖావార్థమౌ
'నొండె' వికల్పార్థ మొదవఁజేయు
ఏవకారార్థంబు నెసఁగించు 'న'త్వంబు
'కు' త్వంబు మర్యాదకును లభించు
అందించు వర్తమానార్థంబు 'చు' త్వంబు
విధ్యర్థమున 'కది' వెట్టవలయు
ఉపమింపుచో 'వోని' యొనఁగూర్పఁగాఁ జెల్లు
'అర్యము' లస్తినా స్త్ర్యర్థదములు

జడపదంబుల మీఁద 'మై' సంఘటింప
నది తృతీయా విభక్తియై యలరుచుండు
ఒప్పుకరణార్థమును కోలుట యనంగ
'ఓ' యిడిన సంశయార్థంబు నొదువఁజేయు. 181

అర్థము :- పొలుపు-ఏది = పొలుపేది. సొగసేది. రాముఁడొండె, లక్ష్మణుఁడొండె, మహేశ! నీవ దిక్కు. నీవే అని అర్థము. మర్యాద అనగా హద్దు. అంతకు లోనవచ్చి. ఇంతకు లోనవెళ్ళి. చేయుచుండె, వినుచుండె. రిపుల సాధించునది. 'మంటయు వోని శాత్రవసమాజము'. నేర్పరి, లావరి., అరి (చేరినది). నేర్పుగలవాడు, బలము (లావు) గలవాడు (అని అర్థము). నేరమి, ప్రోవమి, అమి (చేరినది, నేరకపోవుట, ప్రోవకపోవుట అని అర్థము) భక్తిమై. కాంతిమై. కరణమనగా నిచ్చట తృతీయార్థము. రాజ్యమియ్యనికోలు- ఇవ్వని హేతువు, ఇచ్చుట, వచ్చుట. ఇచ్చిన హేతువు, వచ్చిన హేతువు, ఔనో, కాదో, ఇటువలెనే తెలుసుకునేది. 182

వీటిలో పొలుపేది, లావరి, నేరమి, ఇచ్చుట- దేశ్యనిత్య సమాసయతులు, ఆంధ్రభాషాభూషణమందు అరి అను పదము అథమకార్థ మవుటన్నారు. ఇచ్చుట అస్త్ర్యర్థమన్నారు. రెండును సాధులే. 183

సూ. 'ఏదంత తాచ నామ్నా మన్యతరస్యా మియాంతానామ్' అని వాగనుశాసన సూత్రమున్నదిగాన, మల్లియ, ఒల్లియ, పెట్టియ, మట్టియ, మిద్దియ. గద్దియ, లంజియ, తేనియ, నూనియ, గడియ- ఈ మొదలైనవిన్ని,

'మానార్థాన్నిత్య మేకత్వ, మెదుస్యాత్పరిమాణకే' అని అథర్వణాచార్యుల వారి కారిక గావున మానెడు, జానెడు, పుట్టెడు, బుట్టెడు, మూరెడు, బారెడు, పీసెడు, దోసెడు- ఈ మొదలైనవిన్ని ఉభయముకు చెల్లును.

## 13. శకంధ్వాదియతి (పరరూపయతి)

లక్షణము :-

కాకునూరి అప్పకవి ఆంధ్రశబ్దచింతామణి (౩-226) యందు :-

"సూ. అచోన్త్యాదిటి
అన్త్యాచ్ ప్రభృతి శబ్దష్టి సంజ్ఞ స్స్యాత్
శకంధ్వాదిషు టేః పరరూపం వాచ్యమ్.

శ్లో. శకంధు రథ కర్కంధూః కుద్దాలో లక్త పర్కటీ
లాంగలీషా హలీషా చ మనీషా చ పతంజలిః
కుత్కీలోష్ణీష మంజీర మస్తిష్క కులటాదయః
తథా వృకంధు సీమన్తౌ శకంధ్వాది గణే స్మృతాః

శకానాం దేశానాం అధుః శకంధుః. శకంధువనగా శకదేశమందున్నబావి. కర్కస్యాంధూః కర్కంధూః 'కర్కంధూ ర్బదరీ కోటీ' త్యమరః. కర్కంధు వనఁగా రేఁగుచెట్లు. కం=శిరః ఉష్ణపీర్యత్వా దుద్దాలయతీతి కుద్దాలః; కుం=భూమి ముద్దాలయతీతివా. దలవిశరణే. ఉదిత్యుపసర్గః. 'కుద్దాలో బహువారకః' ఇత్యమరః. కుద్దాలమనఁగా విరిగిచెట్టు. పాదమలతీత్యలక్తః. అలభూషణే. 'యావో లక్తో ద్రుమామయ' ఇత్యమరః. అలక్తమనఁగా లత్తుకపేరు. పర్చ్యతే=పరస్పరం స్పృజ్యత ఇతిపర్కటీ. పృచి సంపర్కే. 'ప్లక్షో జటీ పర్కటీస్యా' దిత్యమరః. పర్కటి యనఁగా జువిచెట్టు. లాంగలస్య ఈషా లాంగలీషా. 'ఈషాలాంగల దండస్స్యాత్' ఇత్యమరః. హలస్యేషా హలీషా. ఈ రెండు ఏడికోల పేళ్ళు. మనస ఈషా లాంగలవత్సంబద్ధా మనీషా. 'బుద్ధి ర్మనీషా ధిషణా' ఇత్యమరః. మనీషయనఁగా బుద్ధిపేరు. పతన్-అంజలిః=పతంజలిః. పతంజలి యనఁగా వ్యాకరణమునకు మహాభాష్యము చేసిన నాగముపేరు. కోర్భూమే రుత్కీలః కుత్కీలః. 'అగకుత్కీలజీమూత సానుమన్నగ పర్వతాః' ఇత్యమరః కుత్కీల మనఁగా గట్టుపేరు, ఉష్ణస్య ఈషః ఉష్ణీషః. 'ఉష్ణీషశ్శిరోవేష్ట కిరీటయో' రితి నానార్థే. ఉష్ణీషమనఁగా దలపాగపేరు. మంజు=రుచ్యం ఈరయతీతి మంజీరః.

ఈరస్వనే. 'మంజీరో నూపురోఽస్త్రియా' మిత్యమరః. మంజీరమనఁగాఁ గాలిగజ్జె, మస్తం - శిరః ఇష్యతే - ప్రాప్నోతీతి మస్తిష్కః. ఇషగతౌ. 'తిలకంక్లోమ మస్కిష్క' మిత్యమరః. మస్కిష్కమనఁగాఁ దలమెదడు పేరు. విటం = విటకులం అటతీతి కులటా. అట గతౌ, 'అసతీ కులటేత్వరీ' త్యమరః కులట యనఁగ లంజెపేరు. ఆది శబ్దముచేత వేదండ, సారంగ శబ్దములు మొదలైనవి మరికొన్ని గలవు. వేదః - సామవేదః, అండః. జననకారణం యస్య సః వేదండః. సామోద్భవ ఇతిప్రసిద్ధిః. 'సామజ స్సింధురోపి సః' ఇత్యమరః. వేదండమనఁగా నేనుఁగుపేరు. సారాణి అంగాని యస్య సః సారంగః. 'సారంగ శ్చాతకే భృంగే కురంగేచ మతంగజే'త్యమరః. సారంగమనఁగాఁ జాతకాదుల పేరు. వృకస్య అంధుః వృకంధుః. వృకంధువనఁగా వృకదేశమందున్న బావి. సీమ్నోంతస్సీమంతః. సీమంతమనఁగా బాపటపేరు. ఇవి శకంధు శబ్దములు మొదలుగాఁగలవి గావున, శకంధ్వాదిగణం మనఁబడును. 135

క. విరతికి వ్యాకరణముచను
వరరుచిచేఁ జెప్పబడిన వాక్యము వల్లన్
బరరూపము నిత్యంబై
పరగు శకంధ్వాదులకు నుభయము చెల్లున్ (3-126). 136

అని చెప్పినారు.

(అయితే) వీటిలో శకంధుః, కర్కంధుః, కులటా, సీమంతః, మనీషాఁ లాంగలీషా, పతంజలిః, సారంగః (పక్షిః), మార్తండః ఈ పది సిద్ధాంత కౌముది సంధిపంచకమందు వ్రాసినారు. వ్యాఖ్యాకారులు, 'కర్కంధుః, కర్కాకో రాజ్ఞాం అంధుః కర్కంధుః'- కర్కులను రాజులయొక్క నుయ్యి- అని వ్రాసి నారు. కాని రేగుచెట్టు కర్థము వ్రాయలేదు. అప్పకవిగారు మిగిలిన పదము లన్నింటికి నర్థము వ్రాసి 'కర్కస్య' అనగా నేమిటో, 'అంధూః' అనగా నేమిటో, అర్థము వ్రాయలేదు. రెండు పదములు కలిసి రేగుచెట్టు కర్థము వ్రాసినారు. శబ్ద శాస్త్రమందు 'శకంధుః, కర్కంధుః' అని ఉకారాంతమనిన్ని, స్త్రీలింగ పుంలింగములు రెండు గలవని వ్యాఖ్యాకారులందఱు వ్రాసినారు గాని, అచ్చున్నటుల సమాస మొకరును వ్రాయలేదు భానోజీ దీక్షితులుగారు రచించిన 'అమర వ్యాఖ్యాసుధ' యందు- 'కర్కం దధాతీతి కర్కంధూః. కర్కః కోశః.

అంధూ దృగ్భ్వా ఇతిసాధుః' అని వ్రాసినారు. కర్కమనగా పౌత్త్రికాయ కర్థ మన్నారు లింగాభట్టుగారు- 'కర్కాణి లోహితాని పర్ణాని ఫలాని దధత్ర ఇతి కర్కంధూః. డుధాఞ్ ధారణ పోషణయోః' అని వ్రాసినారు. 'కర్క' శబ్ద మునకు 'శబ్దార్థతరు' వందు- 'కర్కపి, అదంతఃపుంసి. అమరః శ్వేతాశ్వే. నానార్థ రత్నమాల పుంసి. దర్పణే,' ఘటీభేదే'- చిన్నకుండ- 'అగ్నౌ విశ్వ ప్రకాశః. పుంసి. కర్కటకే. లింగాభట్టః క్లీబే లోహితే' అని యున్నది. 187

ఉయ్యల మొదలైన పదములను లాక్షణికులందఱు నేకపదములని వ్రాసితే, లేని పదన్వయ విభాగముచేసి, స్వకపోల శాస్త్రము కల్పించి, ఇంచు కంతయు సందర్భములేని అర్థము వ్రాసి, ముద్దరాజు రామన్నగారిని ఏకపద మన్నారని (అప్పకవి గారు) ఆక్షేపించినారు. కర్కంధూ శబ్దముకు పదద్వయ విభాగము చెయ్యడము మాత్రమే కాని, శబ్దశాస్త్ర వ్యాఖ్యాకారులను, అమర వ్యాఖ్యాకారులను చూడకనో, ఏమి హేతువునో, ఆక్షేపింపలేదు. సంస్కృతాంధ్రము లందు స్వతంత్రులు గావున వారిసిద్ధాంత మస్మదాదుల కగోచరము.

'వృక ఇవ అంధుః = వృకంధుః'-అని శాబ్దిక వ్యుత్పత్తిగాని, 'వృకస్య అంధుః'-అనిగాదు. 'కర్కంధూ' శబ్దమువలె గాకుండగా నచ్చుకలదు. అల్కర్క పర్కటీ శబ్దములు అప్పకవిగారు వ్రాసిన సమాసమున నచ్చులు కనిపించవు. 'వాఖ్యా సుధ' యందు- 'మంజీర' శబ్దము 'శకంధు' (మొదలగు వానిలోని) పదమని వ్రాయలేదు. 'ఉష్ణస్య ఈషః = ఉష్ణీషః' అని వ్రాసినారు. 'వ్యాఖ్యా సుధ' యందు 'ఉష్ణం ఈషతే, హినస్తి, ఈష గత్యాదౌ, ఇగుపధేతికః, శకం ధ్వాదిః 'ఉష్ణీషంతు శిరోవేష్టే కిరీటే లక్షణాంతర. ఇతి విశ్వః'అనిఉన్నది 189

అప్పకవిగారు పదునెనిమిది పదములు వ్రాసినారు. కర్కంధూ పదము మాత్రము బొత్తిగా కుదురలేదు (ఇక) అమరవ్యాఖ్యా వాదులందు పండితులు నిర్ణయించినవి ముప్పదిమూడు పదములు కనుపించినవి—వ్రాసుతున్నాము.

శ్లో॥ కుబ్జకుంభౌ కూర్మకుతా నశ్మంతం దుదుభిస్తథా
ఇందిందిర స్సుందరీ చ గంధర వృకణావపి
వింధ్యా సారస వాగస్తి ర్ధాత్యుహోవరటా తథా
మకరందః పుష్పవంతౌ శిఖండ రథినామపి

శుద్ధోదనః కలంకశ్చ మార్తండో అర్కఏవ చ
నీలంగుశ్చాపి కుద్దాలః పర్కటః కంకణం తథా
చిరస్య నరకం చాపి మృతండః కంకు రేవ చ
గంధర్వాలర్కశబ్దే చ శకంధ్వాధి గణే స్మృతాః

క్వౌ ఉబ్జతి ఉబ్జ అర్జవే, యద్వా, కు ఈషదుబ్జ అర్జవ మస్య కుబ్జః- పొట్టివాడు. కుం భువం, ఉంభతి, ఉంభ పూరణే, కర్మణ్యణ్, కుంభః-కడవ. కుం శరీరం ఉనత్తి, ఉందీక్లేదనే. బాహుళకాత్తః, కుంతః-బల్లెము. కం జలం ఉర్వతీతి కూర్మః బాహుళకాన్మః, ఉర్వీ హింసాయామ్ = తాబేలు అశ్మనోత్యంతో త్రేతి అశ్మంతః—పొయ్యి, దుందు శబ్దేన ఉభిరత్రేతి దుందుభిః. రాజద్వారమందుండెడు వాద్యవిశేషము. ఇందతి ఇందిరయా ఇందిందిరః ఇది పరమైశ్వర్యే—తుమ్మెద,. సుఅతీవ ఉందతి, ఉంద క్లేదనే. సుపూర్వః బాహుళకాదరః గౌరాదిః సుందరీ=చక్కనిమగువ. గంధం అర్వతే, అర్వగతౌ, గంధర్వః=దేవయోని విశేషము. వృకేన కంఠేన అణతి వృకణః=కొక్కెర. వి ఇంధ్యతే. ఇకి ఇంధన దీప్తౌ, అంతర్భావితవ్యార్ధః వింధ్యః అంఘ్నాదిః=పర్వతవిశేషము. సారం బలం అస్యతేనే నేతి సారసనా, అసగతిదీప్త్యాదానేషు. కరణే ల్యుట్ = నడుముకు బలము కొఱకు కట్టుకొనెడు, కాశకోక మొదలైనవి. అగం అస్యతీతి అగస్తిః అగపూర్వ............దోస్తి ప్రత్యయః = మహర్షి. దిత్యౌహేయం, తస్యేద మిత్యణ్. దేవికాశంశనే త్యాత్వేవాహ ఊఠ్, దాత్యూహః = పక్షివిశేషము. వరం అటనం అస్యాఇతి, వర మటతీతివా వరటా = స్త్రీహంస. మకరసి అందతి అది బంధనే, కర్మణ్యణ్, మకరందః = పూదేనె పుష్పస్య అవతఇతి పుష్పవంతౌ, పుష్పంప్రకాశః, వికాసశ్చ. అకారాంత తకారాంతౌ = రవిచంద్రులు. శిఖయా అత్యతే, అనుగత్యాదిషు ఇమంతాడ్డః'శిఖండో బర్హచూడయో'రితి హేమచంద్రః. శిఖాయా అండఇవ. ఇనే ప్రతికృతా వితి స్వార్థేకన్. 'శిఖండౌవాశిఖా బర్హే' ఇతి తాలవ్యాదౌ రభసః = నెమలి పింఛము జుట్టున్ను. రథస్యఇనః రథినః రథికుడు శుద్ధం న్యాయపరిశుద్ధంఓదనంభుక్తేశుద్ధోదనః=పరిశుద్ధాన్నము భుజించువాడు, అంక్యతేనేనేతిఅంకః, కలశ్చాసావంకశ్చ కలంకః. కలకిల క్షేపే = అంకాపవాదములు, మృతే అండే భవః మార్తండః = క్రోధ సూర్యులు.అలం అర్క్యతే, అర్చ్యతే.లర్కస్తవనే అర్చపూజాయాం అలర్కః = వెఱ్ఱికుక్క. నీలాని అంగాని యస్య సః నీలంగుః = తుమ్మెద. ఖుం భూమిం ఉద్ధాలయతీతి కుద్దాలః = గుద్దలి మొదలయినవి.

పర్వేణ పీఠేన అటతీతి పర్పటః = కుంటివాడు. కంకె గతౌ అణతి. అణ శబ్దే. అచ్, కంకణమ్ = హస్తభూషణము. చిరం అస్యతి, అసు క్షేపణే ణ్యత్ సంజ్ఞాపూర్వకృతత్వాత్ వృద్ధ్యభావః చిరస్య-తడవు అవ్యయపదము. నరత్వేనో త్కృష్ట జన్మవతాం నరాణాం నిరతిశయ మకం దుఃఖం యత్రతత్ నరకమ్ = శునకసూకరాది నీచయోని. కం అంగతి, అగి గతౌ ణ్యంతో వా మృగవ్యాదిత్వాత్ కంగః ప్రియాణి అంగాని యస్యసః ప్రియంగుః = కొఱ్ఱ యనెడు ధాన్యవిశేషము. గంధశ్చాసౌ అర్వశ్చ,గంధే అర్వోలోభో యస్యసః గంధర్వః = వట్రువతోక దొడ్డ కడుపుగల మృగము, కోకల, గుఱ్ఱమున్ను. అలతి భూషయతీతి అలః అలశ్చా వా వర్కశ్చ అలర్కః = తెల్లజిల్లేడు. 141

ఈ ముప్పది మూడు 'శకంధ' పదములు నమర వ్యాఖ్యానాదులయందు చూచి వ్రాసినాముగాని, స్వకపోల కల్పిత మొకటియు లేదు. ప్రియంగు పదమందుననున్న యకారమందు స్వరము లేకపోయినను, అయహలు (చెల్లును) ఏక (పద) మే అయినా, శకంధ్వాదియతియని తెలియవలెగాని, సరసయతి యనరాదు గాన శకంధ్వాదులందు వ్రాసినాము. 142

ఉభయముకు లక్ష్యములు.

సీసమాలిక:—

అపుడు విప్రుండు శకంధు నీరము గ్రోల
క్షత్రియ వరుఁడు శకంధు నీర
మింపుగఁ ద్రావె మనీషియొకండు నిం
డించెఁ గ్రోధంబు మనీషచేత
నెపుడు విప్రునకు హలీషనంటుటయు, హ
లీషా పరులతోఁజెలిమియుఁగూడ
దెలమితో శిరము నుష్షీషంబుఁ దాల్చె, ను
ష్షీషాధిపతులు పూజింపుచుండ
దెబ్బతో శిరము మస్తిష్కంబు చెదరి యిం
తింతపైఁ బడెను మస్తిష్కమెల్లఁ
ఖేలల పాదముల మంజీరంబు లలరె, మం
జీరారవంబులు హెచ్చుమీఱె

నార్యజనములు కులటల నంటుదురె, కు
లటలతోఁజెల్మి ఖలజనుల కగు
మణిభూషలిడియె సీమంతఁబు దీర్చి, సీ
మంతిని యొకతె యొయ్యారమొదవ

నఖిల జనములు మ్రొక్క పతంజలికిఁ బ
తంజలి యొనర్చె శబ్దశాస్త్రముకు భాష్య
మనుచుఁ బలికినఁ బరరూపయతులు సుమ్ము
కాశవరకీర్తి శ్రీకుక్కుటేశమూర్తి. 143

హల్లులకు స్పష్టమే, (ఇకమీద) అచ్చులకేర్పరించుతాము. 144

సీసమాలిక :—

సుందరీమణి కుచ కుంభంబుపై సుమ
కుంతఁబువేసె ప్రద్యుమ్నుఁడపుడు
కుబ్జుండు తనదుబాహులఁ బూనె రత్నకం
కణయుగలంబు కలంక గతిని
కూర్మంబు పూనె సముద్రంబుఁ దరచుచో
మందరధరముకు మహిమమీఱ
వింధ్యాద్రి దుర్గర్వ మింకఁగాఁజేసి య
గస్త్రి ద్రాక్షారామ హరునిఁగాంచె
యోధాగ్రవరుఁడు దుందుభి మొఱఁజేసె, సా
రనను బూనె భటాగ్రవరుఁడు
హేమాబ్జమందు నిఁదిందిరంబున్న గం
ధర్వుండు గనుగొని హర్షమొందె
నలి క్లిష్టమగు మకరందంబు, సూదుండు
నగ్నిరగిల్చె నశ్మంతమందు
నబ్జాకరముల వరటలుచెలంగె వృ
క్షణములు వేడ్క మత్స్యాలి మ్రింగె

నలికనయనున కలదు నలర్కపూజ
యంతికమునుండఁగూడ దలర్కమునక
టంచు పలికినఁ బరరూపయతులుసుమ్మ
హీరహీరాంగ కుక్కుటాధీశ లింగ ! 145

(కొన్నింటికి లక్ష్యములు :-)

'వేదండ' పదము, అచ్చుకు :-

**ఆది పర్వము (8-225) :**

మత్త. దండితాహితవీర సూరినిధాన వీరవినోదకో
దండ పార్థ పరాక్రమ ప్రియధామ దిక్పరిపూరితా
ఖండ పాండుయశోనిధీ పరగండభైరవ మత్తవే
దండతుండ విదారిఘోర తరాసి భాసి భుజార్గళా ! 146

అప్పకవీయ మచ్చుపుస్తకమందు '...వే, దండమండల చండతుండ విదారణాసి భుజార్గలా' అని ఉన్నది పొరపాటు. 147

హల్లుకు :-

భీష్మ పర్వము (1-234) :—

ఉ. పాండు నృపాలనందనులు పావని మున్నుగఁజేసి యట్లు భీ
ష్మండుఁ గడంకమై నడుచుచోటికిఁ జక్కటి రాఁగఁద్రోచి యొం
డొండఁ గడంగి సేన తన యుబ్బున కుబ్బఁగ నన్యసైన్య వే
దండ ముఖాంగముల్ వ్రణవితానముగాఁగొని నిర్వికారుఁడై. 148

'సారంగ' పదము, అచ్చుకు :-

చంద్రికా పరిణయము :-

ఉ. జంగమ రోహణాద్రి సదృశంబులు తత్పరిఁగల్గు భద్రసా
రంగవరేణ్యము ల్పయికి హస్తము లించుక సాచి యవ్వి య
ద్ధాంగఝరంబు పీల్చి మఱి తద్వమధుప్రకరంబు దప్పివో
ప్పంగ నెసంగు రంగుగ నిజాఖ్యవహించిన ధాతకాలికిన్. 149

హల్లుకు :-

ద్రోణ పర్వము (1-17) :-

ఉ. అంగద నాథు డ్రింగిన వృకావలి దన్వేసఁ జుట్టుకున్న స
ర్వాంగములుం జలింప బెగడందుచు దిక్కులు సూచుచున్న సా
రంగియ పోలె నుండెఁ గురురాజ భవత్సుతుసేన భీష్మ నా
జిం గలిలించి పాండవులు జృంభితవిక్రమలీలఁ బొల్చుటన్. 150

ఇటువలెనె మిగిలినవి చూచుకునేది. 151

రంగరాట్ఛందంబునందు స్వాంత, వేదండ, మార్తండ శబ్దములు శకంధ్వాది యతులందు వ్రాసినారు. 'స్వాంత' నిత్యసమాసముగాని, శకంధ్వాదుల లోనిది కాదు. కొందఱు లాక్షణికులు 'వేదండ' పదము నిత్యసమాసములందు వ్రాసినారు.[1] ఏమి పరిశీలించి వ్రాసినారో తెలియదు. 152

## 14. యుష్మదస్మచ్ఛబ్దయతి :-

లక్షణము :-

కాకునూరి అప్పకవి ఆంధ్రశబ్దచింతామణి (3-122) యందు :—

క. క్షితి నస్మద్యుష్మత్పద
యతులనఁ గావ్యముల యుష్మదస్మచ్ఛబ్ద
ద్వితయమునకుఁ బైఁ బ్రాణము
లతికిన నుభయంబుఁ జెల్లు నభయవిహారా! 153

(అని వ్రాసి లక్ష్యములు)

సాంబోపాఖ్యానమునందు :-

క. చతురానన నందన ది
వ్యతపోధనవర్య యుష్మదాగమనమునన్
గృతకృత్యుఁడ నైతిని నే,
నతి పావనమయ్యె నస్మదన్వయ మెల్లన్. 154

1. 'వేదండ' శబ్దమును నిత్యసమాసయతులలో ప్రదర్శించిన వాడు కూచిమంచి తిమ్మన (లక్షణసార సంగ్రహము. 2.263, 64)

ఆదిపర్వము (2-219) నందు

క. ప్రస్తుత ఫణిసత్రభయ
త్రస్తాత్ములమైన యస్మదాదులకెల్లన్
స్వస్తియని పలుక నవసర
మాస్తీకున కయ్యె నిప్పు డంబుజనేత్రా! 155

అథర్వణాచార్యుల విరాటపర్వమునందు :

గీ. ధర్మతనయ యుష్మదాజ్ఞానిగళ విని
బద్ధమగుచుఁ జిక్కువడియెఁగాక
విజయ మత్తగజము విడివడ్డచో నడ్డ
పాటు గలదె విష్టపత్రయమున" 156

అని వ్రాసినారు. ఈ రెండు నఖండయతులు. అయితే అప్పకవిగా రఖండయతి నొప్పరుగాన, ఇచ్చట దిద్దశక్యముగాక 'యుష్మదస్మచ్ఛబ్ద' యతులని పేరుంచినారు. ఇంత మాత్రము చేత నఖండయతికి లోపము రానేరదని యుంచినాము. 157

*15.* ఘఙ్ యతి :-

లక్షణము :-

లక్షణ సారము :-

గీ. అచ్చు హల్లును తాపశబ్దాది వర్ణ
మునకుఁ జెప్పిన ఘఙ్ యతులనఁగఁ దనరు
నంబురుహగేహిని మధురాలాపయనఁగ
లక్ష్మి వాగ్జిత కోకిలాలాపయనఁగ. 158

లక్ష్యములు :-

ఉభయముకు :-

రంగరాట్ఛందము : (8-288)

క. శ్రీ పరిధవిల్ల సత్యా
లాప విలాసియగు కృష్ణు నటువలె రంగ

క్ష్మాపతి శ్రీకరసత్యా
లాప విలాసమునఁ బ్రజల లాలనసేయున్. 159

ఈ రెండు పద్యములందు నుభయ లక్ష్యములున్నవి. హల్లుకు సులభము 160
అచ్చుకు—

నాచన సోమన హరివిలాసము[1] :-

గీ. అగ్రజన్మ నాతోమృషాలాపమిప్పు
డాడి నందుకు ఫలము జిహ్వాంచలంబు
కత్తిరించెద నీ సూరకత్తిచేత
ననుచు దగ్గరి చేరిన నసురఁ జూచి. 161

పింగళి సూరన్న గిరిజాకల్యాణము :

క. కోపాటోపమ్మున ధర
ణీ పాలక చంద్రముఁడు మునిశిఖామణులన్
ద్రోపించిన వారి దురా
లాపము లాడుచును బోయి రాసమయమునన్. 162

శ్రీ కృష్ణరాయల ఆముక్త మాల్యద (7-81) :

ఉ. గోపుర కందరాలి కడకున్ శశిపుష్కరిణీ కణార్ద్రి సం
తాపహరానిలంబులు పతాకరణన్మణి కింకిణీకలా
లాపములన్ సుఖంబడుగ నాటిటిఁ జొచ్చి యకాండగాహనా
చాపలకృన్మరుద్గణముఁ జందుఁ దదల్చెదు లోని వాకిటన్. 163

## 16. ఆదేశయతి :-

లక్షణము :-

గీ. ద్వీప ప్రేప సమీప ప్రతీపముల న
నూప పద మంతరీప పరేపములును
విశ్రమంబుల నుభయంబు వెలయుఁ గృతుల
కవివినుతి పాత్ర కజనేత్ర కంకపత్ర 164

1. రంగరాట్ఛందమున నిది 'హరివంశము' లోనిదిగా ఉదాహృతము. రంగ. ఛంద. 3-287

ద్విధాగతాః ఆపః అస్మిన్నితి ద్వీపః = తిన్నె, సంగతాః ఆపః అస్మిన్నితి సమీపః = చేరువ. ప్రతిగతాః ఆపః అస్మిన్నితి ప్రతీపమ్ = మెరక అనుగతాః ఆపః అస్మిన్నితి అనూపమ్ = ఉదకసమృద్ధిగల దేశము. అంతర్గతాః ఆపః అస్మిన్నితి అంతరీపమ్ = యద్వా, అపా మంతః మధ్యం అంతరీపమ్ = నీటినడుమ నుండెడు తిన్నెయు, జలమధ్యమున్ను. ద్వ్యంతరుపసర్గేభ్యస్స్యోత్, ఉదనోద్దేశే అను నీ సూత్రములవలన ద్వీపాది పదములకు పైనున్న ఆప అను పదముకు ఈప, ఊప అను పదములు ఆదేశములు. అవర్ణాంతములైన ఉపసర్గములకు పైనున్న ఆప అను శబ్దముకు ఈత్వము వికల్పము. ప్రగతాః ఆపః అస్మాత్ ప్రేపః, ప్రాపః. పరాగతాః ఆపః అస్మాత్ పరేపః, పరాపః = శుష్కహ్రదము. ప్రాప, పరాప పదములు ప్రాదులు. ప్రేప, పరేప పదములు ఆదేశయతులు. 165

కవిరాక్షసచ్ఛందమున :

గీ. ద్వీప నాకాంతరీప ప్రతీపశబ్ద
ములకు నచ్చు హల్లులును యతులు చెలంగు
నితఁడు పటుశక్తి జాంబవద్వీపమేలె
నాకవాసులచే నుతు లందె ననఁగ. 166

అని, రంగరాట్ఛందమున (3-220) :-

గీ. ఎలమి సత్కీర్తి జాంబవ ద్వీపమునకు
భర్తయగు పాదుషాచేతఁ బ్రణతు లంది
నాకవిభువైభవము బూని యమరి తౌర
రసికమందార యానందరంగధీర! 167

(అని యున్నది. ఈ చెప్పబడ్డపదములలో) 'నాక' పదమున సమాసము గాని, ఆదేశముగాదు. ఆదేశములందు కలుపుటకు పరిశీలించక పోవుట కారణము. పెద్దిరాజు 'కావ్యాలంకార చూడామణి' (7-65) యందలి :-

ఉ. ద్వీపులఁ జంపి విశ్వజగతీపతి యుత్తమశక్తి జాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్ముగఁజేయుటయుం బ్రసన్నమై
గోపతిధేను వ వ్విభునకుం దనవైభవ మిచ్చెఁగాక యే
భూసతు లీవదాన్య గుణబుద్ధిఁ బ్రసిద్ధి వహించి రుర్వరన్ 168

అను నీ పద్యమును రంగరాట్ఛందమునందు నాదేశయతికి లక్ష్యము వ్రాసినారు. యుక్తము. (అయితే) అప్పకవిగారు నిత్యసమాసయతికి లక్ష్యము (గా) వ్రాసినారు. ఇంతమాత్రమేకాదు, 169

క. లోకంబున కర్ణాట వ
నౌకోద్వీపాంతరీప నాస్తిపదార్థా
నేకాన్యోన్య జనార్దన
నాకాదులు నిత్యసమసనము లంద్రు బుధుల్. 170

అని నిత్యసమాసములందు వ్రాసినారు. (వీనిలో) ద్వీపాంతరీప పదములు రెండు నాదేశయతులు. నాస్తి, నాకపదములు రెండు నసమాసయతులు అనేకపదము నఞ్ సమాసయతి. ఇవి పూర్వకవి లాక్షణికులచేత స్పష్టముగా నేర్పరించబడినవిన్ని, ఆలాగు భేదములున్ను స్పష్టముగా నున్నవిన్ని నిత్య సమాసములందు కలుపుటయు; ఎవరును భేదము చెప్పనివిన్ని, భేదము లేనివిన్ని అకారయతులని, ఇకారయతులని చెప్పుటయు వారి పాండిత్యమేమిటో గోచరింపదు. 171

## *17, 18.* నసమాస, నఞ్ సమాస యతులు :-

లక్షణము :-

ఉత్తమ గండచ్ఛందము :

క. నసమాస నఞ్సమాసము
లసమంబుగ నచ్చు హల్లు యతులందుం దా
పస మానస లసమాస, స
రస జలవిహరణ విలోల రాజమరాలా! 172

తిమ్మకవి లక్షణ సారసంగ్రహము (2-284):—

గీ సరవి నసమాస నఞ్ సమాసములు కృతుల
నచ్చుహల్లులు రెంటికి నగును వలులు
నాకలోకాధిప ప్రణుతాంఘ్రియుగల
నాగ కేయూర సంయుతానంద భవన

నాక పదము నసమాసయతి. అనంతపదము నఞ్ సమాసయతి. నసమాసమనగా—న విద్యతే అకం దుఃఖం యస్మి న్నితి నాకః=స్వర్గము. నసత్యం యయోస్తౌ అసత్యౌ, నాసత్యౌ=అశ్వినీ దేవతలు, న అకటి, అక కుటిలాయాం గతౌ, బాహులకాదుః, నాకుః=పుట, న ఆప్నోతి అస్పృశత్వాదితి నాపితః, ఆపత్ వ్యాప్తౌ=క్షౌరకుడు, న అస్తి=లేకపోవుట. పద్భ్యాం నా గంతీతి నాగాః=పాములు. న అగః నాగః=ఏనుగు.

"నాకో మతంగజే సర్పే, పున్నాగే నాగకేసరే
క్రూరాచారే నాగదంతే, ముక్తకే వారిదేపి చ
దేహానిల విషేశేచ, శ్లేష్మేస్యా దుత్తర...
నాగరంగే సీసపత్రే, స్త్రీబంధే కరణాంతరే'

ఇతి హైమః, 'న భాడి' తిసూత్రేణ నఞః ప్రకృతి భావః దేహానిల విశేషమనగా వాగ్ద్వారమందు నుండెడు వాయువు.

'నాగశ్చ కూర్మ కృకరో, దేవదత్తో ధనంజయః
వాగ్ ద్వారే నాగ అఖ్యాతః కూర్మ ఉన్మీలనే స్మృతః
కృకరాచ్ఛుతు తే జ్ఞేయం, దేవదత్తా ద్విజృంభణమ్
న జహాతి మృతంవాపి, సర్వవ్యాపీ ధనంజయః. 174

లక్ష్యములు:—

నాక పదము. హల్లుకు :—

విరాట పర్వము (5-124) ;

క. మును వెఱతు నేయ, మీరలు
వను నేసినఁ గాని యనుడు నాకేశసుతున్
ధనురాచార్యులు డెబ్బది
సునిశిత బాణంబు లేసెఁ జూపఱ బెగడన్ 175

శ్రీనాథుని కాశీఖండము (2-91) :-

గీ. ఎన్నికకు రోమకూపంబు లెన్నిగలవొ
దివ్యవర్షంబు లన్ని మోదించు సాధ్వి
నాక భవనంబునం దాత్మనాథుఁగూడి
వెఱ పొకింతయు లేక చిచ్చుఱికె నేని. 176

అచ్చుకు :-

చేమకూరవారి విజయ విలాసము (1-71) :

స. గీ. (రాజసము తేజరిల్లు నీ రాజుఁగూడ
యింపు సొంపులు వెలయఁ గ్రీడింప వలదె)
నాకలోకంబు వారల కైన లేని
యలఘుతర భోగ భాగ్యముల్ గల ఫలంబు 177

నాస్తి పదము, హల్లుకు :—

శ్రీకృష్ణరాయల ఆముక్తమాల్యద (1-84) :

శా. ఆ నిష్ఠానిధి గేహసీమ నడురేయాలించినన్ సాగు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలున్ దివ్యప్రబంధానుసం
ధానధ్వానము 'నాస్తి శాక బహుతా, నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్య మన్మాటలున్.

రెండవ చరణమందు 'నమిత' మను కాకుస్వరయతి.

ఉభయమునకు —

కవుల షష్ఠము :

స. గీ. తల్లి దండ్రియు దైవంబు దలఁప గురుఁడు
కాఁడె యతఁ డేమి చేసిన గనలఁదగునె
నాస్తికాధమ యోరి యన్యాయవృత్తి
నాస్తి తత్వం గురోః పరంబనఁగ వినవె. 179

ఇటువలెనే తెలుసుకునేది. 180

'నారాయణ' పదముననున్న రేఫము హల్లుకు నచ్చుకు యతిచెల్లునని నిత్య సమాసములందు లాక్షిణికు లందఱు వ్రాసినారు. (అయితే) నకారమందును స్వరమున్నదని, (అది) సమాసయతియని యందఱు నెఱుంగరు. నిత్య సమాసములందు నసమాసముకు కూడా సమాసము వ్రాసుతున్నాము. 181

'నారాయణ' పదము నకారమందున్న అచ్చుకు :—

పారిజాతాపహరణము (1-96):—

క. ముని యేమి సేయు, రుక్మిణి
నన( గారణ మేమి ధూర్తు నారాయణు జే
సిన చెయిద మేమి చెప్పుదు
మన మెరియదె ప్రాణమైన మగ డిట్లయినన్. 182

ఇక్కడ నఖండయతి యనిన్ని, అది మంచిదిగా దనిన్ని పండితంమన్యులు — 'రుక్మిణి, గొన(గారణమేమి ధూర్త గోపాలు(డు' అని దిద్దినారు. అఖండయతి కాని దాని నఖండయతి యనియు, సుప్రసిద్ధమైన అఖండయతిని మంచిదిగాదనుటయు, సరెకదా, ఈ దిద్దినదైనా అర్థసందర్భము సరిగా లేదు. 'కొన(గారణమేమి?' అని గ్రామణ్యము పలుకరాదు మునియేమి సేయును? రుక్మిణి ననవలసినదేమియున్నది? వంచకుడైన నారాయణుడు చేసిన కార్యమేమి చెప్పవలసియున్నది? అనగా... నేరమంతయు పతిదని కోపోక్తి. ప్రాణమైన పెనిమిటియే యిటువంటి వంచనచేసితే మనమెట్లుగా నుంటున్నది. అని అర్థసందర్భముగాని' 'కొన(గారణమేమి' అని దిద్దినపాఠము పొసగదు. ఈ పద్యముకు పై పద్యములు (అర్థసందర్భము తెలియుటకు వ్రాసుతున్నాము.) 183

క. అరణ భోజను మతకము
లా రుక్మిణి నటన, లామురాంతకు చెయువుల్
చేరి కనుంగొన(గా నె
వ్వారికిఁ గోపంబురాదె వారిజనేత్రా! 184

చ. అనుటయు వ్రేటువడ్డ యురగాంగనయుంబలె నెయ్యివోయ భ
గ్గని దరికొన్న భీషణ హుతాశనకీల యనంగ లేచి హె
చ్చిన కనుదోయి కెంపు దన చెక్కుల( గుంకుమ పత్రభంగ సం
జనిత నవీనకాంతి వెద(జల్ల(గ గద్గదభిన్నకంఠియై. 185

శా. ఏమేమీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడె నా
యా మాటల్ చెవి యొగ్గి తావినియెనా యా గోపికావల్లభుం
డేమే మాడెను రుక్మిణీసతియు నీ వింకేటికిం దాచెదే
నీమోమోటలు మాని నీరజముఖీ నిక్కం బెఱింగింపుమా. 186

చ. అతులమహానుభావమని యవ్విరిఁ దానొక పెద్దచేసి య
చ్యుతునకు నిచ్చకం బొదవ నూడిదయిచ్చెను, నిచ్చెఁగాక తా
నతఁడు ప్రియంబుగల్గునెడ నర్పణ చేసెను, జేసెఁగాక యా
మతకరివేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేల నచ్చటన్. 187

క. పలు దెఱఁగు ముళ్లమాటల
కలహమె కల్యాణమని జగంబుల వెంటన్
మెలఁగెడు మౌనికి సహజము
వలదని వారింప రాదె వల్లభుఁ డతనిన్. 188

క. ముని యేమిసేయు........." 189
(1,81–86)

కొన్ని పుస్తకములందు '...రుక్మిణి, ననఁగారణమేమి ధూర్త గోపా
లుఁడు......' అని యున్నది. యతిభంగమైనది (కానరు) 190

తిమ్మకవి సర్వపుర మాహాత్మ్యము :

క. నీరజగర్భాండోదరు
నారాయణు నఖిల ముని బుధావన విద్యా
పారీణు సకల జనతా
ధారు ననాధారు మదినిఁ దలఁతున్ భక్తిన్ 191

జగ్గకవి సుభద్రా పరిణయము :

క. ఆరూఢ భక్తి నచ్చట
నారాయణుఁ బూజచేసి హరిపుణ్యకథా
సారామృతపానుండై
యా రాకొమరుండు జనెఁ బ్రయాగంబునకున్. 192

(ఇక) నఞ్ సమాసములు :-

న విద్యతే అంగం యస్య సః అనంగః (-మన్మథుడు). ఇటువలెనే,
అనూరు, అనాది, అనేక, అనంత, అనల, అనూన, అనామయ, అనాహత
మొదలయినవి నఞ్ సమాసములని తెలియవలెను. 193

లక్ష్యములు :-

'అనేక' పదము, హల్లుకు :-

కర్ణపర్వము (2-355) :

ఉ. మ్రొగ్గెడు వాహనంబులును మోములు ద్రెవ్వఁగఁ బాఱు వాజులున్
డిగ్గి తొలంగు సైనికు లనేకులు కష్టపుపాటు చొప్పడన్
(బ్రగ్గు సిడంబులుం గులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి యొంటిమై
మ్రగ్గెడువారు నై కురుధరావరుసైన్యము రూపు మాయఁగన్) 194

తిమ్మకవి సర్పపురమాహాత్మ్యము :

ఉ. నీ కరుణావలోకనము నిల్చినచోఁ గులహీనుఁడున్ హయా
నేకప హేమచామర మణీ రమణీయ విభూషణాది కా
నేక విభూతిఁ జెంది పరిశుద్ధకులుం దన మించు, లేనిచో
నాకనివాసుఁడున్ వెతల నందుఁ గదమ్మ జగత్కుటుంబినీ ! 195

అచ్చుకు :-

శ్రీ కృష్ణరాయల ఆముక్తమాల్యద (1-35) :

క. తునియలు తొమ్మిదియఁట పదు
నెనమండ్రఁట మోచువా రనేకప కిటి కూ
ర్మనగాహి శేటి లావరు
లని తావకబాహు వొకటి యవని భరింపన్. 196

రంగరాట్ఛందము (3-157) :

గీ. ఇలఁ గుటుంబ ప్రతిష్ఠ లనేకములు న
నంత గుణనిధియైన యానంద రంగఁ
డమరఁ గావించి కాంచె ననంత కీర్తి
నాత్మనా యెన్న యతని యనుపమ మహిమ 197

న విద్యతే ఉత్తమః యస్మాత్ సః అనుత్తమః, ఉత్తమో న భవతీ
త్యనుత్తమః—ఇటువంటి ద్విన్ని నఞ్ సమాసయత్తుల్లు. 198

## 19. నిత్యసమాస యతి :-

లక్షణము :-

కాకునూరి అప్పకవి 'ఆంధ్రశబ్ద చింతామణి' (3-135) యందు :

గీ. ఒక్క సమసనమున శబ్దయుగము గూడి
పదము వేర్పాటుగాఁ గానఁబడని ప్రాణ
సంధులకు నిత్య సమసన శ్రాంతులును న
ఖండ విశ్రమములు నన రెండు జెల్లు. 199

అని నిత్యసమాస యతికి నఖండయతి యనిగూడా చెప్పినారు. స్వత స్సిద్ధమైన యఖండ యతిని పరిహరించుటకు కాని వాటిని య ఖండ యతులనుటకు వారి సామర్థ్య మవార్యము 200

—: అప్పకవి నిర్ణయించిన నిత్యసమాస యతులు :—

| | | | | |
|---|---|---|---|---|
| విశ్వామిత్ర | రామాయణ | స్వాంత | ఏకాంత | సిద్ధాంత |
| రాద్ధాంత | లతాంత | ప్రాంత | నిశాంత | ఉపాయన |
| బాదరాయణ | శాకటాయన | కాత్యాయన | వాత్స్యాయన | రసాయన |
| పరాయణ | పలాయన | సాంఖ్యాయన | బోధాయన | దక్షిణాయన |
| ఉత్తరాయణ | వాతాయన | ఆపోశన | ద్వీప | అంతరీప |
| నాక | నాస్తి | మందార | నారికేల | |

(వీనిలో) ద్వీప, అంతరీప — ఈ రెండు ఆదేశ యతులు. ప్రాంత, ఉపాయన-ఇవి ప్రాదియతులు. నాక, నాస్తి—ఇవి నసమాసయతులు. "అనాద్యంతానూరు శబ్దములు మొదలైన నఞ్ సమాసముల కన్నింటికిని నిటువలెనే రెండునుం జెప్పవచ్చును." అని తమరే నఞ్ సమాసములనిరి. ఇవి నఞ్ సమాసములు. పూర్వలాక్షణికులు నిర్ణయించినారు. బాదరాయణ, శాకటాయన పదములకు—'బదరస్య గోత్రాపత్యం బాదరాయణః, శకటస్య గోత్రాపత్యం శాకటాయనః'—అని వ్యుత్పత్తి. గోత్రార్థమందు నడాది గణప్రయుక్తమై ఫక్ ప్రత్యయము, ఆయనాదేశము. 'యస్యే'తి లోపముచేత టకారముకు లోపము

గాని, ప్రాణసంధిలేనిది. ప్రకృతి ప్రత్యయములు కాని పదద్వయముకు వచ్చిన సమాసము గాదు. కావున టకారోపరి అకారము లేదు. స్వరము చెల్లదు. 'బదరో నామ ఋషిః, శకటో నామ ఋషిః' బదరశబ్దమును నడాదిగణమందు పాణిన్యాచార్యులవారు పఠించుటవలన ఫక్ప్రత్యయము గాని, సమాసము కాదని శాబ్దికులు వ్యవహరించు చున్నారు. కాత్యాయన, వాత్స్యాయన శబ్దములున్ను, గర్గాది యఞంతములైన 'కాత్య, వాత్స్య' శబ్దముల మీద యఞి ఞోశ్చే'తి సూత్ర విహిత ఫక్ ప్రత్యయాంతములు. శాకటాయన శబ్దమువలె 'యస్యేతి'లోపము గాని, ప్రాణసంధిలేదు. పదద్వయముగాదు. యకారమున్నందున (కాత్యాయన, వాత్స్యాయన శబ్దములకు) అకార హకార యకారములు చెల్లును. సంయుక్తయతి (యగును) గాని, నిత్యసమాస యతిగాదు.

ఈ నిత్యసమాసములందే అప్పకవిగారు- "కుమారవ దాచరితా శక్తిః కుమారాయిత శక్తిః, కుమారాయితతయా శక్త్యా శాలత ఇతి కుమారాయిత శక్తిశాలీ, కుమారసమాన పరాక్రమవా నిత్యర్థః. భద్రవ దాచరితా మూర్తిర్యస్య తత్ భద్రాయితమూర్తి, శోభనమూర్తిమదితియావత్. అయసి క్యఙ్ ప్రత్యయాంతః'- అదిగాన గొందఱా రెండు శబ్దములమీఁదను 'అకారము లున్నవి, నిత్యసమాసము' అని భ్రమింతురు. శబ్ద సూత్రమువలన వానికే దీర్ఘములు వచ్చినవి గాని యందులో నత్తులులేవు" అని వ్రాసిరి. (మరి) శాకటాయనాది శబ్దములందు మాత్రము అత్తులు ఎక్కడనుంచి వచ్చె ననుకొనిరో తెలియదు. 202

'ఆపోశన' శబ్దమునకు స్వరమున్నదిగాని,—' అప్ అశనం= అబశనం' అని యుండవలెను. 'ఆపోశన' మని యెటువలె నిష్పన్నమాయెనో వ్రాయలేదు. కొందఱు— 'అపాం సమూహో ఆపం, ఆపస్య అశనం, గూఢోత్మావత్ వర్ణ వికృతి' యని వ్రాసినారు కాని, 'గూఢోత్మా' అని పఠితముగాని, ఆకృతిగణము గాని కాదు కావున, నది బాగులేదు. అప్శబ్దము సకారాంతము, స్త్రీ లింగము, నిత్య బహువచనమని యందఱు నెఱుంగుదురు. 'అపః, అపసీ, అపాంసి 'అని సకారాంతమున్ను, నపుంసక లింగమున్ను, మూడు వచనములు గలవని ద్విరూపకోశమందు నున్నదిగాన, 'అపసాం అశనం ఆపోశనం'- ఇది సమాసము. 'అపః, అపసీ, అపాంసి; అప్నః, అప్నసీ, అప్నాంసి' అనిన్ని శబ్ధు, 203

(ఇక) 'వాతస్య అయనం వాతాయనమ్'- ఇటువంటివి నిత్యసమాసము లందు వ్రాసుట తగదు. 'ఒక్క సమసనమున శబ్దయుగముగూడి, పదము లేర్పాటుగాఁ గానఁబడని ప్రాణసంధులకు నిత్యసమసన క్రాంతు' అని లక్షణము చెప్పిరి. 'వాత' శబ్దము, 'అయన' శబ్దము వేర్పాటుగా గానబడెను. 'అప'శ్శబ్ది 'అశన' శబ్దములు వేర్పాటుగా గానబడెను. గాన, నిటువంటివి అచ్చుకు నచ్చుకు చెల్లితే స్వరయతి. స్వరమూదిన హల్లుకు చెల్లితే అఖండయతి చెప్పవలెగాని నిత్యసమాసయతి యని చెప్పరాదు. 204

మరియును, 'నారాః ఆపః అయనం స్థానం అస్య నారాయణః' అని సమాసము వ్రాసినారు. నార శబ్దము, అయన శబ్దములు వేర్పాటుగా గానబడెను. ఇది నిత్యసమాసమయితే,: పీతాంబర, గగనాంబర, చిత్రాంగి, కనకాంగి- మొదలగు సమాసములును నిత్య సమాసములే కావలె మందార, నారికేళ శబ్ద ములకు సమాసములు వ్రాయలేదు. మేము వ్రాసుతున్నాము. 'మందాన్ క్షుద్రరోగాన్ ఔషధత్వేన అరయతి పీడయతీతి మందారః = జిల్లేడుచెట్టు' ఇది నిత్యసమాసము. (కాని) 'మందాని సూక్ష్మాణి అరాణి కంటకాని యస్య మందారః ఎఱ్ఱని గొప్పపూలు గల వృక్షము' 'మందాః అరాః-ధారాః యస్య, సరల త్వాదితి మందారః' = దేవలోకమందుండెడు వృక్షము' ఈ రెండు నిత్యసమాస ములు కావు. (ఇక) 'నాల్యాకముదక మీరయతీతి నాలికేరః, యద్వా, నాలీకాని నాలయుక్తాని పుష్పఫలాని ఈరతీతి నాలికేరః, ఈరక్షేపే, రలయో రభేదః, నారికేలః, నారికేరః'—రెండు విధములు గలదు. ఇవి నిత్య సమాస ములు. 205

(ఇక) 'నారాయణ' శబ్దముకు నిత్యసమాసములు వ్రాసుతున్నాము:- ౧ నారం నరసమూహం అయతి స్వకర్మేతివా నారాయణః- ౨ నారంనరసమూహం అయతే జానాతీతివా నారాయణః, ౩ గత్యర్థానాం జ్ఞర్థత్వాద్యస్మాద్ఘాతుః క్షాతే వర్తతే'—ఈమూడు విధములు నిత్యసమాసములు. మరియును స్వరములున్నవి వ్రాసుతున్నాము:-౧ నారం నరాణాంసమూహం అయనం యస్య నారాయణః పూర్వపదాదితి ణత్వమ్: ౨ నారస్య నరసమూహస్య అయనమితి వా నారా యణః; ౩. యథా ప్రలయే నరాణాం అయనత్వాన్నారాయణః సఏవ నారాయణః స్వార్థే కః ప్రజ్ఞాద్యణ్: ౪. నారస్య నరసమూహస్య ఆయనం (య)స్మాత్ప

నారాయణః; ౫. నర ఆత్మా, తతోజాతాని ఆకాశాదీని కార్యాణి అయనం అస్యవా నారాయణః;౬. నారాణి తత్త్వాని అయనమస్యేతివా నారాయణః', శాంతి పర్వ మందు:—

'నరాజ్జాతాని తత్త్వాని నారాణీతి తతో విదుః
తాన్యేవ చాయనం యస్య తేన నారాయణః స్మృతః'

(అని ఉన్నది) ౭. నారం సరోరుహం తస్య అయనమితి నారాయణః.

'నారం సరోరుహం ప్రోక్తం జగద్యోనిమయం పురా
యస్య నాభే సముత్పన్నం స నారాయణ ఉచ్యతే

(అని అందే ఉన్నది).౮. నారాణి చరాచరాణి భూతాని అయన యస్యేతివా.'— ఈ ఎనిమిది విధములు నిత్యసమాసములుకావు. స్వరమున్నందున స్వరయతి అఖండయతి యనవచ్చును.

(ఇక) లింగాభట్టుగారు 'రాయః శబ్దాః అయంతే నిర్గచ్ఛంతి యస్మాత్ స రాయణః రాయణా దన్యః అరాయణః, అరాయణా దన్యః నారాయణః,న అరాయణ ఇతి వా నారాయణః. రై శబ్దే'-అని వ్రాసినారు. ఈయన వ్రాసినవే గురుబాలప్రబోధికయందును వ్రాయబడినవి, మరికొందఱు కవులును ఇదే వ్రాసినారు. అయితే, అటుల సమాసము కుదురదు.'రై' అను పదముకు 'అయనః' అను పదము పైనున్నపుడు 'ఏ చోయ వాయావః' అను సూత్రముచేత వచ్చిన (ఆదేశమందలి) యకారమునకు లోపము వచ్చెడు నాకరము కనుపించదు. 'రాయయణః' అనవలెను. 'రాయణాదన్యః అరాయయణః, అరాయణా దన్యః నారాయయణః' అగునుగాన, నటుల సమాసము పొసగదు. (పొసగెడు విధము వ్రాసుతున్నాము). "అరాణాం దోషాణాం అయనం అస్య అరాయణః, స నభవతీతి నారాయణః యద్వా, న అరాణి నారాణి పుణ్యాని అయన మస్య వా నారాయణః. సకల దోషరహితః, సకల పుణ్యాకరః ఇత్యర్థః. 'అర మంచల దోషయోః' ఇతి శాశ్వతః." నకార మందు స్వరమున్నది, రేఫమునందు స్వరమున్నది. ఈ సమాస మొకటి మాత్రము శాబ్దిక మతానుసారముగా మేము వ్రాసినాము. (ఇక) నరాః అయనం యస్యేతి నరాయణః.

'అథ నారాయణో విష్ణు రూర్ధ్వకర్మా నరాయణః'

ఇతి శబ్దార్ణవః.

'వాసు ర్నరాయణ పునర్వసు విశ్వరూపాః'

ఇతి త్రికాండ శేషశ్చ.

'ముకుందశ్చాపి కుందశ్చ, నారాయణ నరాయణౌ
వాసుదేవో హి వాసు స్స్యాత్, వామదేవశ్చ వామవత్'

ఇతి ద్విరూపకోశశ్చ.

'ఇవి యన్నియు నిత్యసమాసములు కాకున్నను అనేకవిధములు సమాసములుగల వనిన్ని, సకల పాపహరమైనటు వంటిన్ని, సకల శుభదమైనటు వంటిన్ని శబ్దమగుటచేత, పూర్వ పండితులు నిర్ణయించినవిన్ని, మాకు గోచరించినవిన్ని వ్రాసినాము.

అప్పకవిగారు—'జనాన్ అర్దయతి సుఖయతీతి జనార్దనః, అర్దగతౌ, యాచనేచ' -అని వ్రాసినారు, మరియును వ్యాఖ్యాకారులు వ్రాసిన సమాసములు ఇట్లున్నవి- ౧. జనాన్ దుర్జనాన్ అర్దయతి నరకాన్ గమయతీతి జనార్దనః; ౨ జనాః సముద్ర మధ్యస్థ దైత్యభేదా స్తేషాం మర్దన ఇతివా జనార్దనః; ౩ ప్రలయకాలే సర్వాన్ జనాన్ అర్దయతీతి వా జనార్దనః; ౪. జనః జన్మ అర్దయతి హిన స్తీతివా జనార్దనః; ౫.జనం జననోప లక్షితం జీవస్య సంసారం అర్దయతీతివా జనార్దనః; ౬. జనం జననం తత్కారణ మజ్ఞానం చ స్వసాక్షాత్కారేణ అర్దయతీతివా జనార్దనః; ౭ జనైః సుజనైః పురుషార్థం అభ్యుదయకం నిశ్శ్రేయసలక్షణం చ అర్ద్యతే యాచ్యత ఇతి వా జనార్దనః 207

అమర వ్యాఖ్యానాదులందు పండితులు వ్రాసిన నిత్య సమాసములు వ్రాసుతున్నాము:- 208

౧. కేలీనాం సమూహో కైలం, తేనాస్యతే స్థేయత ఇతి కైలాసః; ఆస ఉపనివేశనే; ౨. కం జలం అరవ్యత్ర కాసారః; కస్య ఉదకస్య సార అస మంతా దత్రేతి వా కాసారః ౩. కి ఇతి శబ్దేన ఈష్టే కీశః. ఈశఐశ్వర్యే.యద్వా,

కిః హనుమాన్ ఈశః ఏషాం తే కీశాః; ౪. కేన జలేన ఉద్యతే సిచ్యత ఇతి క్రోద్రవః = అఱుగ ౫. కుచ్చిత మంబతే కదంబకః = ఆవాలు; ౬. కవం శబ్దం అటతే కవాటం=తలుపు. ౭. అంగాని ఆరయతి పీడయతి అంగారకః. ౮. లులః లోలనం అయతి లులాయః = దున్నపోతు. ౯. లద విలాపే లడయో రేకత్వం, లలం విలాపం అటతే, అటగతౌ లలాటః; యద్వా లలంతశ్చలంతః, అటంతి అలకా అత్రేతి వా లలాటం; ౧౦. మాం లక్ష్మీం ఈఖతి వా, మా ఈః ఖతి వా, మాశబ్దో నిషేధే, ఈఖగతౌ, బాహులకా దచ్, మేఖలా = మొలనూలు. ౧౧. కిరతి కౄవిక్షేపే, ఇగుపధేతి కః, అతసాంతత్యగమనే, అచ్, కిరశ్చాసౌ అతశ్చ కిరాతః. ["కిరాతో మ్లేచ్ఛభేదేస్యాత్ భూనింబే చేతనావపి; స్త్రియాంచా సుర వాహిన్యాం కుట్టనీ దుర్గయోరపి". ౧౨. పంచభిర్వర్ణై రల్యతే, అల భూషణాదౌ. ఘఞ్ స్వార్థే అణ్, అదంతాత్ కన్, టాప్, సంజ్ఞా పూర్వకత్వాత్ వృద్ధిః, పాంచాలికా = బొమ్మ. ౧౩. కుచ్చితం అంబరః, కోఃకటో తత్పురుషేతి కదాదేశః, కదంబరం, నీలాంబరం, అస్యాస్తీతి, అర్శఆద్యచ్, కదంబరః = బల రామః తస్యేయం, తస్యేద మిత్యణ్, కాదంబరీ = మద్యము ౧౪. కుచ్చితోదర్యః. కదర్యః; ౧౫. శలశ్చాసౌ వటుశ్చ శలాటుః. శలవల సంవరణయోః, పచాద్యచ్. అటగతౌమృగయ్వాదిత్వాత్కుః శలాటుః = కాయ ౧౬. వరం శ్రేష్ఠం సస్యం ఆహంతీతి వరాహః ౧౭ వరైః శ్రేష్ఠైః అస్యతే వరాసిః. ''వరాసిరుత్తమే ఖడ్గే, వరాసిః స్థూలశాటక'' ఇతి రత్నకోశః. ౧౮ శృంగైః అటంత్యస్మిన్నితి శృంగాటకం, యద్వా, శృంగం ప్రాధాన్యం అటతి, అటగతౌ, సంజ్ఞాయాంకన్, శృంగాటకం = నాలుగు త్రోవలు గల స్థలము. ౧౯ కూర్పరే కపోణౌ అస్యతే కూర్పాసకః. అసుక్షేపణే. పృషోదరాదిత్వాద్రేఫలోపః = రవికె, చొక్కా. ౨౦ మంజతి మంజి ధ్వనౌ సౌత్రః బాహులకాదీరన్ మంజీరః = అందె. ౨౧ కం జలం అలతి భూషయతి కమలం అభూషణాదౌ = వేయి దలములు గల పద్మము ౨౨. 'కమ్ కాంతౌ' వితిధాతో రల ప్రత్యయేపరే ఉపధాయాః కారాదేశే చ, కోమలం. ౨౩. వల్గాసౌవక్షశ్చ వలక్షః వల సంచలనే అక్షూవ్యాప్తౌ. ౨౪ కటం గండం అక్షతి కటాక్షః అక్షూ వ్యాప్తౌ కర్మణ్యణ్ ౨౫ 'కటాక్షకాక్షా' వితి రభసాత్. రభసోనామ పూర్వోకవిః కాక్షః. ౨౬ సహ అరంగచ్ఛతీతి సారంగః "సారంగ శ్చాతకే భృంగే కురంగే చ మతంగజే." భానోజీ దీక్షితులవారు 'మంజీర, సారంగ' శబ్దములు 'శకంధు'లందు వ్రాసినారుగారు, మిగిలినవారు శకంధులందు

[ వ్రాసినారు. ౨౭ కం జలం అండే మధ్యే లాతీతి కమండలుః. ౨౮ పారేణ బలేన అవతీతి పారావతః ౨౯ కటాని ఆకటీతి కటాకః అక కుటిలాయాం గతౌ ౩౦ కీలాన్ జ్వాలాన్ అరతి వారయతీతి కీలాలం=ఉదకము. ౩౧ పాదాభ్యాం అతతీతి పదాతిః. 'పాదస్య పదాజ్యాతి గోపహతేషు' ఇతి సూత్రేణ పాదశబ్ద స్యపదాదేశః = భటుడు ౩౨ నారం నరసమూహం అంచతీతి నారాచః. అచుగతి పూజనయోః = బాణము ౩౩ నారం నరసమూహం అంచతీతి నారాచం = [ త్రాసు. ౩౪ వృక్షాద్యనేనేతి వృక్షాదనః = గొడ్డలి. ౩౫ కుఠాన్ వృక్షాన్ ఇయర్తీతి కుఠారః = గొడ్డలి. ౩౬ కులం పక్షికులం అయతి ఇతి కులాయః=గూడు ౩౭. తులాం ఆసమంతాత్ కుటతీతి తులాకోటిః, తుల ఉన్మాదే కుటి కౌటిల్యే= పెండె రము, అందెయును. ౩౮ చండం గుహ్యస్థానం అతతీతి చండాతకం=చల్లడము ౩౯ లలం విలాస మమతి లలామం అనుగత్యాదిషు= విలాసము గలది, అనగా బాసికము మొదలైన వాటికి చెల్లును. ౪౦ వాతం అయతే వాతాయుః=ఇఱ్ఱి ౪౧. గాం అయతే సదృశత్వాద్గవయః = మృగ విశేషము ౪౨ రాదిఫః రేఫః = ర వర్ణము ౪౩. ద్విరేఫః = తుమ్మెద గండం కపోలం ఉలతి ఆవృణోతి గండాలీ = ఎట్టని తుమ్మెద; కొందఱు కఱుమరీగ అందురు. ౪౪ పిష్టం అతతి పిష్టాతః = బుక్కా. ౪౫ పరాన్ ఆక్రమ్యతే అనేనేతి పరాక్రమః ౪౬ సహ ఆప ఆనమంతి అస్మిన్నితి సోపానం. నమ్ప్రహ్వత్వే శబ్దే ౪౭ స్వరాంతరస్య గంధం లేశం అరాతి గాంధారః=స్వర విశేషము ౪౮ బలేన మేఘమాలాం అకతి బలాకా = తెల్లకొక్కెర ౪౯ సహ అంద్యతే బధ్యత ఇతి సాంద్రం. అది బంధనే ౫౦ అవ శ్యం నిశాయాం అమ్యతే గమ్యత ఇతి నిశాంతం అను గతౌ=ఇల్లు ౫౧ అగాన్ వృక్షాన్ స్తంభభూతాన్ ఇయర్తీతి అగారం ఋ గతౌ = ఇల్లు. నిశాయాం అమ్యతే,అనుగత్యాదిషుక్తః. ౫౨. పారం అవృణోతీతి పారావారః = సముద్రము ౫౩. కందరాన్ సానూన్ అలతి కందరాలః=కొండగోగు. ౫౪ కందరం గుహా ప్రదేశం అలతీతి కందరాలః = కలజువ్వి. ౫౫. మధు మధురసః ఉచ్యతే యజ్యే త్రేతి మధూకః. ఉచ సమవాయే=ఇప్పచెట్టు ౫౬. మధు ఉలతీతి మధూలకః. ఉల ఆవరణే= నీటి ఇప్పచెట్టు. ౫౭. కలాం స్వర్ణశిల్పం ఆదత్త ఇతి కలాదః= కంసాలి. ౫౮. కలాం ఆప్నోతి. ఆప్ల్ వ్యాప్తౌ, కర్మణ్యణ్. యద్వా, కలాః అద్యతే అనేనవా. హలశ్చేతి ఘఞ్. కలాపః,"కలాపస్సంహతౌ బర్హే, కాంచ్యాం భూషణ మాణయో" రిత్యజయః. ౫౯. పిశితం అశ్నంతీతి పిశాచాః. ౬౦. కత్

కుత్సితం అంబతే కదంబకం. అవి శబ్దే=సముదాయము. ౬౧. కుత్సితః ఊష్మా అండేషు బీజేషు అస్యేతి కూష్మాండః=గుమ్మడి చెట్టు. ౬౨. తృప్తిం కరోతీతి కర్కః. ఇయర్తీతి అరుః. కర్కశ్చావారుశ్చ కర్కారుః=గుమ్మడి పండు. ౬౩ ఉరు మాత్రం అరయతి నిస్సారయతీతి ఉర్వారుః = దోసచెట్టు ౬౪. ఇక్షుమపి అకయతి కుటిలయతి తిక్తత్వేన ఇక్ష్వాకుః = చేదు ఆనపచెట్టు ౬౫. తుండికాన్ వదనగత రోగాన్ ఈరయతి ప్రేరయతీతి తుండికేరీ. ఈర క్షేపే పత్తిచెట్టు ౬౬ గాంగం గంగా సంబంధం జలం ఈరయతి గాంగేరుకీ= బీరచెట్టు ౬౭. పటం పటసదృశం పుష్ప సమూహం ఉలతి ఆవృణోతీతి పటోలికా=పొట్ల చెట్టు ౬౮. పలం మాంసం అశ్నాతీవ తిష్ఠతీతి పలాశః= మోదుగు చెట్టు ౬౯. అనసః శకటస్య అకం గమనం హంతీతి అనోకహః=వృక్షము. ౭౦. శక్రం ఆనయతి, జీవయతీతి శక్రాణీ=శచీదేవి ౭౧. ఇంద్రాణీ=శచీదేవి, ౭౨ భవానీ. ౭౩. శర్వాణీ ౭౪. రుద్రాణీ ౭౫. మృడానీ- (ఈ నాలుగు) పార్వతీదేవికి (పేళ్లు) ౭౬ హిమానీ=మంచు సముదాయము ౭౭. అరణ్యానీ=అడవుల సముదాయము ౭౮ యవనానీ=యవనలిపి ౭౯ మాతులానీ=మేనమామ భార్య ౮౦. ఆచార్యాణీ= గురుపత్ని. "ఇంద్ర భవ శర్వ రుద్ర మృడ హిమారణ్య యపన మాతులా చార్యాణా మానుక్" ఈ సూత్రముచేత అచ్చు నిష్పన్నమైనది: అరణ్య, ఆచార్య పదములలో (అరణ్యాని, ఆచార్యాణి) యకారమున్నందున అచ్చులకు చెల్లునుగాని సంయుక్తయతి యనరాదు, నిత్య సమాసమని తెలియుటకై వ్రాసినాము ౮౧ శృంగం ప్రాధాన్యం ఇయర్తీతి శృంగారః ౮౨ ఉరూన్ మహతః అశ్నుతే వ్యాప్నోతి వశీకరోతీతి, కర్మణ్యణ్. సంజ్ఞా పూర్వకస్య విధిరని త్యత్వాన్న వృద్ధిః ఉర్వశీ, ౮౩. ఊరు అశ్నాతీతి ఊర్వశీ. ౮౪. కస్య సుఖస్య జలస్యవా అంతం ఋచ్ఛతి ఋ గతౌ, కర్మణ్యణ్. కాంతారం=వనము. ౮౫. రామం అయతి జ్ఞాపయతీతి రామాయణం. అయ పయ గతౌ. సర్వేగత్యర్థాః జ్ఞానార్థాః. ౮౬. నమశ్శివాయ—

"నమస్కారేణ జీవత్వం శివేతి పరమాత్మని
అయేత్యైకమతో మంత్రః పరబ్రహ్మ మయోహ్యసౌ"

అని 'స్కంద పురాణ' మందలి 'బ్రహ్మోత్తరఖండ' మందున్నది. (అయితే) నమశ్శివాయ, నమశ్శంకరాయ, నమః కేశవాయ— ఈ మొదలైన చతుర్థ్యంతము లందు స్వరములేదు. మంత్రమందు 'శివ-అయ = శివాయ' అని స్వరమున్నది.

(మరి) 'సుపిచ' అను పాణినీయ సూత్రము వలన దీర్ఘము వచ్చినందున ఇవి నిత్యసమాసములు కావు. కాని, (మంత్రమును బట్టి) స్వరములు గల పదములని తెలియపరుచుతున్నాము. (ఇక) ౮౭ కుచ్చితః ఊర్మిః వేగః అస్య కూర్మః ౮౮ కస్యశిరసః ఈశః కేశః ౮౯, కశ్చ ఈశశ్చ కేశౌ, తావస్మింస్త ఇతి కేశవః, యద్వా కశ్చ అశ్చ ఈశశ్చ కేశాః తేఽనంత్యస్మిన్నితి కేశవః. ౯౦ కం జలం అననం ప్రాణనం అస్య కాననం. ౯౧. దివా ఆకీర్తనం అస్య దివాకీర్తిః = మాంగలుడు. ౯౨. పుంసా ఆరుహ్యేత ఇతి ఆరోహః = కటి. వరః ఆరోహో యస్యాః సా వరారోహా = చక్కని మగువ. ౯౩. అసూనాం అంతోఽత్ర అస్వంతం = పొయ్యి ౯౪. కస్య సుఖస్య అంతం కాంతం. ౯౫. మృత్ అంగం అస్యేతి మృదంగః. ౯౬. మందమక్షి అత్రేతి మందాక్షం. మందమక్షం ఇంద్రియ మత్రేతి వా = సిగ్గు ౯౭. విబోః గతి విశేషస్య ఓకః స్థానం విబ్బోకః వబయోరభేదః, బిబ్బోకః. విపూర్వకోవా గతిబంధనయోః ఇతిధాతుః. 'విబు' అనగా గతివిశేషము, అందుకు స్థానము. సాపరాధుడైన ప్రియుని కథ వినునపుడు ఇంచుకంత యనాదరము బిబ్బోక మని వ్యాఖ్యాకారులు వ్రాసినారు గాని, 'విలాస' మని ప్రయోగములు గలవు:– చేమకూరవారి విజయ విలాసము (1-84) నందు:—

గీ. (నువ్వు పువ్వు నవ్వు జవ్వని నాసిక
చివురు సవురు జవురు నువిద మోవి)
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతి వేణి
(మెఱుపు నొఱపుఁ బఱపుఁ దెఱవ మేను) 209

మరియు నందే 2-191 :

క. (గబ్బిమరుం డొఱపెఱుఁగక
గొబ్బునఁ బైబడును; నీవుఁ గూడనివార్తల్
సుబ్బిన కార్యం బెక్కడఁ)
దబ్బిబ్బో కాక పూర్వతనుబిబ్బోకా. 210

అని యున్నది. 'ఓక' శబ్దము సకారాంతము అకారాంతము, నపుంసక లింగము (గూడ) కలదు. ౯౮. పారం అపారం అస్య పారావారః సముద్రము. ౯౯. కృతః అంతో వినాశో యేన సః కృతాంతః. ౧౦౦. ఈషత్

అంకం కుటిలగతికం ఉదక మస్యేతివా కాకోదరః= పాము. కాకోదర, కాంతార, కూష్మాండ పదములందును, సారంగ, సోపాన పదములందును రెండు స్వరములు కలవు. 211

పూర్వలాక్షిణికులు నిత్యసమాసములని వ్రాసిన లక్ష్యములు (కొన్ని కుదురవు. వ్రాసుతున్నాము) :— 212

'వాతాయన'పదము, హల్లుకు:—

విరాటపర్వము (2-238) :—

సీ.పా. తరుణులో పతులు వాతాయనంబుల నుల్ల
మలకలై వేఁబోక మలయపవను... 213

ఇది అఖండయతిగాని, నిత్యసమాసయతిగాదు. 214

అచ్చుకు :—

వసు చరిత్రము (1-116) :

సీ.పా. తన యశో విశద ముక్తాసౌధపాలికి
నంబుదాయనము వాతాయనముగ... 215

ఇది స్వరయతి. ఈ రెండు నిత్యసమాసయతులన్నారు, 216

'రసాయన' పదము, అచ్చుకు :—

గీ. నాస్తి యనక మహి ననంత సంపదలు నా
రాయణుం డొసంగు, రమ్యమగు ర
సాయనంబు బుధుల కతఁ డన నిత్య స
మాసయతులు రెంట నంటియుండు 217

అని అనంతుడు (అనంతుని ఛందము 1. ఆ.) చెప్పినారు. 'నాస్తి'—నసమాసయతి. 'అనంత'—నఙ్ సమాసయతి గాని, నిత్య సమాసయతులు గావు, 'రసాయన' స్వరయతి. 218

హల్లుకు :-

జైమినీ భారతము (1-22) :

గీ. మట్టి మాత్రంబె పిల్లలమట్టి పేరు
పేరు వలె గాదు శారదా పీఠకంబు
వారిలోపల పినవీరు వాక్యసరణి
సరసులకు నెల్లఁ గర్ణ రసాయనంబు. 219

ఇది అఖండయతి. 220

'ఆపోశన' శబ్దము, అచ్చుకు :—

చమత్కార రామాయణము :

క. ఓ శశిముఖి లోపాము
ద్రేశుండు కలశభవుండు నిట నతఁడు తపో
రాశి మహాత్ముఁడు మును నా
పోశనముగఁ గొనియె సాగరాంబువు లెల్లన్ 221

ఇది స్వరయతి. 222

హల్లుకు :—

కవుల షష్ఠము :

సీ.గీ. తత్తరమున నాపోశన మెత్తఁబోయి 223
భూసురుం డెత్తె నుత్తరాపోశనంబు.

ఇది అఖండయతి. 224

భీమఖండము (2-188) :

గీ. పోసి రా యెల్లవారి కాపోశనంబు
లారగింపుఁడు లెండు మీకమృతమస్తు
ప్రొద్దుపోయింది సుండని బుజ్జగించి 225
మ్రొక్కె నంజలి చేసి యమ్ముదుకపడఁతి.

ఇది ప్రాసయతియు, నఖండయతియు ననవలె. ఇవి నిత్య సమాస యతులైతే, 'గ్రామాంత, సీమాంతా'ది షష్ఠీతత్పురుష సమాసములన్నియును నిత్యసమాసములే కావలెను. 226

'సాంగ' శబ్దము, అచ్చుకు :—

విరాటపర్వము (5-118) :

గీ. సకల కురుకుమార చాపశిక్షాచార్యుఁ
డాజి దుస్సహుండు సాంగవేద
వేది నీతిశాస్త్ర విదుఁడు (దివ్యాస్త్ర కో
విదుఁడు సుజనహితుఁడు విమలబుద్ధి) 227

ఇది స్వరయతి. 228

హల్లుకు :—

ఆది పర్వము (4-169) :

సీ. సాంగంబులగుచున్న సకలవేదంబులు
సదివె వశిష్ఠుతో సకల ధర్మ
(శాస్త్రాది బహువిధ శాస్త్రముల్ శుక్రబృ
హస్పతుల్ నేర్చినయట్ల నేర్చె...) 229

ఇది అఖండయతి. 230

'సాంబ', పదము; అచ్చుకు :—

మౌసల పర్వము (1-9) :—

క. అంబుజనాభుని కొడుకీ
సాంబుఁడు గను యాదవక్షయాపాదన క
ల్యాంబగు ముసలము మా వచ
నంబున కనృతంబుగలదె నందుఁడు మీరల్. 231

ఇది స్వరయతి

హల్లుకు :—

సాంబవిలాసము :

గీ. హలికి నెదురేగి సకల పదార్థములు, ను
పాయనము వెట్టి నీముద్దు పట్టితోడ
జాంబవంతుని దౌహిత్రు శౌరిపుత్రు
సాంబు నొప్పించు బ్రతికించు సకలజనుల. 233

ఇది అఖండయతి. సాంబనారాయణాదిశబ్దములు ఆ యా దైవములకు మాత్రమె కాదు మానవ నామములకున్ను నుభయము చెల్లును. 234

వనౌకశ్శబ్దము; అచ్చుకు :—

అధర్వణాచార్యుల విరాటపర్వము :

క. శ్రీకంఠుఁ డెదురు నపుడు వ
నౌకోధ్వజ మింద్రమకుట మర్దన తురగా
నీకము దివ్యశతాంగము
నాకవ్వడి కబ్బియున్న నతడేమగునో 235

హల్లుకు, అందే :—

క. ఆ కర్ణు దురాలాపము
లాకర్ణింపఁగ నసహ్యమై ద్రోణునితో
నాకనదీసుతుఁ డనియె వ
నౌకోధ్వజ మెఱుఁగవచ్చు నరు జూపి తగన్ 236

ఇవియు నిత్యసమాసములు గావు. వనశబ్ద, ఓక శ్శబ్దములు స్పష్టములు. 237

'ఏకాంత' పదము, హల్లుకు:-

ఆది పర్వము (8-74) :

గీ కామసుఖ సంగములకు నేకాంత గృహము
పోరి పొలిచియు ధర్మార్థములకు నిదియ
యాస్పదంబన వర్గత్రయానురమ్యు
లైన జనులకు నెంతయు నప్పురంబు. 238

అరణ్య పర్వము (3-319) :

సీ. (హ్రస్వపీనగ్రీవు నచలితాయతహను
నతి చపల స్వభావాభిరాము
............................)
ఊర్ధ్వలాంగూల మత్యున్నత ధ్వజలీలఁ
గ్రాలుచునుండి నేకాంత యోగ
నిద్రనున్న ధర్మనిర్మలు హనుమంతు
(జూచి పాండురాజ సుతుఁడు వాని
నిద్రఁ జెఱుపఁ గడఁగి నిజసత్వ మేర్పడ
సింహనాదమొప్పఁ జేసె డాసి) 239

వసుచరిత్ర (5-123) :

శా. కాంతన్ శుక్తిమతీ నగేంద్రభవ ముక్తా రత్నరాజిం దదే
కాంత స్వచ్ఛ శరీరయుక్తి నగజా కల్యాణ వేలార్హస
త్కాంతుల్ నించిరికాక (కానియెడ లోక శ్లాఘ్య సౌభాగ్యమ
క్కాంతాలోకమణి న్మణీశతములం గ్రైసేయఁగా ముగ్ధలే) 240

ఇవి అఖండయతులు. ఈ మొదలైనవి నిత్య సమాసములని లాక్షణికులు వ్రాసినారు. వారు చెప్పిన లక్షణముకు లక్ష్యములకు కుదురదు. పదము వేర్పాటు కాకుండగ నుండవలెనని లక్షణము చెప్పిరి. (పదములు) స్పష్టముగ వేర్పడి యుండెను. బహువ్రీహి, తత్పురుషాదులన్నియు నిత్యసమాసములే అయితే, వేరే నిత్యసమాసములని చెప్ప బని లేదు. అఖండయతి నొప్పక నివి (యన్ని) యు నిత్యసమాసము లన్నారు కాని, యివి నిత్యసమాసములు గావు. 241

నిత్యసమాసయతు లనగా :—

'కర్ణాట' పదము, హల్లుకు :-

శ్రీనాథుని గారి వీథి నాటకము :—

మ. కుసుమంబద్దిన చీరకొంగు వొలయం గ్రొవ్వారు పాలిండ్లపై
దిసరంబుల్ పొలుపార వేణి యవటూదేశంబుపై రాయగా
బస నెవ్వాఁడో యొకండు రాత్రి రతులం బల్గాసి గావించిన
న్వసివాల్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనన్ గంటిరే 242

ఇందు కర్ణశబ్ద, ఆటశబ్దములు విడి యుండవుగాన, వేర్పాటు గానబడని ప్రాణసంధి గలదు.

అచ్చుకు :-

భాస్కరుని రామాయణము (కిష్కిం. 881)

శా. లాటీ చందన చర్చ చోల మహితా లావణ్య సామగ్రి క
ర్ణాటీ గీతకలా సరస్వతి కళింగాంతఃపురీ మల్లికా
వాటీ మంజరి గౌల వామనయనా వక్షోజహారాళియై
పాటింపందగు నీదుకీర్తి రధినీపాలాగ్రణీ సాహిణీ. 244

ఇటు వలెనే, జనార్దన, రామాయణాది శబ్దములకు లక్ష్యములు వ్రాసినారు ఇవి నిత్యసమాసము లౌను. (ఇక) కైలాసాది నిత్య సమాసయతులకు లక్ష్యములు వ్రాసుతున్నాము. 245

స్వరములకు:-

సీసమాలిక :—

అబ్జనాభుండు కైలాసంబు జొచ్చి క
మలములఁ బూజించె సాంబ శివుని
కాసారకమల కోమల మారుతము వీచె
సారంగి దనరారె కాననముల
కాకోదరములు కాంతారమందుండును
కాంతారమందు వరాహమలరు
కాననంబులను లులాయంబు దనరు, శ
క్రాణిధరించు మందారసుమము,
లిభవక్త్రునకు నారికేళంబు సంప్రీతి
కోశలె శ్రీరాము పృతనకెల్ల
కేశముల్ జడవేసి మేఖలఁబూని వ
రారోహ చెలఁగె పాంచాలియనఁగ

సారంగమదము లలాటంబుననుబెట్టి
కాంతంబుమీఱ లలామకమును
కూష్మాండ ఫలము మధూకసుమములు గాం
గేరి శలాటు ద్విరేఫవేణి

యవనిసురునకు నిచ్చె,శృంగార వతులు
నందఱును జల్లుకొనిరి పిష్టాతపటల
మనుచుఁజెప్పిన నిత్యసమాసయతులు
చనుఁ బ్రబంధాలి బాలశశాంక మౌలి! 246

హల్లులకు హల్లులు సులభమే. కాని నిత్యసమాసయతులని తెలియజాలరు గాన, వ్యంజనములకున్ను తెలియ పరచుతున్నాము. 247

సీసమాలిక :

రమణీయమైన కైలాసంబు జూడ క
మలనేత్రుఁడరిగె జంభరిపుతోడఁ
గాననంబులయందుఁగాసారములుగల్లఁ
గాకోదరాలియుఁగాసరములు
క్రీడించుఁగద నారికేరంబు దినుమంచు
కేశవునకు దేవకి తమినొసఁగ
మేఖలఁదొల్చె సంప్రతి నొక్కర్తు వ
రారోహ బెట్టె లలాట మందు
సారంగమదము పాంచాలినిఁగనుఁగొని
కాంతంబు మీఱఁగాఁ గాలియపుడు
తోరంబులైన మధూకసుమములుగా
గేరి శలాటు సుకేశియొకతె
ప్రేమతో నొక్క ద్విరేఫాలక కిడె లు
లాయంబు మత్తవరాహము బవ
రము సేయుచున్న కిరాంతుడు మదిమెచ్చె
చక్కఁగా మృదులపిష్టాతపటలి

మగువయొక్కతె చిమ్మె కోమలము మీఱ
కలిగి చూపుల నగగ శక్రాణి యపుడ
టంచుఁ జెప్పిన నిత్యసమాసయతులు
జనుఁ బ్రబంధాలి బాలశశాంకమౌలి! 248

ఇవి నిత్యసమాసయతులు గాని, వర్గయతులు మొదలయినవి గావు, కేశి, కేశవ పదములు మాత్రము అఖండయతి. ఇటువలెనె తెలుసుకొనేది. 249

## 20. కాకుస్వరయతి :-

లక్షణము :—

అనంతుని ఛందము (1-94) :—

క. కాకు స్వరయతియగు నితఁ
దే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
శ్నాకలిత దీర్ఘమున నితఁ
దే కవ్వడి రథముగడపె నిమ్ముల ననఁగన్. 250

ఈ పద్యమందు 'ఇతదే' అను చోట ప్రశ్న అని చెప్పివారు గాని, (ఆ పదము) నిశ్చయార్థమును చెప్పుచున్నది గాని ప్రశ్నార్థమును చెప్పదు. రంగరాట్ఛందమున నీ పద్యములకు లక్ష్యము చెప్పిన పద్యము :—

క. వసుమతి రసికాగ్రణియై
యెసఁగిన యానందరంగఁదే బ్రోచు సుధీ
విసరముల నామహాత్ముని
యసమసమఖ్యాతి వింటిరా కవులారా! 251

మొదట నిశ్చయము, రెండవచోట నిబోధమును తెలుపుచున్నది. 252

(ఇక) కాకునూరి అప్పకవిగారు ఆంధ్రశబ్దచింతామణి (3-241,2) యందు :—

క. వలుకుల తలఁగల వ్రాలకు
వలనగుచోఁ బ్లుతము నిలిపి వానికి రెండున్
వలులుగఁ జెప్పిన కావ్యం
బుల నది కాకు స్వరంబు ప్లుత వలియు నగున్. 253

గీ. ఏక మాత్ర హ్రస్వ మినుమడించిన దీర్ఘ
మయ్యె మూఁడు మాత్రలైనఁ బ్లుతము
భీతి శోకతర్క గీత దూరాహ్వాన
సంశయార్థములను జరుగుఁ బ్లుతము. 254

అని చెప్పినారు కాని, అనాదిగా దూరాహ్వాన, సంగీత, రోదన, సంశయ ములు-నాలుగు విధములు ప్లుతయతులని సుప్రసిద్ధిగా నున్నవి. కాకు స్వర యతులు-ప్లుతయతులు :— కనక, సువర్ణ శబ్దములవలె శబ్దభేదమేవాని అర్థ భేదములేనటుల నెవరును చెప్పలేదు. భీతి, తర్క ములు రెండు మాత్రము కాకు స్వరయతులు, ప్లుతయతులు నాలుగు కన్నను (భిన్నముగా) కనుపించుచున్నవి. మరికొందఱు లాక్షణికులు శోక, భయ, సంశయ. ప్రశ్న— ఈ యర్థములందు కాకుప్లుత యతులన్నారు. ప్లుతయతులైన రోదన, సంశయములు కాకుస్వర యతులందు వ్రాసుట పొరపాటు, సకల లాక్షణికాభిప్రాయము కనుగొనగా, భయ, తర్క, ప్రశ్న—ఈ మూడు విధములు మాత్రము ప్లుతయతులు నాలుగు విధముల కన్నను (భిన్నముగా) కనుపించుచున్నవి; కాని వారు వ్రాసిన లక్ష్య ములు పరిశీలించితే వారిమతము (నని) యనుసరించవు. 255

కాకు స్వరయతు లనేకవిధములు కనుపించుచున్నవి. ఇరవై అయిదు విధములకు లక్ష్యములు కనుపించినవి. అవి తెలియ పరుచు చున్నాము:- 256

సీ. కాకుస్వరంబు అనేక విధంబులు
దలప, నమిత నిబోధనములందు
వ్యంగ్య నిందా నిశ్చయ వ్యర్థతా క్షేప
ణానంది తోద్ధతత్వానునయము
లందు ప్రశ్న ప్రార్థ నాశ్చర్య పరిహాస
తర్క బోధక శానుతాపములను
వ్యాజస్తుతి విచార ప్రాగల్భ్య భీతి శం
కాంగీకరణ కృతులందు పృచ్ఛ

శ్లాఘలను జెందు సుకవి కావ్యౌఘములను
హల్లులకు నచ్చులకు మేర్వహార్యచాప!
చక్రధరరోప పరిహృత సకలతాప!
ధక్కి కోద్దీప! శ్రీకుక్కుట స్వరూప!

యక పజ్కాల్ నడుచున్ సహస్రములుగా నయ్యారె విచ్చ్వచ్చు చే
తికి కన్నుల్ గలవంచు నెంచి రపు డెంతే యోధవీరాగ్రణుల్ 261

ఇవి వర్గయతు లనుకొందురు.

అచ్చుకు :

కృష్ణరాయల ఆముక్తమాల్యద (4-107) :

ఉ. సారెకు మింట మేఘుఁడు నిజస్ఫురణం బఱఁ గ్రూరమౌ పురోం
గారక యోగ మూఁది తిరుగన్ సకుటుంబము తద్గృహంబు నెం
తే రుషఁ ద్రొబ్బ నంతలును నింతలునై పడు తన్నఖక్ష్యతాం
గార శిఖ ప్రతానముల కైవడి రాలెను నింద్రగోపముల్. 263

ఇక్కడ నఖండ యతిగాదు 'అమిత'మను కాకుస్వరయతి చెప్పవలె. రెండవ నాల్గవ చరణములందు నిత్యసమాసయతులు గాని, వర్గయతులు గావు.

అందే (4-112) :

స్రగ్ధర :- గ్రావాలం గేతకీ కోరకకటజరజో రాజి దూర్వాంకురశ్రీ
తో వీక్షింపం దినాను త్రుటి మఱుపడుచుం దోచు నిట్లే విరోధా
నావిర్భావంబులన్ బాయక పొరయు నభస్యాభ్రముల్ గప్పె నెం
తే విప్పె పింఛికల్ బర్హిణులు దిరుగఁబెల్లింద్రజాలంబు సూపెన్.

నాలవ చరణమందు రెండు చోట్లను స్వరమున్నందున 'నమిత' మను కాకు స్వరయతి నంగీకరించక విధిలేదు. 266

కవి ధూర్జటిగారి కాళహస్తీశ్వరశతకము :

మ అతి దుర్గంధము మూత్ర పూరితము నేహ్యంబున్ మహారోమ సం
యుతమౌ జెత్తెఁడు యోని జూచి నరు లెంతో మోహవిభ్రాంతులై
మతి నూహించి సురేంద్ర భోగమనుచున్ మానంగలే రెంతయున్
క్షితిలో మూఢు లదెట్టి చోద్య మహహా శ్రీకాళహస్తీశ్వరా ! 267

'ఎంతో' అనుచోట. 268

హల్లుకు :—

చేమకూర వారి విజయవిలాసము (అవ. 20) :

ఉ. శైలము చెక్కి యష్టమద సామజమౌలుల మీఁదుగా మహా
కోల కులేంద్రు దాటి బలుగొమ్ము మొనం బడి సర్వదా విష
జ్వాలలు గ్రమ్ము శేషుని చాయనె యోడకవచ్చి కూడె నౌ
భూలలితాంగి కెంత వలపో రఘునాథ నృపాలునందునన్. 269

'వలపో' అను చోట. మరియు నందే (1-16) : 270

సీ. తృణముగాఁజేయు నెంతే వాని నైన నీ
నీలంపు ముంగర నీలవేణి... 271

'ఎంతటి వాని' నని ప్రతి పుస్తకమునందున్నది. యతిభంగము కానరు. 272

పూర్వలాక్షణికులు నిర్ణయించిన భీతి, శోక, తర్క, గీత, దూరాహ్వాన, సంశయ, ప్రశ్న—ఈ యర్థములలో నొకటియు నిచ్చట కనుపించదు. హల్లులు ప్రధానమైనచోట వర్గయతి మొదలైనవి చెప్పవచ్చును. అచ్చులు ప్రధానమైనచోట మరియొక యతి చెప్పవల్ల లేదు, గాన నేను నిర్ణయించిన 'యమిత' మను కాకుస్వరయతి చెప్ప టొప్పగును.

2. 'నిబోధము' కు, హల్లుకు :— 273

చేమకూర వారి విజయ విలాసము (1-199) :

శా. చెండ్లా గుబ్బలు జాళువా తళుకులా చెక్కిళ్లు డాల్ సింగిణీ
విండ్లా కన్బొమ లింద్రనీలమణులా వేణీరుచుల్ దమ్మిరేఁ
దూండ్లా బాహువు లింతచక్కదన మెందుంగాన మీజవ్వనిం
బెండ్లాడం గలవాఁడు చేసినది సుమ్మీ భాగ్య మూహింపఁగన్. 274

'సుమ్మీ' అనుచోట. ఇది బిందుయతి యనరాదు. అందఱును బిందుయతి యని చెప్పినారు.

అందే (2-168) :

ఉ. కోమలి యీగతిన్ మది దగుల్కొన వల్కిన (నవ్వి) నిర్జర
గ్రామణి సూను మీరెచటఁగంటిరొ యంటివి కన్నమాత్రమే
యేమని చెప్పవచ్చు నొక యించుక భేదము లేక యాయనే
మేమయి యున్నవారము సుమీ వికచాంబుజపత్రలోచనా. 276

చేమకూరవారి సారంగధర చరిత్రము (2-96) :—

క. మేలాబడి బెట్టంగా
మేలా నిలు పోవలదు సుమీ చలమేలా
మేలా వరసుతరూపస
మేలా రమియింపు మనుచు మీఁదం బడియెన్. 277

ఇవి ఎక్కటి యతులనరాదు. 'మీ' అనుచోట స్వరమున్నది. 278

అచ్చుకు :—

అందే (2-24) :

గీ. ఈ సుబుద్ధిమాట యెంత లేదని పోవ
నీసు బుద్ధి నిడు సుమీ లతాంగి
నిలు పరాకుమాని తలపోసి చూడుమా
నిలుపరాకు మనుచు నలుగనేల 279

అందే (2-233) :—

ఉ. ఇంతకుఁ గీర్తి రాగ త్యజియింతును బ్రాణమదెంత యీ విధం
బంతయు నీకుఁ దెల్పుటకునై యిటు లుండితి నీదుపట్టి న
న్నెంతయుఁ బ్రేమఁబట్టి రమియించిన యప్పుడె మామవైతి నీ
కింతటి నుండి కోడలఁ జుమీ ననుముట్టకు రాజశేఖరా. 280

అందే (2-63) :—

ఉ. అందు వినోద మార్గములయందు విశేషములందు హర్మ్యలిం
పొందఁగఁజూచి మానికపు టోవరిలో సొగసుల్ నటింపఁగా

గంధము వక్కలాకులును గైకొను వేడ్క నొకింత సేపు నీ
వందుల విశ్రమించి చనుమా చనుమాననముతోడ నావుడున్ 281

'చనుమా' అనుచోట. 282

చేమకూర వారి విజయవిలాసము (2-123) :

శా. కామాది స్ఫురణంబులెల్ల నణగంగాఁజేసి ధన్యాత్ములౌ
స్వాముల్ వీరలు వీరి కింపొదవు సేవన్ సేవ గావింపు మెం
తో మోదంబున నానతిచ్చి బలభద్రుండే నియోగించి నాఁ
డేమో చెప్పితినంచునుండెదవు సుమ్మీ నీమదిన్ సోదరీ 283

మూడవ చరణమందు 'నమిత' మను కాకుస్వరయతియు (నున్నది.)

కృష్ణరాయల ఆముక్తమాల్యద (1-14) :

ఉ. ఎన్నినుగూర్తు నన్న వినుమీ మునుదాల్చిన మాల్యమిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండ్లియె చెప్పుము, మున్ను గొంటినే
వన్నన దండ యొక్క మగవాఁడిడ నేన తెలుఁగు రాయండన్
గన్నడరాయ యక్కొదువఁ గప్పు ప్రియాపరిభుక్త భాక్కథన్. 285

అడిదము సూరకవి 'కవిజనరంజనము':

క. ప్రేమ విడెమొసఁగఁ గైకొను
మీ మగనినిఁ గౌఁగిలింత కెడ సేయకుమీ
మోమెత్తి ముద్దొసంగుమి
యో ముద్దులగుమ్మ యింకకుండెడు సుమ్మీ. 286

సుమీ, సుమ్మీ. సూ, చనుమా, చనుమీ, వినుమా, వినుమీ, వినవో ఈ
మొదలైన పదముల చివర స్వరమున్నది గాన నుభయము చెల్లును. 287

మను చరిత్రము (3-99):

ఉ. ఓ సరసీరుహాక్షి వినవో రతిఁగౌఁగిట నిన్ను చేర్పు నిం
పొ సురభర్త కైనఁ గలదా వలదంచుఁ బెనంగనేల స
న్యాసినె యొక్కటే తహతహ న్మన పొగ్గదు కేలికైన 'నా
శ్వాసితదుఃఖితే మనసి సర్వమసహ్య'ముగా నెఱుంగవే. 288

రెండవ చరణమందు వ్యంగ్యకాకుస్వరయతి (యు నున్నది.) 289

ఉభయముకు:-

పారిజాతాపహరణము (5-86):-

సీ. మేలవించినవి సుమ్మీ దీని మెట్లని
మాంసలాంసంబున మహతిఁ జేర్చి
మిన్నేటి జలము సుమ్మీ తొలఁకెడునని
డాచేత మణికమండలు వొసంగి
యిది జపోచితము సుమ్మీ జతనంబని
వలచేతఁ బద్మాక్ష వలయమిచ్చి
యీశానుఁడిచ్చె సుమ్మీ మాకు నిది యని
శార్దూల చర్మంబుఁ జంకఁ జొనిపి
పొమ్ము పొమ్మని యొకకొంత పోవఁబనిచి
రమ్ము రమ్మని యొకకొంత రాగఁ బిలిచి
కపట నటనాపరుండైన కంసవైరిఁ
బరమముని నవ్వటాలకుఁ బనులు గొనియె. 290

అందే (2-28) :

చ. అదితి మొఱంగి కుండలము లానరకుండు హరించె వానినే
కదనములోన ద్రుంచి యవి గైకొని దాచితి నాటనుండియుం
బదిలముగాఁగ నన్నడుగఁ బంపని కారణమేమి లాతినే
యిదె చనుదెంచి యిత్తునను మీ శతమన్యునితోడ సంయమీ. 291

లాక్షణికులు సంశయప్లుతమందు 'అనుమీ' అనునది వ్రాసినారు. సంశయ మెక్కడను కనుపించదు నిబోధనమే స్పష్టముగా నున్నది. 292

మరియును, హల్లుకు:-

శ్రీనాథుని కాశీఖండము (3-198) :

శా. పౌనఃపున్యమునన్ ఘటింపఁ దొడఁగెన్ బ్రహ్మన్యయోత్తంస, గో
క్షీనాగ్రంబున లేగపెయ్య యది శంకే కామధేనూద్భవం

బానందంబున డెందముబ్బఁగ జనన్యాపీన వాపీసుధా
పానోత్పచ్ఛ మనూనమై చటులఝంపాతాండవాటోపమున్. 293

'కంటే' అనుచోట నిబోధనము సంయుక్త యతి యనరాదు. స్వర మున్నది 294

వసుచరిత్రము (2-8):

మ. ఘనజాంబూనద కావ్యరత్నరుచులన్ గన్పట్టు నీ గట్టుఁజు
ట్టిన గండోపల మండలంబుఁ గనుగొంటే మేదినీశైలశా
సన, యుష్మచ్ఛరణావధూతమగు నీశైలంబు నూరార్పఁగా
ననుకంపామతిఁ జేరుమేరు ముఖగోత్రాధీశులన్ బోలెడున్. 295

విరాట పర్వము (5-129):-

క. ద్రోణుఁడు రయమున నేసిన
బాణము లెడఁదెగక యొక్కబాణమ పోలెన్
శ్రేణి యయి పోవఁ బార్థుఁడు
రేణువు గావించెఁ గంటిరే చిత్రగతిన్.

పారిజాతాపహరణము (2-25):

మ. అనిశైనం బతి నిన్నుఁబాసి చనునో ప్రాణంబు ప్రాణంబుగా
నిను మన్నింపఁడొ నీమనోరథములున్ నెయ్యంబునం జేయఁడో
చనవుల్ నీవలె నెవ్వరేనిఁ గనిరో సౌభాగ్య మింతింతయే
నినుఁ బోలంగల రబ్జగంధులన వింటే యెందు సాత్రాజితీ. 297

(చివర చరణమందు) అనునాసికయతి గాదు. 298

అచ్చుకు :—

అందే (2-91):

శా. ఏణీ శాబ విలోలనేత్ర కనుగొంటే వీరు విద్యాధరుల్
మాణిక్యోజ్జ్వల రత్న కుండలులు సంబద్ధాసిధేనుల్ రణ
ద్వీణాపాణులు చంద్రికామల శిరోవేష్టుల్ త్రిపుండ్రాంకితుల్
నాణీయ స్తవ తారహారులు శివధ్యానైక నిష్ఠాపరుల్. 299

'కనుగొంచె' అను చోట స్వర ప్రధానమైనందున, నంతట స్వరము న్నది గాన (ఇట) నిబోధన కాకుస్వరయతి. ఇచ్చట మరొకటి పొసగదు. 300

శ్రీవాథుని నైషధము (3-134):

క. ఇందుండి యూర్ధ్వగతియును
నందుండి యధోగతియును నవసానమునం
బొందును సజ్జనుఁ డిందును
నందును గల వాసి చూడు మా డెందమునన్. 301

చేమకూరవారి సారంగధర చరిత్రము (2-250):-

చ. పొలయక నీరు గానఁబడఁ బొందుగఁ దెల్పు టదే నిజంబుగా
దలఁచెద వీ వదంతయును దబ్బరసూ మగవాఁడు బొంకెనా
యల దడిగట్టి నట్టులగు నాడుది బొంకిన గోడ వెట్టిన
ట్లలవడునన్న మాట వినరా వనరాశిపరీత భూభుజా! 302

'వినరా' అనుచోట. 303

బాలురకు తెలియుటకై యిన్ని లక్ష్యములు వ్రాసినాము. 304

8. 'వ్యంగ్యము'కు, హల్లుకు:—

ద్రోణ పర్వము (2-303) :

క. కౌరవ సైన్యంబులఁ గల
వీరుల యస్త్రములు నాదు వివిధాస్త్రగతి
క్రూరప్రవాహముల కెదు
రే రాజీవాక్ష యాదరింపకు వారిన్. 305

'ఎదురే' అనగా, ఎదురుగాదనుట. ఇదే వ్యంగ్యము 306

చేమకూరవారి విజయ విలాసము (1-182):

ఉ. చెప్పెడిదేమి కన్నుఁగవ చేరల కెక్కుడు చంద్రబింబమో
తప్పదు మోము మోవి సవతా చివు, రెక్కుడి మాట గొప్పకున్
గొప్పపిఱుందు గబ్బిచనుగుబ్బలు కౌఁగిటి కెచ్చు జాలువా
యొప్పులకుప్పమేను నడుమున్నదొ లేదొ యెఱుంగ మింతకున్. 307

'సవతా' అనగా, (సవతు) సమానము గాదనుట. 308

అచ్చుకు :-

అందే (అవ. 54):

ఉ. ఆనతి యిచ్చెనా యది శిలాక్షర మెవ్వరికైన మెచ్చెనా
వానిఁ గృతార్థుఁజేయుఁ బగవాఁడయినన్ శరణంబుఁజొచ్చెనా
యా నరు నేరమెంచక తనంతటివాని నొనర్చు, నిచ్చెనా
యేనుఁగు పాడి యీడుగలరే రఘునాథ నృపాల శౌరికిన్. 309

'ఈడుగలరే' అనుచోట. 310

చేమకూరవారి సారంగధర చరిత్రము (3-100)[1] :

సీ. చంద్రోదయంబైన చందాన నీరాక
కన్నులు చల్లఁగాఁ గాంతు నెపుడు
నిను గొండఁగాఁ జూచుకొని యేవిచారంబు
లేక నుండుదు నాత్మ లేశమైన
నిసుమంత దవ్వైన నీవు రాకుండిన
నిదియేమొ రాఁడని యెదురుచూతుఁ
తెలియఁజూచినయెడ దృష్టిదాకునొ యని
వేడ్కదప్పక చూడ వెఱతు నిన్ను

నెటులఁ దరియింతు నీరూపు మెటులఁగాంతు
నీ విఁకను వత్తువని యెదురెదురు జూతు
మనసులో నిన్ను నేలాగు మఱువవచ్చు
నీవు లేనిదె యొకబ్రతుకే కుమార! 311

'బ్రతుకే'-బ్రతుకు కాదనుట. ఇటువలెనే తెలుసుకునేది. 312

1. ఇక్కడినుండి ఈ ఆశ్వాసాంతము వరకున్న భాగము 'ఇ. ప్రతి' లోనిది. చూ. సమాలోకనము – మూల ప్రతి.

4. 'నింద'- హల్లుకు:—

కవిధూర్జటిగారి శ్రీకాళహస్తీశ్వర శతకము :

శా. రాజై దుష్కృతిఁజెంది చందురుఁడు రారాజై కుబేరుండు దృ
గ్రాజీవంబునఁగాంచె దుఃఖము కురుక్ష్మాపాలుఁడా మాట నే
యాజింగూలె సమస్త బంధువులతో నా రాజశబ్దంబు సీ
సీ జన్మాంతరమందు నొప్పదు సుమీ శ్రీకాళహస్తీశ్వరా ! 313

అందే:

శా. వేధం దిట్టఁగరాదుగాని భువిలో విద్వాంసులం జేయనే
లా ధీచాతురిఁ జేసెఁ జేసిన గులా మాపాటునే పోక క్షు
ద్బాధాదుల్ గలిగించనేల యవికృత్యంబైన దుర్మార్గులన్
సీ ధాత్రీశులఁ జేయనేటి కకటా శ్రీకాళహస్తీశ్వరా ! 314

రెండవ చరణమందు 'వ్యర్థత'నే కాకువు. 315

జగ్గకవి సుభద్రా పరిణయము :

ఉ. అక్కట నేనుగోరిన శుభాంగుఁడు నన్ను వరించు వేడుకన్
మక్కువ పిక్కటిల్ల యతి మాడ్కిని దగ్గరవచ్చి వేడినన్
జిక్కని గుబ్బచన్ను లెదఁజేర్చి కవుంగిట బిగ్గఁజేర్చకేఁ
జిక్కులు బెట్టి వచ్చితి నిసీ యతఁ డెంత విరాలిఁదూలెనో. 316

'సీ' యనుచోట నింద. 317

అచ్చుకు:

తిమ్మకవి అచ్చతెనుఁగు రామాయణము (అయో. 86) :

గీ. ఆలి మాటకొరకు బేలయై కోడలిఁ
కొడుకుఁ బోవద్రోచుకొనియె నితని
దేటి మగతనం బిసీ కడు కొదువేని
అట్టువొందె నింక అంతు లేల. 318

సీ, ఇసీ, ఇస్సిరో- ఈ మొదలయినవి నింద (ఇటువలెనే తెలుసు కొనేది.) 319

౬. 'నిశ్చయము'. హల్లుకు:

వసుచరిత్రము (1-11):

శా. భావం బేకడ లేక వృత్తనియమా పాయంబు చింతింప కెం
దే వర్తించు పరార్థవంచనలచే దీపించి మూర్ఖాలి సం
భావింపం గుకవిప్రణీత కృతి సామాన్యాకృతింబూని పై
పై వన్నెల్ బచరింప, దానిఁ దిలకింపంబోరు ధీరోత్తముల్ 320

'ఎందే' అనుచోట. మొదటి చరణమందు ప్రాదియతి. 321

చేమకూరవారి విజయ విలాసము (3-34):

ఉ. లెంకగ నేలుకోఁగలదులే మగనిం దజీతీపుజేసి మీ
నాంకుని పాటమాన మన మాదట వేడిన మాఱుపల్కఁగాఁ
గొంకెదునంచు మీరిపుడు గోలని చూడకుఁడమ్మ నేర్చుఁబో
చంకల బిడ్డ లూడిపడ సారసలోచన మాట లాడఁగన్. 322

మొదటి (చరణమందు.)

అచ్చుకు:-

చేమకూరవారి విజయ విలాసము (2-147):

ఉ. సుందరి రానిచో నెదురు సూచుచునుండఁగఁబట్టు, వచ్చుచో
నింగునిభాస్య చక్కదనమే గని చొక్కుచు నుండఁబట్టు, నీ
సందడి చేతనే యరుగ సాగెను ప్రొద్దిఁక వేల యెప్పుడో
సందెజపంబు లర్చనలు సల్పఁగ నా కపటత్రిదండికిన్ 324

'చక్కదనమే' (అనుచోట). 325

అందే (1-131):

క. వాతెరకు నమృతమే తుల
మే తులకింపగు పిసాళి మిసిమికిఁ గ్రొమ్మిం

జే తుల, చేతుల కబ్జము
తే తుల లేతుల వెలందు నీచెలి తులయే. 326

'అబ్జములే' (అనుచోట.) 327

శ్రీకృష్ణరాయల ఆముక్తమాల్యద (1-7):

ఉ. యాదవ సార్వభౌము భయదాయతబాహు నియుక్తిఁజేసె యం
దే దనుజేంద్ర సాల్వపుర హేమమణీ వరణంబు సంగతం
బై దివి నాత్మకంకణములం దొక కంకణమయ్యె నట్టి కౌ
మోదకి మోదకీలిత సముజ్జ్వల కల్పకమాల్యఁ గొల్చెదన్. 328

చివర (చరణమందు) ప్రాదియతి. 329

కవిజన రంజనము:

క. లోకాలోక మహీధర
మే కోట కులాచలములు కృతకాద్రులు కే
ళా కూళులు జలరాశులు
శ్రీకర ధృతి సాంద్రుఁడౌ హరిశ్చంద్ర నృపతికిన్ 330

'మహీధరమే' (అనుచోట.) 331

కాకునూరి అప్పకవి ఆంధ్రశబ్ద చింతామణి (1-85)

క. రసమునకు నాశ్రయంబై
యసదృశమగు నెద్ది యదిగదా శబ్దము రా
క్షసదమన రసికులనఁగా
వసుమతిఁ దద్విధ మెఱుంగు వారలు సుమ్మీ. 332

ఈ పద్యమందు నప్పకవిగారు నిర్ణయించిన యిత్యాదులు నాటింటిలో నొక టియు గనుపించదు. (మరి) యేమి నిశ్చయించుకుని యచ్చుకు యతి నిడిరో తెలియదు. 333

6. 'వ్యర్థత', హల్లుకు:—

పారిజాతాపహరణము (1-125) :

ఉ. ఈ నయగారపుం బ్రియము లీ పను లీ మొగమెప్పు మాట లే
లా నిను నమ్మియుండిన ఫలంబిది తోడనె కల్గె నాకు నీ
యాన జుమీ ననుం జెనకి యూఱడి బెట్టుకు నవ్వు వారలం
గాన నెఱుంగునే పసులకాపరి భావజ మర్మకర్మముల్. 334

'ఏలా' అని వ్యర్థ (త్వ) ము. 335

మనుచరిత్రము (2-64)

శా. ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యెందేఁ గంటిమే కామశా
స్త్రోపాధ్యాయివినా వచించెదవు మే లోహో త్రయీధర్మము
ల్పాపంబుల్ రతిపుణ్యమంచు నిక నేలా తర్కముల్ మోక్షల
క్ష్మి పద్యాగమ సూత్రపఙ్క్తి కివెపో మీ సంప్రదాయార్థముల్. 336

అచ్చుకు:—

అందే (3-94):

శా. రా వైరాగ్యముపూని నీవు దగ నిర్దాక్షిణ్య చిత్తంబునన్
రావైతే జనిగాని యందులకు హోరాహోరిగాఁబోరి యే
లా వాలాయము సేయఁగా బ్రతుకు మీ వాచార వంతుండవై
చావో యెక్కుడు నీ యెడంబొడము నెచ్చం భూసురగ్రామణీ. 337

శ్రీనాథుని నైషధము (5-28)

ఉ. భావజు కేలివైభవము పట్టున నీచికురాగు మోవి యా
శీ విష నాయకుం డెవఁడు సేవ యొనర్చుట నర్థకారిగా
దో వనజాక్షి యయ్యమృత మున్నది నీయధరంబు నందు నే
లా వెఱువన్ సుధారసమునందు విషంబు పరిస్ఫురించునే. 338

7. 'ఆక్షేపణ', హల్లుకు:—

వసుచరిత్రము (4-28):

ఉ. ఇంతుల నేచు పాప మిది యింతటఁ బోవదు సుమ్ము పాంథ లో
కాంతక నిన్ను ఘోరతమమై ఘనమై యజహాత్కలంకమై
వంతల బెట్టి యాఱు పది వ్రక్కలు సేయక పూర్వపక్షపుం
గంతులకేమి **చూచెదవుగా** తుది నీ బహులార్తి ఖేదముల్. 839

'చూచెదవుగా' అనుచోట 840

అచ్చుకు:—

అశ్వమేధ పర్వము (4-52)

ఉ. యాగ విముక్తమై చను హయంబున కడ్డము వచ్చి పట్టికా
కీ గతి మెత్తఁబాటు దగునే నృపధర్మ విహీనతన్ రణో
ద్యోగము లేక తక్కి భయ ముల్లము జేరఁగ నిచ్చు రాజు **రా**
**జే** గుణహీన పొమ్మనిన నేమియుఁ బల్క కతండు గ్రమ్మఱన్. 841

రెండవ; నాల్గవ చరణంబులందు. 842

చేమకూరవారి సారంగధర చరిత్రము (8-58):

ఉ. ఏల బజారి అంతులివి యెవ్వరు మెత్తురు నోరిలోపలన్
వ్రేలిడి నప్పుడుం గఱువనేరఁడు నీ సుతుఁ డద్దపాప **గా**
**డే** లలితాంగి నీవనక నేరికనందు రయారె పొమ్ము చా
ల్చాలును వ్రేళ్లసందులను జారెడు దారలు లేరిటెవ్వరున్. 843

'గాఁడే' (అనుచోట) 844

మనుచరిత్రము (2-64)

శా. 'ఈ పాండిత్యము నీకుఁ దక్కమఱి యెందేఁగంటిమే...'

8. 'అనందము': హల్లుకు:—

వసుచరిత్రము (2-125)

చ. అన విని గట్టు రాకొమరుఁ డాననగహ్వర రోచమాన నూ
తనతర దంత హీరరుచి ధారలు వెల్వడ నొక్క లేఁత న
వ్వు నగి నిజంబె వల్కితి వవున్ భువనాశయ సన్నివేశ వే
దిని సరసాగ్రగణ్యవు గదే యన యన్నది వల్కె వెండియున్. 346

చేమకూరవారి విజయ విలాసము (1-66)

ఉ. తీరిచినట్టు లున్నవి గదే కనుబొమ్మలు కన్నులంటి మా
చేరలఁ గొల్వఁ గావలయుఁ (జేతుల యందముఁజెప్ప గిప్పరా
దూరులు మల్చివేసి నటులున్నవి; బాపురె తొమ్మిలోని సిం
గారము; శేషుఁడే పొగడఁగా వలె నీతని రూపరేఖలన్) 347

'గదే' అనుచోట్ల. 348

అచ్చుకు:—

అందే (3-126):

ఉ. ఈయపురాలవైతివి గదే[1] యిపు డత్తవు తొంటివావి నో
తోయజనేత్రు గాంచిన వధూమణి (నీ సుతఁ బెండ్లి యాడఁగా
నాయము నా కుమారునకు నర్మిలి హత్తఁగ; నత్తవావిచే
నాయువు గల్గువాఁడవు నటంచ్రడు శుభంబగు దీన నెంతయున్. 349

అందే (2-18)

ఉ. చక్కని కన్యకామణికిఁ జక్కని వాఁడగు ప్రాణనాథుఁడున్
జక్కని శోభనాంగు నకుఁ జక్కని యింతియుఁ గల్గు టబ్బురం
బెక్కడ నిట్లులుండ వలదే రతిదేవికి సాటి వచ్చుఁబో
యిక్కనకాంగి; మన్మథున కీ డితఁ డీడితరూపసంపదన్. 350

'వలదే' అనుచోట. 351

---

1. ముః ప్రః 'వీయపురాలవై తిగదవే...'

9. 'ఔద్ధత్యము' హల్లుకు:-

చేమకూరవారి విజయవిలాసము (3-163):

శా. ఏతన్మాత్రమె భారకార్యమనిపై యెత్తెన్నకే నేఁడు ని
ర్భీతిన్ బాలికఁ గొంచుఁబోవ నుచితంబే కండ గర్వంబు దు
ర్నీతుల్ యాదవ వీరసింహములతోనేనా, బలారా, బలా
రాతిప్రోద్భవుఁ డెంతచేసె నిది మేరా వీరరాణ్మౌలికిన్ 353

('మేరా' అనుచోట)

10. 'అనునయము', హల్లుకు:-

చేమకూరవారి సారంగధర చరిత్రము (2-127):

సీ. లతకూనయని తగుల్ మతిఁదలంపఁడుగదా
వేడి తావులు చల్లి వేచుఁగాని
జలజగంధి యటంచు సంభ్రమింపఁడుగదా
చురుకు సోకులమీఁద సుకియుఁగాని
చిలుకలకొలికి యంచెలమిఁ బైకొనఁడుగా
చిగురుటాకు కటారిఁ జిమ్ముఁగాని
కలువకంటి యటంచు నలరఁజేయఁడుగదా
యుడుకువెన్నెల గాయఁ దొడఁగుఁగాని

మధుఁడు సారంగరథుఁడు మన్మథుఁడు విధుఁడు
వసుల పాతర పీరెందు మసలనీయ
రెటుల నిఁకఁదాళ గలదని యెఱుఁగవైతి
కటకటా నీకు దయరాదుగా యొకింత. 354

చివర చరణమందు. 355

అచ్చుకు:-

అందే (2-212):

శా. ఏమే పల్కవు మోహనాంగి యిటు లేలే యల్క చిత్రాంగి ని
న్నేమంటిం గలకంఠి నావలని తప్పేమే వయారీ యయో
నామీఁదం దయ లేదటే చెలి నను న్మన్నింపవే కోమలీ
నీ మాటల్ జవదాటకుందుదుగదే నీరేజపత్రేక్షణా! 356

తృతీయాశ్వాసము 241

మొదట చరణమందు 357

పారిజాతాపహరణము (1-123):

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుటల్క దోచి తా
చినయది నాకు మన్ననయ చెల్వగు నీ పదపల్లవంబు మ
త్తను పులకాగ్ర కంటక వితానము నాటిన నొచ్చునంచు నే
ననియెద నల్క మానవుగదా యికనైన మదాలికుంతలా. 358

చివర చరణమందు. 359

శశిబిందు చరిత్ర:

ఉ. పయ్యెద బాపి గుబ్బలను బాహులఁ బట్టఁగ నిచ్చి మోవిపై
తియ్యని మోవియు న్మనసు దీరఁగఁ గ్రోలఁగ నిచ్చి యిప్పుడో
తొయ్యలి నీవి ముట్టినను ద్రోచెద వేనుఁగు నిచ్చి యంకుశం
బియ్యక కయ్యమాడ దగునే నను నీశశి వేచఁ బాడియే 360

చివర చరణమందు 361

ఉభయముకు:-

తిమ్మకవి

చ. కటకట యిప్పు డింత యులుకా యులుకా బలుకానలోన న
న్నటమట నొందఁజేయఁదగవా మగువా పగవాఁడనె యింక నె
న్నటికిని నిన్నుఁబాయఁగలనా లలనా వలనా కలంచ నే
నెటువలె తాళువాఁడ వలతీ పొలతీ కలతీరు తెల్పుమా. 362

నాలుగు చరణము లందున్న. 363

11. 'ప్రశ్న'. హల్లుకు:—

చేమకూరి వారి సారంగధర చరిత్రము (1-34)

శా. లేవే భోజనమేటి కొల్ల విటు లేలే మేన బల్సొమ్ము లే
వే వేఁ బూనవు (వెల్లఁబాతె మొగమేమీ రాజుతో నల్గి నా

వో వామాక్షిరొ తెల్పవే యనుచు గర్భోక్తుల్ చెలు ల్వల్కఁగా
వేవిళ్లం బొరలెన్ లతాంగి పతికిన్ వేడ్కల్ కొనల్సాఁగఁగన్) 364

మొదటి చరణమందు. 365

అచ్చుకు:—

వసుచరిత్రము (4-76) :

శా. ఏమే హేమలతా యటంచుఁ బనియేమే మాధవీ యంచు, నీ
భామా మన్మథు చందమే మనుచుఁ జెప్పంజాల భూపాలుఁడా
రామక్షోణికిఁ జిన్ననాటగొలె నిద్రాసౌఖ్యము ల్మాని నాఁ
డేమో యంచు వచింప వింటిఁ దమలో నేకాంత లీలాగతిన్. 366

మొదటి చరణమందు 'గొలె' యని హ్రస్వమున్ను గలదు. 367

శ్రీనాథుని నైషధము (7-19) :

శా. ఏమో క్రొత్త యపూర్వ వార్త విను చేమీ చెప్పుచుం దండనా
ధామాత్యాదులు పాదచారమున సేవాసక్తిమైఁ గొల్వఁగా
భూమీశాగ్రణి సొచ్చెఁ బట్టణము సంపూర్ణానురాగంబుతో
భామానేత్ర చకోర చుంబిత ముఖ ప్రాలేయ రుగ్బింబుఁడై. 368

(ఈ పద్యము మొదటి చరణము) అన్ని పుస్తకము లందు 'వినుచేమో జెప్పుచున్' అని యున్నది. యతి భంగమైనది ఈ తప్పు పాఠముకే పండితు లర్థమును చెప్పుతారు. ఆ అర్థమున్ను తప్పు పాఠముకు కుదురదు. మొదట విమర్శ లేనివారికి నర్థవిమర్శ మాత్రమెటుల కలుగును! 369

దమయంతీ వివాహానంతరము నలమహారాజు స్వపుర ప్రవేశ సమయ మందలి పద్య (మిది) 'ఏమో నూతన వార్త వినుచు 'ఏమీ' అని రాజు ప్రశ్న చేసిన పిమ్మట (మరలనేమో) చెప్పుచు సరదారులు, మంత్రులు మొదలయిన వారు పాదచారులయి—' మీద సులభమే. దండనాధామాత్య ప్రధానమంత్రి శబ్ద ములు నియోగులకు పేరులవును. దండనాధు లనఁగా యుద్ధ సన్నద్ధులకు రూఢి

గావున పునరుక్తి దోషము లేదు. వార్తలు వినునపుడు 'ఏమీ' అనుట సామంతు లకు స్వభావమే గావున నాశబ్దముంచుట ముఖ్యమే. 370

చేమకూరవారి విజయవిలాసము (3-31) :

ఉ. ఎవ్వనిఁ జూచి **మేలుపడితే** యరవిందదలాక్షి, నీ మనం
బెవ్వఁడు వచ్చుఁ జెప్పఁగదవే మదకోకిల వాణి, నిన్న నే
డెవ్వని చెల్వు నీ యెదుట నెన్నఁబడెన్ లతాంగి, నేనకా
కెవ్వరు నీకు ప్రాణపదమేటికి దాచెదవే తలోదరీ. 371

ప్రథమ, ద్వితీయ చరణములందు. 372

12. 'ప్రార్థన', హల్లుకు :-

ద్రోణ పర్వము (2-379) :

క. మునినాథ దేవకీ సుతుఁ
డును సంక్రందన తనూజుఁడుం బూనిన యీ
పని యెమ్మెయిఁ గడతేఱెనొ
వినవలతుం **దేటపరుపవే** పరిపాటిన్. 373

కర్ణ పర్వము (1-246) :-

చ. గురుఁడును భీష్ముఁడుం బడినఁ గొంచెపుమూఁకలతోడ నేను సం
గర విజయంబుగోరి భుజగర్వమునన్ సడిసన్న పాండు భూ
వరసుత వర్గముం దొడరు వాఁడనకా మది నిశ్చయించు టె
వ్వరిఁగొని యింత నీ **వెఱుఁగవా** నిను గర్ణునిఁగాదె నమ్మితిన్. 374

శాంతిపర్వము (6-27) :

క. అనుపమ మజర మతీంద్రియ
మనామయ మనంత మమల మన వెలుఁగు నొకం
డని వేదశాస్త్రములచే
వినియుండుదు దానిఁ **దెలుపవే** కృప నాకున్. 375

అచ్చు:—

అందే (5-506):

గీ. అనిన జనకుఁ డిట్లు లను వినినవియైన
వలయుఁ దెలియ వినఁగ వర్ణధర్మ
సమితిఁగల విశేష సాధారణత్వంబు
వేర్పరించి చెప్పవే మునీంద్ర. 876

అందే (2-54):

క. శరణాగతుండ భక్తుఁడ
పరమపదవి గోరెదను శుభంబుగ నన్నున్
బరికించి యేది మేల
య్యిరవు దొరకొనంగఁ జేయవే కమలాక్షా! 877

మహాప్రస్థానిక పర్వము (1-52):

సీ. అనుటయు ధర్మజుం డమరేంద్రుతో నన్ను
నత్యంత దృఢభక్తి నాశ్రయించి
పురమేను వెడలు నప్పుడు మొదలుగ...
జనుదెంచె నీ భవ్య సారమేయ
మిది యట రావలదే నామనంబు ని
ష్ఠుర వృత్తి కోర్వ దస్తోక పుణ్య
నిరతాత్మ నావుడు దరహాస మొప్ప న
బ్బలవైరి యిట్లంట పాడియే య

మర్త్యభావము కుక్కకే మాడ్కిఁగలుగు
ననఘ నీచింత తెఱుఁ గశక్యంబు దీని
విడిచి చనుదేల నిష్ఠుర వృత్తియయ్యె
నిచటఁ దడయఁగ నేటికి నెక్కు రథము. 878

మనుచరిత్రము (2-78) :

క. జైమిని యాదివ్యఖగ
గ్రామణులం జూచి వేడ్క గడలుకొనంగా
నా మీఁది వరూధిని విధ
మేమయ్యె నెఱుంగఁ జెప్పవే నా కనుడున్ 379

చేమకూరవారి విజయవిలాసము (3-50) :

క. వలపెక్కడ లేదా యీ
యలికుంతల తలనె పుట్టెనా యేచ కిఁకన్
జలిగాలిఁ ద్రోచి విడువుము
చెలి మిక్కిలి మనసు పేదశీతల పాదా! 380

13. 'ఆశ్చర్యము', హల్లుకు :-

రాజవాహన విజయము:-

ఉ. రామపయోధరంబు లదెరాఁ దనపై ఘనమయ్యె నంచుఁ దా
వేమరు వేరె రూపునఁ బ్రవీణతఁ గ్రిందొనరింప మేరు వు
ద్దామత నుండియుం గను స్వతంత్రులతో నఖవజ్ర ఘాతలన్
గ్రామము లెంత వింతలయిన న్మరి కర్మము లంత లింతలే. 381

మొదటి (చరణమందు) 382

అచ్చుకు:—

చేమకూరవారి విజయ విలాసము (1-106) :-

మ. ఒక మాణిక్యపు బొమ్మ యెట్టివగ కీలో జాలువా జాలవ
ల్లిక బాగా ల్కపురంపు టాకుమడుపు ల్వేతెచ్చి రాజున్న చా
యకు నందియ్య నతండు లేనగవుతో నవ్వేల నావ్యాలక
న్యక కెంగేల నొసంగఁ గై కొనియె నయ్యాటంబు వాటిల్లినన్: 383

మొదటి (చరణమందు) 384

చేమకూరవారి సారంగధర చరిత్రము (2-38) :

చ. ఉరుకుచ డెంద మెంత మృదువో మరి తియ్యని తుంట వింట న
వ్విరి విరిబోవు నారినిడి వేనలి గొజ్జఁగి పూవుచేత మ
చ్చరమునఁ బొంచి చచ్చియును జావని వాఁ డవు దేసి యార్చెఁబో
సురసుర స్రుక్కి (మెత్తనగు చోటనె) గుద్దలి వాడియో గదా। 385

మొదటి (చరణమందు) 386

అందే (3-215) :

ఉ. ఆయెడ రాజునానతి మృగాక్షిని రజ్జు నిబద్ధఁజేసి య
న్యాయము రాకుమారు సుగుణాగ్రణి పావనశీలు నుత్తమున్
మాయలు పన్ని మచ్చరము మై మని మించెను జూడనున్న ద
న్నా యిది మేకవన్నె పులి యంచుఁ దలారులు గొంచుఁబోవఁగన్ 387

చివరి (చరణమందు) 388

14 'పరిహాసము', హల్లుకు:-

చేమకూరవారి సారంగధర చరిత్రము (1-84) :

శా. లేవే భోజన మేటికొల్ల విటు లేలే మేన బల్సొమ్ము లే
వే వేఁబూనవు వెల్లఁబాఱె మొగమేమీ రాజుతో నల్గి నా
వో వామాక్షిరొ దెల్పవే యనుగు నర్మోక్తుల్ చెలుల్ వల్కఁగా
వే విశ్లం బొదలెన్ లతాంగి పతికిన్ వేడ్కల్ కొనల్ సాఁగఁగా. 389

అచ్చుకు:—

మనుచరిత్రము (2-41) :

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర యే
కాంతము నందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతయ కాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవచొప్పు, నీ
కింత భయమ్ములే కడుగ నెల్లిదమైతిమి మాటలేటికిన్. 390

మూడవ చరణమందు 391

15 'తర్కము', హల్లుకు:—

శ్రీనాథుని కాశీఖండనము (6-273):

మ. గయకేలా యరుగంగ మానవులకుం గాశీపురీ వాహినీ
త్రయవేణీ పులినంబు లందు నిడరాదా తల్లినిం దండ్రినిం
బ్రియమాతామహులం బితామహులనుం బేర్కొంచుఁ బిండాన్నముల్
గయికోరోటు ప్రియంబు తోడఁ బితరుల్ హస్తాబ్జముల్ సాచుచున్ 392

రెండవ చరణమందు 393

తారాశశాంక విజయము:

మ. తొలి దేవేంద్రుఁడు మాకులంబుఁ జొరలేదో మేము నార్కొము రా
యల యంకస్థితిఁ గాంచలేదొ స్వరవిద్యల్ మున్ను మావారి శి
క్షలచేఁ బాణిని నేర్వఁడో యని కుల స్థానప్రతిష్ఠన్ ద్రిభం
గుల ఘోషించె ననంగఁ గోళ్లు కలయం గూసెన్ ధరామండలిన్ 394

మొదటి చరణమందు 395

శాంతి పర్వము (1-287) :-

మ. అనుమానింపక తోడఁబుట్టువులఁ గాదా దున్మి దూటాడె నెం
దును గ్రొన్నెత్తురు లేఱులై పఱవ నింద్రుం డుగ్రతన్ దైత్యులన్
మును లవ్వీరు భజింపరో క్రతువు లామోదంబుతో నమ్మహా
త్ముని యాజింపరొ యూర్ధ్వలోక మదికాదో యేలఁడో నాకమున్. 396

చివర చరణమందు అచ్చుకు:- 397

హరిశ్చంద్రోపాఖ్యానము (2-147) :-

శా. ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేటరారో మద
క్రూరాభీల మృగావలిం దునుమరో ఘోరాటవుల్ లేవొ నా
యారామంబుఁగలంచి జంతుతతి మాయంజేసి యస్మత్కుమా
రీ రత్నంబులు వేడ వచ్చినను వారిన్ నొంచినావేమిరా! 398

చేమకూరవారి సారంగధర చరిత్రము (3-63) :

మ. తొలుతన్ రాజులు భోగకామినుల యందున్ మోహితుల్గారొ యిం
పొలయన్వారి కపారమైనధన మీరో యందుకే మిట్లు పు
త్రుల దండింపఁగ నిచ్చువారి వినమెందున్ నేడు చిత్రాంగి మం
దులు నీకుం దలకెక్కెనో పరవశాత్ముల్ గారె కామాతురుల్. 399

ఆముక్తమాల్యద (2-66) :

మ. తరుణుల్ తల్లియొరం గుచంబులునుపం దత్ప్రత్యముల్ దీమఁలై
పెరరేపం జనుదెంచెఁగాక రవి దీప్తిం జెంది పాతాల గ
హ్వరమం దూరిన వారి నీ యతుకుఁ ద్రాళ్లాతెచ్చు (నాదీర్ఘ త
చ్ఛిరకృష్టిం గను నీటిశైత్య మలరించెన్ నూతులం దత్తజిన్) 400

రంగనాథుని రామాయణము :

ద్విపద. అట్టినామీఁద నీవా యకరెవవు
పట్టి చట్టలువాపి పాఱవైచెదను. 401

మొదటి చరణమందు. 402

16. 'బోధకత'-హల్లుకు :-

జగ్గకవి సుభద్రాపరిణయము :-

క. ఆ యర్జునుఁ డీ చాయనె
మాయాయతివేషమూని మసలుచునున్నాఁ
డీ యిక్కవ నీ వెఱుఁగవు
గా యొక్కింతైన మత్తకరి వరయానా! 403

చివర చరణమందు 404

అచ్చుకు :-

మను చరిత్రము : (3-34)

ఉ. ఉడుపతి బారికి న్వెఱచి యూఅటయౌనని పేరుటామనిన్
ముడివడు కంతు సేనలకు ముయ్యలగుట్టగు నట్టి యిందురా

నడఁగక తాపవహ్ని ఘనమై హరిణేక్షణ ముల్లువుచ్చి కొ
ట్టడచిన చందమయ్యె పదమా యెంఁదోటఁ జరింప కింటికిన్. 405

చివర చరణమందు. 406

17. 'అనుతాపము'-అచ్చుకు :-

మనుచరిత్రము (3-36) :

క. ఓ చెల్ల విరహిణీవధ
మే చతురత నీకు దురితమే సేయుపనుల్
రాచరికమునకు ఫల మ
య్యో చంద్ర వివేక మెఱుఁగవో మదుసేనన్. 407

రెండవ చరణమున నిశ్చయము, నాలవచరణమున అనుతాపము 408

18. 'వ్యాజస్తుతి', హల్లుకు :-

పారిజాతాపహరణము (1-88) :

ఉ. నా మొగమాటకై వలని నాటకముల్ ఘటియించి రుక్మిణీ
కామినిమీఁదటం గలుగు గౌరవముం గృపయుం బ్రియంబుఁ దా
నేమియుఁ గానరాక నిటు లిన్ని దినంబులు నన్ను దేల్చెనో
తామరసాక్షి మెచ్చవలదా మురదానవభేది కృత్యముల్. 409

చివర చరణమందు. 410

19 'విచారము', హల్లుకు

ఉద్యోగపర్వము (2-52) :

ఉ. దక్కెను రాజ్యమంచు నకటా యిటుతమ్ముని భాగమీక నీ
వెక్కటి మ్రింగఁజూచెద వదెట్లఱుగున్ విను మీను లోలతన్
గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన మాడ్కి సువ్వె యి
ట్లుక్కివుఁడైన నీ కొడుకు నుల్లము నన్నిటు లాడఁగూడునే 411

'అక్కటా' అనుచోట. 412

చేమకూరవారి సారంగధర చరిత్రము (3-49) :

చ. పొంతుక లెస్సయున్న యొక పూటయుఁ జూడఁగఁజాల వీవు మా
యఁగొడిగట్టి తెంతటి గయాళివి చేర జవు న్విచారముల్
దెలియనివారిపైఁ గలవి లేనివి చాల ఘటించి తండ్రి బి
డ్డల కెడ సేయఁజూచి తకటా మఱి నీ కిది యెంత దోసమే. 413

అందే (3-80) :

చ. వలదని మీరలైన యొకపాల్ దెలుపంగదరయ్య యాలిమా
టలు వినియందు బట్టి యకటా తెగటార్తురె యంచు నాపె పె
ద్దల గని పుత్రమోహమున దైన్యపడెం గడు రాజు మొత్తగా
నల మొగసాలకు న్మొఱయయు టన్నది నిక్కముగాగ నయ్యెడన్. 414

తిమ్మకవి అచ్చతెనుఁగు రామాయణము (యుద్ధ. 29) :

క. పంతము మెఱయఁగ రాచప
దంతి న్విదలేక యక్కటా యొకట కొలం
బంతయుఁ జెఱుపఁగఁ జూచెద
వింతయు మేల్గానము పూనకేమి యనఁ జనున్. 415

అచ్చుకు :-

చేమకూరవారి సారంగధర చరిత్రము (2-176) :

చ. సకలము కాలకూట సహజన్ము సుధాకరుఁ డంద్రుడు నిక్కమౌ
నౌకొ యిదియంచు నోసితమయూఖ నినున్ దెలియంగఁగోరి యూ
రక యటు జేరినంతఁ దలప్రాణము తోకకు వచ్చె లెక్క సే
యక నిను మ్రింగెనేని యకటా యలరాహువు నేమి యయ్యెడున్. 416

ద్రోణపర్వము (1-14) :

ఉ. అప్పుడు భీమ్మలేమి హృదయంబును నుమ్మలికంబు గూరగా
నెప్పటి చందము న్విడిచి యేడ్తెఱఁ దక్కిన చూడ్కు లొండొరున్
తెప్పల మాటునం బొలయ నీ సుతు పాలికి వచ్చు రాజులం
దిప్పు డితండు రావలువదే యని కర్ణుఁ దలంచి రందఱున్. 417

అందే (2-233) :

క ఆననములు వెలవెల్లం
గా నడ లొాదవినది మీకుఁగాద దడవ మీ
లో నభిమన్యుఁడు లేఁడే
మో నాకుం జెప్ప దేల యూరక యుండన్. 418

'ఏమో' అనుచోట విచారము, సందేహము కాదు 419

అందే (2-342) :

సీ. అభిమన్యుఁ డీల్గిన నర్జునుఁ డధిక శో
కావేశమొంది సాహసిక వృత్తి
నతి దుర్ఘటంబైన ప్రతిన యట్టులె పట్టు
నే కౌరవులు దీని నెట్టులైనఁ
దప్పింపఁజూతురు దర్పంబు వెరవును
గలవారు వారి కగ్గలము గలరు
కడు దెప్పరంబైన కార్యంబు వాటిల్లె
నెమ్మెయి నిది నిర్వహించు వాఁడొ

యకట దినములోన నాసైంధవునిఁ జంప
నబ్బకున్న నతని నగ్ని సొరఁగ
వలయు నాతఁ డనృతవాదిగాఁ డిక్కార్య
మెట్టు లగునొ మనకు నేది గతియొ. 420

రెండవ చరణమందు రెండవ యతి. 421

అందే (3-24) :

సీ పుత్రశోకానలంబును గ్రోధ వహ్నియు
మనమున ముప్పిరి గొనఁగ మృత్యు
భంగి నేతెంచు భీభత్సుని కౌరవుల్
సెనక జాలరు నేమి చేటు మూడె

నో పురిలో నొక్క యమ్మడి నింటింట
నార్తనాదములు పెక్కయ్యె నెల్ల
రవములు మిగిలి సైంధవునింటి దిక్కున
నాక్రందన ధ్వను లతిశయించె
నేను ద్రోణుఁడు భీష్ముండుఁ బూని చెప్ప
శౌరి మాటలు మీరాజు సరకుగొనఁడు
సంధిగానక కర్ణుండు సౌబలుండు
దుస్ససేనుండు నందఱఁ ద్రోచికొనిరి. 422

మూడవ చరణమందు మొదటియతి 423

శ్రీనాథుని కాశీఖండము (6-83) :

సీ. బ్రహ్మ మానంద రూపం బట్టి తథ్యంబు
నానాత్మ పరికల్పనంబు మిథ్య
ముదిమి నింద్రియశక్తి మొఱవవోకుండఁగ
మైథునక్రీడ యేమఱని యురువు
సౌఖ్యార్థి యైన యాచకుని కిచ్చుట పాడి
పంచ భూతాంశక ప్రకృతి తనువు
యౌవనంబులు పోయెనా రావు క్రమ్మఱ
సపరిక్షయమ్ములు సంచయములు
గడచి నప్పుడు క్రిములొండెఁ గాకులొండె
గుక్కలొండేసియును భుక్తిగొనెడు దేహ
మొకఁడు ప్రార్థించి యడిగిన నొసఁగ వలదె
తన్ను నిచ్చిన యది గదా దానగుణము. 424

నాలవ చరణమందు మొదటియతి 425

హల్లుకు:—

అందే (6-165) :

సీ. ఒకనాడు మేనక యూర్వీ ధరేంద్రుని
యొద్దఁ గూర్మి తనూజ యునికిఁ దలఁచి

పేదజీవన మయ్యె బిడ్డకు రాగుండె
వాఁడవుగాన నీవా యరయవు
కాశి నెట్లున్నదో కమలాయతేక్షణ
దర్శించి వచ్చుట తగవుగాదె
యెలనాగ పుట్టిన యింటివారలు దన్ను
నరయ నుపేక్షించి నపుడె బెగడు

ననిన బహుసంపదలతోడ నరిగి యతఁడు
క్రతుభుగీశ్వరు పురలక్ష్మి నతిశయించు
తత్పురము సూచి శివుఁజూచి తనయఁజూచి
తెలిసి యవ్వీట లింగప్రతిష్ఠ చేసె 426

రెండవ చరణమందు రెండవ యతి 427

20. 'ప్రాగల్భ్యము'' అచ్చుకు

శ్రీనాథుని కాశీఖండము (6–295) :

చ. అనవిని పారువంబు నవయౌవన గర్వమునం బదంతి కి
ట్లను నిదియేమి నా బలపరాక్రమ సంపద యింత మాత్రమే
తన సరివారికి న్వెఱచి ధామము పాడఱజేసి డాగటో
యిన సరియిళ్ల వారు నగరే ఖగమో యది యేమి దయ్యమో 428

చివర చరణమందు (ఇక) రెండవ చరణమందు నిత్యసమాసాఖండాభేదయతులు గలవు 429

21. 'భీతి', హల్లుకు:

వసుచరిత్రము (4–108) :

చ. చెలుల మొఱంగి నాడు మణిచిత్ర గృహంబున మోమువాంచి తొ
య్యలి భవదేకదర్శన మదాకృతిఁ జూచెఁగదా విసీలకుం
తల హృదయంబు నీకు విదితంబు గదా యిఁక దాపనేటికిన్
వెలది మనంబుఁ దెల్పగదవే మణిహారమ సారె వేడెదన్. 430

అచ్చు కు:—

మనుచరిత్రము (2-38) :

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁజరించె దోటు రే
కివ్వన భూమి భూసురుఁడ నేఁబ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁగాంతుఁ దెల్పఁగదవే[1] తెరువేది శుభంబు నీకగున్ 431

'తెల్పఁగదవే' అనుచోట 432

22. 'శంక', అచ్చుకు:

ఆము క్తమాల్యద (2-42) :

శా. దానత్యాగ పతత్రిరై తొలుత పత్రం బంబుధారన్ సదా
నానందత్సితకీర్తిహంసి జనుమింటం గ్రొత్తనా నేల నా
నా నీరార్ద్రి పతత్రి యయ్యె వడి మింటం బాఱు తజ్జాతి తే
లా నిల్పుంగతి యన్యపత్రిగతి పత్త్రైకప్రదేశాప్లుతిన్. 433

'ఏలా' అని శంక. 'పత్త్రైక' వృద్ధి యతియును గలదు. రెండవ మూడవ చరణము లందు ననునాసిక యతులు. 434

23 'అంగీకరణ కృతి', అచ్చుకు :

అనుశాసనిక పర్వము (8-114) :

సీ. సిరిధేనువులలోని కలిగిన నెవ్వతె
వనియని యడిగిన నమ్మహాత్మ
శ్రీ నేను మీలో వసింపఁగా వచ్చితి
ననవుడు చంచలవైన నిన్ను

1. 'తెల్పగదవే' అన్నది ప్రార్థన కావచ్చును.

నొల్లము మాలోన నునుపఁగా ననియెన
గ్గోవులు దానికద్దేవి వగచి
యేను బాసిన సర్వ దానవకులము గీ
డ్పడియెఁ బొందిన సురల్ ప్రభుత నొంది

రేను వచ్చుట కోరిగదే తపంబు
లాచరింతురు నన్ను నిట్లభిభవించు
టుఱువె మీకన్న నధ్రువ నొల్లమనుట
యభిభవమె నీకుఁబోలిన యచట కరుగు. 435

'కోరికాదే' అనుచోట ఒప్పించుట 436

24 'పృచ్ఛ', హల్లుకు :

చేమకూరవారి విజయవిలాసము (2-137) :

గీ. వినుతి చేసిన, భిక్షగావింపుఁ డనిన
మాఱు వడ్డింప నిది తెత్తుమా యటన్న
పలుకు నారాయణా యను భాషణంబె
యిల నిజాలకు సన్న్యాసివలె నతడు. 437

అచ్చుకు:—

అందే (2-182) :

గీ. ఓ మహానుభావ యేవి గావలె దేవ
పూజ కిపుడు పత్ర పుష్పఫల జ
లాదికములు దెత్తుమా యనవుడు నట్ల
సేయు మనుచు నతఁడు సేయిచూప. 438

'తెత్తుమా' అనుచోట అడుగుదే. ఇంతకన్న వేఱొకటి లేదు. 439

హల్లుకు:—

శాంతిపర్వము (1-285) :

సీ. అర్థి విశ్వావసుం డాదిగాఁ గలుగు గం
ధర్వులు హృద్యవాదన మొనర్ప

నప్సరో నికురుంబ మాటలు పాటలు
 నై వినోదింపఁగ నమరగణము
బహువిధాలంకార భంగుల విన్నాణ
 ములు సూడ దివ్యమునులు నుతింప
మనుజ లోకం బెల్ల కనకాన్న వస్త్రభూ
 షణ దానములఁ దృప్తి సనఁగ నశ్వ

మేధసమితిఁ జేసి మెప్పించె నింద్రుని
శతతమాధ్వరమున నతఁడు హయము
నాసపడిన నిచ్చె నా దిలీపునిఁ జూపు
మా ధరిత్రి నిపుడు మనుజనాథ. 440

చూపుమా' అనుచోట 441

అచ్చుకు:—

అందే (1-237):

సీ. అనిమిషాసుర యుద్ధమున సువర్ణావలి
 సమయించి వర్ణాశ్రమములు సేర్ప
రించి భూమి నలంకరించి యగ్నిష్టోమ
 హయమేధ వాజపేయాతి రాత్ర
పౌండరీకములనఁ బరిగిన యధ్వర
 ము లనేకముల చేసి భూసురులకు
నఖిలభూములఁ గల యర్థంబు నెల్లను
 దనకని యేమియు నునుప కిచ్చె

శుక్రుఁ దల్లుఁ డనఁగ శోభిల్లెఁ దనయందు
ధర్మతత్వ మూర్తితముగ నియమ
నిష్ఠుఁడై యయాతి నెగడి శాశ్వతుఁడయ్యె
నే నృపాల యమ్మహీశ్వరుండు. 442

'అయ్యెనే' అనుచోట 443

హల్లుకు:—

జగ్గకవి సుభద్రా పరిణయము :-

సుగంధి. జాలమేల బాలఁ జూపు సాలమా రసాలమా
 తాలజాల మాలతీ లతా వృతాలి జాలమా

వాలుగంటిఁ జూడఁ జూడవా వనీరసాలమా
నీలవేణిఁ గానవోటు నీవు నేడు తాలమా ! 444

మూడవ చరణమందు 'చూడవా' అనుచోట. 445

అచ్చుకు :-

రామాభ్యుదయము (5-239) :

సుగంధి. అంగనాలలామ గానవా లతాకుడుంగ మా
తంగమా భుజంగమా పతంగమా కురంగమా
లుంగమా లవంగమాతులుంగ మాధవీ నటద్
భృంగమా నీరమా కరీరమా సమీరమా ! 446

'కానవా' అనుచోట. 447

ఈ పద్యమును అప్పకవిగారు సంశయ కాకుస్వరయతికి లక్ష్యము వ్రాసినారు. వృక్షాదుల నడుగుట కనుపించుచున్నదిగాని సంశయము లేశమైనా కనుపించదు. 448

25. 'శ్లాఘ' అచ్చుకు :-

శ్రీనాథుని కాశీఖండము (1-14)

శా. ఈ క్షోణిన్ నిను బోలు సత్కవులు వేరీ నేటి కాలంబునన్
దాక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ గంధసార ఘుసృణ ద్వైరాజ్య భారంబు న
ధ్యక్షించం గవిసార్వభౌమ భవదీయ ప్రౌఢ సాహిత్యముల్. 449

మొదటి చరణమందు. 450

'వేరి' యనుట అపశబ్ద మనుకొని లేఖకులు 'సత్కవు లింకేరి' అని దిద్దినారు. 'వేరి' అనిన్ని కలదు. మరియును ననేక శబ్దములు-ఎన్ను, వెన్ను మొదలైనవి గలవు. (పంచమా) శ్వాసము నందు తెలియ పరుచుతాము. 451

## 21. ప్లుత యతి :-

లక్షణము:—

క. దూరాహ్వానము లందును
హా రోదన గాన సంశయార్థము లందున్
సూరి నుత ప్లుతాన్వితంబులు
నారయ నుభయంబునకును యతు లలరు ధరన్. 452

అర్థము:- పిలుచుట యందు, రోదనమందు, గానమందు, సంశయమందు ప్లుతముతో గూడిన హల్లులు స్వరములకు, వ్యంజనములకు యతులొప్పును. ఈ నాలుగు విధములు ప్లుతయతులని చిరకాల ప్రసిద్ధి. లాక్షణికులు స్వరములకు మాత్రమే చెప్పినారు గాని వ్యంజనములకు చెప్పలేదు. అప్పకవి గారయితే ఉభయముకు చెప్పినారు గాని వేఱువేఱైన ప్లుత-కాకు స్వరములను ఏకము చేసినారు. దశవిధయతులలోను ప్రసిద్ధమయినది ప్లుతము. మిగిలిన యతులలో ప్రసిద్ధమైనది కాకుస్వరము. బుద్ధిమంతులు పరిశ్రమించితే ఆ యీయి భేదములు స్పష్టముగానే యున్నవి. 453

'దూరాహ్వానము', హల్లుకు:-

వసుచరిత్రము (4-27) :

శా. రాజీవాక్షుల నేచు పాతకివి చంద్రా రాజవా నీవు నీ
రాజత్వంబునఁ జక్రముల్ మనియెనో రంజిల్లి సత్సంతతుల్
తేజంబందెనొ డిందెనో యహితయోద్రేకంబు, నే జెల్ల రే
రాజై పుట్టుట రశ్మిమాత్ర ఫలమా రాజౌట దోషార్థమా 454

పిల్లలమఱ్ఱి వీరన్నగారి శాకుంతలా పరిణయము (3-188) :

మ. జననం బొందితి దుగ్ధవారినిధి నా సర్వేశు జూటంబవై
జనునే ప్రొద్దు ప్రశంససేయ నవతంసంబైతి నీ ప్రాభవం
బునకున్ బాంథజనాపకారి యగు నా పూవిల్తునిం గూడి నా
వని దుష్కీర్తిగఁ దిట్టునం బడకు ఛంద్రా! రోహిణీ వల్లభా! 455

'ఛంద్రా'. అనుచ్చోట్ల. 456

తిమ్మకవి భర్గశతకము:-

మ. కవి విద్వద్ధరణీ సుధాశనవరుల్ కార్యార్థులై యొద్ద దా
సి వడిం జేతులు దోయిలించుకుని యాశీర్వాదముల్ సేయ నె
క్కువ దర్పంబున నిట్టులం గదలకే కొర్మించి నట్లుండ్రుగా
రవశిం దుర్నృపు లేమి యీఁగఁరొ భర్గా! పార్వతీ వల్లభా. 457

అచ్చుకు :-

తిమ్మకవి భర్గశతకము :-

శా. మన్నెల్లం దమ సొమ్మటంచు వసుధా మర్త్యోత్తమ క్షేత్రముల్
గన్నారఁగని యోర్వలేక దిగ మ్రింగం జూతు రల్పప్రభుల్
వెన్నప్పంబులొ బూరెలో వడలొ భావింపంగ బొబ్బట్లొ కా
యన్నా యెన్నఁగ వారి పాలికవి భర్గా! పార్వతీ వల్లభా! 458

'భర్గా' అనుచోట 459

జగ్గకవి సుభద్రాపరిణయము :-

శా. నీహారాంశుముఖీకదంబకమణిన్ నిన్గోరి సన్యాసినై
యాహారాది విహారము ల్మరచి యత్యంతానురాగంబుతో
బాహాలింగన సౌఖ్యవాంఛ మదిలో బాటిల్ల నేనుండుచో
నాహా యిట్లుఁజేసి యేగితె సుభద్రా! భద్ర కుంభస్తనీ! 460

చివర చరణ మందు. 461

భాస్కర రామాయణము (యుద్ధ 41):-

ఉ. ఏ జనకాత్మజం దశరథేశ్వరు కోడల రాముభార్యఁజూం
డో జనులార యడ్డపడరో సురలార సురారికంచు నం
భోజదలాక్షి శైల వన భూములు దాటి విభీతి నేగుచో
నీజలరాశిఁజూచి మతి నెంతఁదలంకెనొ యేమి సేయుదున్. 462

'అడ్డ పడరో' అనుచోట. 463

ఈ పద్యమును లాక్షణికు లందఱు రోదనప్లుత యతికి లక్ష్యము వ్రాసి నారు. వారి తాత్పర్యము- రావణాసురు డెత్తుకు పోవుచున్నాడుగాన రోదనమును

కున్నారు. అప్పకవిగారు- 'భీతి నేగుచో' అనియున్నందున భీతికాకుస్వరముకు లక్ష్యము వ్రాసినారు. 'ఓజనులార, సురలార, అడ్డపడరో' అని పిలుచుటే ముఖ్యమని మాతాత్పర్యము. కుశాగ్రబుద్ధి (గల) సుకవి రాజశేఖరులు ఏది గ్రాహ్యమో దాని గ్రహించవలయును. 464

అందే (అరణ్య. 111):-

శా. అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞానినై వల్కితిన్
నన్నా పాపము వచ్చిచుట్టుకొనియెన్ నా పాలి దైవంబవై
యిన్నీచుం బరిమార్ప వేగఁ బరతేవే నన్ను రక్షింపు మీ
యన్నం గ్రక్కున జీరవే యరుగవే యత్యుగ్ర శీఘ్రంబుగన్ 465

'వేగఁబరతేవే' అనుచోట. 466

ఇది అప్పకవిగారు శోకప్లుత మన్నారు. దూరాహ్వానమని మాతాత్పర్యము. 467

శ్రీనాథుని కాశీ ఖండము (7-161):-

ఉ. వేదపురాణశాస్త్రపదవిన్ నదవీయసియైన పెద్దము
త్తైదువ కాశికానగర హాటకపీఠ శిఖాధిరూఢ య
య్యాదిమ శక్తి సంయమివరా యిటు రమ్మని పిల్చె హస్త సం
ఛ్ఛాదర నీల రత్న కటకాభరణంబులు ఘల్లుఘల్లురన్.

వసు చరిత్రము (2-141):- 468

ఉ. ఓ వసుధాతలేంద్ర కరుణోదధి యీ తడవేల ప్రోవరా
వే వసుభూప యంచు నెలుగెత్తి వెస న్మొఱవెట్టు చాద్పునన్.
(శైవలినీ రవం బెసఁగె శైవలినీ నినదంబు కన్న ము
న్నావిలభూరి వారి విహగారవగౌరవ మెచ్చె నెల్లెడన్). 469

కళాపూర్ణోదయము (4-116) :-

మ. అకటా యేమని దూఱుదాన నిను నాథా వేఁగు జామయ్యెఁ (బొం
దికఁగాఁ బాదములొత్త రమ్మనుట గానీ యొంటియేమో కదా
నికటక్షోణికి నేగుదెమ్మనుట గానీ కొంత నెయ్యంపుఁ బా
నికతోఁగన్నులు విచ్చిచూచుటయు కానీ లేద యొక్కింతయున్), 470

'రోదనము', హల్లుకు:-

భీష్మపర్వము (8-516) :

క. నీ చెలువును నీ బలువును
నీ చతురత నీ బలంబు నీ సాహసమున్
నీ చక్కఁదనము నేనే
రాచూలికిఁ గలుగనందురా రా కుఙ్ఞా. 471

చివర చరణమందు. 472

ద్రోణపర్వము (2-242) :

ఉ. హాయను ధర్మరాజతనయా యను నన్నొదఁబాయ నీకుఁ జ
న్నే యను దల్లి నేచఁ జనునే యను గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటి నేగఁదగవే యను నేగతిఁ బోవు వాఁడనే
నో యభిమన్యుఁడా యను ప్రియోక్తుల నుత్తరఁ దేర్చవే యనున్. 473

తిమ్మకవి అచ్చతెనుఁగు రామాయణము (అయో 89) :

ఉ. రా యనుగా యనుం దొగల రాయనిఁ గేరు నిగారపుం గొటా
రా యను మేటి నాడెపు దొరా యను గిన్కయొనర్చెదేమి మే
రా యను నింపనీకుఁ గనరా యను దయ్యము పాటిఁదప్పెనొ
రా యను గన్నవారు నగరా యను నిప్పుని మానరా యనున్. 474

అందే (అయో. 90) :

ఉ. కా యిది నేటి తప్పు కొడుకా యను నిద్దపు పూతమామిటో
కా యను బంజరంపుఁ జిలుకా యను నబ్రపు సోయగంపు బ్రో
కా యను బల్కవేమి యలుకా యను బంతము డిఱెనోటు కై
కా యను నేరయిట్లు దుడుకా యను బాయఁగ గోలికా యనున్. 475

ఈ పద్యములందు దూరాహ్వానాదుల జెప్పరాదు. ఈ పద్యములకు పై పద్యము నందు 'వేఁడొ వేడి వెలుంగు వెంగడపు రే వెల్గించు బిట్టేడ్చుచున్' (అయో. 88) అని స్పష్టముగా నున్నది. అనేక విధములు విలాపించుట లోక ప్రసిద్ధమున్ను మరియును— (అందే) 476

ఉ. దాయను గెల్చుటెంకఁ గలదా యను రాచకొలంపు గల్వ విం
దా యను నాడెమైన బిరుదాయను రక్కసి కార్మొగుల్ల యీ
దాయను బీరమూన వలదా యను బిల్చిన నాలకింప రా
దా యను బన్నమొందతి గదా యను నీకును నంగదా యనున్.
(యుద్ధ. 399) 477

ఉ డాయ నదేల రావు తెగఁడా యను నెక్కటి చివ్వ గెల్పుకాఁ
డా యను ముద్దురా కొమరుఁడా యను మేలిగొనంబులూను ప్రో
డా యను సోయగంపు మరుఁడా యను నెన్నిక గన్న నేల ఱేఁ
డా యను మేటి జెట్టి మగఁడా యను బల్కర తమ్ముఁడా యనున్
(యుద్ధ. 400) 478

శ్రీరామమూర్తి ధీరోదాత్తుడైనప్పటికి సహోదరుని యందు దయార్ద్ర హృదయుఁడుగాన కారుణ్యమున రఘుక్ష్మావరేణ్యుని బోలి... అనికరుణాకరులలో శ్రీరామమూర్తి కన్న నెవరును లేరు గావున నిచ్చట కరుణరసము కవి వర్ణించు టలంకారమే. 479

గీ. అంత నచ్చట రాచూలి నంతఁ బెరయఁ
దోడ బుట్టువుఁ గాడిన తూపు వెతికి
వైచి క్రొవ్వేది కన్నీరు వఱద వాఱఁ
బలు దెఱంగుల నిట్లని పలువరించె (యుద్ధ. 391) 480

అని కవి సార్వభౌముడే స్పష్టము చేసినారు. మరియును :-

ఉ. మా యనుఁగుం జెలి న్వెదుకుమా యను వొప్పఁ దుటారి చిల్క లే
మా యను గందు దేటి కొదుమా యను నిద్దపు ముద్ద చందమా
మా యను జుట్టు పుల్గు తుటుమాయను గద్దఱికాఱు బింకమా
మా యను నింక నోర్వఁదరమా యను నక్కట దయ్యమా యనున్.
(అరణ్య. 86) 481

ఉ. పాయను నేరమేమి బలుపా యను నాడెపు ప్రోదరాచ పా
పా యను గుందనంపు మెఱుపా యను బూవిలుకాని వాలు దూ
పా యను బల్కవేమి దిసపాయను బంటవలంతి ముద్దుకా
న్పా యను నిట్టులింత మఱపా యను నీకిది నేరుపా యనున్ 482

అంబరీష మహారాజును, ఆయన పుత్రికైన శ్రీమతి యందు నారద పర్వతులను దేవమునులకు అనురాగోదయమై, ఉభయులు తమ కిమ్మని కోరితే, శ్రీమతి యెవరిని వరించితే వారికి వివాహ మొనరించుతానని అంబరీషుడనగా, శ్రీమన్నారాయణమూర్తి వద్దకు వెళ్లి శ్రీమతి చూపులకు ఒకడు కోతియు,నొకడు కొండముచ్చువలె కనిపించేలాగు చెయ్యమని ప్రార్థించితే, ఆ ప్రకారమే భగవంతులు వరమిచ్చినందున, శ్రీమతి వరించనందున, శ్రీమన్నారాయణమూర్తి యెవరెఱుంగకుండ (శ్రీమతిని) పాణిగ్రహణము చేసి వైకుంఠముకు తీసుకు వెళ్లితే, భగవన్మాయ తెలియనేరక, రాజు తమను వంచించినాడనుకుని, యిద్దరు మునులు 'మోహము నిన్ను కళ్మలము చేసుగాక'యని శపించితే, మునిశాపము కొట్టివెయ్య (రాని) దనిన్ని, అంబరీషుని యందున్న దయచేత రాజుకు శాపము తగులకుండగ, 'ముందు నేను దశరథపుత్రుడ కాగలను. అప్పుడు నన్నావరించు'మని ఆ శాపమును మరలించి, యిపు డవలంబించి కాముకాగ్రణి వలె నటించినాడు (శ్రీ మన్నారాయణావతారమైన శ్రీరామ చంద్రమూర్తి ) ఇది లింగ పురాణ ప్రసిద్ధి. 483

జగ్గకవి సుభద్రాపరిణయము :-

చ. కనుగవ నశ్రు బిందువులు గ్రమ్మఁగ గద్గదకంఠియై మొగం
బునఁ గడు విన్నబాటొదవ ముప్పిరి గొన్వలవంతఁ బల్కెనో
జనవరచంద్ర యో నయవిశారద యో జనరంజనైకశో
భనతరరూప యో ఘనకృపా యిటులాన తిడంగఁ జెల్లునే. 484

'ఘనకృపా' యనుచోట రోదన ప్లుతము. అందదును వర్గయతి యనుకుందురు. పవర్ణముపై ప్లుతమున్నది గాన వర్గముకాదు. ప్లుతమైనా దూరాహ్వానమనరాదు, నాయక సమీపవర్తియై యున్నదిగాన, గానప్లుత మనరాదు. ( ఎందుకనగా) 'కనుగవ నశ్రు బిందువులు గ్రమ్మఁగ గద్గదకంఠియై మొగంబునఁగడు విన్నబా టొదవ ముప్పిరి గొన్వల వంత...' ఈ పదములచేత రోదనమే ముఖ్యము (గాన). వ్యాజస్తుతి యనే కాకుస్వరయతి యనరాదు, నాయకునికి కరుణ పుట్టుటకై వచించుచున్నదిగాన. కరుణారసమునకు శోకము స్థాయీభావము.

'శృంగార హాస్యకరుణా రౌద్రవీర భయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చ రసాః పూర్వై రుదీరితాః॥
రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయ శమాః స్థాయీ భావాః ప్రకీర్తితాః॥

ఈ లాగున నని అలంకార శాస్త్రము. నాయికలు నాయకులకు దయవచ్చే కొఱకు శోకించుట లోక ప్రసిద్ధమున్ను. 485

అచ్చుకు :-

ఆరణ్య పర్వము (5-177) :

గీ. ఒక్క దనుజాధముఁడు మొత్తోయనంగ
నను( జెఱఁగొని పోయెడు నన్నలార
యెవ్వ రిట విడిపింపరే యింత వట్టు
పుణ్యమునఁ బోవరయ్య కారుణ్యబుద్ధి. 486

చేమకూరవారి సారంగధర చరిత్రము (3-86) :-

ఉ. రంగదపారమోహ జలరాశి మునింగి రహిం దొరంగి ర
త్నాంగి యొకింత సేపునకు హా సుకుమార కుమార నేడు చి
త్రాంగికి నప్పగించు కొఱకా నవమాసములుం భరించి వే
డ్కంగని నిన్నుగూరిమి గడల్కొన గోముస నెత్తి పెంచుటల్ 487

మూడవ చరణమందు 488

అందే (3-88) :

శా. నిన్నున్ సద్గుణవంతుఁ డంచు నెపుడు న్వేనోళ్ల మెత్తుంగదా
యన్నా నేడిది యేమి చేసితివి యేలా పుట్టె నీ మర్లు నీ
కిన్నాళ్లే నిది చెల్లఁబో జనని గా దే యల్ల చిత్రాంగి దా
నన్నుం జూచిన కంటఁ జూడ వలదా నామాటుగా నాయనున్. 489

రెండవ మూడవ చరణములందు 490

ప్రబోధ చంద్రోదయము :

సీ. ఏ జెంత బోధించె నే తల్లి నిన్ను కా
గాని పాషండ సంగతుల మెలఁగ
నే బొడ్డి బోధించె నే యింత విడనాడ
తల్లి నీ కుపనిషత్తరుణి తోడ
నే దండ యెడఁబాపె నే తల్లి నీకు నా
మీఁద హత్తిన కూరిమియును గృపయు
నే లంజె భ్రమియించె నే తల్లి నిన్ను స
ద్ధర్మ మోక్షము లబద్ధంబు లనుచు

నంచు దుఃఖించుఁ గన్నీరు నించు దిశలు
గలయ వీక్షించుఁ గానక కలవరించు
నించు కించుక గమకించుఁ జంచలించు
తల్లిమొఱుగుడు లేగ చందమున మఱియు. 491

గానప్లుతము; హల్లుకు :-

ఆనుశాసనిక పర్వము (3-180) :-

క. వ్యాకరణ ధర్మ శాస్త్ర వి
వేకములు బురాణ జాత వేదిత్వము బ్ర
హ్మైకత్వ బోధనము నధి
పా కలిగినవారు పజ్క్తి పావనులు గడున్ 492

వసుచరిత్రము (2-3) :

ఉ. ఆ యెడ నొక్క నర్మసచివాగ్రణి యిట్లను నో యఖండ తే
జోయుత యద్భుతం బొకటిఁ జూచితె చూపితె నీకు నాదు చే
జాయనె చూడు మాత్రమునఁ జక్కఁగ నల్లదె నల్లమబ్బులో
బాయవు కొన్ని మ్రాకులు నృపా యవుజమ్మవి నాకభూజముల్ 493

చివరి చరణమందు 494

అందే (5-18) :

మ. మనముల్ వాహనముల్ వదాన్యమణి యాకల్పంబు కల్పాగముల్
వనముల్ వేలుపుగిడ్డి దొడ్డి పసి దేవా నీకు పాదార్ఘ్య మి
త్తునొ రత్నాంజలి యిత్తునో యలరుటెత్తుల్ దివ్య సద్వస్తు లి
త్తునొ నీవేమిట మెత్తు వేమి దగ నిత్తున్ భక్తపూజాప్రియా 495

చేమకూరవారి సారంగధర చరిత్రము (2-108) :

మ. వలదమ్మా యిటువంటి కానిపను లో హామాక్షి యీ వెఱ్ఱి బు
ద్ధులు నీ కేల ఘటిల్లె నమ్మ తెగువన్ దుర్భాష లిట్లాడి యీ
కొల నాకేటికిఁ గట్టెదమ్మ మరి లోకుల్ విన్న నేమందు ర
మ్మ లఘుత్వంబుగఁ జూతురమ్మ దగదమ్మా ధర్మమూహింపుమా 496

గానప్లుతము (అనగా) స్తుతించుట యని కొందఱు, 'తనరీ' యని సంగీత మందని కొందఱు నందురు. అటు లనరాదు. భక్తి, గౌరవము, వాత్సల్యము, అనురాగము- ఈ మొదలైన వాటిచేత, ననగా తద్ధర్మ ప్రతిపాదక శబ్దములచేత సంబోధన మాత్రమున గానప్లుతము. 497

అచ్చుకు:—

వసుచరిత్రము (5-21) :

మ ఆన నింద్రుండను లాఁతిరీతి నచలేంద్రా యేల యిట్లాడ నీ
జనకుం డధ్వర భాగభోక్త యనిమేషశ్రేణిలోఁ బెద్ద త
త్తన (యగ్రామణి) వైన నీకు నరుదే ధాత్రీధరేంద్రాభినం
ద్య నితాంతోన్నతి కీర్తి వైభవము మేనా శుక్తిముక్తామణీ. 498

అందే (4-101) :

మ నిను భాగ్యాక్షరపఙ్క్తిగాఁ దలఁతునో నిర్వేల మూర్చాపనో
దన దివ్యామృత ధారగా మనమునం దర్కింతునో కాక మ
ద్ఘన పుణ్యద్రుమ కోరికావలియ కాఁగన్గొందునో ప్రేమ నే
మని వర్ణింతుఁ బ్రియాపయోధరవిహారా హారవంశోత్తమా 499

అందే (3-61) :

చ. అనఁ జనకర్త వల్కు ముదితా విదితాతను మంత్రజాలు ని
మ్మునిఁ గొనియాడ శక్యమె సముజ్జ్వల రూపకలాపయైన మీ
యనుఁగు వయస్యఁగాంచు సుకృతాతిశయం బవలీలఁ గూర్చె నీ
యనఘుఁ డితండు మాకుఁ బరమాప్తుఁడు గాక మునీంద్రమాత్రుఁడే 500

అందే (2-91) :

చ. అన మునిరాజు వల్కు వనితా జనతా వినుతాభిధేయుఁడై
యొనరిన (గౌతమున్ మునికులోత్తముఁ జెప్పఁగ వింపరేకదా
యనఘ తదన్వవాయ కలశాంబుధిఁ బుట్టినవాఁడ గౌతమా
ఖ్యనెసఁగువాఁడ నే (బరమ హాసరస ప్రతిభానుభావుఁడన్) 501

శ్రీనాథుని నైషధము (8-191) : 501

మ. ఇదె వీక్షింపు చకోర శాబక నిశాక్షీ దీర్ఘికాహంసి యీ
యుదకాంతః ప్రతిబింబితున్ గగన మధ్యోపస్థితున్ జంద్రుని
న్మది దర్శించి నిజాధినాథుఁ డనుచు న్వాత్సల్య మేపారఁగాఁ
జదురొప్పం బరిచుంబనం బొనరించెం జంచూపుటాగ్రంబునన్. 502

మనుచరిత్రము (1-68) :

శా. ఏ యే దేశములం జరించితిరి మీ రే యే గిరుల్ సూచి నా
రే యే తీర్థములందుఁ గ్రుంకిడితి రే యే ద్వీపముల్ మెట్టినా
రే యే పుణ్యవనాలిఁ ద్రిమ్మరితి రే యే తోయధుల్ దాసినా
రా యా చోటులఁ గల్గు వింతలు మహాత్మా నా కెఱింగింపరే. 503

అందే (1-65) :

క. నావుడు ముని యిట్లను వ
త్సా విను మావంటి తైర్థికావలి కెల్లన్
మీవంటి గృహస్థుల సుఖ
జీవనమునఁగాదె తీర్థసేవయుఁ దపమున్. 504

చేమకూరవారి సారంగధర చరిత్రము (2-121) :

ఉ. నావుడు నిట్లు వల్కు జననాయకుఁ డీ వెడ మాట లేల త
ల్లీ వినవమ్మ యీ జగము లెల్ల సృజింప భరింప నొంప జా
ల్దేవత లెట్లు వర్తిలిన లెస్సవుగా కివి చెల్ల వొడ్డకున్
నీ విపుడన్న రంభరతి నీగతిఁ బుత్రుల బల్మిఁ బట్టిరే. 505

అందే (3-93) :

మ. అని శోకింపుచునున్న తల్లిఁ గని యమ్మా నేను చిత్తాంగి న
ట్లనె నీ మాఱుగనే దలంపుదు మరు ల్వాటిల్లి యాయమ్మ న
న్నెనయంగోరిన నియ్యకోక...కే నేతెంచితిం గాని పా
వని యే దోషము నేనెఱుంగను మనోవాక్కాయ కర్మంబులన్. 506

'కొనక' అను శబ్దమునందు నకారము లోపమై 'కోక' అని యున్నది. 507

చాటుధార :—

శా. కాండావిర్భవ ఖాండ భూపరివృఢ గ్రైవేయ శైలేయసూ
కాండాటాధిప కేతుమాతుల బలాకాశ్రవంతీ మరు
త్కాండాఖండలతుండి పాండురయశః కర్పూర పేటీ భవ
త్కాండా రాయనమంత్రి భాస్కరుని కొండా దండనాథాగ్రణీ! 508

కొందఱు లాక్షణికులు, గానప్లుతమనగా, స్తుతి చేయుట యందు వచ్చిన దని యీ పద్యము (లక్ష్యముగా) వ్రాసినారు. స్తుతి యంతయు 'పేటీ భవత్కాండా' అనుట తోడనే సరిపోయినది. 'రాయన మంత్రి భాస్కరుని కొండా' అని సంబోధన మాత్రమే యున్నది. స్తుతి యందే గానప్లుతమయితే 'అమ్మా, తల్లీ, వనితా, ముదితా, వత్సా—' ఈ మొదలయిన వాటియందు నేమి స్తుతి యున్నది? (కావున) గానస్తుతి యందు (మాత్రమే) గానప్లుతమనుట బాగు లేదు. 509

చేమకూరవారి విజయ విలాసము (1-89) :

ఉ. నావుడు మోమునన్ మొలక నవ్వొలయన్ వలగబ్బి గుబ్బచన్
ఠీవికిఁగా నోకించుక నటింపఁ గవున్ గనుపింపఁ బల్కె రా

జీవదలాక్షి యో రసికశేఖర యో జనరంజనైక లీ
లావహరూప యో నుతగుణా తగునా యిటు లానతియ్యఁగన్ 510

చివర (చరణ మందు). కొందఱు లాక్షణికులు (దీనిని) శోకప్లుతముకు లక్ష్యము వ్రాసినారు. 'మోమున మొలకనవ్వ...'అని చెప్పుచుండగా శోకమనుట చిన్ని పూదేనె (ను)కారమను బెట్టిదో, యిదియు నట్టిది. ఈ పద్యముకు పద మూడవ పద్యమందు కరుణరసము కనుపించు చున్నది. 511

చేమకూరవారి విజయ విలాసము (2-193) :

క. ఏలే శైలేయస్తని[1]
యేలే ప్రాలేయకరముఖీ యేలనయో
యేలే యా లేఖ్యాకృతి
యేలే బాలేందు నిటల యేలాతి నడే 512

తిమ్మకవి రసికజన మనోభిరామము :-

క. ఏమే యామేచకకచ
యే మే వామేక్షణా మణీహేమఘృణీ
యేమే సోమోపమ ముఖి
యేమే మోమెత్తి చూప కిటు లేతురుటే. 513

తారాశశాంక విజయము (2-46) :

మ. అనినన్ సంతస మంది గీష్పతి కుమారా యత్రి గర్భంబునం
జననం బొందిన నీకు నీ వినయమున్ సౌజన్య మర్యాద వ
ర్తన మంచన్మధురోక్తులుం దలఁప వింతల్ గావు రాజత్కళా
ఖనివై యొప్పెడు నీవు శిష్యుఁడగు భాగ్యం బెన్న సామాన్యమే. 514

ఆనుశాసనిక పర్వము (2-393) :-

ఉ. ఆ నగనాయకుం డొక మహాధ్వర మెంతయు వేడ్కఁ జేయఁగా
బూని మహీసురావలికిఁ బూజ యొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం

1. ముద్రితప్రతులందీ పద్యపు ద్వితీయపాదములు వ్యత్యస్తముగా నున్నవి.

దై నయమారఁగా ననలుఁ దాతని పాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదు పుత్రుఁ గృప యేర్పడ దానముగాఁగ నావుడున్. 515

ఈ పద్యమును అప్పకవిగారు గానప్లుతముకు లక్ష్యము వ్రాసినారు. దూరాహ్వానము మాత్రము స్వకవిత్వము. అచ్చులకు హల్లులకు లక్ష్యము వ్రాసినారు. మిగిలిన వాటికి స్వరములే వ్రాసినారు గాని వ్యంజన మొకటియు వ్రాయలేదు. (పై పద్యమందు చివర చరణమున 'ఏర్పడ' అని యున్నది. 'వేర్పడ' అని హల్లున్ను (ఆదినున్నది) గలదు. ఇక్కడ 'ఈవే' అని కాంక్షించుట కనుపించుచున్నది. 516

వసుచరిత్రము (4-83) :-

ఉ. ఏమిటి కల్గితే కువలయేక్షణ పల్కవదేటికే వధూ
టీ మణి నీవు రాఁ గడిఁది డెందము పూనితివే లతాంగి య
య్యో మనసారఁ దావక పయోధరపాలి దృఢాంకపాలి యీ
వే మృదువాణి నీకు నొక యెగ్గును జేయఁగదే తలోదరీ. 517

చివర (చరణమందు) 518

రాజశేఖర చరిత్రము (2-4) :-

శా. కేలీ కాంచన సౌధ వీధికల చక్కం దొట్టి లోఁబెట్టి యో
ప్రాలేయాచల కన్యకాధవ కృపా పారంగతా నిద్రవో
వే లావణ్య పయోనిధీ యనుచు నావిర్భూతమోదంబుతో
జోలల్పాడుదు రక్కుమారకునకున్ శుద్ధాంత కాంతామణుల్. 519

స్పష్టముగా తెలియగలందులకు నిన్ని లక్ష్యములిచ్చినాము. 520

"సంశయము" హల్లుకు :-

వసుచరిత్రము :-

ఉ. తొంగలి ఱెప్పలం దొలఁగఁ ద్రోయుచుఁ బైపయి విస్తరిల్లి క
న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రుదు నటంచుఁ బోవ నీ
కంగఁ బుఁ దానపెట్టి కదియం గుఱివ్రాసె ననంగ జాఱె సా
ధంగ మదంబు లేఁతెమట క్రమ్మ లలాటము డిగ్గి చెక్కులన్ 521

అస్మదీయ 'గోపికా హృదయలోల' శతకము :-

సీ. భామ నాపయినిఁ గోపము బూను టరయ మ
నము గనుఁటకొ లేక నవ్వుటాల
కో కాక నన్నుఁ జిక్కులఁ బెట్టుటకొ జడి
పించుటకో లేనివి గలిపించి
చెలులు చెప్పుటనొ వంచించుటకును నన్ను
లంచంబు చాల వలసిన వేల
నిడకుండు టను జేసి యింతెకా కను మత్త
కోకిలాలాప నిక్కువము వినుము

స్వప్న మందైన నీయాన భద్రయాన
దాటగలవాఁడనే నను దయను జూడు
మనుచు బతిమాలు నిన్నెన్న నలవె మాకు
మదనగోపాల! గోపికా హృదయలోల! 522

రెండవ చరణమందు (మొదటి యతి) 523

అస్మదీయ 'రామచంద్ర' శతకము :-

సీ. తల్లిదండ్రుల మాడ్కిఁ దద్దయు భక్తిచే
మిముఁ గొల్చుచుండు సౌమిత్రి నటులు
ననరాని వినరాని యా మాట లాడుట
సపరివారంబుగ సకల లోక
కంటకుఁడగు దశకంఠునిఁ ద్రుంచుట
కో లేక నారుల గుణము లిట్టి
వని తెల్పుటకొ నిర్ణయము గానఁగారాదు
[కల నిజ] మెవరైనఁ దెలియఁ గలరె

యని పురాణముల్ దెల్పుచో నఖిల భువన
జాత విఖ్యాత సద్గుణాపేతయైన
సీత చేతంబు తెలియ దెరీతిఁ గలుగు
రమ్య...................... 524

మూడవచరణమందు రెండవయతి 525

అచ్చుకు :-

విరాటపర్వము (2-84) :

ఉ. చిత్తము మెచ్చినా వలనఁ జిక్కఁగ వెండియు నాలతాంగి య
చ్చొత్తిన యట్లు నాకుఁ దన యుల్లముఁ దెల్లము చేయకున్కిఁదా
నత్తరిఁ గ్రొత్త కాన్పగుట నద్దము సొచ్చిన సిగ్గుపెంపు న
న్నుత్తల మందఁ జేయుటకునో తల పోసి యెఱుఁగ నయ్యెదన్ 526

శ్రీనాథుని నైషధము (4-65)

చ. హరి హయుఁ డేమి యయ్యెనొకదా మదనానలతాప వేదనన్
(వరుణుఁడు విప్రయోగమున వాడఁడె యింతకు, దండపాణి తా
విరహభరంబున న్మిగుల వేగఁడె, నొవ్వఁడె వీతిహోత్రుఁడున్
బరిసరకేళి కానన సమాగత మంద సమీరణంబులన్) 527

చేమకూరవారి సారంగధర చరిత్రము (2-68) :

ఉ. పాయక మోహ తాపమున భామిని యుండఁగ నందు మీఁద నేఁ
డీ యెడ హానివచ్చునని యెంచక యూరక పిట్టరేపు నే
యీయన రేచ వచ్చునొకొ యిచ్చనె వచ్చెనొ యమ్మచెల్ల యే
నో యిది కారణంబనుచు నూహలు సేయుచుఁ గ్రోదచేడియన్. 528

శ్రీనాథుని కాశీఖండము (4-191) :

సీ. ప్రతిబింబమోకాని రజనివల్లభున క
ధ్యాహారమోకాని యమృతరుచికి
వినిమయంబోకాని వధున కన్యాదేశ
మోకాని యత్రి నేత్రోద్భవునకు
పిప్పయోకాని పూవిలుకాని సఖునకు
నామ్రేడితమొ కాని యబ్ధిజునకు
నభిధాంతరమొకాని యరవిందవైరికి
స్వారూప్యమోకాని ఛందధునక్కు

ద్రుమిడి యాడ్చినవాఁడు భర్గుని కిరీట
కోటికాభరణంబైన కువలయాప్తు
మిగులఁ జక్కని కొడుకంద్రు మింట నడుమ
గ్రహములం దీతఁ డెవ్వఁడో గణములార 529

రెండవ చరణమందు రెండవ యతి. 530

*స్వరయుగ యతి (ప్లుతయుగయతి) :-*

**లక్షణము :—**

గీ. వ్యంజనము లేవి యైనను వాటితలను
గలుగు కాకుస్వరప్లుతములకు మైత్రి
దనరి స్వరయుగయతి యన నొనరు సుకవి
కృతుల సంస్ఫూర్తి శ్రీకుక్కుటేశమూర్తి. 531

అర్థము :- కాకుస్వరములకు ప్లుతమునకునైనా, ప్లుతముకు ప్లుతమునకు నైనా, కాకుస్వరమునకు కాకుస్వరమునకునైనా, కేవల స్వరములకే యతి చెల్లును. అప్పకవిగారు ఇదే ప్లుతయుగయతి యన్నారు. 532

"క. తా మే వర్ణములైనను
ఝామండలమునను ప్రాణమైత్రి గలిగినన్
దామోదర ప్లుతయుగ వి
శ్రామము లనఁగాఁ బ్లుతాక్షరద్వయ మమరున్" 533

(అని లక్షణము వ్రాసి) అప్పకవిగారు

వజ్రపంజర శతకము :

ఉ. శ్రీ గజగామినీమణిని సీతనుగా నిరపాయిఁగాఁ ద్రిలో
కీ గృహమేధిగా గరుడకేతనుగా భవరోగవైద్యుఁగా
నా గురువాన నిన్నె మది నమ్మితి వేఱొక వేల్పుఁగొల్వ నీ
వే గతి కావవే రఘుపతీ శరణాగత వజ్రపంజరా ! 534

(అను) ఈ పద్యమును మాత్రము లక్ష్యము వ్రాసినారు. 'నీవే' అను చోట తాము నిర్ణయించిన భీతి, శోక, తర్క, గీత, దూరాహ్వాన, సంశయములు కనుపించవు. 'నిశ్చయ' మనే కాకుస్వరము స్పష్టముగా నున్నది. 'రఘుపతీ' (అనుచోట) దూరాహ్వానము. కాకుస్వర ప్లుతములకు యతి. మరియు ననేకము లుగా గలవు. 535

విరాటపర్వము (2-212) :

క. మాయరవి యేల గ్రుంకడొ
కో యను నిట్టేలఁ దడసెనో యనుఁ గ్రుంకం
బోయెడుఁ బొమ్మిప్పుడ యను
దాయవలచె నను మనోజ తాపముపేర్కిన్. 536

చేమకూరవారి సారంగధర చరిత్రము (1-84) :

శా. 'లేలే భోజన మేటి కొల్ల విటు లే లే మేన బల్సొమ్ములే
వే లే పూనవు వెల్లఁబాఱె మొగమే మీ రాజుతో...' 537

రెండవ చరణమందు రెండును ప్రశ్నలు. 538

హరిశ్చంద్రోపాఖ్యానము (4-143) :

క. కౌశిక సంయమి మాయా
పాశంబును జేతఁ గట్టువడితిమి మదిలో
లేశము ధైర్యము వదలకు
డీ శాశ్వతకీర్తి సత్యమే యొనగూర్చున్. 539

నిబోధకత-నిశ్చయము (చివరి చరణమందు) 540

తారాశశాంక విజయము (4-78) :

శా. ఔనే ముద్దులగుమ్మ కల్కి తగునే యందంపు పూరెమ్మ హా
దానే చక్కదనాల యిక్క యడియౌ నబ్జాస్త్రు చే ధక్క మే
రే సీలాలక యంచు నే బొగడ నెంతే వింత పుంభావకే
ళీ నాట్యంబున నన్నునేలిన వగన్ నేనెంతుఁ గాంతామణీ ! 541

రెండవ చరణమందు శ్లాఘకు, నమితముకు. 542

జగ్గకవి చంద్రరేఖా విలాపము (2-21) :

క. నా వగ నా యొసపరినడ
నా వాలుం చూ పు కోపు నా మాటల తీ
రావంతయు నీ వెఱుఁగవు
గా వన్నెలెగాని కూతురా యిది మేరా ॥ 543

(చివరి చరణమందు) నిబోధకత, గానప్లుతము. 544

అస్మదీయ 'రామచంద్ర' శతకము :

సీ. ధనమె సమస్తసౌఖ్యనిధి కీర్తికరము
ధర్మమూలము గుణస్థానకంబు
ధనవిహీనుఁడును జచ్చినవాఁడు నొకటని
సౌమిత్రి మిముఁగూర్చి చాల చెప్పె
నప్పటిదశకొద్ది నప్పండితుఁడు చెప్పు
టేకాక నది సత్యమే తలంప
మీరు నెమ్మి వశిష్ఠగారితో విన్నవిం
చిన వచనమ్ములు సిద్ధమయ్యె
రాజ ప్రకృతివలెను మాధురాలు లక్ష్మి
పార్శ్వమందున్న వానినే పట్టుకొనును
సుగుణ దుర్గుణములు మదిఁ జూచుకొనక
రమ్య......... 545

మూడవచరణమందు నిశ్చయము, వ్యంగ్యము 546

అస్మదీయ 'కుక్కుటేశ్వర' శతకము :

'హర చంద్రశేఖర నారాయణాస్త్ర భ
ర్గా మహాదేవ భీమా కృపాబ్ధి......' 547

రెండును దూరాహ్వానములు. మొదట నసమాసయతి. స్వరయుగ విరామము నెవరు నెఱుంగరు. 548

స్వరయతులు, వ్యంజనయతులు, ఉభయయతులు వివరించదమైనది. 549

1. ము. ప్ర : 'నీ వెఱుగవ, హా వన్నెలకాని కూతురా...'

## -: ప్రాస యతులు :-

ప్రాసయతులు :-

లక్ష్యములు :-

ఆనుశాసనిక పర్వము (3-175) :

సీ. జూదరి గరదుండు వేదంబు జదువని
 వాఁడు వడ్డికి నిచ్చువాఁడు గాయ
కుండు గ్రామము పని గుడుచు నాఁతడు గృహ
 దాహి కష్టముగల తనువునాతఁ
డఱ దెవుల్గొన్నాతఁ డఖిల వస్తువులను
 నమ్మెడు నతఁడు సోమమ్ము విక్ర
యించిన యతఁ డబ్ధి సంచార లాభోప
 జీవకుం డుర్వీశ సేవకుండు
భార్యయును దాను బుత్రులు పంచికొన్న
వాఁడు పసులఁబెక్కేలెడు వాఁడు కపట
కృత్యముల మృచ్ఛిలిని శిల్పకృతుల బ్రతుకు
వారు బఙ్క్తిదూషణు లండ్రు గౌరవేంద్ర ! 550

(ఒకటవ, నాలవ చరణములందు మొదటియతులు, మూడవ చరణమున రెండవయతి, గీతము నాలవచరణమున-మొత్తము) నాలుగు ప్రాసయతులున్నవి. 551

ప్రాసయతులు (ఆది) ప్రాసనియమముగల పద్యములకు చెల్లవు. గీత పద్య సీస పద్యములకు చెల్లును. 552

# సుకవి మనోరంజనము

## చతుర్థాశ్వాసము



శ్రీ భారతీశ సన్నుత
భా భా ద్భవహ నామ లింగ పంచపృషత్క
ప్రాభవ తూలాపహచ
త్పూ భవ దగ్నిస్ఫులింగః కుక్కుటలింగాః 1

### -: రేఫ శకటరేఫలు : లాక్షణికుల పొరబాటులు :-

గీ॥ [1]అవధరింపుము; కాకునూర్యప్పసుకవి
హిమకరాదుల గురు లఘు రేఫములను
నుభయరేఫాలి నేర్పాటు నొనరఁజేసి
రందుఁగల పొరపాటు లుదాహరింతు. 2

కాకునూరి అప్పకవిగారు ఆంధ్రశబ్దచింతామణి యందు :-

గీ॥ రేఫము అకారమును నన రెండు తెలుఁగు
లగుచు వికృతి పదంబుల నమరియుండు
దాని సంస్కార పూర్వకావ్య ప్రయోగ
సరణి తెలుఁగగవలయు సజ్జన విధేయ (2-198) 3

---

1. ఈ ఆశ్వాసాదినుండి 28 (వచనము) వరకు 'ఇ-ప్రతి' నుండి గ్రహింప బడిన భాగము. (చూ. 'సమాలోకనము' - మూలప్రతి).

సీ॥ శ్రీ కామెపల్లి పురీ గోపికాజార
యసుర సంహార నీ కంకితముగ
నాద కవీంద్ర కావ్యములెల్ల శోధించి
క్రమత హ్రస్వములు దీర్ఘములునైన
యచ్చుల మీఁదను హల్లుల మీఁదను
గలుగు రేఫ ఱకారములు వచింతు
తాళ్ళ పాకాన్వయోదధి పూర్ణ ధవల ధీ
ధితి పెద తిరుమల దేశికుండు
మొదలైనవారలు మునుపు రచించిన
యవియెల్ల చాలవా యనఁగ వలదు
వెండియు నొకకొన్ని వెదకి కూరుతుఁ గవి
రాజులు మేలని ప్రస్తుతింప............ (2-196) 4

అనిచెప్పి, రేఫముల కొకసీసమాలిక, ఱకారముల కొక సీసమాలిక చేసినారు. రెండును పరిశీలించితే, రేఫములందు ఱకారములును, ఱకారములందు రేఫములును గలసినవి. ఉభయరేఫములని వ్రాసినవి ఉభయరేఫములుగావు. 5

"అరుగుట-పోవుట, చెఱచుట, తెఱఁగులు, తొఱఁగుట, తొఱలుట, నెరసులు విస్తరించుట, పరిగొనుట, పరిచనుదెంచుట, పరిమెయి, పరవకటి, పరిమార్చుట, పెరుగుట, క్రమ్మఱ, మఱదలు—ఇవి కుఱుచలమీఁది రేఫ, ఱకారములు రెండు నగును. 6

ఆరుట = శమించుట, తీరనికినుక, తీరులు, పోర నీరయిపోవుట, మారి మసఁగుట, వేమారు—ఇవి దీర్ఘములమీది రేఫ, ఱకారములు అని వ్రాసినారు. (మరియు) 'అరుగుట' గురురేఫమగుటకు (ఉదాహరణముగా) :—

మౌసల పర్వము (1-169) :

క. మఱునాఁడ యగుట లెస్సగ
నఱిగి యినుం డపుడు వేఁడి యడిరిన దీప్తుల్
తుఱఁగలి గొని పశ్చిమగిరి
చఱికి ననతి దూరుఁడై విశదుఁడై తోఁచెన్ 7

(అను పద్యము వ్రాసినారు). రేఫ, అకారములు రెండును ఈ యొక పద్యమువలన నెటుల తెలియవచ్చునో తెలియరాదు. సరెకదా, ఈ పద్య మైనను-పామరులకును తెలియవచ్చెడు తప్పుశబ్దము-అనగా, ఆ శబ్దమేలేని లక్ష్యము వ్రాసినారు. శ్రీకృష్ణమూర్తి వనమునందు శరీరమును వదిలిన పిమ్మట నర్జునుఁడు నక్కడికి వెళ్ళి విచారించుచున్న సమయమందలి పద్యము (ఇది). ఈ పద్యముకు పై పద్యములు, క్రిందిపద్యమును, ఇదియును పరిశీలించితే సుల భముగానే పొరపాటు స్పష్టమవుతున్నది:- 8

ఉ. అమ్మొయి నూరకుండ ననుయాయి జనమ్ములఁ బెక్కులాడి చి
త్తమ్ము కలంక దేర్చి యుచితక్రియకు న్మొగకొల్పి బంధుసం
ఘమ్ముల నిందుఁ దెత్తమొ వికారవిదూరః యుపేంద్ర భవ్యదే
హమ్ముల గొంచుఁబోదమొ సమర్థవిధం బొక టేర్పఱింపుమా.
(1-167) 9

చ. అని యడుగంగ దైవగతి నంబుధి పట్టణ మాక్రమించు నె
ద్దినమున నొక్కొ యన్వగ మదిం జొనిపెం గురునాధ! యిప్పు డ
వ్వినుతగుణాభిరాముఁ డదవిం దను త్రిమ్మటఁజన్న ప్రొద్దుల
య్యనుచరకోటితోడఁ దెలియం దలపోయఁగ లెక్కతోచినన్
(1-168) 10

క మఱునాడ యగుట లెస్సఁగ
నెఱిఁగె నినుం డపుడు వేడి యెదలిన దీప్తుల్
తుఱఁగలిఁగొని పశ్చిమగిరి
చఱికి ననతిదూరమున విశదుఁడై తోచెన్ (1-169) 11

సీ. దానికి జనములు దాను నుత్తులమంది
చర్చించి కార్యంబు చాయ గాంచి
మనము కృష్ణునిఁ గని చనుదెంచువారమై
పురమున నిహ్వార్త పుట్టకుండ
నడచి యిచ్చట మాట లవి కొన్ని మఱియించి
చెప్పి యూరేయి చెచ్చెరఁ బ్రయాణ

మనకుఁగృత్యములగు పనులెల్ల సమకట్టి
వేగంబ గ్రక్కున వెడలవలయు
గాని వెడలకున్న భానూదయంబున
వనధి పురము ముంచికొనఁగ గణన
సేయరానియట్టి సేగియు, బ్రయ్యు భా
వంబు వగయు నెల్ల భంగిఁ గలుగు (మౌసల 1-170) 12

'మఱునాడే సముద్రుడు ద్వారకాపట్టణమును ముంచగలడని నిశ్చయముగా 'నెఱిఁగె' నని స్పష్టమేకదా! (కావున పద్యమందు) 'ఎఱగె' ననిగాని, 'అరిగె' నని గాని కాదు. అరుగుటే అర్థము చెప్పితే అరిగెడు వాడెవడో, కర్త కనుపించదు. ఇంతమాత్రమేకాదు. (ఇది) సూర్యాస్త సమయమందలి ప్రవృత్తికదా! కాకపోతే సూర్యుడు 'పశ్చిమగిరి చఱికి ననలి దూరుడై విశదుడై' అని చెప్పరు గదా! సూర్యాస్త సమయమందు 'వేడియదరిన దీప్తుల్', అనగా-నుష్ణత్వముచే ప్రజ్వరిల్లుచున్న దీప్తులని చెప్పుటయు గూడదుకదా! 'వేడి యెదలిన' వనగా-ఉష్ణత్వము నెడబాసిన వనుట-సాయంతనమందు యుక్తము. కావున 'విశదుఁడై' అని. అన్ని విధములచేత నప్పకవిగారు వ్రాసినటులైతే తప్పులని (వేరే) చెప్పనేల? 'అరుగుట' రేఫముగాని ఱకారమని ఎవరును చెప్పలేదు. లక్ష్యమున్ను కనిపించదు. మరియును దీర్ఘములమీద నుభయరేఫములకు వ్రాసిన పద్యము:- 13

'మాఱి' యనుటకు కర్ణపర్వము (8-10):

ఉ. పాఱినఁ జూచి కౌరవ నృపాలుఁడు సూతతనూజుతోఁద నీ
కాఱియ మద్బలంబునకుఁ గాదగునే వివిధాస్త్ర సంపదన్
మీఱిన నీవు గల్గిన నమేయ పరాక్రమ నీకుఁబాండవుల్
మ్మాఱి తలంప నీదగు బలంబును జేవయు, జూపు మిత్త్రఱిన్ 14

(ఇక్కడ అప్పకవిగారి దృష్ట్యా) 'మాఱి' యనగా-సంహార కర్త్రియయిన శక్తికర్థముగదా! 'నీకుఁబాండవు ల్మాఱి'-చంపేవారని అర్థము చెప్పవలెనుగదా! ఇదే అర్థమయితే దుర్యోధనుడు తనసేన విరిగిన పిమ్మట కర్ణునితో ననెడు వాక్యముగదా (ఇది) ఈ కాఱియ = ఈ కష్టము. 'వివిధాస్త్ర సంపదన్మీఱిన' అను విశేషణమున్ను, 'అమేయపరాక్రమ' అను సంబోధనమున్ను (కర్ణుని) శౌర్య

ధైర్య సాహసాదులను ప్రకటించుటకే కదా! కావున, నీదగు బలంబును, అనగా-అస్త్రబలమును, చేవయు = పరాక్రమమును, చూపుము = ప్రకటింపుము, ఇత్తఱిన్ = ఇటువంటి కష్ట సమయమందు నూరకుండకుమని ప్రోత్సాహము చేయునపుడు, 'మాఱి' = చంపేవారనుట అసంగతమని చెప్పనేల! "పాండవుల్ మాఱే?" = మాఱె యనగా 'ఎదురేనా' అని అగ్గించుటేకాని, చంపేవారని తిరస్కరించి చెప్పరాదు. (పద్యమందున్నది) 'మాఱె' యను పదముగాని, 'మారి' యను పదముగాదు ఆ మారి పదమైనా ఱకారముతో ప్రయోగమొకటియైనా కనుపించదు. రేఫముకు విరాటపర్వము :

గీ. కాలపక్వంబులైన లోకముల జముఁడు
బారి సమరెడు చాడ్పున మారి మసఁగి
యుగ్రరూపుఁడై శౌర్య సమగ్ర బాహు
సంపదుద్దాముఁడగు క్రీడి చంపె రిపుల. 15

'బారి' పదమును రేఫములం దందఱు వ్రాసినారు. (మరియు)

భీష్మపర్వము (3-242) నందు :-

గీ. అనిన నతఁడు పాండవాగ్రజుఁ గవలను
దాకి విపుల బాహు దర్పమొప్ప
నారసములఁ బొదవి మారిమసంగిన
ట్లైనఁ జూచి నరుఁడు ననిలసుతుఁడు. 16

(అని మారి పదము రేఫముగా నిర్ధారితమై ఉన్నది).

'ఎఱిఁగె' నను పదము 'నరిగె'నను పదమనుకొనుటయు, నది ఱకారమనుకొనుటయును, 'మాఱె' అనుపదమును 'మారి' అనుకొనుటయు, నది ఱకారమనుకొనుటయు (తప్పని) సులభముగా నీ గ్రంథ పరిశీలనము వలన తెలియవచ్చును. 17

(ఇక) ఆరుట = శమించుట—ఈ పదముకు మాత్రము (అప్పకవి గారు) రేఫ ఱకారములకు రెండు లక్ష్యములు వ్రాసినారు. ఇందులో—

ఆదిపర్వము (4-19) :

క. కాఱడవిఁ బఱచు మృగముల
నూఱటకుం దిగిచి డస్సి యున్నతని శ్రమం
బాఱఁగ నెద పరితాపము
దీఱఁగఁ బైవీచె నన్నదీపవనంబుల్. 18

(అను) నీ పద్యము మాత్రము బాగున్నది. కాని, శాంతిపర్వము (1-18) :

క. కౌరవులు సేయు నవమతి
కారణమునఁ గోపమెత్తు కర్ణుని వదనాం
భోరుహముఁ గనుఁగొనఁగ శ్రమ
మారు న్నా వశముగాక యంతన బుద్ధిన్. 19

అని వ్రాసినారు. 'ఆరుట' అను పదము నిండుటకు నడగుటకు నర్థము. 'నిండె'నను నర్థమైనపుడు రేఫము, అణగు నను నర్థమైనపుడు అకారము. ఆ ప్రకారముగా నొకర్థమైనపుడు రేఫము, నొకర్థమైనపుడు అకారమునగు పదములు పెక్కుగలవు. ముందు ముందు కొన్ని తెలియ పరచుతాము. (అర్థభేదము చే భిన్న రేఫములగునను నీ యంశము) నెఱుంగక, 'శమించుట' కర్థమనియు, రేఫ అకారముల రెంటను గలదనుటయు భ్రాంతత్వము. క్రిందటి రెండు పద్యము ల(ందు)వలె భ్రాంతత్వము (ఇచ్చట) సులభముగా తెలియదు. ఈ పద్యమందు 'శ్రమ మారున్' అని యుంటే అర్థము కుదరదు. దుర్యోధనాదులు సేయు నవ మతిచేత కోపము ప్రజ్వరిల్లుట సరే, కర్ణుని ముఖము గనుగొంటే 'శ్రమ పోయె' ననిచెప్పుట 'పృష్ఠతాడనము-దంతభంగము' అను సామ్యముగా నున్నది. ఆ సామ్యమేమి? "కౌరవావమతిచేత క్రోధోదయ మయిాది, తత్క్రోధముచే శ్రమో దయ మయిాది, కర్ణముఖావలోకనమున తచ్ఛ్రమము పోయిాది[1] —ఈ లాగున ననరాదా?" అంటే యీ యర్థము బాగులేదు. (ఇది) మూలమునకు విరోధించి నదిన్ని, అసందర్భమైనదిన్ని. ఇట్టి యర్థము పండితులు చెప్పరాదు. (ఎందుకనగా వ్యాస భారతము) శాంతిపర్వము ప్రథమాధ్యాయము నందు :-

1. అయిాది, పోయిాది, అనునవి, అయ్యెడిది, పోయెడిది అను పదము లకు వికృతి రూపములు. (వ్యాకరణపరిభాషలో గ్రామ్యరూపములు).

శ్లో॥ సభాయాం క్లిశ్యమానస్య, ధార్తరాష్ట్రైః దురాత్మభిః
సహసోత్పతితః క్రోధః, కర్ణం దృష్ట్వా ప్రశామ్యతి'

అనియున్నది (దానికి తెలుగు భారతమున) పద్యము :-

క. కౌరవులు సేయు నవమతి
కారణమునఁ గోపమెత్తుఁ గర్ణుని వదనాం
భోరుహముఁ గనుఁ గొనఁగ శమ
మారు న్నావశముగాక యంతన బుద్ధిన్" 20

తనకు కర్ణుదన్నని యెఱింగిన పిమ్మట ధర్మరాజు దుఃఖాక్రాంతుడై యనుకొనే (సందర్భములోనిదీ పద్యము). సభయందు దుర్యోధనాదులు ద్రౌపదీ మానభంగము సేయునపుడు వారిపై క్రోధము ప్రజ్వలించేది. కర్ణుని నన్నని యెఱుంగకపోయినా ధర్మరాజు ఉత్తమోత్తముడు గావున (అతనికి కర్ణుని మొగము చూడగానే) శాంతి నిండేది. "అన్నగాకపోతే యెందుకు నా హృదయము చల్లగా నుండేదిః" (అని) యీ విమర్శ చేసుకోనైతినని (ధర్మరాజు) పరితపించుచున్నవాడని భావము. అప్పకవిగారు " 'శ్రమ మారున్' అనే వ్రాసి యుందురు. లేఖక ప్రమాద మనుకోరాదా" అంటే, రేఫ సీసమాలికయందు, "శ్రమ మారె, పొంగారె" అని వ్రాసి, అర్థమున్ను శ్రమమారుట = బడలిక తీరుట, పొంగారుట = పొంగు తీరుట అని వ్రాసినారు.

అకార సీసమాలిక యందున్ను (2-197)

"...అఱు సంఖ్యాపద మాఱడి యాఱిక
పంట చిచ్చాఱె పాపంబు లాఱె
నాఱని తేజము లాఱిన ముత్తెంబు
తడి యాఱె శ్రమ మాఱె తాప మాఱె...' 21

అర్థము :- చిచ్చాఱుట, పాపములాఱుట, ఆఱని తేజము, ఊటాఱిన ముత్యములు, కోక తడి యాఱుట, శ్రమ మాఱుట" అని రేఫ అకారముల రెంటి యందు 'శ్రమ మాఱె' అని వ్రాసి అర్థమున్ను స్పష్టముగా నదే ప్రకారము వ్రాసినారు. కావున (ఇది) లేఖక ప్రమాదముగాదు. అప్పకవిగారి పాండిత్య మహిమయే. 22

మరియును,—తొఱగుట, నెరసుట, పరిగొనుట, పరిచను దెంచుట, పరిమెయి, పరవకటి, పెరుగుట, నెరసెననుట—ఈ పదములు రేఫములకు లక్ష్యములు వ్రాసినారు. (అయితే) తొరగుట, నెరసుట—ఈ రెండు పదములు గాక మిగిలినవి రేఫములే కాని, అకారములు కావు. చెఱచుట క్రమ్మఱ మఱదలు, తెఱగు, తీఱు, తేఱుట, వేమాఱు—ఈ పదములు అకారములకు లక్ష్యములు వ్రాసినారు. (అయితే) వేమాఱు, తొఱుగుట, నెరసుట—ఈ మూడు పదములు మాత్రము ఉభయ రేఫము లౌను. అప్పకవిగారు ఉభయములకు లక్ష్యములు వ్రాయలేదుగాని, ఉభయములకు ప్రయోగములు గలవు. ఇరులు, రొమ్ము, చీరుట = రెండు తునుకల కర్థము ఇవి అకారము లన్నారు. రేఫములకును ప్రయోగములు గలవు, కారులు, కూరలు, చారు, రేకులు, దూరులు వలుకుట—ఇవి రేఫము లన్నారు. అకారములకు ప్రయోగములు గలవు. దూరులు వలుకుట—రేఫము. పొదల దూఱుట-అకారమన్నారు. అరుదు, చురచుర, ఇందరు, ముందర, మరి, వేర్వేర అకారము లన్నారు. ఉభయము గలవు. ఇవియన్నియు లక్ష్యములలో ముందు వ్రాసుతాము. 23

అప్పకవిగారు కవిత్వమందు గలిపిన గురులఘు రేఫములు (మఱియును గలవు. చూపుతున్నాము.) 24

క. అఱటుల బఱటుల బఱిదెల
గఱిదెల మొఱిదెలను గల అకారములెల్లన్
ధర నెఱసున్నలునగు న
య్యఱటుల బఱటులను ద్రుతములగు వలసినచోన్ 25

'ధర' - రేఫము. అందే (4-265)

గీ. పరగ కందము పద్యయు మఱి విపులయుఁ
జపలయును ముఖచపలయు జఘునచపల
యనఁగఁ గందపద్యంబులీయాఱు విధము
లఖిల సుకవి కృతులలోన నలరుచుండు: 26

'పరగ' (పదము) రేఫసీసమాలికయందును,'మఱి' (పదము) అకార సీసమాలిక యందును వ్రాసినారు (గాని), వీటిలో నుభయరేఫములందు

నొకటియు నప్పకవిగారు వ్రాయలేదు. లాక్షణికులందఱు (గూడ) 'పరగ' రేఫమని, 'మఱి' అకారమని నిర్ణయించినారు. (కాని 'మరి' ఉభయములందు గలదు). 27

శకటరేఫ యగుటకు

శల్యపర్వము (2-387) :-

చ. మఱియు నొకండు వింటె పవమాన తనూజునిచేత పెన్గొదల్
విఱిగి ధరిత్రిపైఁబడుడు వేగమె వచ్చి శిరంబుఁ దన్నె నే
డ్తెఱ గలయప్డు శత్రు నవధీరితుఁజేయుట యొప్పుగాక యే
పఱినఁ బరాభవించిన జనావలి నవ్వదె నొవ్వదే మదిన్. 28

రేఫమగుటకు, అందే (1-84) :

క. సురసరిదాత్మజుఁడును
గురుడును గర్ణుండు దెగుటకుం దలఁకక యె
వ్వరి బాహుబలము గైకొని
మరి క్రోల్తల జేసి రొక్కొ మనవా రనికిన్. 29

'మరి' ఉభయము నందుఁదఁగా శకటులందు నిర్ణయించుట యొకటి, రేఫముతో ప్రాసము గూర్చుట రెండు ప్రమాదములు. 30

'చఱచఱ కాలుట' శకటరేఫమన్నారు. రేఫమగుటకు-

శల్య పర్వము (2-385) :

క. తురగంబులతోఁగూడఁగ
నరదము సకలంబు సుజ్జ్వలానలశిఖలం
జురజురవోయినఁ గని య
స్నరుఁ డచ్చెరువంది కృష్ణునకు నభిముఖుఁడై. 31

'కృష్ణునికి' యని యున్నది. (యతిభంగముకానరు). 32

శకటరేఫమగుటకు :

తిక్కనగారి ఉత్తర రామాయణము (8-106) :

క. చుఱచుఱ దెందముచూడిన
తెఱఁగున నొక్కింత స్రుక్కి ధీరుండగుటన్

గొఱత వడకుండ వినుటకు
పెఱవారల కిట్టులనియె, బ్రియనదయుండై. 33

'అరుదు' రేఫమన్నారు. శకటరేఫమగుటకు :-

- తిక్కనగారి ఉత్తర రామాయణము (9-57) :

క. మఱియు నొకమాట యెవ్వరు
నెఱుఁగనియది దశరథునకు నేకాంతమునం
దఱమఱ లేక దృఢంబుగ
నఱుదుగ నొకతిబిసి చెప్ప నంతయు నింటిన్ 34

'పెఱుగుట' శకటరేఫమన్నారు. రేఫయగుటకు :-

- తిక్కనగారి ఉత్తర రామాయణము (9-75)

క. పెరుగుట స్రగ్గుట దెవులం
బొరయుట యవశంబు కాన పుట్టువు చావుం
బెరయుట పాయు పదార్థో
త్కరముల నైజ మదియెట్లు తప్పింపఁదగున్? 35

- ఆదిపర్వము (3-12) :

సీ. పాండుకుమారులు పాండుభూపతిపరో
క్షంబున హస్తిపురంబునందు
ధృతరాష్ట్రు నొద్దఁ దత్సుతులతో నొక్కట,
బెరుగుచు భూసురవరుల వలన
వేదంబులును ధనుర్వేదాది విద్యలు
గఱచుచుఁ గడలేని యెఱుక దనరు 36

'చేరుట' రేఫమన్నారు. శకటరేఫమగుటకు :-

- ఆదిపర్వము (5-166)

సీ. కూడి జలక్రీడ లాడుచోఁ గదఁగి యా
ధృతరాష్ట్రతనయుల నతులశక్తి
లెక్కించియుఁ బదుండ్ర నొక్కొక్క భుజమున
నెక్కించుకొని వారి నుక్కడంగ

గొంచక నీటిలో ముంచుచు నెత్తుచు,
గాఱించి తీరంబు చేఱఁబెట్టు........." 37

'చీరుట' తునకలుసేయుట-శకటరేఫమన్నారు.

రేఫమగుటకు :-

అశ్వమేధ పర్వము (4-104) :

ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి రథంబు వగిల్చి కేతువుం
జీరి శరాసనంబు పొడిచేసి (న నమ్మగధుండు ధీరతో
దార గతిన్ సముజ్జ్వల గదా గ్రమణంబున బాహువొప్ప న
వ్వీరవరేణ్యుసైఁ గపెసె విక్రమ మాకృతిదాల్చి పొల్చెనాన్) 38

ఆరణ్య పర్వము (6-187)

ఉ. ఘోరగదా విదారణ విఘూర్ణిత శాత్రవ కుంభికుంభముల్
జీరుచు మౌక్తిక ప్రతతిచే రణభూమి (నలంకరించు కే
లీ రసలోలుఁడై సమదలీల బకాంతకుఁ డేఁగుదేరఁ గ
న్నారఁగఁజూచి కాక యిటు లంతకు నీమది త్రుళ్ళడంగునే). 39

'చీరు' పిలుచుట-రేఫమన్నారు. (కాని) రెండుమనుం గలవు. శకటరేఫ
మగుటకు :-

పోతనగారి భాగవతము-సప్తమస్కంధము (194) :-

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు బాహుల నొడ్డఁడు బంధురాజిలో
దూఱఁడు ఘోరకృత్యమని దూఱఁడు తండ్రిని మిత్రవర్గముం
జీఱఁడు మాతృసంఘము వసించు సువర్ణ గృహంబులోనికిం
దాఱఁడు కావరే యనఁడు తాపము నొందఁడు కంటగింపఁడున్, 40

రేఫమగుటకు :-

శాంతి పర్వము (2-440)

స్రగ్ధర. ధీరోదారోగ్రలీల న్వినముడు సమరో
ర్విం బలోల్లాస మొప్పం
జీరన్ బాహాసముల్లాసిత ఘనరుచిరా
సి ప్రభా భాసురుండై

యారక్షోనాథుపైఁ బేలుక మఱపుజే
యంగ నీతండు డిగ్గెన్
దే రుద్యత్ ఖడ్గదీప్తుల్ దెసల నిగుడ దై
తేయవీరు ల్చలింపన్. 41

'ఉల్లాసిత' (అని లకార) దీర్ఘము (గూడ కలదు). 42

'ముందఱ' శకటరేఫమన్నారు. రేఫమగుటకు .-

ఆది పర్వము (3-241)

క. ధరణిఁ గడు పేదవారును
పురుటికి ఘృత తైల ధాన్యములఁ జెచ్చెరముం
దర సంగ్రహింతురని మన
కరుదుగ నతిదుర్లభంబు లర్థము లేమిన్ 43

శకటరేఫమగుటకు.

ఉద్యోగ పర్వము (2-294) :-

చ ఎఱిఁగి యెఱింగి యుండె మది నేది యెఱుంగక యుండె నెప్పు నం
దఱు వినఁ బాండు నందనులు దర్పితులై యని గెల్తురంద్రుముం
దఱ నిను బాహ్లికున్ గురునిఁ దక్కిన వారిని నమ్మి వేను నే
డ్తెఱ నని సేయఁబూనితి కడిందిమగంటిమి తోడఁ జాలరే 44

ఇందఱ-శకటరేఫమన్నారు. రేఫమగుటకు :-

ఉద్యోగ పర్వము (4-228) :-

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ గాండీవితోఁ
బురుడింపందగువాడుఁ వీని కెన యీ భూలోకసంచారు లె
వ్వరులే రీతఁడు బ్రాహ్మణుండనిన భావంబూనఁగా నోర్వమిం
దర నూహింపఁగలేదు కాని జము చందంబయ్యోడిన్ బోరులన్ 45

'చారు' రేఫమన్నారు. శకటరేఫమగుటకు :-

శ్రీనాథుని హరవిలాసము (2-82) :-

ఉ. బోఱున వర్షముల్ గురియ సువ్రతుఁడా చిఱుతొండనంబి దై
వాఱెడు భక్తిఁ బెట్టు శివభక్తుల కర్థిఁ జతుర్విధాన్నముల్

ఱాఁఱని యొల్పుఁ బప్పును ఘృతంబును దియ్యని పానకంబులున్
జాఱులు పిండివంటలును శర్కరయున్ దధియున్ యథేచ్ఛఁగన్. 46

'చేఱు' శకట రేఫమన్నారు. రేఫమగుటకు :-

కళాపూర్ణోదయము (7-124) ;

ఉ. క్రిందను మీదనుం బడి యకించిదసూయఁ బెనంగులాడు న
ర్ధేందుఁడు నుల్లసత్ప్రలసమృద్ధ తమిస్రమువోలెఁ జాలఁ జె
న్నొందెడు ఫాలముం గబరియు న్మరి పాపట ముత్తియంపుఁ జే
రుం దిలకంపుఁగస్తురియు రూఢిగ బాహులలీల నొప్పఁగన్. 47

'రేకు' రేఫమన్నారు. శకట రేఫమగుటకు ;-

భీష్మపర్వము (2-20) :

ఉ. తెక్కలు సించి కంఠమున తేకులు వాపి శిరంబుపుచ్చి పే
రుక్కునఁ గ్రొంచచందమగు నొడ్డుఁ గలంగఁగఁజేసి భీష్ముఁ దే
ఠిక్కునఁ దానయై దిశలు దీటుకొనన్ శరకోటినింపఁ గెం
పెక్కిన కంటిరేవ చెలువెక్కుడు సేయఁగ గ్రీడి కృష్ణుతోన్. 48

'కాఱులు' రేఫ మన్నారు. శకటరేఫమగుటకు :-

ఉద్యోగపర్వము (3-107) :

ఉ. ఆఱడి పోకయున్ ఫలము లందుటయుం గని పల్కనేరమిన్
మాఱట నోరిదాననయి మాటలు చిత్తమునం దలంపకే
కాఱులు వల్కెదన్ వినుము కర్ణము నెగ్గును (గాన నల్కమై
వీఱిడియైన మానిసికి వెండి వివేకము గల్గనేర్చునే.) 49

'కూఱ' రేఫమన్నారు. శకటరేఫమగుటకు :-

కాకమాను రాయని బహులాశ్వచరిత్రము (4-50):

క. ఆఱేడు వగల బాఱుల్
నూఱు విధంబుల రసావలు ల్వేయు వహుల్

కూఱలు పచ్చ ఘోర్బిం
దూఱుంగాయలకు లెక్కయు న్నరి కలదే. 50

'అర' = సగము, దీనికి లక్ష్యము-అరగంటఁజూచుట = సగము కంటఁ జూచుట, అరగొఱత = సగము తక్కువ- ఈమొదలైనవివి, చెఱవు = తటాకము, చెరగులు = అంచులు—ఇవి రేఫములన్నారు. అఱచెయ్యి, అఱకాలు; తఱలుట, తీఱు, చూఱ, నీలపుఱాయి— శకటరేఫములన్నారు. ఉభయములును గలవు. 51

'అర' రేఫమగుటకు :-

తిక్కనగారి ఉత్తర రామాయణము (6-30):

చ. అరవిరిగుత్తులం బోలిచి యల్లన గాడ్పుల నీగు నీరతన్
దరహసితోదయంబు స(విలాసతనూవలనంబుఁ గల్గు సుం
దరుల తెఱంగుగాఁ బతి విధంబున నున్న రసాలపోత మీ
గిరితట భూమికిన్ సరసకేలికి వచ్చిన మాడ్కి నొప్పెడిన్) 52

కళాపూర్ణోదయము (1-41) :

స. అరవిడు గొప్పున విరుల వాసనకుఁ దో
రపుటూర్పు గాడ్పులు ప్రాపుగాఁగ... 53

కవికర్ణ రసాయనము (8-167) :

క. గరివంక బొమలపైఁ గ
స్తురిఁ దీర్చిన తిలకరేఖ సుదతికిఁ బోలిచెన్
మరుఁడు వెడవింటఁ దొడిగిన
యరవిరి నును నల్లగల్వయమ్మునుబోలెన్. 54

శకటరేఫమగుటకు :-

విరాటపర్వము (2-83) :

స. కరువలి సుడియమిఁ గదలక చెన్నొందె
నఱవిరిదమ్ముల నుఱక దెగడి... 55

ఆరణ్య పర్వము (3-235) :

క. అఱఖోర కుఱుచ చేతులు
నొఱవ శరీరంబు గలిగి యొఱులకుఁ జూడం
గొఱగాకుండియు మన్మథు
నొఱపులఁ బడియెడు నితండు యువతిప్రీతిన్. 53

రంగనాథ రామాయణము :

ద్వి. అఱగొను లసియాడ నలసయానముల
మెఱుపులోయలతలై మేదీఁగ లొలయ. 57

అరచేయి, అరకాలు—అనగా. క్రిందివైపు (చేయి, కాలు) అని అర్థము గాని, సగము (అని అర్థము) కాదు. మీఁజేయి, మీఁగాలు-అనగా పైవైపు అని అర్థము. అరచేయి, అరకాలు — క్రిందవైపు అర్థము గావున నొకటిగా నెంచవలెను. 58

రేఫమగుటకు :

రామాభ్యుదయము (5-172) :-

క. అరకాలు ముల్లు గొన కిదె
తిరిగి రఘుస్వామి యేగుదెంచు న్మదిలో
తరుణీ వెఱవకు విపినాం
తరమున నిను విడిచిపోవఁ దగ దిదిఃనాకున్. 59

శకటరేఫమగుటకు :

శ్రీనాథుని నైషధము (8-125) :-

మ. తఱి నాక్రాంత సమస్తలోక బలివిధ్వంసీ...యోదేవ నీ
యఱకా లుద్ధతి రాహు మండలము బ్రహ్మాండంబుతో నెత్తినం
గుఱుగుఱ్ఱుం జెడ సంధి బిట్టొరలు నప్మైరాహి నీ యంఘ్రికిన్
కిఱు చెప్పైన విధంబుగా మనములోఁ గిలించిన ట్లియ్యేడున్. 60

శ్రీ పర్వము (2-88) :

క. పిఱుదం గురు ధరణీపతి
యఱచేతం బ్రాణములుగ నరిన్నృపతిబలం
బుఱ తెగువ ముందటం జే
గ్గొఱలుట చిత్తమునఁ బెట్టుకొని హరియించున్. 61

'చెఱువు' శకట రేఫమగుటకు :-

ఎఱ్ఱనగారి రామాయణము :

మ. చెఱకుం దోటలఁ బెంచి శాలిమయ సుక్షేత్రస్థలుల్ నించి య
క్కఱ లేకుండఁగఁ బూగ నాగలతికా కాంతారముల్ ప్రోచి యే
డ్తెఱ నంతం గుముదోత్పలాబ్జవనవాటీకోటిఁ బాటించి పెం
జెఱువుల్ వొల్చుఁ బురంబునల్దెసలఁ బ్రస్ఫీతాంబుపూర్ణస్థితిన్. 62

మరియును గలవు, రేఫ యగుటకు.

సీ. గీ. తనరు బక పఙ్క్తులకు జానుదఘ్నమయ్యె
చెరువు గమి యుడుములన రేల్ దిరిగె కుక్క
పసికి (కావులఁ బడుటకు బనుల యెరువు
చెఱలకు మొసళ్లు మలుగు మీన్బొఱియ దూఱె) 63

'తిరుగుట' ఉభయము గలుగుటవలన 'చెరువు' రేఫముకు చింత్యము. 64

'చెరగు' రేఫ మగుటకు :-

శ్రీ కృష్ణరాయల ఆముక్తమాల్యద (2-17) :

చ. రవి యను దివ్వె కేతువు చెరంగున మూసి కృతోర్ధ్వయంత్ర వా
ర విరల ఘర్మమై కలరవాల్పరవోక్తుల (వాంత ధూపరా
జి వరనిశ స్ఖనన్మదన చేతులఁ జాతురి నెయ్యవుం గురుం
జువిదలు దార్ప విష్ణు పదమొత్తుఁ బురీ గృహలక్ష్మి నూత్ననాన్) 65

కాకమానురాయని బహులాశ్వ చరిత్ర (4-5) :

ఉ. రంగు మెఱుంగు బంగరు చెరంగుల రెంటెము నాల్గుకొంగులన్... 66

శకట రేఫ మగుటకు :-

వసు చరిత్రము (5-73) :

మ. చెఱఁగుల్ పూతపసిండి వ్రాతపసిమిం జిత్రాతిచిత్రంబులై
మెఱయన్ రత్నపు కుచ్చు లంచుల బడి న్మించం దువాళించుఁ గ్రొ
మ్మెఱుఁగుల్ చంద్రిక కాటపట్టు సురభూమీజార్పితం బిచ్చెనా
తఱుచుంగన్నుల వేల్పు పట్టి వసుగోత్రామండలస్వామికిన్. 67

శ్రీనాథుని కాశీఖండము (2-32) :

సీ. కనకమేఖలఁ గ్రుచ్చికట్టై నెవ్వఁడు లీలఁ
జెఱఁగునఁ బూషార్క మెఱుఁగుబండ్లు. 68

'తరులు' రేఫ మగుటకు :

యయాతి చరిత్రము (4-47) :

చ. మురియుచుఁ దిమ్మిచూలి ముది ముంద రెఱింగనయట్ల నేర్పుతో
తరులను బైడికట్లిడిన దానఁ దిరంబయి యుండెఁగాక యే
వెరపున నిల్చు దీనివగు వ్రేకపుచన్నుల వ్రేగునం బయల్
దొరసిన యట్టి నెన్నడుము తోరపు నల్వకడంక మెచ్చితిన్. 69

శకట రేఫ మగుటకు :

వసు చరిత్రము (5-75) :

చ. తఱు లర నిక్కఁ బూత నెరతావియ చిక్క నపాంగమాలికల్
మెఱుఁగులు గ్రక్క నూరుపుల మేలిమి తేఁటులు చొక్క హారము
ల్కఱచలు ద్రొక్క ముంగురులు క్రొంజెమటం బదు నెక్క వేఱుపుం
దెఱవ యొకర్తు చేది జగతీపతికిన్ సిరసంటె నేర్పుగన్ 70

అహోబల పండితులవారు 'క్రక్క' గ్రామ్యమన్నారు.

'నిష్ఠ్యూతోద్గీర్ణమంతాది, గౌణవృత్తి వ్యపాశ్రయమ్
అతిసుందర మన్యత్ర, గ్రామ్యకక్షాం విగాహతే'

అని యున్నందున, గీర్వాణమందు నిష్ఠ్యూతాది పదము లెటువంటివో, తెలుగున 'కక్కు' అను పదమున్ను అటువంటిదే (కాని) 'క్రక్కు' అనగా 'ప్రసరింపుచుండగ' అని అర్థము. గ్రామ్యము కనుపించదు 71

'తరలుట' రేఫ మగుటకు :

వసు చరిత్రము (1-49) :

చ. అరిజయకీర్తి సాంద్రుఁడగు నయ్యలు రామనరేంద్రు సోదరుం
దిరుమల దేవరాయని నుతింపఁదరంబె తదీయహేతిగాం
కరి యతిలోహితావయవగాఁ దను నాత్మ హృదంతరంబులం
దరలక దాల్చువారలకుఁ దార్చు సురీవరణీయ వైఖరుల్. 72

శకట రేఫ మగుటకు :-

భాస్కర రామాయణము :

చ. ఒఱగె వసుధరాస్థలి మహోరగనాథుఁడు వంగె కూర్మముం
దఱలె నభంబు మ్రోసె సురదంతులు మ్రొగ్గె దిగంతరంబు ల
త్తఱి నదవె న్మరుత్సుతుఁడు దర్పమెలర్ప నహోరముద్ధతిం
బెఱుకఁగ గోత్రశైలములు పెల్లదలెం గలఁగెం బయోనిధుల్. 73

'తిరుగుట రేఫ మగుటకు :

ఆదిపర్వము (1-158) :

చ. తిరిగెడుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరు పాముల రోసిరోసి ని
ష్ఠుర భుజదీర్ఘ దండమున ద్రొల్లఁగ వ్రేయుచు (వచ్చివచ్చి య
య్యురవున డుండుభంబును నహిం గని వ్రేయఁగ దండమెత్తుడున్
హరి హరి యంచు డుండుభమహాహి భయంపడి పల్కె భార్గవున్.) 74

శకట రేఫ మగుటకు :

స్త్రీ పర్వము (2-45) :

గీ. ఉడుకు కన్నీరు దడియంగ నొరలుచును వి
చేష్టయై యూరకుండుచు చెలుఁదోడ

తిఱిగి పొగలంగ వేసరి నెఱియ మనల
యవుల( దిరుగుచున్నది యక్కటకట! 75

'వాతెఱ' రేఫ మగుటకు :

పారిజాతాపహరణము (3-48) :

క. గురువింద( జైత్రు డొడ్డిన(
గరమలుకన్ మాని యపుడు కరచిన నునువా
తెరమీ(ద( గానగు పలు
వరుస యనన్ ననలు పల్లవము పై మొనసెన్. 76

శకట రేఫ మగుటకు :

ఆదిపర్వము (7-74) :

చ. నెఱిగురులున్ విలోలసిత నేత్రయుగంబును నొప్పులొప్పు వా
తెఱయును దీని యాననము దెల్పు( గరంబు మనోముదంబునే
నెఱి(గినయంతనుండియును నిట్టుల నాలలితాంగి( జూచి యే
నెఱు(గ సురేంద్రకన్యకలు నిట్టిద రూప విలాస సంపదన్. 77

'తీరు' రేఫ మగుటకు :-

యయాతి చరిత్రము (5-95) :

క. ఈ రాజున కివముఖ నొక
తీరున( గావించి సిద(దీర్పమి దగనా
(యోరుచునా మైసెగలకు(
జేర(గ రాదనుచు నెరము సేయందగునే) 78

శకట రేఫ మగుటకు :

తిక్కనగారి ఉత్తర రామాయణము (9-20) :

గీ. సందియంబు పడ విచారంబునకు( జొర
మాఱుపల్కు నొందుటీఱు సేయ

(పరవుగాక పిడుగు వ్రేసిన యట్లైన
మాట కియ్యఁగొనుచుఁ బోటి పలుకు) 79

'చూర' రేఫమగుటకు :

రంగనాథ రామాయణము :-

ద్వి. ఏసి బండారంపుటిండ్లలోఁ జొచ్చి
రాసులర్థములు చూరలు చల్లువారు 80

శకటరేఫ మగుటకు :

ఎఱ్ఱనగారి రామాయణము :

క. నూఱుతెఱంగుల నెఱసులు
మీఱఁగ నీ విభ్రమములు మెఱయించు మునిం
గాఱఁగఁ జేయుచు మేనక
చూఱగొనదె యతని తెలివి సొమ్ములు మున్నన్ 81

'కాఱుట' గ్రామ్యమౌను. 'నిష్ఠ్యూత' పదమువంటిది 'స్రవించుట' అర్థము చెప్పితే బాగుంటుంది. ఎఱ్ఱాప్రెగడ 'కాఱుట' పదము ప్రయోగించినందుననే రామరాజభూషణకవి 'క్రక్కు' అని ప్రయోగించినాడు. 82

'రాయి' రేఫమగుటకు:

కవిధూర్జటిగారి శ్రీకాళహస్తీశ్వరశతకము :

శా. రాలన్ రువ్వఁగఁ జేలాతుడవు, కుమారా, రమ్మురమ్మంచు నే
జాలన్ జెంపఁగ, నేత్రము ల్దివియఁగా శక్తుండ నే గాను, నా
శీలం బేమని చెప్ప, నున్నదిఁక నీచిత్తంబు నాభాగ్య మో
శ్రీలక్ష్మీపతిసేవితాంఘ్రికమలా! శ్రీకాళహస్తీశ్వరా! 83

ఊహాంశములుగలవు. (ఇక) శకట రేఫమగుటకు: 84

తిమ్మకవి లక్షణ సారసంగ్రహము (3-288) :

గీ. రాయి యనెడుచోటఁ బాయక రేఫమం
చాద్యులై ప్రసిద్ధులైన కవులు

కృతులనిలిపి రమలమతిఁ దిక్కమఖి గురు
రేఫగాగ నిచె కృతి నుమేశ! 85

భీష్మపర్వము (3-419) :

క. నా యుల్ల మరయ నినుమో
డాయో కా కిట్లు రూపఱక విన నేర్చెన్
సాయక సముదయ ఖర భవ
దీయవచన చయము గవియుదేరం దిరమై. 86

శ్రీనాథుని భీమఖండము (2-154) :

క. పోక నడుకొట్టితేనియు
డాకింతుఁజూపి మొగంబు డాచట్టుపయిన్
శ్రీకాశిని నిందించిన
నీ కింతట నెలవు పోవు నీచచరిత్రా. 87

'మరలుట' ఉభయముగలదు. అంతు, పరుసదనము, పరతెంచుట, చూపఱ, పలుమఱు-శకట రేఫములన్నారు. ఉభయములుగలవు. 88

'రంతు' రేఫమగుటకు :-

శ్రీనాథుని చాటుధార :

ఉ. అంగడివీథి పల్లవుల కాసగ మామిడిపండు లమ్ముచున్
జంగమువారి పిన్నది పిసాళితనంబునఁ జూచెఁబో నిశా
తాంగజబాణ కైరవ సితాంబుజ మత్తచకోర బాల సా
రంగతటిన్నికాయముల రంతుల జేసెడి వాలుచూపులన్. 89

వారిదే మరొక చాటుధార :

శా. రంతుల్ సేయకు కుక్కుటాధమ దరిద్రక్షుద్ర శూద్రాంగణ
ప్రాంతోలూ చాల మూలపల్లవకణ గ్రాసంబుచేఁ గ్రొవ్వి దు
ర్దాంత స్వానిత భిన్నహృత్పుణిఫణాంతర్మాంస మాధుర్యమే
చెంతం గ్రోలు ఖగేంద్రు చెంగటను నీ జెంఝూటముల్ సాగునే 90

శకటరేఫమగుటకు:-

శ్రీనాథుని భీమఖండము (4-96):

ఉ. అంతులు మీఁదు మిక్కిలిగ జాగతనంబున దొమ్మిచేసి దు
ర్దాంత పరాక్రమోన్నతులు దానవదైత్యులు (వేల్పువెజ్జు ధ
న్వంతరి చేతి దుగ్ధమయ వార్థి సుధారసపూర్ణ కుంభమున్
సంతనకట్టి పుచ్చుకొని చయ్యననేగిరి నిర్విశంకతన్) 91

యయాతి చరిత్రము (4-22)

రగడ : అంతేమిటికిఁ గొఅంతే మల్లెల
వంతులకాసే వంతులు చెల్లెల. 92

'పరుసదనము' రేఫమగుటకు :-

ద్రోణపర్వము (5-51) :

క. తురగము తురగము కరికరి
నరుని నరునిఁ దేరు తేరు నలి దాఁకిన న
ప్పరుసదన మేమిచెప్పుదు
బొరిమిడుగురు లెగసె క్రైదువులపొడి రాలెన్. 93

శకటరేఫమగుటకు :-

సభాపర్వము (2-228)

గీ. ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు
బేల నీక యెఱుఁగ నేల వలసె
చిఱుతవాని కింత పఱుసందనమ్ములు
సన్నె వృద్ధజనము లున్నచోట. 94

'పరతెంచుట' రేవమగుటకు :-

తిక్కనగారి ఉత్తరరామాయణము (6-140)

క బరసికొని పోవ నత్తఱి
సురసైన్యం బార్చుటయును జూచి తిమిరముం

గర మచ్చెరువుగఁ గ్రక్కునఁ
బరతెంచుడు నసురకొడుకు పరతెంచి వడిన్. 95

శకటరేఫమగుటకు :-

ఆదిపర్వము (5-258) :

క. వెఱచఱచి నీరిలో న
క్కెఱగా నొక మొసలి చూడ్కికి నగోచరమై
పఱతెంచి కుంభసంభవు
చిఱుదొడ వడిఁ బట్టుకొనియె శిష్యులు చెదరన్ 96

'చూపర' రేఫమగుటకు :-

శృంగార షష్ఠము :

మ. గురుబంధుల్ దను జుట్టురాఁ దిగిచి యాక్రోశింప నిశ్చేష్టుఁడై
యొరులం దన్ను నెఱుంగలేక యసుహృద్వ్యాధార్తి ముం జెంది చూ
పర దన్ రోయుచుఁ బో వివర్ణత మెయిం బాటిల్ల...... 97

శకటరేఫమగుటకు :

భీష్మపర్వము (1-288) :

క. కొఱవియుఁ గొఱవియుఁ దాకిన
తెఱఁగున నర్జునుఁడు సురనదీసూనుఁడు చూ
పఱ వొగడం దాఁకుట ని
ద్దఱిదిక్కుల సైన్యములును దలపడియె వడిన్ 98

'పలుమరు' రేఫమగుటకు :-

రామాభ్యుయము (4-126) :

చ. ఇరువురు సిగ్గులగ్గలపుదేవ కదాకచి పైకొన న్మఖాం
బురుహయుగంబు వాంచి తలపుల్మది నువ్విళులూరఁ జూపులొం
డొరులపదంబులం దొరయ నొండు నెపంబున మోములెత్తి ప
ల్మరు మరువెట్టిచూడ నెదమం గుడినేయఁదొడంగెఁ గంతుఁడున్. 99

శకటరేఫమగుటకు :-

భీష్మపర్వము (3-31) :

క. విఱుగుట నొచ్చుట మనదెస
దఱచగ నాడెదవు పాండుతనయులబల మే
డ్తెఱఁ దఱుగక పెనఁగుట ప
ల్మఱుఁ జెప్పెద వకట యేమిమాయయొ దలఁపన్ 100

'వేమఱు' శకటరేఫమన్నారు. రెండును గలవు రేఫమగుటకు :- 101

యయాతి చరిత్రము (4-35) :

క. మఱుఁ దల నెలకడ దాచిన
విరితూపును నల్లచెఱకు విండ్లునుబలె వే
మరు నలరు చేరుచుక్కయు
నరుదుగఁ గనుబొమలు మిగుల నతివకు నమరెన్. 102

శకటరేఫమగుటకు :-

చేమకూరవారి విజయవిలాసము (3-42):

పంచచామరము: మెఱుంగుఁబోడి కిట్లు చల్వ మేఱమీఁ ఱఁ జేసినం
గుఱంగట న్నిలంగరాని కూర్చి వెచ్చ హెచ్చఁగాఁ
దుఱంగలించు వేడ్కతోడ దూఱి పల్కిరంత వే
మఱున్ మరున్ మరున్మృగాంక మత్తకోకిలాదులన్. 103

'ఆఱికెపంట' చింత్యమన్నారు. రెండునుగలవు, రేఫమగుటకు:- 104
ఆనుశాసనిక పర్వము (3-194)

గీ. పూరిపంట వ్రాలు నారికెబియ్యంబు
జంబువున ఫలంబు శ్రాద్ధకృతికి
గావు, తుమ్మ నేద్వఁ గాదు శ్రాద్ధక్రియా
చరణసమయములఁ బ్రశాంతివలయు. 105

అచ్చుపుస్తకములందు 'పూరి' రేఫము, 'ఆటికె' ఆకారము వ్రాసినారు. అటుల వ్రాసుటకు వారి పాండిత్యమహిమ తెలియదు. 106

శకటరేఫమగుట :-

తిమ్మకవిగారి లక్షణసారసంగ్రహము (3-206):

ఉ. ఆఱని తేజమాఱడియు నాఱికెపంటయు నాఱుషట్కమూ
టాఱిన ముత్తియంబు తడియాఱెను పాపము లాఱె జిల్గునూ
గాఱు వెలంది కొప్పె నను నట్టిపదంబుల (లోన) బెద్దఱాల్
మీఱుచునుండుఁ గబ్బముల మేరుమహీధరరాజకార్ముకా 107

తిమ్మకవిగారి రసికజనమనోభిరామము :

సీ. పా. ఆఱుగన్నను చిత్తమలరెడు చెలియన్న
మఱి కొప్పుగంటె వేమర చెలంగు 108

ఇరులు శకటరేఫమన్నారు. రేఫమగుటకు :-

యయాతి చరిత్రము (2-75) :

క. ఇరులు బిలియుచును నలుపులు
కరమరుదై నలుపుకట్టి కదిసిన కరణిం
బరగగ దోముదు కాటుక
కరవటమునుబోలె నిజ్జగంబు దనర్చెన్ 109

శృంగార షష్టము :

చ. పెరిగిన యీసున న్నెమలిపించెములం బురి విప్పఁబోలు నీ
సరసిరుహాక్షి వేనలికి సాటిగ నిల్వఁగ నోడి సొచ్చె నిం
దరిశరణంబు తేటిగమి నీలము లింద్రుని పేరుగాంచెఁ బె
న్నిరులు గుహాశ్రయంబు గనియెన్ నెఱిగల్గిన వారి కోర్తురే. 110

కళాపూర్ణోదయము (3-31) :

సీ. పా. నిండుచందురునవ్వు నెమ్మోముసిరితోడ
నిరులు గ్రమ్మెడు వేణిభరముతోడ 111

'రవళి' శకటరేఫమన్నారు. రేఫమగుటకు:-

పినవీరభద్రుని శాకుంతలము (2-184) :

మ. నవలావణ్యపయోధిఁ జిత్త మను మంథానాద్రికిం జంద్రికా
పవనాశిం దటి త్రాడుగాఁ బెనచి యజ్ఞాతాస్త్రుఁడుం దీర్చినన్
రవళిం గోకిలకీరముల్ దరువ నీరత్నాకరంబందు ను
ద్భవముంబొందిన లక్ష్మిగావలయు నప్పద్మాక్షి నీక్షింపఁగన్. 112

యయాతి చరిత్రము (4-154) :

సీ. పా. ఎల్లప్పుడును బిక్కటిల్లు బేరులమ్రోత
రహిమించు దరగల రవళిగాగ 113

రనరవలు శకటరేఫమన్నారు. రేఫమగుటకు :-

చేమకూరవారి విజయవిలాసము (1-85):

క. రవరవలు నెరపు నీలపు
రవరవణముతోడఁ జెలి యరాళకచంబుల్
కవకవనవ్వున్ వలిజ
క్కవకవఁ గలకంఠకంఠి కఠిన కుచంబుల్ 114

'కచ' పదము బహువచనమేగాని ఏకవచనముగలుగదు ఉత్తరార్థమందు రీతియను గుణమున్నది. 115

రొమ్ము, చేరెడు, పరువంపుఁబువ్వు, సురసుర-(వీటిని) శకటరేఫము లన్నారు. 116

'రొమ్ము' రేఫమగుటకు :-

రంగనాథరామాయణము :

ద్విపద. నీ రొమ్ముగానికాడ నేర్తునా చూడ
నీ రాజ్యగతి చూడ నేరుతుఁగాక 117

'చేరెడు' రేఫ మగుటకు :

చేమకూరవారి విజయవిలాసము (1-68) :

ఉ. తీరిచినట్టులున్నవి గదే కనుబొమ్మలు, కన్నులంటిమా
చేరలఁ గొల్వఁగావలయు చేతులయందము చెప్పఁగిప్ప రా
దూరులు మల్చివేసినటు లున్నవి (బాపురె బొమ్మలోని సిం
గారము, శేషుఁడే పొగడఁగావలె నీతని రూపరేఖలన్) 118

'పరువము' రేఫ మగుటకు :

పారిజాతాపహరణము (4-4) :

క. తరుణీ యీ తరుశాఖాం
తరలోల దుకూలమారుతము లింద్రాణీ
పరివారవారసతులకు
పరువపు విరిగొంత బొడము బడలిక లడఁచున్. 119

ఉద్యోగపర్వము (2-112) :

సీ. పా. పరువంబు దప్పిన విరులు దాల్చుచుఁ దరు
చయము చుక్కలతేని చంద మరయ. 120

శ్రీకృష్ణరాయల ఆముక్తమాల్యద (5-67) :

సీ. పా. పరువంపు మంకెన విరివంపు నరవంపు
వాతెర చింద్రెంపు వాన గురియ. 121

మరియును గలవు.

'సుర సుర' రేఫ మగుటకు

చేమకూరవారి సారంగధర చరిత్రము (2-88) :

చ. ఉరుకుచ (దెందమెంత మృదువో మఱి తియ్యని తుంటవింటనే
విరవిరవోవు నారిఁగని పెన్నెఱి గొజ్జఁగ పూవుచేత న
చ్చెరువుగఁ బొంచి కంటికి దిసింపనివాఁ డవు దేసి యార్చెఁబో
సురసుర స్రుక్క; మెత్తనగుచోటనె గుద్దలి వాడియౌ గదా) 122

'గౌరవంక' (రేఫ మగుట) చింత్యమన్నారు. (అది) రేఫ మగుటకు :

మనుచరిత్రము (4-111) :

మ. శరసంధానముతోనె కొన్ని యడుగుల్ జౌజన్వనంబారి యా
ధరణిం గాల్గొని ద్రోణముల్ దిగిచి దోర్దండబలం జేసి యే
సిరి బోయల్ దినమంచు నార్చు పఱచున్ బెట్టాసలం డాయుచున్
గౌరవంకల్ మొఱవెట్టినట్లు గుణముల్ ఘోషింప రోషంబునన్. 123

చేమకూరవారి విజయవిలాసము (2-179) :

క. మఱఁ దపు దేసిన తూపులు
ధరియించియు నేమి చెప్పఁ దరుణి న్నరునిన్
సరిగోలల వడి నేసెన్
గౌరవంక రొదల్ సెలంగఁ గ్రొన్ననవింటన్. 124

'ఎరువు' (రేఫ మగుట) చింత్యమన్నారు. రేఫ మగుటకు :

అరణ్యపర్వము (4-347) :

క. ఇమ్ము నరేశ్వర మాతుర
గమ్ముల, నీ కార్యమయ్యెఁ గాదేఁ గడు లో
భమ్మొనర నొరుల సొమ్ములు
రమ్మనినన్ వచ్చునే యెరవు సతమగునే. 125

ఉద్యోగపర్వము (8-214) :

క. హరి పలికిన విధమంతయు
నెరవై యున్నయద వింటె, యీ మాట తెఱిరి
గరయుదము (తొలుత నీ పెను
పరిచందం బెల్లి నెఱుక పడియెడుఁ బిదపన్) 126

ఇట్లు బహులములు గలవు.

'కట్టెదురు' శకట రేఫ (మన్నారు) రేఫ మగుటకు :

విరాట పర్వము (5-55) :

క. ఒక మరి కిరీటి కట్టెది
రికిఁ గ్రమ్మనఁ బోయిరేని రెండవమా రి
య్యే కొనుట కోర్వగ (వేరై
రొకళ్లఁ గురురాజసేన యోధులలోనన్) 127

ఉద్యోగపర్వము (2-161) :

క. మగటిమి వారికి వీఁ డెదు
రుగ నమ్మి సుయోధనుఁడు విరోధముఁగొని (స
ర్వగుణాఢ్యులు బలవంతులు
నగు పాండు నృపాల సుతుల నవమానించెన్) 128

'ఱిచ్చ' రేఫ మన్నారు, (కాని అది) శకట రేఫ మగుటకు :

విరాటపర్వము (4-52) :

క. కని యుత్తరుండు గరుపా
టిన మేనును దలఁకు మనము ఱిచ్చపడిన చూ
పును నై త్రొట్రుపడుచు ని
ట్లనియె దిగులు సొచ్చి యాబృహన్నల తోడన్. 129

ద్రోణపర్వము (1-281) :

క. చిచ్చునకుఁ దోడు కరువలి
వచ్చినక్రియ భీముకడకు వాసవి యిమ్మె
(వచ్చిన మన యోధావలి
ఱిచ్చవడియె వారి మొన దఱిమికొని వచ్చెన్) 130

ఆరణ్య పర్వము (6-34) :

సీ. గీ. మహిత కమల మధుర మధురసాస్వాదన
పరవశాత్మయైన భ్రమరకాంత
ఱిచ్చ బుద్ధి నకట తేగు బువ్వుల రస
మాను బెట్టు బేల వై తిగాక. 131

దేహము గరుపాఱుట, తఱిమికొనుట, తేగు–అకారములందు నప్రకవిగా రే
వ్రాసిరి. ఈ మూడు పద్యములందును 'ఱిచ్చ' నేమి పరిశీలించి రేఫములందు
వ్రాసిరో (తెలియదు). ఆ సామర్థ్యము అవాచ్యము. 132

'గీ. అజ్జులాడి యాగి ఱాపడి సభలోన
తేసి పోరిలోన ఱిచ్చఁ బొరసి

తెన్న మనుగు పుడమితేల నేల నుతింప
మనకు విశ్వనాథుఁ డొనరియుండ' 183

(అను) నీ పద్యము పెద్దిరాజు కావ్యాలంకార చూడామణి యందు(7-45) ఉన్నదని లాక్షణికు లందఱు నెఱింగినదే. అప్పకవిగారును వ్రాసినారు. ఈపద్య మందు ఱకారముగాని రేఫములేదు. కావున ననేక గ్రంథములు పరిశీలించి-ఈ గ్రంథము చూచితే మఱియొక గ్రంథాపేక్ష లేకుండగా జెప్పుతామని ప్రతిజ్ఞచేసి చెప్పినారు. ఇదివఱకు వ్రాసిన గ్రంథమందు (అప్పకవిగారు) రేఫములు ఱకారము లందున, ఱకారములు రేఫములందున, కేవల రేఫములు-కేవల ఱకారములు వ్రాసినవి ఉభయ మందున, ఉభయము నందును వ్రాసినవి యొక్కొక్క దాని యందున స్పష్టము చేసినాము. ఇదివరకే గ్రంథ విస్తరమైనందున నప్పకవిగారు చెప్పిన రేఫ ఱకార)ములను గూర్చిన) గ్రంథము నిలిపినాము. 184

## -: రేఫ ఱకారములు-యతిప్రాసలలో సాంకర్యము :-

తిమ్మకవిగారు లక్షణసార సంగ్రహమందు :-

'కాకునూరి యప్పకవి యహోబలపతి
ముద్దరాజు రామ ముఖ్యు లెల్ల
పోతరాజు కబ్బమున ఱాలు రేఫలు
గదిసె నంచుఁ బలికి రది హుళక్కి. (3-340) 185

'ఉ. ఇమ్మెర పోతరాజకృత భాగవతంబు సలక్షణంబుగా
కి మ్మహి నేమిటం గొదువ నెంతయు నారసి చూడ నందు రే
ఫమ్ములు ఱాలునుం గదిసి ప్రాసములైన కతంబునంగదా
నిమ్మగ నాదిలాక్షణికు లెల్లను మాని రుదాహరింపఁగన్' 186

అని రామన్న చెప్పినాడు.

క. పురసతుల విలోకనములు
సరసాలాపములు నర్మ సంభోగంబుల్
మఱిగి హరి మనల నొల్లఁడు
నరవరు లో యమ్మ నూతనాప్రియులుగదే' 187

అని పోతరాజు చెప్పినారని అహోబలపతి వ్రాసినాడు. మరికొన్ని కొందఱు లాక్షణికులున్ను ఈలాగే అన్నారుగావి, పోతరాజు లాక్షణికు డగుటచు కాకుండుటను లెస్స పరిశీలించినారు కారు. 138

సీ. అఖిల వేదాంత విద్యా రహస్య విదుండు
సహజ పాండిత్య విశారదుండు
మత్తక్షితీశాధమ స్తోత్ర విముఖుండు
శంభు పదాబ్జ పూజారతుండు
పటుతర కవితా విభాసిత ప్రతిభుండు
సకలాంధ్ర లక్షణ చక్రవర్తి
రఘుకులేశ నిదేశ రచిత మహాభాగ
వతపురాణుఁడు పుణ్యవర్ధనుండు
బుధ జనహితుండు బమ్మెరపోత సుకవి
యెన్న రేఫ ఱకారంబు లెఱుఁగఁ డనుచు
నజ్ఞులొకకొంద ఱాడుదు రమ్మహాత్ము
కవిత కెందును లోపంబు గలుగ దభవః 139

రామన్న మొదలైన వారిని తెలియని వారనుట తప్పు: పరిశీలించనిది నిష్కారణ (ముగా) నాక్షేపించిన వారిది తప్పుగాక. ఇంకను 140
తిమ్మకవిగారు లక్షణసార సంగ్రహమందు :-

సీ. ఘనుఁడు పోతనమంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించు నెడల
సర్వజ్ఞ సింగయ క్ష్మావరుం డది దన
కిమ్మని వేడిన నిడకయున్న
నలిగి యాపుస్తకం బవనిఁ బాతించిన
చివికి యందొక కొంత శిధిలమయ్యె
క్రమ్మర నది వెలిగందుల నారప
రాజును మరి బొప్పరాజు, గంగ
రాజు మొదలగు కవివరుల్ తేజమెసఁగఁ
జెప్పి రాగ్రంథములయందు తప్పులొదవెఁ

గాని పోతకవీంద్రుని కవితయందు
లక్షణం బేమి తప్పదు దక్షహరణ! (౩-౩44) 141

పోతరాజు చెప్పినది ప్రథమస్కంధము, ద్వితీయము కొంతయు, ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది స్కంధములును, దశమము పూర్వభాగము కొంతయు నున్నది. అందులో రేఫఱకార సాంకర్యము లేకుండుటకు వ్రాయుచున్నాము:-142

దీర్ఘముల మీద ఱకారములకు :

ప్రథమ స్కంధము (158) :

ఉ. మాఱు పడంగనేసి యసమర్థుల సుప్తుల నస్త్రవిద్య లం
దేఱని పిన్న పాపల నతిత్వరితంబునఁ ద్రుంచుఁ గ్రూరుఁడై
పాఱుఁడుగాని పాతకుఁడు ప్రాణభయంబున వెచ్చ నూర్చుచుం
బాఱెడు వీనిఁ గావుము కృపామతి, నర్జున! పాపవర్జనా! 143

కుఱుచలమీది ఱకారములకు :-

అందే (159) :

చ. వెఱచినవారి దైన్యమున వేదురు నొందినవారి నిద్రమై
మఱచినవారి సౌఖ్యమున మద్యము ద్రావిన వారి నగ్నులై
పఱచినవారి సాధుజనభావము వారిని కావు మంచు వా
చఱచినవారిఁ గామినులఁ జంపుట ధర్మముగాదు ఫల్గునా! 144

సప్తమ స్కంధము (194) :

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు బాహుల నొడ్డఁడు బంధురాజిలో
దూఱఁడు ఘోర కృత్యమని దూఱఁడు తండ్రిని మిత్రవర్గముం
జీఱఁడు మాతృసంఘము వసించు సువర్ణగృహంబులోనికిన్
దాఱఁడు కావరే యనఁడు దాపము నొందఁడు కంటగింపడున్. 145

అందే (63) :

ఉ. ఱెక్కలు రావు పిల్లలకు ఱేపట నుండియు మేత గానమిం
బొక్కెడు గూటిలో నెగసి పోవఁగ నేరవు మున్ను తల్లి యా

దిక్కునకునుండి వచ్చునని త్రిప్పని చూడ్కుల నిక్కినిక్కి న
ద్దిక్కులు చూచుచున్న వతిదీనత నెట్లు భరింతు నక్కటా. 146

అందే (202) :

చ. ఎఱుగఁడు జీవనౌషధము లెవ్వరు భర్తలు లేరు బాధలం
దఱలఁడు నైజతేజమున తథ్యము జాడ్యము లేదు మిక్కిలి
న్నెఱయుచు నున్నవాఁ డొక నిమేషము దైన్యము నొందఁడింక నె
త్తెఱఁగునఁ ద్రుంతు వేసరితి దివ్యము వీని ప్రభావ మెట్టిదో? 147

అష్టమ స్కంధము (62) :

మ. ఉఱుకుం గుంభయుగంబుపై నరిక్రియన్ హుమ్మంచు పాదంబులన్
దిఱుగన్ గంతము వెన్నుఁ దన్ను నెగయున్ హేలాగతి న్వాలమున్
జఱుచున్ నుగ్గుగ దాక ముంచు మునుఁగున్ శల్యంబులుం దంతముల్
విఱుగన్ వ్రేయుచుఁ బొంచి పొంచి కదియున్ వేదండయూథోత్తమున్. 148

అందే (257) :

క. ఒఱపగు నురమును బిఱుదును
నెఱిఁదోకయు ముఖము సిరియు నిర్మలఖురముల్
కుఱుచ చెవుల్ దెలి గన్నులు
పఱచగు కంఠంబు జూడఁదగు నా హరికిన్. 149

అందే (588) :

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు
నఱిముఱి గుబురులకుఁ జనుచు హరిహరి యనుచున్
మఱుచుచు నురుకుచుఁ దిరుగుచు
కుఱుమట్టవు పడుచు వడుఁగు గొంత నటించెన్. 150

నవమస్కంధము (206) :

చ. ఎఱిఁగితి మద్దిరయ్య తరవేటికి గుఱ్ఱపు దొంగఁ బట్టఁ డా
జఱభినిఁ బట్టి చంపుఁ దతిసాధుమునీంద్రుడువోలె నేత్రముల్
దెఱవక బొక్కినోరు మెదలింపక బాసిక వెట్టియుంచు న
య్యెఱువది వేవురుం జని కరాయుధముల్ ఝళిపించి డాయుచున్. 151

దశమస్కంధము - పూ. భా. (469) :

క. పాఱుదురు కికురు పొడుచుచు
దూఱుదురు భయంబులేక తోరపుటురముల్
జాఱుదురు ఘనశిలాతటి
మీఱుదు రెన్నంగరాని మెలకువల నృపా.' 152

అందే (325) :

క. తెఱవ యొకతె నిద్రింపఁగ
నెఱిఁగట్టిన వలువ విడిచి నేఁడొక తేలుం
గఱిపించె నీ కుమారుఁడు
వెఱచుచు నది పఱవ నగుట విహితమె సాధ్వీ. 153

అందే (660) :

చ. వెఱమఱ లేని మేటి బలవీరుఁడు కృష్ణకుమారుఁ డొక్కచేఁ
జఱచి ఖగేంద్రు చందమునఁ జక్కఁగ దౌదలు వట్టి కన్నులం
జొఱజొఱ దుర్విషానలము నుబ్బవధింపక యెత్తి లీలతో
బిఱబిఱ ద్రిప్పివైచెఁ బరిశేషితదర్పముఁ గ్రూర సర్పమున్. 154

అందే (703) :

క. కఱచిన భుజగము రదములు
విఱుగఁగ వదనముల విషము వెడలఁగ శిరముల్
పఱియలుగ నడఁచె గరుడఁడు
తఱిమి కనక రుచులు గలుగు తన డాఱెక్కన్. 155

ఇది పోతరాజుగారి కవిత్వము.

ఇక వెలిగందుల నారపరాజు కవిత్వము :

ద్వితీయ స్కంధము (247) :

చ. హరి వచనంబు లాత్మకుఁ బ్రియం బొనరింపఁ బయోజగర్భుఁడో
పరమపదేశ యోగిజన భావన యీ నిఖిలోర్వియందు నీ
వెఱుఁగని యట్టి యర్థమొకటేనియుఁ గల్గునె యైన నామదిం
బెరసిన కోర్కె దీని వినిపించు దయామతిఁ జిత్తగింపవే 156

దశమస్కంధము ఉ. భా. (476)

క. ఎఱుగమి నైనను భూసుర
వరుల ధనం బపహరింప వలువదు పతికిన్
మఱుపున ననలము ముట్టిన
దరికొని వెసఁ గాల్చకున్నె తను వెరియంగన్. 157

తృతీయ స్కంధము (54) :

క. హరిపద సేవకుఁ డరి భీ
కరుఁ డర్జును వలన మిగుల కార్ముక విద్యల్
గఱచిన బలియుఁడు సాత్యకి
వఱలిన సుఖలీల నున్నవాఁడె ధరిత్రిన్. 158

చతుర్థ స్కంధము (38) :

చ. సరసిజగర్భ యోగిజన సర్వసుపర్వ మునీంద్ర హవ్య భు
క్పరమ ఋషి ప్రజాపతులు భక్తిమెయిం జనుదెంచి యుండున
త్తఱి తరుణార్కతేజుఁడగు దక్షుఁడు వచ్చినఁ దత్సభాసదుల్
తరమిడి లేచి రప్పుడు పితామహ భర్గులు దక్క నందఱున్ 159

ఇక బొప్పరాజు గంగరాజు కవిత్వము :-

పంచమ స్కంధము (1-9) :

క. హరి నా ముఖమున నీకున్
నెఱిఁగింపఁదలంచి నాకు నెఱిఁగించెను సు
స్థిరమతి వినుమంతయు శ్రీ
హరి వాక్యముగాఁ దలంచి యవనీనాథా ! 160

అని వ్రాసినారు.

కావున పోతరాజుగారి భాగవతము అన్ని విధముల సర్వోత్కృష్టమైనది.

(ఇక ఇతర కవుల కవిత్వములందు) రేఫ అకార సాంకర్యము కలుగుటకు తిమ్మకవిగారు 'లక్ష్మణసార సంగ్రహము' (3-319) నందు :

క. అలసాని పెద్దకవి పిం
గళి సూరన రామభద్ర కవివర్యుఁడు పి

ల్లల మట్టి వీరభద్రుఁడు
గలిపిరి గద కృతుల జాలు గడు రేఫములున్. 162

మనుచరిత్రము (3-12) :

శా. క్రేఁగుల్గట్టి నభోంతరాళమునఁ జాఱెన్ బక్షు లుష్ణాంశు పా
షాణవ్రాతము కోష్ణమయ్యె (మృగతృష్ణా వార్ధు లింకెన్ జపా
శోణంబయ్యెఁ బతంగబింబము, దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణంబయ్యె, సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గడున్.) 163

ఆముక్తమాల్యద శ్రీ కృష్ణరాయ విరచితమని యుండినను పెద్దనగారి కవిత్వము గావున 'పెద్దకవి కలిపినా'రని (చెప్పుచు నీ క్రింది ఆముక్తమాల్యద పద్యములు) చెప్పినారు. 164

ఆముక్తమాల్యద (1-152) :

మ. ఇలకున్ వ్రేఁగుగఁ బండు తీరవన పుండ్రేక్షుచ్ఛటాదీప్త ల
గ్గలమై వ్రేల నురుస్వనంబు లెసఁగంగాఁ ద్రుప్ప రాట్నంపు గుం
డ్రలు నాఁ దేనె కొలంకులం బొఱలి పాఱున్ విచ్చు పంకేరుహం
బుల నాడెం దొలుసంజ తేటి వలయంబుల్ తార ఝుంకారముల్. 165

అందే (1-82) :

మ. పునుగుందావి నవోదనంబు మిరియంపుం బొళ్ళతోఁ జట్టు చుం
యను నాదారని కూరగుంపు ముకుమందై పేర్చు నావం చిగు
ర్కొను పచ్చళ్లను పాయసాన్నములు నూఱుంగాయలున్ జేచుఱు
క్కనునేయిన్ జిఱువాలు వేలుపగు నాహారం బిడున్ సీతువున్. 166

అందే (7-49) :

చ. ముదిమది దప్పితోటు మునిముఖ్య భవత్తనయన్ గృహంబునన్
బదిలముజేసి వచ్చి మఱి బట్టబయల్ వెదదూఱు దూఱె దా
సదన మికొక్కమాటరసి చంచలలోచనఁ గానకున్న దూ
ఱెదు మరి కాని బుద్ధి విపరీతతఁ బొందక పోయి చూడుమా. 167

అందే (4-245) :

శా. తేపుల్ మాపు మతంగజంబును మణి శ్రీఖండ ముక్తాలియున్
రా వాణిజ్యము బెంచి యేలఁగనగున్ (వర్షంపుటెవ్వాన్ రుజన్
హావళ్లందగు నన్యభూప్రజల రా జాయాయి జాత్యోచితిన్
ప్రోవంగాఁదగుఁ, దోట దొడ్డి గను లాప్తుల్ సూడఁ బంపందగున్) 168

సూరన రాఘవ పాండవీయము (1-20) :

సీ పా. కానలో దారు మృగంబులకై వడిఁ
గైకొని యసమాస్త్ర కర్మవలన 169

ఇందులో, తారు = తమరు అన్న అర్థమునందు లఘురేఫ తాఱుట = అడగుట అన్న అర్థమునందు గురురేఫము నగును. (కాని) వెల్లంకి తాతంభట్టు నిదుపుల మీద బండి లేదన్నాడు. అందుకు 'తారుట' రేఫమే అని రాఘవపాండవీయానకు టీక వ్రాయుచు ముద్దరాజు రామన్న సమ్మతి వ్రాసినాడు. అది (సరి) కాదు. 'తాఱుట' అకారమే సిద్ధము. మరియు సూరన్న అది అకారానకు. 170

సీ. పా. రేఖపై మీఁదటి ఱెప్పల యొప్పు ప
న్నాగంపు గడవళ్లె బాగు నెఱప. 171

అని, మరియు ప్రభావతీ ప్రద్యుమ్నమునందు :

క. గ్రక్కునఁ జని వ్రాలుదునో
ఱెక్కలు గట్టుకొని దివిజ రిపు మేడలపై
నక్కొమ్మఁ జూచు టెపుడెపు
డొక్కో యనునంత తమక మున్నది తమలోన్. (4-86) 172

(అని ప్రయోగించినాడు.)

ఇక కవి రామభద్రుడు రామాభ్యుదయము (8-69) నందు :

ఉ. సైరిభ వారిభ ద్విరద శాసన ఖడ్గ ఖరాధిరూఢులై
దారలు బూర కొమ్ములును దప్పెటలుం బటహంబులుం బదు
ల్వానఱును వేలు మ్రోయఁగ వను ల్వాడి వెల్వాడి హత్తి యుత్తర
ద్వారముపంక...ర నిరు వంకల పౌజులు దీర్చి రయ్యెడన్. 173

మరియు నందే (పీఠిక. 104) :

ఉ. (రంగనవద్యమై సుధ తెఱంగన శోభిలి విన్గొలంకు చే
రం గన దిందు దీప్తి నెదురం గనకోదరు కంబుకంఠి దూ
ఱంగ ననంగు జాతిపగ ఱం గనలం గమకించి) తీవి మీ
ఱంగ నటంచు గొబ్బురిపుర ప్రభు రంగనకీర్తి రంజిలన్. 174

(అని ప్రయోగించి రేఫ ఱకారములు కలిపినాడు.)

మరి, పిల్లలమఱ్ఱి పినవీరన్న జైమినీ భారతము (1-137) నందు :

ఉ. తూరుపు తెల్లవారుటయుఁ దోడనె మంగల పాఠక స్తుతుల్
మీఱఁ దదీయ రాగముల మేల్కని కాల్య సమంచిత క్రియల్
దీరిచి పాండు పుత్ర వసుదేవ సుతుల్ ప్రమదంబు మోములం
దేరఁగ వేడ్కతో నరుగుదెంచి సభాస్థలి నిల్చి రయ్యెడన్. 175

అని, సంకుసాల నరసింగయ 'కవికర్ణ రసాయనము' (5-75) నందు :

గీ. వనధి సర్వంకషంబయ్యు వలయు పనికి
తేఫులన కాని చొర రాని రీతిఁ దవరి
విశ్వరూపకుఁ డయ్యు శ్రీ విభుఁడు కూర్మ
రూపముల సేవ్యుఁడగు నారురుక్షులకును. 176

(అని రేఫ ఱకారములు కలిపినారు.)

'నాన్యేషాం వైధర్మ్యం, లఘ్వలఘూనాం,
రయోస్తు నిత్యం స్యాత్'

అనే ఆంధ్ర వ్యాకరణ సూత్రమునకు టీకవ్రాసి, రేఫ ఱకారాలు కలుపరాదని చెప్పిన బాలసరస్వతిగారు తమ 'చంద్రికా పరిణయ' మందు :-

ఉ. ఆక్కమలేక్షణన్ సవినయంబునఁ గాంచుము నాదు మాఱుగా
మ్రొక్కుము సేమ మా భువన మోహిని నీకని పల్కు మూర్తిఁజేఁ
జిక్కితి వేగఁ బ్రోవుమని చెప్పుము పొమ్మిఁక తేటిరాయ నీ
తెక్కల మాటునన్ నను భరించి లభింపుము కీర్తిపుణ్యముల్. 177

(అని రేఫ అకారములను కలిపినారు). ఇటువలెనే మహాకవులకున్ను రేఫ అకారాలపట్ల పరిశీలన లేకపోయినది" అని వ్రాసినారు. 178

లాక్షణికులు నిర్దోషమైన భాగవతము నాక్షేపించిరి. రేఫ అకార సాంకర్యముగల (మనుచరిత్ర) ఆముక్తమాల్యాది కావ్యముల నాక్షేపించరయిరి. అయితే అది పరిశీలించి, తప్పులున్న చోట తప్పులనుట తిమ్మకవి సార్వభౌమునికి తప్పా. పామరులు 'అప్పకవీయమునందు తప్పులున్న' వన్నామని మమునాడుదురు. చెప్పకమానితే, తప్పులే ఒప్పులగును. 179

రేఫ సాంకర్యములు మరియును గలవు.

చేమకూరవారి విజయ విలాసము (1-23) :

ఉ. కోపమొకింతలేదు బుధ కోటికిఁ గొంగు పసిండి సత్యమా
రూపము తారతమ్యము నెఱుంగ స్వతంత్రుఁడు నూతన ప్రియా
టోపము లేని నిశ్చలుఁ డిటుల్ గృతలక్షణుఁడై చెలంగఁగా
ద్వాపర లక్షణుం దనఁగ వచ్చునొకో యిల ధర్మనందనున్. 180

అందే (2-40) :

సీ. పా. తన పితామహుని బృందారకాధిపుఁ బోలు
ఱెప్ప వ్రేయక చూచు రీతిఁ గనుట... 181

చేమకూరవారి సారంగధర చరిత్ర (2-180) :

క. వ్రతమా యిటు లేచ మధు
వ్రతమా సీ కుచితమా విరాలింబడ నా
మత మాలోచించ వయో దా
రు తమా మోదయుతమా చిఱుత మారుతమా! 182

అందే (3-252) :

క. మఱపింపఁదగునె నృపతికి
ధర పాలన సేయకునికి ధర్మం బగునే
సరగున తిరిగి పురంబున
కరుగుము చింతిలక మానవాధిపతిలకా! 183

అందే (2-30) :

క. ఈ రాసుతు సమ్ముఖమున
జేరి యెవరు బుద్ధిమతులు చెప్పెడివారల్
లేరైరా యని పెద్దలు
దూఱుదు రందుకొఱ కళుకుతో ననవలసెన్. 184

అందే (2-71) :

సీ. పా. నిస్తంభ నీలమణి స్తంభ రుచితోడ
నెఱి గొప్పు కప్పు డాలొరసి కొనఁగ... 185

మరియును గలవు.

రుక్మాంగద చరిత్రము (5-9) :

చ. వెఱువకు మాత్మలో ననుచు వింతఁగఁ జూడఁగ వల్దటంచు న
తెఱవకు లోలుఁడై యతఁడు తెల్లమిగా నను నొల్లకుండుచే
నెఱిఁగి సహింపలే కెచట కేని యు నేగు తలంపుతోడఁ ద
త్తరముగ నేగుదెంతుఁ బ్రమదంబున నిన్ననుగొంటి నియ్యెడన్. 186

కవి రామభద్రుడుగారి 'జయ రామా రామ' శతకము నందు :

సీ. పా గరల కంధరు విల్లు విఱుగునా నేదిపై
కొండలు దేలునా, కుంభకర్ణుఁ
డుదెగునా, వార్థి గట్టు వడునా...' 187

మరియు నందే :

సీ. చలమున నీవు దశగ్రీవుతోఁ బోరు
నప్పు డహంపూర్వికాది ఘోర
శబ్ద గర్వములు ముష్టా ముష్టిఁ గదియు శా
ఖామృగ దనుజ (సంఘముల) నరకు
గొనశ బాహాబాహిఁ బెనగు రాక్షస కీశ
వరులు ఖడ్గాఖడ్గి నఱుకు లాడ

కపి దైత్య వీరశేఖరు లశ్వ ఘోషలు
కరి బృంహితములు మార్గణ గరుత్ప్ర
చండ ఝాంకృతు లట్ట హాసములు నెమ్మి
ఘన నినాదంబు లతి భయంకరము దుర మ
లంఘ్య మీక్షింప బ్రహ్మాదులకు వశంబె
జయరమా రామ రామ రాక్షస విరామ. 188

ఈ పద్యమందు రేఫ ఱకార సాంకర్యమేకాదు. 'ముష్టీముష్టి' యని యుండవలసినందుకు 'ముష్టాముష్టి'యని యతి యందు ప్రయోగించినారు. 189

వ్యాకరణ సూత్రము :-

'కర్మవ్యవహారే బహుప్రీహౌ పూర్వ పదాంతస్య దీర్ఘః
ఇచ్ సమాసాంతో వక్ష్యతే.
తత్ర తేనేద మితి సరూపే.
సప్తమ్యంతే గ్రహణవిషయే సరూపే పరే తృతీ
యాంతే చ ప్రహరణ విషయే. ఇదం యుద్ధం
ప్రవృత్త మిత్యర్థే సమస్యేతే
కేశేషు కేశేషు గృహీత్వా ఇదం యుద్ధం ప్రవృత్తం కేశాకేశి.
దండైశ్చ దండైశ్చ ప్రహృత్యేదం యుద్ధం ప్రవృత్తమితి దండాదండి.
ముష్టినా ముష్టినా ప్రవృత్తం యుద్ధమితి ముష్టీముష్టి.
'ఓర్గుణః'. ఉవర్ణాంతస్య గుణః స్యాత్ తద్ధితే
అవాదేశః. బాహాబాహవి. తద్ధితే కిం? పట్వీ.
సరూపే ఇతి కిం? హలేన, ముసలేన...'

అని యున్నందున 'ముష్టాముష్టి' యనరాదు. అకారాంతములకు-దండాదండి. ఇకారాంతములకు- 'ముష్టీముష్టి.' ఉకారాంతములకు-'బాహాబాహవి'అని వ్యాకరణమందే యున్నది. 'బాహాబాహి' అనుచోట 'బాహా' శబ్దము-ఆకారాంత స్త్రీ లింగము-కలదు. కావున 'బాహాబాహి'యని పూర్వపదాంతముకే దీర్ఘము. కాని, 'ముష్టి' శబ్దము అకారాంతముగా కన్పించదు. ఇక,—— 190

ఆంధ్రనామ సంగ్రహము (స్థావర 13) నందు :

క. మఱుగనఁగ నోలమాసము
మఱువనఁగాఁ జాట నంగ మాటన వరుసన్
బరగు నివెల్ల నగోచర
ధరణీ నామంబు లగుచు దర్పకదమనా ! 191

అందే (మానవ 1) :

గీ. పా. తేఁడు దొరసామి యన నొప్పు నృపునిపేళ్ళు. 192

అని, మరియు 'నాంధ్ర భాషార్ణవము' నందు :

గీ. చాయ పెనిమిటి జముతండ్రి జగముకన్ను
తమ్మిచుట్టము వినురత......
ప్రాఁబలుకు చెంకి పచ్చగుఱ్ఱములవాఁడు. 193

అని రేఫ అకారములు కలిసినవి. ఇఱ్ఱి, మఱ్ఱి, (గుఱ్ఱము) మొదలైన ద్విత్వములు గల పదములు శకట రేఫములేగాని రేఫములు గాదని పండిత పామర సాధారణము. మరియు,-

అందే :

క. మెఱుఁగన మెఱువన......
బరగును విద్యుత్తు స్తనిత వాచకమౌగా
యుఱు మనగ నశని పిడుగం
దురు కొఱడన రోహితమ్ము దోచు మురారీ. 194

అందే :

గీ, 'మొగిలు విరినీరు నాగను దగు జలంబు
మీరును హిమాంబుసంజ్ఞ పన్నీరనంగ......' 195

అని రేఫ అకారములు కలిసినవి. ఇటువలెనే మరియును గలవు. 196

ఆంధ్రశేషము :

క. తఱి యజ్ఞదనన సమయం
బుఱడనఁగను సరకుసేయ కుండెననఁగఁ జే
ర్లొఱ పగు గణింపబడుటకుఁ
గరిచర్మాంబర త్రినేత్ర గౌరీమిత్రా ! 197

రామలింగేశ శతకము :

సీ. కోతికి జల్తారు కుల్లాయి యేటికి
విరజాజి పూదండ విధవకేల
ముక్కిడి తొత్తుకు ముత్యాల నత్తేల
యద్దమేటికి ని జాత్యంధునకును
మాచకమ్మకు నేల మౌక్తిక హారముల్
క్రూరచిత్తునకు సద్గోష్ఠి యేల
అంకు బోతుకును సద్వైత నిష్ఠ లేటికి
వావి యేటికిని దుర్వర్తనునకు
మాట నిల్కడ సుంకరమోట కేల
చెవిటివానికి సత్కథాశ్రవణ మేల
సరస కవితారసంబు ముష్కరున కేల
రామలింగేశ రామచంద్రపురవేశ ! 198

'భళిరకందర్ప' శతకము ;

సీ. మరుకేలి గవయ నత్తఱి తొడల్గదియించి
పై కెక్కుటకు హాసుబరపు నొరపు
రాణించు నెఱజంటి అవిక పట్టీగంటి
ముస్తరుల్ దొంతరై బిత్తరింప...... 199

మృత్యుంజయ విలాసము :

ద్విపద. చెఱుకు విల్లెక్కిడి చేనిండ బూని
త్వర సురవరపురి దరియంగ నరిగి
ఎఱుకలసానిగా రెన్నఁగా నాపాలి
హరి కృప మూర్తియై యవతరించినది
హరి కృపగల్గు సర్వైశ్వర్యములును
కొరత లేదెప్పుడు కొండ యెక్కెదవు
ఊఱుఁగాయలు రుచు లూఱు పచ్చళ్ళు
బూరెలు చక్కరాల్ పూతట్టుగారె
లటిసె లప్పాల్మొదలైన భక్ష్యములు
పరమాన్నములు పండు పానకా ల్వెఱుగు
మఱది వాలి యొనర్చి మాధవస్వామి

హరుని మీఁదను కుంకుమాంబువు ల్సిమ్మె
.........................
నాలవహస్తంబు నవ్వసంతఁబు
లీల నందించి యా లేమలమీఁద
గొరిచే నిండించి కలకల నవ్వె
.........................
మెఱుఁగు బోడి శిరంబు మిక్కిలి వంచి
కరగినయట్టి బంగరు ముద్దలాగు." 200

'నవ్వసంత' మనుచోట నఖండయతి.

గీ. పొరలు నుసురను కనుమూయు వెఱగుఁజెందు
బెదరి పాన్పునఁబడి లేచు నొదుగు నవ్వు
కన్నుగవ నీరు నించు చికాకునొందు
వాయు చలవల్లి పోలిక వడఁకుఁ జెందు. 201

భానుమతీ పరిణయము :

ఉ. ఆరతిరాజు తాపమున నల్లలనాడు మెలంతమేనిపై
జాఱిన కప్పు పెన్నెఱుల సందడి యొప్పు మహానిలాహతిం
గారు మెఱుంగు కీలెడలి గ్రక్కున వ్రాలిన మోహదృష్టిచే
వారిధరంబు మిన్ను డిగి వచ్చి వెసం బయిఁ బర్వెనో యనన్. 202

అందే :

చ. సరసిజగంధి పెందొడల సాటికి రా నెదిరించి పోరు సీ
కరభము లెల్ల జేబడుట కన్గొని యుండియుఁ దజ్జయార్థమై
పొరలఁ బెనంగి యూచఁబడి పోవుట లింతియెగాక ధాత్రిపై
నఁటులు పిల్ల పిల్ల తరమైనను సామ్యముఁ బొందనేర్చునే. 203

అందే :

రగడ : ప్రేమ నెఱుఁగు పెద్ద తెగులను తెగులను
గోము మీఱిన కొండ గోగులను గోగులను... 204

అరణ్యపర్వము (4-294) :

క. ఉరవగు నారికె పంటలు
గొఱియల పాడియును దఱచగున్ బురుషులకున్
దెఱవలు చుట్టము లయ్యెద
రెరచియు భుజియింతు రర్థి నెల్ల జనంబుల్. 205

ఇటువలెనే మరియు (బహుళములు) గలవు. ఇక— 206

## రేఫయుత పద పరిగణనము

తిమ్మకవి సార్వభౌముడు లక్షణసార సంగ్రహమునందు నిర్ణయించిన లఘు రేఫలు :

అరి = సింజిని, పన్ను
అరదము
అరవాయి
అరిది
అరగన్ను
అరయుట
అరణము
అరుగుట
అరిగె
అబ్బురము

ఇరవు = నివాసము
ఇరువది
ఇరుగు
ఇరువురు
ఇరవన్నె = పసిడి
ఇరుసు
ఇరుగుడు మ్రాను
ఇవురు
ఇవ్వరు

ఉరులొడ్డుట
ఉరియాడుట
ఉరళించుట
ఉరుపడించుట
ఉరువరి

ఎరగలి = చిచ్చు
(చిత్తము) ఎరియుట
ఎరువు
ఎర (మ్రింగెను)
(సొమ్ము) ఎరవు
ఎర పరికెము
ఎవ్వరు

ఒరులు = అన్యులు
(ఒం) దొరులు
ఒరిమెలు
ఒరిమె
(సొమ్ము) లొరయుట
(ఉల్ల) మొరయుట
ఒక్కరుడు
ఒరగంట రాచుట

కరివాడి మావులు
కరిసెము = కృషి
(పైడి) కరుగుట
కరణి
కరవలి
కరవాలు
కరకలు
కరకరి
కరువు = మూస

కనికరము
కరకర (గ్రాలుట)
కరమొప్పుట
(కూటి) కరడు
(లక్క) కరవటము
కరిగోరుట
(వాన) కురియుట
కెరలుట
కొర బ్రాణము
కదురు
కుదురు

గరిత = పతివ్రత
గరగరిక
(మేను)గరుదాల్చుట
(పెండ్లి) గరగ
గరికి
గరువతనము
గరిడి
గరపచేను
గిరగిర (వ్రాయుట)
గురుగు కూర
గురపోతు
(సవరపు) గురుజు
గురువింద గురువులు
గురువు = దొడ్డు
గురువులు = పిడతలు
గొరవంక పిట్టలు
గొరగొర నడచుట
గొరిజ

చిరుగుట
చిత్తరు
చెరువు
చెచ్చెర
(కోక) చెరగు
(చేటం) జెరుగుట
చెరువుట
చొరవ
చొరకుండుట
చక్కెర
చప్పరము

జక్కర

తరచియాడుట
(ఏటి) తరగలు
తరతర
తరములు = చుట్టములు
తరముగామి
తరచిన మజ్జిగ
తరవాయ
(దేహంబు) తరలబారుట
తరబడి
తిరుగుట
తిరియుట
తిరుగ = క్రమ్మర
తెరతెర వచ్చుట
తెరువు = తోడు
తెరలు = కట్టుట
(రెండు) తెరంగులు = తెగలు
తెరల గ్రాగిన నెయ్యి
తొరలుట
తొరగుట

దరికొనుట
దరి త్రొక్కుట
దరి
దరియుట
దురము
దురటిల్లుట
దురదుర
ఎ) దురుట
దొరయు
దొర
దొరలుట
దొరకొలుపుట
దొరయుట
దొరకుట

నరములు
నురుములు
నెరపుట
నెరి
నెరసులు
నెరయుట
నెరసిన తల

పరువులు వెట్టుట
పరచనుదెంచుట
పరపుట = నించుట
పరపు = నిడుసు
పరివడ
పరువడ
పరిమార్చుట
(అమ్మలు) పరగించుట

పరుగుట
పరుసదనంబు
పురపుర బొక్కుట
పురికొల్పుట
పురుగు
(తనకు) పురుడు (ఎవ్వఁడు)
పురిటాలు
పేరడాలు
పెరుగు
(మేను) పెరుగుట
పొరుగు
పొరిగొంట
పొరిపొరి
పొరలుట
పొర
పొరపొచ్చెము
పొరిగరుగుట

బరులు
బరిమేన
బరిగట్టె
బరడు
బరవు
బరువసంబు
బరుజులు
బిరుదు
బిరుసు
బురద
బురబుర
బొరగుట
బెరయుట

ఖరుకు
ఖొరుసు

మరులు
మరియాద
మరలుట
మిరియములు
మురువు
మురమురలాడుట
మురియుట
మురుగు
మురియలు
మెరమెర
మొరపనేల
మొరడు
మొరయుట

రచ్చ
రజ్జులాడి
రమ్మంట
రంకెలు
రమణ
రవళి
రంతు
రహి
రంగు
రిత్త
రెండు
రెట్టపెట్టుట
రొద

వరుస

వరజులు
వరువుడు
వరి
వరగ
వరుస
విరవిరబోవుట
విరియుట
విరియజల్లుట
విరులు
విరివి
వెరను
వెరసు
వెరవరి
వివరము
వెదురు

సరకు (లమ్ముట)
సిరి
సరులు
సరకుగొనమి
సరగ
సరుదుట
సరసను
సరవి
సరిగె
పరి
సురట
సురె
సురుగుట
సెరబడుట
సొరిది

హారివాణము = తల్లె
హారువు
హూరుమంజి ముత్తెము
హొరంగు

దెప్పరము

ఆరుట = నిండుట
ఆరెకులు = తలవరులు
ఆరాటము
ఆరగించుట
ఆరటము
ఆరయుట = విమర్శించుట

ఈరిక లెత్తుట
ఈరెలుగు
ఈరు = రెండు, ఇరవు
ఈరసము
(దానము) ఈరే (యనుట)

ఊరు = గ్రామము
ఊరార్చుట
ఊరకుండుట

ఏరి
ఏరికి
ఏరా

ఓరసిక
ఓరసిల్లుట
ఓరుచుకొనుట

ఓరెము = అన్నము
ఓరీ

కారులు = కల్లలు
కారుమెఱుగు
కారించుట
(ము) క్కారుపంట
కారాకు
(పట్టు) కారు
కారాటము
కూరుకు = నిద్ర
కూరిమి
కూరసేయుట
(మన్ను) కూరుట
(తోట) కూర
(నెనరు) కూరిచి
కూరుట = పొగలుట
కేరుట
కోరడి
కోరిక
కోరు = పన్ను వెట్టుట
కోరగిన్నె
(పంది) కోరాడుట
(చే) కూరుట

గారాము
గారవట్టుట
గారాబము
గారనము
గారె
గారచెట్టు
గోరు = నఖము

చీరికి గొనంకుట
చీర = కోక
చీరుట = పిలుచుట, చించుట
చూర = పొడి
చూరీలు
చేరుట
చేర
చేరుచుకొంట
చేరికె
చేరువ = ప్రోగు, చెంత
(ముత్తెపు) చేరు
చీపుర

జేగురు
జూదరి

తారసిలుట
తారుదారనుట
తీరనికినుక
తూరుపు
తేరు
తేరకు
తేరగంజి
తేరు తేరోరి (తేర=ఓరి)
(ఏ) తేరబోకు
తోరము=రమ్యము
(సందిట) తోరము
తామరి

దారి=మార్గము.
(పట్టు) దారము
దోరపండు

(శిలల) దొరవెట్టుట
దోరగల్లు
దోరుట
దేవర

నారచీర
(వింటి) నారి
నీరగుట = చచ్చుట
(తేట) నీరు
నేరుపు
(గంగ) నేరేడు
నోరు

(పూ) రేడు
పూరి
పేరులు
పేరెద
పేరెము
(పూసల) పేరు
పేరు = నామము
పేరుంబోరచి
పోరు
పోరామి
పోరితంబు

బార
బారి
బారు
బీరము
బూరుగు
బూరటిలుట
బూరె

బూర
బేరము
బేరజము
బోరగిలుట
బోర
బోరుగొండ

మారి మసంగుట
మారేడు
మారుతురు
మీరు
మూర
మేర
మోర
మోరతోపు
(వే) మారు
మోహరము

రాణ
రాణించుట
రాయిడి
రాయడు
రాచూలి
రాయంచ
రాపొడి
రాముళ్కపండు
రాము
రాగిల్లుట
రారాపు
రాచుట
రావి|మాను
రాణువ
రాయుట
రాజులు
రాలుట
రామి

రాకొట్టు
రాచబంటు
రీతి
రూపులు
రూక
రేయి
రేగుట
రోత
రోయుట = వెదకుట
రోవెలంది
రోలు
రోకలి
రోజుట

వారని కోపము
వారక
వారించుట
వారువనము
వారకులు
(కూడు) వారుచుట
వారకము
వారు
వీరు
వేగిరము

సారెలు
(పెండ్లి) సారె
(వే) సారుట
సారెకును
సూరెలు
సేరు
సైరణ
సోరణగండ్లు
సౌరు

## శకటరేఫయుత పద పరిగణనము

తిమ్మకవి సార్వభౌముడు లక్షణసార సంగ్రహమున నిర్ణయించిన ఱకారములు.

అఱవఱ
అఱగొఱలు
అఱిముఱి
అఱచుట
అఱముట
అఱచెయ్యి
అఱవుకొనుట
అఱకలుబెట్టుట
అఱలేక
అఱవుడు = కుప్పసము
అఱుగు
అఱిసె
అఱుగుట = తక్కువ
అఱవడి
అఱపొరడు
అఱమూతయిఱ్ఱు
అఱ్ఱు
అక్కఱపడి
అఱకమ్మటము
అఱటులు
అఱవలు = ద్రావిళులు
అఱకన్ను
(అన్నము) అఱుగకుంట
అఱుట = తఱుగుట
(రూ) పఱి
(పొలు) పఱి
(క్ర)చ్చఱ

—ఇందులో, అఱచెయ్యి అఱకాలు- అరయనుట రేఫ ఱకారాలు రెండు గలవు.

ఇఱియుట
ఇఱికికొనుట
(కూడు) ఇఱిసిచనుట
ఇఱకటము
ఇఱులు (ఇరులు) = చీకటు
ఇఱుకు
(క్రి) క్కిఱియుట
(బంది) ఇఱుసు

—ఇరులు; శకట రేఫ ఉదాహరణము చింత్యము.

ఉఱదు = క్రైకొనదు
ఉఱుకుట
ఉఱుము
ఉఱక
ఉఱిది = దగ్గర
ఉఱు = మిక్కిలి
ఉఱవు
(కొంపలు) ఉఱియుట
ఉఱుకరి
ఉఱియ
ఉఱని తెగువ
ఊఱుత పిల్లలు

ఎఱకలు = ఱెక్కలు
ఎఱగుట
ఎఱపరికెము
ఎఱుకువాడు
ఎఱుపు
ఎఱుగుట
(సొమ్ము) ఎఱవిడుట
ఎఱచి = మాంసము
ఎఱికత

ఎరవు; శకటరేఫ ఉదాహరణము చింత్యము.

ఒఱకటంపు త్రోవ
ఒఱగాల నిలుచుట
ఒఱగు = వంక
(కత్తి) ఒఱ
ఒఱయుట
ఒఱగుబిళ్ల
ఒఱపులు
ఒఱవదేహము

కఱపుట = నేర్పుట
కఱువు = దుర్భిక్షము
కఱతలు = పోకిళ్లు
కఱటి = మంతు
కఱదలు = బుద్ధులు
కఱుకు = కాఠిన్యము
కఱ = కప్పు (నలుపు)
(పులి) కఱచుట
కిఱుపుట
కుఱుమాపు

కుఱుగంటి
కుఱుగడ
కుఱుకొని
కుఱుకులు
కుఱుపు
కుఱులు (కురులు)
కుఱుకుఱ మన్నీలు
కుఱగలి
కుఱుచ
కెఱయుట
(ఉ) క్కెఱ
(ప) క్కెఱ
కొఱత
కొఱడు
కొఱలుట
కొఱగామి
కొఱకు
కొఱవి
కొఱుకుట
కొఱకొఱ

ఇందులో కురులు; పక్కెర శకటరేఫము చింత్యము భారత విరాట పర్వము

సీ. ఇందు బింబము మీది కందు చదరంబున
కురులు నెమ్మొగమున నెరపి
యుండ...'

చేమకూర విజయ విలాసము :

గీ. కురులు కెంపుం దొగరుం నెరయ
దువ్వి...'

ఇందులో 'నెరసుట' ను, 'ఒఱసుట' ను (నెఱయుట, ఒఱయుట) రేఫ, ఱకారాల రెంట గలవు కనుక చింత్యము. కురులనుట రేఫ ఱకారాల రెంట గందని తోచబడుచున్నది.

గఱికె
గఱగఱిక (గరగరిక)
గఱిసె
(ద) గ్గఱి
(అంప) గఱి
(మోట) గిఱుక
గిఱుమెట్లు
గిఱికొనుట
గిఱులు వ్రాయుట
గిఱుపుట
గుఱుకొని
గుఱుకు
గుఱినడచుట
గుఱుకొండి
గుఱగుఱ
గుఱువెట్టుట
గుఱి
గుఱిమలు = గింజలు
గుఱుతు
గొఱియ
గొఱక కట్టెలు
గొఱగుట
గొఱవంక (గొరవంక)
గఱుగుగాయ (గరుగుగాయ)

ఇందులో గరగరిక, గరుగు గాయ, గొరవంక పిట్టలు–రేఫ అకారాల రెంట చెప్పినారు. శకటరేఫ చింత్యము.

(అరచేత) చఱుచుట
(గొడ్డలి) చఱుచుట
(వా) చఱుచుట
చఱులు
(చి) చ్చఱ మంట

చిఱుతది
చిఱునవ్వు
చిఱుకొట్టుట
(ము)చ్చిఱి తనంబు
చిఱిమి
(దేహంబెల్ల) చుఱచుఱ గాల్చుట
చుఱుకు
చెఱి సగము
చెఱుకు
చెఱసాల
చెఱుముట
చెఱగు
చెఱచుట
చెఱలాట
చెఱకబట్టి
చెఱువున (ద్వైజుల్ భుజించుట)
చెఱువుట
చెఱువు = తటాకము

ఇందులో చెరగులనుట, చెరువులనుట రెంటగలవు. చెరువుట శకట రేఫము చింత్యము.

జఱి జఱి
(జా) జఱి
(పూ) జఱి
జఱికొను
జఱపుట
(చేత) జమఱుట
జఱజఱ
ఝఱిఝఱ త్రిప్పుట
ఝుంఝుఱ నెఱులు
ఝొఱఝొఱ

తఱుగుట = కోయుట, తక్కువగుట
తఱుగఱి = బేహారి
తఱిగొలుపుట
తఱులుట
(పుచ్చిన) తఱకలు
(శత్రుల) తఱియుట
తఱుముట
తఱులు
తఱపి
తఱచు = దట్టము
తఱి
తఱిగొని నడచుట
తిఱుగుట
త్రిమ్మఱి
తిఱి వెనచుట
తుఱగలి
తుఱుము
(వా) తెఱ (వాతెర)
(ఏ) త్తెఱ
(కను) దెఱచుట
తెఱవలు
తెఱకొలుపుట
తెఱపి
తెఱలిన వాసన
తెఱకువ
తెఱగు
తెప్పఱి
తొఱలుట
తొఱగులు

ఇందులో తరలుట, తిరుగుట, (వాతెర తొరగుట- రెంట గలవు.)

(అం) దఱు
(ఇం) దఱు
(కొం) దఱు
(ముం) దఱ
(పె) ద్దఱికము
(ఇ) ద్దఱు
(అ) ద్దఱ
(గ) ద్దఱి
(ప) దఱుట
(ఎ) దుఱుట (ఎదురుట)

—ఎదురుట, శకటరేఫము చింత్యము

నఱుజు = కొంచెము
(చెట్టు) నఱకుట
నిఱుబేదు (నిఱుపేద?)
నుఱుముసేయుట
(వడ్లు) నుఱుపుట
నెఱకులు—ఆయములు
వెఱులు = వెంట్రుకలు
నెఱసుట (నెఱయుట) = నిండుట
నెఱియ = మిగులు
నెఱి = బాగు
(నీటులు) నెఱపుట
నెఱవును
నెఱలేని మిత్రుడు
నెఱికె = కాసె
నెఱ = దొడ్డు, గొప్పలు
నెఱజాణ
నెఱజిక్కి

—నెఱసుట, నెరపుట రెంటగలవు

పఱచుట = ప్రవహించుట
పరువిడుట, ఏయుట
పఱపఱచించుట
పఱుసదనము
పఱ
పఱియుట
పఱికెలు
పఱిగొనుట
పఱతెంచుట
(అమ్ములు) పఱపుట
పఱపుట
(అం)పఱ
(నెం)పఱ
పఱువు
పఱిమార్చుట
(తెం)పఱ
పఱిమోపుట
పఱువైనపువ్వు
(చూ)పఱ
పిఱుంద
పిఱిచనుట
పిఱివోవుట
పిఱికితనము
పిఱుదు
(తె)ప్పిఱి
పుఱియ
(మేను) పెఱుగుట
పెఱియు
పెఱసనిపోవుట
పెఱుకుట
పెఱికెలు

—పరతెంచుట, చూపర రెంట గలవు, పరిమార్చుట పరువు, పెరుగుట, = శకటరేఫము చింత్యము

బఱబఱ నీడ్చుట
(ద)బ్బఱ
బిఱబిఱ త్రిప్పుట
బిఱుసులు = బాణసంచ
(కోట)బుఱుజులు

మఱచుట
మఱునాడు
మఱదలు
మఱిది
(ఏ)మఱిపాటు
(పలు) మఱు (మరు)
మఱి (మరి)
మఱుగు
మఱువ = మృద్భాండము
మఱుగుట
(వే)మఱ (మర)
మఱుపడి
మఱలేక
మఱగాలు
మఱల
(తి)మ్మఱుట
(పద)మఱ
మిఱిచూపు
మిఱిమిట్లు
ముఱిముఱి చీకటి
ముఱిముఱి బడిబడి
ముఱి = మొండెము
(ఆఱి) ముఱి
మెరములిడుట
మెఱపు
మెఱయుట
మెఱుగు
(కన్)మొఱుగుట

మొఱకతనము
(వేవులు) మొఱగుట
మొఱ
మొఱమొఱలాడుట
మొఱక-వెలితి
మొఱసుట (మొఱయుట)
—పలుమఱు, మరలుట, వేమఱు, మఱి-రెంటగలవు.

ఱట్టువొందుట
ఱంపిల్లుట
ఱంతు
ఱవఱవలు
ఱవళి (రవళి)
ఱవికె
ఱంతులు (రంతులు)
(వ్రజపు) ఱవలు
ఱంపము
ఱికిరించుట
ఱిచ్చ
ఱిక్కవిడుట
ఱివ్వున నెగయుట
ఱింగున మ్రోగుట
(శిలల) ఱువ్వుట
(చిలుక) ఱెక్క
ఱెల్లుగడ్డి
(కను) ఱెప్ప
(పూ) ఱెమ్మ
ఱొమ్ము
—రంతులు, రొమ్ము రెంటగలవు.

వఱువ
వఱద
వఱలుట
వఱడు
వఱుగు
విఱుగు
విఱిపోవుట
విఱిగాలి
విఱివిడి
వెఱపు
(ని) వ్వెఱ
వెఱబొమ్మ
వెఱచఱచుట
వెఱగు
సుఱసుఱ స్రుక్కుట
ఆసుఱుసుఱు

ఆఱని తేజము
ఆఱడి
ఆఱికెపంట
ఆఱు=షట్క, రోమావలులు
(ఊ) టాఱిన ముత్రెము
(తడి) ఆఱె
(పాపములు) ఆఱె

ఊఱుట = చాలించుట
ఊఱుగాయలు
(జలము) ఊఱుట

ఏఱు = నది
(పండులు) ఏఱుట
ఏఱువ = సీమ

కాఱడవి
కాఱుపోతు
కాఱుట
కాఱియబెట్టుట
(హాంత) కాఱి
కోఱ = దంతము

(పండ్లు) గీఱుట
గీఱుట = నాటుట

చాఱుద్రావుట
చాఱలపులి
చాఱపప్పు
చీఱుట = పిలుచుట
చూఱగొనుట (చూరగొనుట)
(ఉట్టి) చేఱు (చేరు)
చేఱెడు (చెరెడు)
చోఱమీలు

—చీరుట (= పిలుచుట), చూర రెంటగలవు, చేరు. చేరెడు శకటరేఫ చింత్యము.

జాఱుట
(బ) జాఱు
(హ) జాఱము = మొగసాల
(తు) జాఱులు = ధనికులు
జోఱున వానగురియుట

తాఱుట
తీఱుట
తీఱు
తీఱెను
తేఱుట
(గడి) తేఱుట
తేఱిచూచుట
(ధర్మంబు) తేఱుట
తేఱుదురు

దూఱుట

నాఱువిడుచుట
(ఉల్లి) నాఱు
(సొ) న్నాఱి
నీఱు = నిప్పుపైబూది
నూఱు = సంఖ్య
(పసపు) నూఱుట
పాఱుడు = బ్రాహ్మణుడు
(నది) పాఱుట
(ఇంకన్) పాఱుట
(మేను గరు) పాఱుట
పేఱుట = పెనగుట
పోఱడు

బీఱువోవుట

మాఱుమొగము
మాఱిమసగుట (మారి)
(ఇను) మాఱు
మాఱుదుగుట
మాఱువడుట
(వే) మాఱు (మారు)
మాఱుమాట
మీఱుట

—బీరువోవుట. మారుమొగము- రెంటగలవు. మారిమసగుట - శకట రేఫము చింత్యము

ఱాచుట
ఱాయి
ఱాగ
(ప్రే) ఱేచుట
ఱేపు
ఱేవు
ఱేసి
ఱేకు
ఱేడు
ఱేలు
ఱేచు
ఱేగు
ఱోయుట
ఱోత
ఱోలుట

రాయి; రెంటగలదు, రాచుట, రోయుట (అసహ్యమర్థము) - శకట రేఫము చింత్యము.

వేఱువడుట
వేఱొకటి
పిఱడి

## రేఫ ఱకార పరిశీలనా లోపములు :-

తిమ్మకవి సార్వభౌముడు (ఇట్లు రేఫ ఱకారముల నిర్ణయించి)లక్షణ సార సంగ్రహమందు (1-318) :

గీ. అరయ గురురేఫ హల్లుతో బెరసినపుడు
ప్రాసముల విశ్రమములు రేఫములతోడఁ
గలసి యుండును సుకవి పుంగవుల కృతుల
జగదవన సూత్ర గిరితనూజా కళత్ర. 207

లక్ష్యములు :

ఎఱ్ఱనగారి రామాయణము :

ఉ. నూర్వురు నొక్క చందము మనోగతి సైరసజేసి నమ్మి నా
సర్వకులంబు నుత్తమ యశంబున నుంచితి రమ్మలార మీ
కుర్విని సాటియే యబల లొండొరు దేవతలుం బటుక్షమా
నిర్వహణం బొనర్చుటకు నేరరు, మర్త్యులఁ జెప్ప నేటికిన్. 208

భీష్మపర్వము (8-278) :

క. కార్చిచ్చు గవసి మృగముల
నేర్చుకరణి నేడు భీష్ముఁ డేచిన కడిమిం
జేర్చి మన భీముఁ బొదవె శ
రార్చుల నవ్వీరుఁ గన్నులారం గంటే. 209

ద్రోణపర్వము (4-191):

క. చెలఁగి పటు సింహనాదం
బులు రంకెలుగాఁగ వారు బొలిచిరి వృషభం
బుల క్రియ నొండొరులకు మా
ర్మలయుచు దాకుచు నుదాత్తరభసోజ్జ్వలులై 210

అని చెప్పినారు.

—కాని రేఫ అకారముల పట్ల పరిశీలించుట (లో) అందఱికిని లోపమే. అహోబల పండితుల వారు 'పురసతుల - మఱిగి' అని రేఫశకట రేఫ ముల పోతరాజుగారు కలిపినారని ఆక్షేపించినారు. అది పోతరాజుగారి కవిత్వముకాదు. (కాని అది) ఎవరి కవిత్వమైనను (మరిగి) ఉభయము కలదు. 211

ఎఱ్ఱనగారి హరివంశము (పూ. భా. 8-1౮) నందు :

క. హరి చేష్టితములు క్రమమున
మరిగి నిజముగాఁగఁ దమదు మగలఁ దొరఁగి యా
హరియంద భర్తృ బుద్ధిం
బరిణతలై రా వ్రజంబు బాలిక లెల్లన్. 212

అని రేఫముగా ప్రయోగించిరి. కవిత్రయమువారి ప్రయోగము గలుగగా పరిశీలించక భాగవతము నాక్షేపించుట కూడదు. లాక్షణికులు మఱిగి, వేఱు - గుఱు రేఫము లన్నారు. (కాని) ఉభయ రేఫములందు నెవరు వ్రాయలేదు. కాకునూరి అప్పకవిగారు 'ఆంధ్రశబ్ద చింతామణి'యందు :—

గీ. వేఱు పఱుటయు వీఱడి వేఱొకటియు
నాదిగాఁ గొని యాంధ్ర వాక్యముల యందుఁ
బాదుకొను దీర్ఘముల మీఁద బండిఱాలు
దీని నెఱుఁగక కృతిసేయు వెఱ్ఱిగలఁడె 213

అని స్పష్టముగా చెప్పిరి. 214

రేఫంమీద వకారమున కేత్వము దీర్ఘములగల పదమే. (కాని) యెవరును చెప్పలేదు. అట్టిదానికి -అహోబల పండితులు కవిశిరోమణి యందు

ఉ. వేరనలేరు ధారుణి నవీనతరాంధ్ర కవిత్వ సంపదా
ధార రసజ్ఞులైనఁ గవితల్లజులైన వినుండు పాండితీ
పారగులార యో పరమ బంధువులార తదీయ శబ్ద సం
భారము పారముం దెలియ పాల్పడ నేనసుడీ నిజంబుగన్ 215

అని రేఫముగా ప్రయోగించిరి. స్వకవిత్వమున సాంకర్యమే కలిగెను. వారు 216

'గట్టిగ నభినవ నన్నయ
భట్టాచార్యాభిధాన పటు బిరుదాంకం
బట్టిట్టనక వహించిన
దిట్టను నను బోలఁగల సుధీమణు లేరీ?'

అని స్వమహిమ ప్రకటించుకొనిరి. కాని, వేఱు ఉభయము గందు. 217

ఎఱ్ఱనగారి హరివంశము (ఉ. భా. 4-112) :

క. పోరాని చుట్ట మితఁడని
కూరిమి చెలికాఁ డనంగఁ గోరి వరుస గో
త్రారి హరి బాంధవుల వే
ర్వేరం గుశలంబు లడిగెఁ బ్రియ మలరారన్. 218

ఉద్యోగ పర్వము (2-116) :

గీ. పాండురాజ తనూజుల పాలి కర్థి
నిమ్మహారాజు పనుపంగ నేఁగి ధర్మ
పుత్రుఁ గాంచితి నాతఁడు మైత్రి మెఱయ
గౌరవుల సేమ మెల్ల వేర్వేర నడిగె. 219

అని రెండు లక్ష్యములుండగా కేవలము గురు రేఫగా లాక్షణికులు చెప్పుటయు
పరిశీలించకపోవుటే 220

అయితే, అహోబల పండితులవారు ఉభయము గలదని యెఱిగే రేఫముగా
ప్రయోగించినా రంటిరా, 'మరిగి' (అను దానిని) ఆక్షేపించరాదు. భాగవత
మందు మాత్రమేమి, రాఘవ పాండవీయము (2-6) నందు 222
22)

రగడ. మరిగి యెవ్వఁడు కంఠ మాలికల పోలికల
పరగను గలిపి రంక పాలికల బాలికల 222

(అని యున్నది. కావున) రాఘవ పాండవీయమును (కూడ) నాక్షేపించవలెను,
'పరగ' రేఫ గావున. 228

అహోబల పండితులవారు బిరుదుకు తగిన పాండిత్య మహిమను వహించ
లేదు. 224

—— లాక్షణికుల పొరబాటు మరియు (నొకటి). నూఱా కుట, నీఱు = నిప్పులపై
బూది, కాఱియ = కష్టము — ఇవి గురు రేఫ లన్నారు. (కాని రేఫమున్నను
గలదు.) 225

ఎఱ్ఱనగారి హరివంశము (ఉ. భా. 6-128):

క. మీరాడినఁ గోపింతురు
నీరుగ శపియింతు ,రేము నీబోంట్లకు నీ
కూరతములు వెఱతురె మము
గారియఁగా నిట్లు వలుక గలరే యన్యుల్. 226

అచ్చు పుస్తకములందు 'కూరతములు' రేఫగాను, మిగిలినవి అకారములుగాను
వ్రాసినారు. భారతమందే రేఫ అకార సాంకర్యముంటే, రేఫ అకార నిర్ణయమే
పనిలేదు. ఇంతకన్న నవివేకము గలుగదు 227

"దేవ దానవు లట్లు విద్వేష మెపుడు
గలిగి యుండును రేఫ అకారములకు
నట్లు గావున నవి గలయంగ నీక
కావ్యములఁ గూర్పవలయు సత్కవు లెఱింగి 228

ఎన్ని లక్షణంబు లెఱిఁగిన రేఫలు
బండిఱాలు నెఱుఁగకుండు నట్టి
కవి కవిత్వమెల్ల గవ్వకు కొ...
కొ అతఖెంధు రజత కుధరనిలయ 229

(ల. సా. సం. 8-40, 42)

జ్ఞాతి వైరంబు నంది ప్రాసంబులందు
విశ్రమములందుఁ దమలోన వేరు గలిగి
దేవదానవు లట్లన తెలుఁగు నందు
మించి రేఫ అకారముల్ మెలఁగుఁ గృష్ణ 230

(అ. క. 2-229)

'నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం
రయోస్తు నిత్యం స్యాత్'

అన్న వాగనుశాసన సూత్రమునందుననె (యున్నందున) లాక్షణికులు రేఫ అకార (ములు యతి) ప్రాసములకు కూడ దన్నారు కాని— 231

నన్నయభట్టుగారు, తిక్కన సోమయాజులగారు, ఎఱ్ఱాప్రెగడగారు — వీరు కవిత్రయము వారు. వీరు ముగ్గురును తెలుగు చేసినది భారతము. తిక్కన సోమయాజులగారు 'ఉత్తర రామాయణము' తెలుగు చేసినారు. ఎఱ్ఱాప్రెగడగారు (హరివంశము రచించినారు). ప్రత్యేకము 'రామాయణము' రచించినారు. మరి యును గ్రంథములు రచించినారు. అటు (వంటి మహాకవుల ప్రయో) గములకు లాక్షణికులు నిర్ణయించిన రేఫ అకారములకు— (సరిగా) పరిశీలించ నందున వ్యత్యస్తములు గలవు. ఇదివరకు మిక్కిలియు లక్ష్యములు వ్రాసినాము.(ఇంకను ఉహరణములు గలవు. కాని) గ్రంథ విస్తరమగుటవలన నిలిపి (వేసినాము. బుద్ధి మంతులు గ్రంథములందు పరిశీలించి ఇంకను తెలిసికొనేది.) 232

# సుకవి మనోరంజనము

## పంచమాశ్వాసము



శ్రీ భారతీశ సన్నుత
భా భాద్భహునామ లింగ పంచపృషత్క
ప్రాభవ తూలాసహచ
క్ష్మా భవదగ్ని స్ఫులింగః కుక్కుట లింగా![1] 1

(అవధరింపుము) అప్పకవిగారి ఆక్షేపణలు :-

[2] మహాకవి ప్రయోగములు గల యతిప్రాసములు కొన్ని కొట్టివేయడమున్ను, కొన్ని దిద్దడమున్ను, ఒకటియు మహాకవి ప్రయోగములులేని యతిప్రాసములు నిలుపుటయు (మొదలగునవి అప్పకవిగారు చేసినవి వివరముగా వ్రాసినాము. ఇవి యిట్లుండగా-)

'డోలా భూషో త్తరీయాణి వినైత్వం నాస్తి మత్యయె'

అను ఆథర్వణ కారికను తెనిగించిన ముద్దరాజు రామన్నగారి నాక్షేపించి, పయ్యెద - ఉయ్యెల - తాయెతులకు యకారమున కేత్వము లేదనుటయు, ఒక పదముంచే అర్థము కుదురదని (మరి) యొక పదముగా నిర్ణయించి పొసగని లక్ష్యములు వ్రాసుటయు- ఈ మొదలైనవి (అప్పకవిగారి వ్రాతలు) అనేకములు గలవు. 2

---

1. ఇది చతుర్థాశ్వాసాది పద్యము. చతుర్థాశ్వాసమునుండి వేరుచేసి విడిగా చూపబడిన ఈ పంచమాశ్వాసమున కదే ఆదిపద్యముగా చూపబడినది.

2. ఈ ఆశ్వాసాదినుండి 149 వ పద్యమువరకు 'ఇ ప్రతి'నుండి గ్రహింపబడినది. (చూ. సమాలోకనము '—మూలప్రతి')

అందులకేమి (గాని), సంస్కృతాంధ్ర విద్వత్కవి రాజశేఖరుడు, రెండవ వాగనుశాసనుడు, రెండవ శ్రీనాథుడున్ను నైన శ్రీనాథుడుగారిని (అప్పకవిగారాక్షేపించినారు) ఆక్షేపించిన చోటు:— 3

"నిత్య మనుత్తమ పురుష క్రియాస్వితః"

అను సూత్రమునకు వ్రాసిన గ్రంథ (ఘట్ట) ము. (ఆ గ్రంథమిది) కూకుమారి అప్పకవిగారి ఆంధ్రశబ్ద చింతామణి:—

గీ. వసుధ నుత్తమ పురుషైకవచనమునను
దక్క ధాతుక్రియా పదాంతములఁ గల్గు
నిత్తులకు మీఁద నచ్చులు హత్తునపుడు
నిత్యముగ సంధులు ఘటించు దైత్యదమన. (5-61) 4

గీ. పుడమి సూత్రోక్త ముత్తమ పురుషమనుచు
తత్పురుష మెల్లఁ గొనరాదు తద్బహూక్తి
మున్ను తిజ్మధ్యములతోడ నెన్నుకతన
నిత్యముగఁ బ్రాణిసంధి దానికి ఘటించు. (5-62) 5

గీ. వనిని దీవించిరట మునీశ్వరులు నిన్ను
రవిజు నేలితివట నీవు రామచంద్ర
మీరు గట్టితిరట కపులార జలధి
వింటి మీవార్త మేమన వెలయు నిట్లు. (5-63) 6

క. విరచించెను శ్రీనాథుఁడు
ధరణిని శృంగార నైషధంబునఁ 'గూర్చుం
డిరి యెందొరు' లని కానుక,
పరపురుష క్రియలఁ బ్రకృతి భావము గలదే (5-64) 7

నైషధంబునఁ 'గూడిరి' మీఁద విసంధిగా శ్రీనాథుడు చెప్పిన పద్యము (3-78):

మ. బలభిద్వహ్ని పరేతరాజు వరుణుల్ పర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొందొరుం గదిసి యర్థిం దత్ప్రదేశంబునన్
నలనాలీక మృణాలనాల లతికా నవ్యప్రవాళీ మిల
ల్లలనాలాప కథాసుధానుభవ లీలాలోక చేతస్కులై. 8

ఇటువంటి నిరుపమాన పద్యము నాక్షేపించుటకు (అప్పకవిగారికి) నోరెట్లు వచ్చెనో, తెలియదు. ఇందుకు సమాధాన మిప్పుడే వ్రాసుతాము, గాని- 'ఇత్తులకు మీఁద' అని ఇట్టి వచియింపరాని గ్రామ్యపదమెటుల ప్రయోగించిరో; చెవులు, కనులు, బుగ్గలు, పండ్లు, చండ్లు, బొడ్లు, ముడ్డి, కాళ్లు- అనరాదు. వీనికి (వరుసగా) వీనులు, కన్నుదోయి, చెక్కులు, పలువరుస, నిక్కుచన్నుగవ, పొక్కిలి, పిఱుదు, చొక్కంపుటడుగులు- అనవలసిన' దని చెప్పిరే; ఇందులో చెవులు, కనులు, కాళ్లు- ఈ పదములు సాధారణముగా మహాకవులు ప్రయోగించినారు. బుగ్గలు మొదలైన మిగిలిన పదములైనా, తాము ప్రయోగించిన యవాచ్య పదమువలె నత్యంత నిందితములు గావు 9

గీ. పా. కంపు తూపులుగల వన్నెకానిఁ గాంచె (2-32)

అని (తాము) పూర్ణంబిందులకు చెప్పిన పద్యము (నందు 'కంపు') దుర్వాసనకు ప్రసిద్ధిగాని, పరిమలముకు ఎవ్వరు నొప్పలేదు. ఇది యెందుకు ప్రయోగించిరో ; (ఇక)— 10

'నిత్య మనుత్తమ పురుష క్రియాస్వితః'.

నిత్యగ్రహణం వానువృత్తి నివృత్త్యర్థమ్. ఉత్తమ పురుష వ్యతిరిక్త క్రియాంత గతస్యేకార స్యాచా సహ నిత్యం సంధి స్స్యాత్. 'రాముని నుతించి రమరులు; చేసితి వచ్యుతపూజ; కంటి వతనిరూపము'— ఇత్యాద్యుదాహరణమ్. ఉత్తమ పురుషే తు

'ప్రాయస్తు స్యాత్ కిమాదికస్యేత'

ఇతి వక్ష్యమాణః ప్రాయస్సంధిః. 'చేసితి నచ్యుతార్చనము' - ఇత్యాది. వికృతవివేక కారస్తు—

'ప్రథమే చోత్తమే చైవ, క్రియేతో వా భవేత్ చ్యుతిః
నిత్య మన్యస్య వికృతౌ, క్త్వార్థేతో న భవేత్ సదా'

ఇతి ప్రథమ పురుషేపి సంధే ర్వికల్ప మాహ. అత ఏవ—

'బలభి ద్వహ్ని పరేతరాజ వరుణుల్ పర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొంకొరుం గదిసి...'

'సిద్ధిఁగాంచిరి యవిముక్త సీమయందు...'

ఇత్యాదయః శ్రీనాథాది ప్రయోగాః సంగచ్ఛంతే, కాకునూ ర్యప్పకవిస్తు ఏతద్గ్రంథ సంపాదన వైధుర్యేణ శ్రీనాథస్య భ్రాంతత్వ మాహ"

(కవిశిరోభూషణము. పు. 281)

అని (అహోబల పండితులవారు) అప్పకవిగారి నాక్షేపించినారు. కాని, 'సిద్ధిఁ గాంచిరి...' అన్నదిన్ని శ్రీనాథునిగారి ప్రయోగమే గాన, '...ఇత్యాదయః శ్రీనాథాది ప్రయోగాః...' అనుట బాగులేదు. అప్పకవిగారు ఆక్షేపించినవారి ప్రయోగము లక్ష్యముగాదు. ఉపనిషత్తుల కన్నను నన్నయభట్టుగారి కారిక లప్పకవిగారికి ముఖ్యము. స్మార్తునికి హరిహరులందు సమబుద్ధివలె (అహోబల పండితుల వారికి) నన్నయభట్టుగారి కారికలు, అథర్వణాచార్యుల వారి కారికలు సమము గాన, (వారు) రెండింటిని గూడగట్టుకువచ్చినారు. 11

ఆధునికులున్ను అహోబల పండితులవారి మతము ననుసరించి వ్రాసిన గ్రంథము:— 12

"అనుత్తమ పురుషక్రియాసు=ఉత్తమ పురుష వ్యతిరిక్త క్రియా పదములందు, ఇతః=ఇకారముకు, అచి=అచ్చుపరమగు చుండగా, సంధిః=సంధి, నిత్యం=నిత్యముగాను, స్యాత్=అగును. అనగా మధ్యమ పురుషంబునం దికారమునకు సంధి నిత్యముగా వచ్చునని తాత్పర్యము. ఉదాహరణము:- సేవించితి వచ్యుతుని; సేవించితి వచ్యుతుని. ప్రథమోత్తమ పురుషంబులు కిమాదికములో చేరినవి గావున వానికి సంధి వైకల్పికంబని యెఱుఁగునది. ఉదాహరణము:- వచ్చి రమరులు; వచ్చిరి యమరులు; వచ్చితి నిపుడు; వచ్చితిమిపుడు, వచ్చితిమి యిపుడు. ద్రుతాంతంబులైన టి, డి వర్ణకాంతంబులకు రాదు. వింటి నపుడు; తింటి నన్నము; పోషించెడి నచ్యుతుడు, ఇత్యాదులు.

కారిక. ప్రథమే చోత్తమే చైవ, కియేతో వా భవేత్ చ్యుతిః
నిత్య మన్యస్య వికృతౌ, క్త్వార్థేతో న భవే త్సదా.

అనుట వలన ప్రథమ పురుషముకు సంధి వైకల్పికము" 13

ఇక, బాలసరస్వతిగారి వ్యాఖ్య:—

'అను త్తమ పురుష=ఉత్తమ పురుష వ్యతిరిక్తమైన, క్రియాసు=క్రియలందలి, ఇతః=ఇకారమునకు, నిత్యం=నిత్యముగాను సంధి గద్దు చెల్లి రసురులు; ప్రోచి రమరులు; చేసితి వచ్యుతుని పూజ; ఉత్తమ పురుషకైతే- కొలిచితి నంబును, విడిచితి మన్యులను. అన్నది కిమాదికము గనుక క్రియా గ్రహణాన నంట లేదు."

అని యెవరి మతానుసారము నాయూ ప్రకారముల వ్రాసినారు. 14

సూత్రార్థము పరిశీలించితే ప్రథమ, మధ్యమ పురుషములకు సంధి నిత్యమనిన్ని, ఉత్తమ పురుషకు వికల్ప మనిన్ని కనుపించుచున్నది. ఈ లాగు వ్రాయక సూత్రమందు లేని యర్థమును సామరస్యము కొఱకు వ్రాసినంత మాత్రమున నేమి వినియోగము! 15

అప్పకవి లాక్షణిక చక్రవర్తిగారు (మహాకవి ప్రయోగముల)నేమి పరిశీలించిరో! 16

ఉద్యోగ పర్వము (3-38) :

మ. గురు భీష్మాదులు సూచుచుండ సభ మీకుం గీడు నా దట్లు ము
ష్కరులై చేసిరి యంత చేసియును బశ్చాత్తాపముం బొందనో
పరు వా రెన్నఁడు నట్టిచోటఁ గృపయుం బంధుత్వముందక్కు మె
వ్వరు గోపింపరె యాదురాత్మకుల గర్వ క్రౌర్యముల్ సూచినన్. 17

పారిజాతాపహరణము (5-47) :

క. విన నేర్చిరి బధిరులుగను
గొన నేర్చిరి యంధకులు లఘుత్వము మీఱన్
జన నేర్చిరి వికలాంగులు
యనిమిషతరు కుసుమ సౌరభావేశమునన్. 18

కవుల షష్ఠము :-

క. మనుజులలో సత్కర్మం
బొనరుచువారెల్ల దండ్యులో వారలలోఁ
గనుఁగొనఁ గొందఱె దండ్యులొ
యనవుడు హరిభటుల కనిరి యప్పార్శ్వచరుల్ 19

రుక్మాంగద చరిత్రము (4-112) :

ఉ. కట్టిరి కొట్టి రీడ్చి రథికంబుగ నాగిరిగుండ్లు త్రొమ్మనం
బెట్టి రెసంగి ద్రోచిరి తపింపఁగ నెండల నిల్పి రంటఁగాఁ
జుట్టిన పచ్చడంబు వడిఁ జారఁగ ద్రోచిరి పట్టుకారులం
బట్టిరి యిట్లు పాపముల పాలుగఁ జేసిరి వీర లందరున్. 20

చేమకూరవారి సారంగధర చరిత్ర (1-48) :

క. 'జోల ల్పాడిరి యమృతపు
జాలుం జోకొట్టఁ జాలు...........' 21

రామాభ్యుదయము (1-89) :

ఉ. కూడిరి యొండొరుల్ దొరసి కుంతలకాంతు లొసంగి వీకుజో
డాడిరి (క్రేళ్లు దాటెడు మదాళులతో వెలిదమ్మి ధూళి గో
రాడిరి కంతు దంతులన హస్తపుటంబుల వారి చల్లఁ బో
రాడిరి యోలలాడిరి లతాంగులు రాగరసైకమగ్నలై) 22

మరియును (ప్రథమ పురుషమందు సంధి వికల్ప మగుటకు ప్రయోగములు బహుళములు) గలవు. సోమయాజి, నందితిమ్మన్న, ప్రౌఢకవి మల్లన్న మొదలైనవారి నాక్షేపింపక శ్రీనాథుకు గారిని మాత్రమే 'కానక' ప్రయోగించె నని (అప్పకవిగారు) అనుట, తలంపగా—, విష్ణు తత్త్వమించు కంతయు దెలియక విష్ణునిందసేయు వీరశైవు డొకడు, శివతత్త్వమించు కంతయు దెలియక శివనిందసేయు వీరవైష్ణవు డొకడు-ఈ ఇద్దఱు మాత్రమే అతిసాహసికులుగలరు అప్పకవ్యార్యుడు మూడవ వాడుండె (ననిపించును.) 23

"సీ. చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగు మీసాల నూత్న యౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిందు జవ్వనంబున యందు
హర్ష నైషధ కావ్య మాంధ్ర భాష

ప్రౌఢ నిర్భర వయః పరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమ
ప్రాయ మింతకు మిగులఁగా ప్రాలకుండ
కాశికాఖండ మను మహాగ్రంథ మేను
దెనుఁగు సేసెద కర్ణాటదేశకటక
పద్మ వనహేళి శ్రీనాథ భట్ట సుకవి 24

అని (కాశీఖండము 1-7) శ్రీనాథుడుగారు చెప్పుకొనినారు. హరవిలాసము మొదలైనవి మరియును రచించినారు. చిన్నతనము నుంచి నిరుపమానమైన యిన్ని ప్రబంధములు చేసిన కవి (మరియొకడు) కనిపించడు. (అష్ట) దిగ్గజములందు ప్రసిద్ధుడైన రామరాజభూషణ కవి—

మ. మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ (మహా
మహులై సోముఁడు భాస్కరుఁడు వెలయింపన్ సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తి మయప్రపంచమున దత్ప్రాగల్భ్య మూహించెదన్) 25

అని (వసుచరిత్ర- 1-10 యందు శ్రీనాథుడుగారిని) వినుతించెను. 26

శ్రీనాథునిగారి ప్రయోగములు విసంధికి మరియును గలవు. 27

నైషధము (1-67):

ఉ. తెప్పలు ప్రాల్ప కప్పుడమితేని మనోహరమూర్తి నిచ్చలుం
దప్పక చూచి చూచి ప్రమదల్ ప్రమదంబు లాత్మలం
జిప్పిలుచుండ నెద్ది పరిశీలన జేసిరి యట్టి యభ్యాసం
బిప్పుడు వారు జూపుదు రపేత నిమేషములైన చూపులన్ 28

'అభ్యసన' మని ప్రాస్వము నున్నది. 29

అందే (6-115):

ఉ. లాలనఁ గ్రొత్త బెబ్బులి కళాసము వెట్టిరి యాసనంబుగా
గోలయు సాధువైనా యొక కోమటికిన్ నిషధేంద్రు బచ్చుకున్

మేలపు మైవడిం దను సమీపపు ధూర్తులు తత్పరః స్థలాం
గూలము యవ్వణిక్కునకుఁ గోళవిజృంభణ శంకజేయఁగన్. 30

(నాల్గవ చరణమున) ఉకారమునకు సంధి వికల్పము 31

కాశీఖండము (3-232):

గీ- చంద్రమౌళి భరద్వాజ సంయములును
హంస పదియను నొక కిన్నరాంగనయును
నా ప్రవాలోష్ఠి మగఁడు వేణీప్రియుండు
సిద్ధిఁబొందిరి యవిముక్త సీమయందు. 32

అందే (2-38):

సీ. పా. అందందఁ జేసిరి యభవు గేహమునకు
ధన్యాత్ములుగఁ బ్రదక్షిణములు. 33

(ఇక) మధ్యమ పురుషమునకు విడియుండుటకు:-

కవులషష్ఠము:-

చ. అదలిచి నిల్చి వారిం గని యంతక కింకరు లెవ్వరయ్య మీ
రిదె యమునాజ్ఞ ద్రోచితిరి యెచ్చటనుండిటు వచ్చినార లె
య్యది గత మడ్డపెట్టుటకు (నేవ్వరివార లెరుంగఁ జెప్పఁడా
యదిటి తనూజులో సురలొ యక్షులొ సిద్ధులొ కాక సాధ్యులో 34

(ఇక) ఉత్తమపురుషమునకు విడియుండుటకు:-

ఆదిపర్వము (5-289):

క. విలువిద్య నొరులు నీక
గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదు నని మున్
బలికితిరి నాకకా దీ
త్రిలోకముల నధికుఁ జూచితిమి యొక యొఱుకున్. 35

విరాట పర్వము (4-93) :

క- తలఁపగ రిపులకు నిమ్మగు
కొలఁది గడచి వచ్చితిమి యకుంఠిత బాహా
బలము నెఱుపఁ దఱి యయ్యెన్
జలింప వలదింగ మనకు శత్రుల వలనన్. 36

హరిశ్చంద్రోపాఖ్యానము (4-28) :

చ. ధరణిప నేడు నెల్లియును దక్కఁగా నెలనాళ్ళు నయ్యె నే
నరసితి లెక్కవెట్టితిని యాయము లేదొక పీసమైన నే
నెరవున నింక మా ఋణము వేగవె తీర్చెదుగాక, మిన్న కే
సురిగెదవో వివేకగుణశూన్యత బొంది యసత్యవాదివై. 37

శ్లిష్టమై యుండుటకు :-

ఆరణ్య పర్వము (6-99) :

క. జనపతి మేల్కని యంతయు
ననుజుం డెఱిఁగించి యిట్టు లను నబ్దముపై
నెనిమిది నెల లుండితి మి
వ్వనమునఁ దగు నింక నొండు వనమున కేగన్. 38

పారిజాతాపహరణము (5-41) :

చ. బలిదనుజేంద్రుఁ గట్టి తని వల్కఁగ విందుముగాని నేడు మా
చెలి యిది పువ్వువాగురముచే నిను గట్టఁగఁ గంటి మింక నె
మ్మెలు పచరింపరా దనుచు మేలము లాడెదు సత్యబోట్ల స
న్నల నెసఁ గొల్చుచున్ గెలవ నవ్విరి ధర్మజ భీమ ఫల్గునుల్. 39

మూడు పురుషములకు విడియుండుటకు (ఇట్లు) మహాకవి లక్ష్యము లనే కము లుండగా నప్పకవిగారు నిలువని సూత్రమున కర్థము పరిశీలించుటయు శ్రీనాథుడుగారి నాక్షేపించుటయు సర్వోత్కృష్టముగా నున్నది. 40

అప్పకవీయ మనే పేరు మాత్రమేకాని, ఆ గ్రంథము నెఱుగని కొందఱు పండితులు, నించుకంత గ్రంథ మెఱుంగుదురు గాని తదర్థ మెఱుగని కొందరు

పండితులను సుప్రసిద్ధమైన యప్పకవీయము నాక్షేపించినామని మము నందురు. అయితే, అప్పకవి స్వయముగ కల్పించినవిన్ని, కొన్ని దిద్దినవిన్ని, కొన్ని పొరపడినవిన్ని మహాకవి లక్ష్యములతో విశద పరచినాముగాని, అనంతునిని, ముద్దరాజు రామన్నను, శ్రీనాథాదుల నప్పకవి నిష్కారణ మాక్షేపించినట్లుల (మేము) ఎవరిని నాక్షేపించము. ఈ పామరులసడి రథ్యామృగాక్రందనము భద్ర గజమున కెట్టిదో మాకు నట్టిది. 41

అమర వ్యాఖ్యాసుధ యందు భానోజీ దీక్షితులు గారు అమరవ్యాఖ్యాకారుల నందరి నాక్షేపించిరి. కోలచెల మల్లినాథ సూరిగారు మొదలైనవారు అదివరకు (ఇతరులు) రచించిన వ్యాఖ్యానాదులందు పొరపాటు లున్నచోటల నాక్షేపించి నారు. ఆ లాగున వారు దిద్దక పోతే తప్పులే యొప్పులవును. ఇప్పు డప్పకవి చెప్పిన తప్పులు పామరులకు గ్రాహ్యములైనవి కావుగనుకనా! మేము విశద పరచిన శంకా సమాధానములు సంస్కృతాంధ్ర కవితాకలా ధురంధర కలానిధి హృత్ప్రమోద కరములుగాని కేవల బాలిశ మానసోల్లాస కరములుగావు. కావున దేవానాంప్రియ ప్రియా ప్రియ భాషణము లొక్క టిఖు. 42

ఇన్ని తప్పు లప్పకవీయ మందుంటే నందఱు నెందుకు (దానిని) గొని యాడుదు రంటిరా? మొదట భూలోకములోనున్న గ్రంథముల పేరులన్నియును వ్రాసినందున (అప్పకవిగారు) ఇన్ని గ్రంథములు పరిశీలించి నారనిన్ని; అలంకారముల పేరులు, రీతులు, వృత్తులు మొదలైనవాటి పేరులు, రసముల పేరులు వ్రాసినందున నిన్నియు విమర్శించినారనిన్ని పామరుల తాత్పర్యము. 'వేదములు నాలుగు అన్నంత మాత్రమున వేదములు చదివినవాడగునా!' ఈ గ్రంథమువలన నొక యలంకారము, ఒకరసము, ఒకరీతి మొదలగు కావ్యసామగ్రి తెలియ వలసినవారి కించుకంతయు తెలియదు. తెలిసినవారల కీ పేరులతో నేమి పని యున్నది. గ్రంథముఖమున నున్న గ్రంథాదుల పేరులున్ను, అయన చెప్పించు కొన్న తన గ్రంథ మహిమను చూచిన బాలిశులకు (అవియన్నియు) వారకామినీ వేషభాషాదులవలె మోహకరములు. 43

(అప్పకవిగారు చెప్పిన మరియొక అంశముగూర్చి ఇక్కడ వ్రాసుతున్నాము.) 44

"గీ. గ్రామ్యమైన నాంధ్రకవులు సంకేతిత
సుప్రసిద్ధమనుచు సూత్రమునను
గలిమిఁ బూర్వకవులు కావ్యోక్తములు ప్రసి
ద్ధంబులైనఁ గూర్పఁ దలఁతు రెపుడు. (1-128) 45

వ. అది యెట్లనినఁ, 'గనియె' ననవలసిన భూతార్థ క్రియాపదైక వచనంబు నందు వర్ణలోపముచేసి 'కనె'నట యని గ్రామ్యపదముగా వాగనుశాసనులు ప్రయోగించిరి గాన నది సాధకము చేసికొని యాంధ్ర కవితా పితామహుడు 'కొనియె' ననుటకుఁ 'గొనె'నని చెప్పె, నవి యెవ్వియనిన :- 46

ఆదిపర్వము (4-100) నందు :-

క. వనకన్యక యట నే నట
వనమున గాంధర్వ మట వివాహం బట నం
దనుఁ గనెనట, మఱచితినట
వినఁ గూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్ 47

ఆముక్త మాల్యద : (1-4) నందు :-

ఉ. పూని ముకుందునాజ్ఞఁ కనుబొమ్మనె గాంచి యజాండ ఖాండముల్
వాననుమీఁదఁ బ్రోవ నడువంగొనె దన్నన నగ్రనిశ్చల
వ్యానచలత్వనిష్ఠలె సమస్త జగంబుల జాడ్యచేతనల్
గా నుతికెక్కు సైన్యపతి కాంచనవేత్రము నాశ్రయించెదన్''. 48

అని వ్రాసినారు. మరి అహోబల పండితులవారు :

''చనెన్, వినెన్, కనెన్,ఇత్యాది క్రియాప్రయోగోపి ప్రబంధేషు వర్తతే.

'ఏదంతతాచ నామ్నా మన్యతరస్యామి యాంతానామ్'
ఇతిసూత్రం న ప్రవర్తతే నామ్నామితి నామమాత్రస్యైవ
గ్రహణాత్ కింతు వికృతి వివేక సూత్రేణ తన్నిర్వాహః
'యస్యాద్దేశ్య క్రియాంతేయ భూతఏకత్వవాచకః ఇతి'యః'
'ఇత్స్యాత్ భూతబహుత్వేతు, దేశ్యే తూభయతో భవేత్'
ఇతి ఎత్వమ్ చనియె, వినియె, కనియె-ఇత్యాది

'ఇయాంతాస్సాధవశ్శబ్దాః క్వచి దేదంతతాపివా' ఇతి వా ఏత్వయ్.
'అచోఽచి కుత్రచిల్లోపో, బహులం స్యాత్ప్రయోగతః
ఇతీకారలోపః చనె, వినె, కనె-ఇత్యాది (క. శి. భూ. పు. 183)

ఏవం స్థితే, మహాకవి ప్రయోగసిద్ధేః ప్రయోగవిధానత్వ కథనేన మహాకవి ప్రయోగ రూఢంచేత్ గ్రామ్యమపి ప్రయోగార్హ మిత్యాచార్య తాత్పర్యమితి బాల సరస్వత్యోక్తమ్. ఇదమేవ తాత్పర్యమభివర్ణ్య అప్పకవినాపి వినె, కనె, చనె-ఇత్యాదిశబ్దానాం గ్రామ్యత్వేపి మహాకవి ప్రయోగ రూఢత్వాత్సాధుత్వ ముక్తమ్. తన్న, చనె ఇత్యాది శబ్దానాం శాస్త్రరూఢత్వేన.' (క శి. భూ. పు. 217)

అని 'చనె, వినె' మొదలైనవి గ్రామ్య పదములుగావని స్పష్టముగా చెప్పినారు. 49

గ్రామ్య పదములనగా—ఎక్కడ, ఏడ, అక్కడ, ఆడ-ఇటువంటివనిన్ని 'ఒరులఁ దెగడుచోట చెప్పవచ్చు' నని లాక్షణికులందఱి తాత్పర్యమున్ను. 'పాపడు ఏడ, కౌరవసేన ఏడ, ఒంటిసనుట ఏడ' అని విరాటపర్వమందు చెప్పి నారు. 'కౌరవసేన యేడ' అనుచోట తిరస్కారము కనుపించదు. సరేకదా, 'ఒంటిసనుట యేడ' అనుటవలన నిక్కడ తిరస్కారమున్ను, మొదట స్తుతియు కనిపించుచున్నది. 50

విజయవిలాసమునందు—'భూజగ మేడ', మారుతాశనజగ మేడ-' ఇవి గ్రామ్యపదము లన్నారు. ఇక్కడనైనా నింద కనుపించదు. 'ఎంత ఘనసాహస మింతుల కంచు నెంచుచున్' అనుటవలన నాశ్చర్యము కనుపించుచున్నది. 51

నూత్నదండిగారు 'వేదాలు, వాదాలు'-ఇటువంటివి గ్రామ్యము లన్నారు. మహాకవి ప్రయోగము లవియును గలవు. 52

మధ్యవర్ణ లోపముగల పదములు గ్రామ్యములని సకల లాక్షణికుల తాత్పర్యము. చివర వర్ణలోప(మైన) పదముల గ్రామ్యములని యెవరు ననలేదు. అప్పకవి గారున్ను

గీ. 'చులుకఁగా గ్రామ్యజనములు పలుకునట్టి
తెలుఁగుమాటలు గ్రామ్యంబు లనఁగ బరగు
వర్ణలోపంబు నొంది కావ్యములఁ జొరవు
పరులఁ దెగడెడుచోఁ నొప్పు పొలదొంగ' (1-128) 53

గీ. అక్షరవిలోపమై యుండునట్టి పలుకు
గ్రామ్యమన నొప్పు నదె యపభ్రంశకంబు
ననఁగబడును నాకడ కాడ యనుచు మఱియు
నడుమనున్న కకారంబు నుడువకున్న (1-124) 54

అని చెప్పిరి. కనె, కొనె అనుచోట చివరివర్ణము పోయినది. చివర నువర్ణ లోప ములుగల పదములున్ను గ్రామ్యములనుకుంటే- (వన కన్య కయట...' యను) మొదటి పద్యమందు నాశ్చర్యము కనుపించుచున్నది. లేక, నిందయున్న దంటిరా; ('పూని ముకుందు...' అను) రెండవ పద్యమందు నింద యెక్కడా కనుపించదు. మహాకవి ప్రయోగములు మరియును గలవు. 55

చేమకూరవారి విజయవిలాసము (అవ. 91) :

చ. నలువుగ నెన్నఁనైన రఘునాథ నృపాలుఁడు గల్గఁగా మహీ
స్థలి నఖిలైక ధర్మములు తామరతంపరలై చెలంగెఁ గొ
ల్లలుగ నశేష సజ్జనకులంబు సుఖంబు గనెన్ సమస్త వి
ద్యలఁ గసటెల్ల వాసి మెఱపై వెలకట్టి సభాంతరంబులన్. 56

శ్రీనాథుని కాశీఖండము (6-16) :

గీ. సవతి కద్రువ శేషతక్షకులు మొదలు
గాఁగ వేవురు భుజగపుంగవులఁ గాంచె
నండముల మూఁటిఁ గలధౌత గండశైల
సన్నిభంబులఁ గనెఁ బుణ్యసాధ్వి వినత. 57

రామాభ్యుదయము (3-114) :

ఉ. అంత సుమిత్రయుంగనె ననంతవిలాసుల ధర్మశాస్త్ర సి
ద్ధాంత రహస్యకోవిదుల (నృపతిమ ప్రతిభాప్రభావ దు
ర్దాంతుల శ్రీనిశాంతుల నుదగ్రగభీరిమచాతురీ సర
స్వంతులనిర్వురన్ విమతజైత్రులఁ బుత్త్రుల సచ్చరిత్రులన్). 58

శ్రీనాథుని భీమఖండము (5-112)

చ. మగటిమి చంద్రగుడ్డురక మట్టిన వామపదాంబుజంబుపై
నిగలమునన్ సురాసురుల నించిన యందియ ఘల్లుఘల్లనం
బొగడలు బొందు మల్లియలు బొన్నలు పొగడ నొల్లియంబునన్
నిగిడిచి వీరభద్రుఁడు చనెన్ శశిమౌళి సమీప భూమికిన్. 59

హరవిలాసము (7-29) :-

మ. (భసితోద్ధూళితనిర్మలావయవుఁడున్ బంచాక్షరీ సంతతా
భ్యసనవ్యాప్తిపరాయణుండును శివధ్యానాను సంధాతయున్
మసృణస్నిగ్ధతరత్వ చర్మమయ కంథాభద్ర పీఠుండునై)
అసమస్థేమ కిరీటి పాశుపత దీక్షారంభముం గైకొనెన్. 60

జైమినీ భారతము (1-104) :-

శా. చేదోయిన్ముకుళించి వీడుకొనె నక్షీణప్రమోదంబునన్
వేదవ్యాసు ప్రసాద భాసురవచో విన్యాసు నంహస్సము
త్పాదాభ్యాసు సుధీవిలాసు నుతవిద్యావాసుఁ బ్రజ్ఞాకలా
సాదజ్ఞానసముల్లసచ్చిదమృతాస్వాదాధికోల్లాసునిన్. 61

అందే (2-76) :-

ఉ. భీముని జానుదేశముల భీషణ వాయువు లుప్పతిల్లి సం
గ్రామ తలంబున న్విసరఁగాఁ జతురంగ సమస్త సైనిక
స్తోమము లభ్రమండలముతో నొరయం జనె బొందితోన సు
త్రాముని వీటి కేగెడు విధంబున దివ్యులు చోద్యమందఁగన్, 62

మరియును గలవు.

ఆంధ్రనామ సంగ్రహము (మానవ 40) నందు :-

క. కనియెం జూచెను కాంచెను
గనుగొనియెం గనె ననంగ గలయవి పేర్లై
చను వీక్షించె ననుటకున్
(ఘనతర గోరాజగమన కాయజదమనా) 63

అందే (మానవ. 81) :-

గీ. అనియె నుడివె వక్కాణించె నాడెఁ జెప్పె
వినిచె వాక్రుచ్చెఁ బలికెనాఁ బను వచించె
ననుట యాలించె నాలకించెను వినియెను
వినె నవంగ నొప్పు శ్రుతుఁడయ్యెననుట పేళ్లు. 64

అనియున్నది. మరియు-

పారిజాతాపహరణము (2-84)

క. మురమథనుఁ డి వ్విధంబున
గరుడనిపై గగన పథము గడచి యరుగుచున్
తరలాయతాక్షి కిట్లనె
సరస మధుర వచనరచన చాతురి మెఱయన్. 65

అందే (1-20)

చ. అల ఫణిభోగరత్నములు నాదిశిలోత్కట గంధగంధముల్
తలివునఁ బాఱ నవ్వ వసుధాసతి దా భుజకీర్తి మౌక్తిక
చ్ఛలమునఁ గృష్ణరాయ నృపచంద్రుని ప్రాపున...భూషణో
జ్జ్వలనమణుల్ మృగీమదము వాసనయుం గనె ధూర్దలంగలన్. 66

ఇట్లు మహాకవి ప్రయోగముల, నిఘంటువుల గలవాటివి గ్రామ్యములని యెవరు ననలేదు. అప్పకవిగారు వ్రాసిన గ్రంథమువలన నన్నయభట్టుగారు, పెద్దనగారు నప్పకవి గారితో (స్వయముగా తమపొరబాటు) చెప్పినట్లు కన్పించుచున్నది : 67

## నామాంతముల అమ, అయాదుల విచారము

(ఇదిట్లుండగా తెలుగున మనుష్యుల పేర్ల చివర చేర్చబడు అమ్మ, అయ్య మొదలగువాటికి సంబంధించిన యంశములు కొన్ని గమనింపదగినవి వ్రాసుతాము.) 68

విరాటపర్వము (1-10)

సీ. మజ్జనకుండు సన్మాన్య గౌతమ గోత్ర
మహితుండు భాస్కర మంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన
మల్లన సిద్ధనామాత్య వరులు
కూరిమి తమ్ముఁడు గుంటూరి విభుఁడు కొ
మ్మన దండనాథుండు మధురకీర్తి
విస్తర స్ఫూర్తిఁ డాపస్తంబ సూత్ర ప
విత్రశీలుఁడు సాంగవేదవేది
యర్థిఁ గలఁ వచ్చి వాత్సల్యమతిశయిల్లు
నస్మదీయ ప్రణామంబు లాచరించి
దుష్టి దీవించి కరుణార్ద్రదృష్టిఁ జూచి
యెలమి నిట్లని యానతి యిచ్చె నాకు 69

ఈ పద్యమందు-అన్నమాంబ, సిద్ధనామాత్యుడు, కొమ్మన దండనాథుడు-అని ప్రయోగింపబడినది. 70

అరణ్యపర్వము (7-469)

సీ. భవ్యచరిత్రుఁ డాపస్తంబ సూత్రుండు
శ్రీవత్స గోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యాన సంసక్త చిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుం డిల పాకనాటిలో నీలకం
ఠేశ్వర స్థానమై యెసకమెసఁగు
గుత్తూరు నెలవున గుణగరిష్ఠత నొప్పు
ధన్యుఁడు ధర్మైక తత్పరాత్ముఁ
డెఱ్ఱనార్యుఁడు సకల లోకైక విదితుఁ
డైన నన్నయ భట్ట మహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి తన్ను
బొందుటయు సాధుజనహర్షసిద్ధిఁ గోరి. 71

ఇందు—సూరనార్యుడు, పోతమాంబ, ఎఱ్ఱనార్యుడు-అను ప్రయోగము లున్నవి. 72

శ్రీనాథుని నైషధము (1-32)

సీ. గౌతమగోత్ర విఖ్యాతుఁ డాపస్తంబ
పరమసంయమి సూత్రపావనుండు
గారాపు పౌత్రుండు గంధవారణుఁ డగు
శ్రీ కేతనామాత్య శేఖరునకు
పేషిణీహనుమంత బిరుదాంకుడగు....
వారికి నెయ్యంపు వరసుతుండు
చేహత్రిమల్లుండు దోహత్త నారాయ
ణుం'డఖండి యరాయచండ బిరుద
మంత్రి యల్లాడరాజను మహితపుణ్యుఁ
డన్నమాంబయుఁ దనకు నత్యంత గరిమఁ
దండ్రియును దల్లియును గాఁగ...
తల్లమాంబికదేవి నుద్వాహమయ్యె. 73

అందే (1-33)

మ. వనితారత్నము తల్లమాంబికకు శ్రీవత్సాంక తుల్యుండు పె
ద్దనకుం బుట్టిన నందనుల్ విమల విద్యాభారతీ వల్లభుల్
వినతాసూన సమాన విక్రమ నిధుల్ వీరుండు వేమాహ్వయుం
డును శ్రీ ప్రెగ్గడ దండనాథతిలకుండున్ సింగనామాత్యుఁడున్. 74

ఈ పద్యములందు — కేతనామాత్యుడు, అన్నమాంబ, తల్లమాంబ, సింగనామాత్యుడు-అను ప్రయోగములున్నవి. మరియు 75

అందే (1-36)

మ. తగు కైవార మొనర్ప విక్రమకలా ధౌరేయతాశీలి శ్రీ
ప్రెగడన్న ధ్వజినీశుఁ డంబునిధిగంభీరుండు శుంభద్ద్విష
న్నగరద్వార కవాట పాటన విధానప్రౌఢ బాహార్గలా
యుగలుం డాహవసవ్యసాచి ధరలో నొక్కండు పేరుక్కునన్. 76

ఈ పద్యమందు ప్రెగడ-అన్న = ప్రెగడన్న అని స్పష్టముగా నున్నది. 77

కొందఱు కోనయ-కోనయ్య, రామయ-రామయ్య, సింగన-సింగన్న, వెంకమ-వెంకమ్మ,—ఈ మొదలైనవి ఏకపదములేగాని, వాటిలో అయ, అయ్య; అన, అన్న; అమ, అమ్మ; అని పదవిభాగము లేదంటారు. ఆంధ్రగీర్వాణాదులందు నామధేయమొకటేగావున అమాత్య, మంత్రి, దండనాథులు పురుషుంకున్ను; అంబాదులు స్త్రీలకున్ను చెల్లునవుడు మధ్యను తెలుగుపదములైన అయ, అయ్య మొదలైనవి ఉండరాదని వారి తాత్పర్యము, కావున రామయ్య, వెంకమ్మ మొదలైనవి ఏకపదములే (అని అంటారు.) 78

(మరి ఇదేసరి) అయితే ప్రభునామయతులందు (రామయ్య, వెంకమ్మ ఇత్యాదులలో) అచ్చులకు (యతి) చెల్లకపోవలెను. ప్రభునామ యతులు ఉభయ యతులని యుండగా; స్పష్టముగా 'పెగడ దండనాథు' డని; 'పెగడన్నదండనాథు' డని యొకనికే రెండు విధములుగా మహాకవి ప్రయోగము లుండగా, విమర్శకులు చెప్పిన (పైమాట) నిలువదు. 79

ప్రబోధ చంద్రోదయమునందు :—

సీ. కలరు కౌశికగోత్ర కలశాంబురాశి మం
దారంబు సంగీత నంది, నంది
సింగమంత్రికిఁ బుణ్యశీలయౌ పోచమ్మ
కాత్మసంభవుఁడు మల్లయ మనీషి
యతని మేనల్లుఁ డంచిత భరద్వాజ గో
త్రారామ చైత్రోదయంబు ఘంట
నాగధీమణికి ధన్యచరిత్ర యమ్మలాం
బకుఁగూర్మి తనయుఁడు మలయమారు
తాహ్వయుఁడు సింగనార్యుఁడు నమృతవాక్య
లీశ్వరారాధకులు శాంతు లిలఁ బ్రసిద్ధు
లుభయ భాషల నేర్పరు......
మర్థి రీ కృతిరాజు నిర్మాణమునకు. 80

ఇందు 'మల్లయ మనీషి' యను చోట ప్రభునామ యతి. 81

పారిజాతాపహరణము (5-108) :

సీ. కౌశికగోత్ర విఖ్యాతు( డాపస్తంబ
సూత్రు( డార్వేల పవిత్రకులు(డు
నంది సింగామాత్యునకు( దిప్పమాంబకు
తనయుండు సకల విద్యావివేక
చతురుండు మలయమారుత కవీంద్రునకు మే
నల్లు(డు కృష్ణరాయక్షితీశ
కరుణా సమాలబ్ధ ఘనచతురంతయా
న మహాగ్రహార సన్మానయుతు(డు
తిమ్మనార్యు(డు శివపరాధీన మతి, య
ఘోర శివగురు శిష్యు(డు పారిజాత
హరణ కావ్యమును రచించె నాంధ్రభాష
నాదివాకర తారాసుధాకరముగ 82

తిప్పమాంబ, తిమ్మనార్యుడు.

చాటుధార :—

క. మాకొలది జానపదులకు
నీ కవితారీతి యబ్బునే కూపనట
ద్భేకములకు నాకధునీ
శీకరముల చెమ్మ నంది సింగయ తిమ్మా! 83

చాటుధార :—

ఉ. ఆరవి వీరభద్ర చరణాహతి( బోయిన బోసినోటికిన్
నేరకపోయె, రామకవి నేరిచె(బో మన ముక్కుతిమ్మన
క్రూర పదాహతిం బడిన కొక్కిరపంటికి దుప్పికొమ్ము, బ
ల్గా రచియించినా(డు రవి గానని చో( గవి కాంచునే కదా! 84

ఒక పద్యమందు 'తిమ్మ' అని, రెండు పద్యములందు 'తిమ్మన' అని యున్నది. మరియును- 85

పారిజాతాపహరణము (1-14):

క. ఆ నరస మహీమహిలా
జానికి కులసతులు పుణ్యచరితులు తిప్పాం
బా నాగాంబిక లిరువురు
దానవదమనునకు రమయు ధరయుం బోలెన్. 86

కవి 'అమ' శబ్దము లేకుండగా 'తిప్పాంబా' 'నాగాంబిక' యని ప్రయోగించినాడు.
నాగాంబిక అని నామకరణమే అయితే ఆకవియే ఆనాగాంబికనే (ఈ క్రింది పద్య
మున) 87

శా. వీరశ్రీనరసింగ శౌరిపిదపన్ విశ్వక్షమా మండలీ
ధౌరంధర్యమునన్ జగంబు ముదమొందన్ నాగమాంబాసుతుం
డారూఢోన్నతిఁ గృష్ణరాయఁడు విభుండై రత్నసింహాసనం
బారోహించె విరోధు లాగహన శైలారోహముం జేయఁగన్.
(పారి. 1-16) 88

'నాగమాంబ' అని ప్రయోగించెను. కవీశ్వరుల యిష్టముగాని మరేమియులేదు. 89
వసుచరిత్ర (1-35)

క. ఆమనుజేంద్రునకుఁ బురం
ధ్రీమణి యగు తిమ్మమాంబ శ్రీరామునకున్
భూమిజ, సుత్రామునకు పు
లోమజయను బోలె జగతిలో నుతికెక్కెన్. 90

సోమనాథ శాస్త్రులవారు ఈ పద్యవ్యాఖ్య యందు 'తిమ్మమాంబ' అని ప్రయోగించి నందుకు (అది) కవి ఔద్ధత్యమని వ్రాసినారు. మహాకవి ప్రయోగములలో బహుళముగా రెండు విధముల నుండిన 'తిమ్మమాంబా'ది ప్రయోగముల నహోబల పండితులవారు నిషేధించి నందున, వారి మతము ననుసరించే, 'తిమ్మమాంబ' అని ప్రయోగించరాదని సోమనాథ శాస్త్రులవారు కోపమును ప్రకటించినారు. ఈ వెఱ్ఱి ఆధునికులకున్ను కొందఱికి గలదు. అటువంటి సర్వోత్తమ పండితులకే ఉండగా ఆధునికుల కుండుట వింతగాదు. (మరికొన్ని ప్రయోగములు వ్రాసుతాము.) 91

మనుచరిత్రము (1-31) :

గీ. ఆ నృసింహ ప్రభుండు తిప్పాంబ వలన
నాగమాంబిక వలన నందనులఁ గనియె
వీర నరసింహరాయ భూవిభుని నచ్యు
తాంశ సంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు. 92

ఆముక్తమాల్యద (1-23) :

క. ఆ యీశ్వర నృపతికిఁ బు
ణ్యాయత మతియైన బుక్కమాంబకు తేజ
స్తోయజ హితు లుదయించిరి
ధీయుతులగు నారసింహ తిమ్మనరేంద్రుల్. 93

రాఘవపాండవీయము (1-6) :

సీ. పా. ఏన్నృపోత్తముతల్లి మానిత పరమ సా
ధ్వీగుణంబుల ప్రోద తిమ్మమాంబ... 94

వేమకూరవారి విజయవిలాసము (అవ. 11) :

గీ. శీవి నచ్యుతరాయల దేవియైన
తిరుమలాంబకు దేవియై తేజరిల్లు
మూర్తమాంబను బెండ్లియై కీర్తివెలసి
చెవ్వవిభుఁడు మహోన్నత శ్రీచెలంగె. 95

రుక్మాంగద చరిత్రము (1-1) :

ఉ. శ్రీమయ పత్రముల్ జటలు చెల్వగు నభ్రంతరగింణీ కణ
స్తోమము పుష్పముల్ ఫలము సోముడునై పొలుపొందు పార్వతీ
కోమల దేహవల్లి పెనఁగొన్న సమంచిత దక్షవాటికా
భీమయ దేవకల్పక మభీష్ట ఫలంబులు మాకు నీవుతన్. 96

అందే (1-47) :

క. వామాంగ కలిత గౌరీ
భామా కుచకుంభ ఘుసృణ పంకవిలిప్త

శ్రీమహితోరస్థలునకు
భీమయ దేవునకు శాతపృథు బాహునకున్ 97

దేవనామములకు అయ, అయ్య అని తలుచులేవు. శంకరయ, శంకరయ్య ఇటువలెనే ప్రయోగములు గలవు. 98

రుక్మాంగద చరిత్ర (1-11):

క. మనమున సేవింతును మ
జ్జనకుని శ్రీవత్సగోత్ర సాగరచంద్రున్
ఘను పోతయ మంత్రీశ్వరు
ననయంబును భక్తి నమ్మశాంబా ప్రియునిన్. 99

హరిశ్చంద్రోపాఖ్యానము (2-207):

స్రగ్విణి: లింగమాంబ సుతా లేలిహానేశ పా
దాంగద ధ్యానలీనాత్మ (గాంగేయ గ
ర్భాంగనా నర్తకీ హారి జిహ్వాస్థలీ
రంగ సారంగ దృగ్రాజి మీనధ్వజా) 100

భారతమందు, ఆంధ్ర పంచకమందు, పారిజాతాపహరణ, విజయ విలాసాది మహా ప్రబంధములందే కాదు గీర్వాణ కావ్యములందున్ను (ఇట్టి ప్రయోగములు గలవు. వ్రాసుతున్నాము.) 101

సాహిత్య రత్నాకరము :-

శా. తస్మాత్పర్వతనాథసూరిజలధేః శ్రీయల్లమాంబావియ
ద్గంగా సంగజహేయి సద్గుణమణేర్లక్ష్మో యశశ్చంద్రవత్
సోఽయం ధర్మ సుదీర్ఘవాం విలసితైః కర్తుం రసాలంక్రియా
సంపూర్తిం సముదంచయేయ మథునా సాహిత్య రత్నాకరమ్. 102

స్రగ్ధర : వర్మాంతర్వాణి వర్య త్రిభువనవిదితే
వారణాస్యన్వవాయే
యస్సంజాతః పర్వతేశాచ్ఛుభగుణగణ భూ
ర్యల్లమాంబా సుగర్భః

వ్యాఖ్యావిఖ్యాత కీర్తి ర్వివరణగురు వా
క్సాంఖ్యముఖ్యాగమానాం
తస్యాలంకారశాస్త్రే రఘుపతిచరితే
త్రిత్వసంఖ్యస్తరంగః 103

స్రగ్ధర। ధర్మాంతర్వాణివర్య స్త్రిభువనవిదితే
వారణాస్యన్వవాయే
సంజాతోయల్లమాంబాకృత సుకృత ఫలం
పర్వతేశస్య భాగ్యమ్.
కావ్యాలంకార కృష్ణాస్తుతి రవిశతకా
న్నాటకాది ప్రణేయ
స్తస్యాలంకారశాస్త్రే రఘుపతిచరితే
తుర్య ఉక్త్యైస్తరంగః 104

మేము లక్ష్యములు వ్రాసిన గ్రంథము లన్నియును అహోబల పండితుల వారు పరిశీలించిన వేను. కవిశిరోభూషణమందు.

'రామయప్రభుడు, రామయమంత్రి, కోనమాంబ ఇత్యాదయో నప్రయోగార్హాః రామప్రభుడు, రామమంత్రి, కోనాంబ ఇత్యాకారేణ ప్రయోగార్హాః. 'లక్కమాంబా కుమారే'తి ప్రయోగస్తుప్రౌఢోక్తిమాత్రనిష్పన్న ఇతి జ్ఞేయః'

అని వ్రాసినారు. 'లక్కమాంబా కుమార' అన్నది ఎవరి ప్రయోగమో తెలియదు. వారు భారతాది (గ్రంథము లందలి) ప్రయోగము లేమనుకొనిరో తెలియదు, ఆయన నిషేధించిన ప్రయోగములే బహులముగా నున్నవి. నిలిపినదే విరలము. ధర్మాభట్టుగారు 'యల్లమాంబ' అని ఆద్యంతస్థము ప్రయోగించినారు. కావున యల్లయ్య, యఱ్ఱన్న—ఈ మొదలైన విన్ని యకారాదు లుండవచ్చుననే తోచుచున్నది. 105

శ్రీనాథుని కాశీఖండము (1-24):

గీ. అతని యర్ధాంగలక్ష్మి శ్రీ యన్నమాంబ
కాంచెఁ దనయుల నర్థారికల్పతరుల

నల్లయాధీశు పెదకోటయన్నప్రోల
కువలయేశ దొడ్డయ పిన్నకోటవిభుల 106

'యన్నమాంబ' యకారాది కాకపోతే 'ఇకోయణచి' సూత్రము ప్రవర్తించవలెను. ఈపద్యమందు 'యన్నమాంబ' 'అల్లమాధీశ' (అను రెండు పదములు నున్నవి.) 107

## -: దీర్ఘాంతపదముల హ్రస్వాంతత :-

మరియు నహోబల పండితులవారు ;

''దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్''

యే దీర్ఘాంతాశ్శబ్దాః తేషాం హ్రస్వః స్యాత్· సోమపుడు, గ్రామణి, లక్ష్మి, రమ ఇత్యాది. నచదేశ్యపదే నచైక వర్ణేపి, దేశ్యపదస్య, ఏకవర్ణ సంస్కృత పదస్య హ్రస్వో న స్యాత్· నవలా, నేజా, లకోరీ. మత్తా. ఇత్యాదయః దేశ్యాః. శ్రీ, భూ, మా ఇత్యాదయః ఏకాక్షర సంస్కృతశబ్దాః.

అత్రేయం చింతా. హ్రస్వవిధాయకం శాస్త్రం భిన్న విషయక మేవ, న తు సమాస విషయకమపి· సమాసే తాదృశ ప్రయోగస్యాదృష్టత్వాత్. న చ గ్రామణి పుత్ర ఇత్యాది స్తద్విషయ ఇతివాచ్యమ్. 'ఇకోహ్రస్వోఙ్యోగాలవస్యే'తి శాస్త్రేణ తత్సిద్ధేః న చ సమాసే స్త్రీప్రత్యయమాత్ర విషయత్వేన నియమః కార్య ఇతి వాచ్యమ్. అసమాసే సాధారణ్యేన ప్రవృత్తస్యాస్య సమాసే అన్యాయత్వాత్. తర్హి 'నది సుత గురు కర్ణ శల్య నాగపురీశుల్' ఇత్యాది కథం హ్రస్వ ఇతి చేత్

'హ్రస్వోదీర్ఘ సమాసేపి, క్వచిద్దీపః ప్రయోగతః'

ఇత్యథర్వణయోగతః హ్రస్వః. న చాత్ర ద్వితీయాతుల్యతా ప్రతిపాదక శాస్త్రప్రవృత్తిః. యత్ర సమాసాంత గతపదస్య షష్ఠ్యంతేనాన్వయ స్తత్రైవ తత్ప్రవృత్తిః· న చ "జ్యాపోస్సంజ్ఞా ఛందసోర్బహులమ్' ఇతివార్తికమత్ర ప్రవర్తతే· శబ్దస్యాస్య సంజ్ఞాత్వేన రేవతిపుత్రాదివత్ హ్రస్వవిషయతా· తయా ఆద్యప్రకృత్యాం వ్యవహారాభావాత్· అథర్వణవచన మేవ మానమ్· ప్రయోగత ఇత్యనేన స్థితి నిర్వాహార్థ మిదం వచనమ్. నాపూర్వ శబ్దకల్పనార్థ మపీత్యయ మర్థో ద్యోతతే· వాగనుశాసనస్యాప్యత్రరుచి రస్తీతి జాయతే· ఆదిపర్వణి

చ. నలినసరస్సుగంధి యమునా నది తుంగతరంగ సంతతా
నిల శిశిర స్థలాంతర వినిర్మిత నిర్మలహర్మ్యరేఖలన్'

ఇతిపాఠస్య బహుపుస్తకేషు దర్శనాత్. 'రాకసుధాంశు మండలమూ'
ఇత్యత్ర రాకాపదం షష్ఠ్యంతమ్, సప్తమ్యంతం వా భవతి.

క. నెలకొనియె వేటతమి న
బ్బలియుఁడు శిశిరనగరుచిరపరిసరమహిమం
గల తమసవీరసికతా
విలసనములు డెందమునకు విందొనరింపన్.

ఇత్యాది ప్రయోగేతు తమసాది శబ్దానాం భిన్నపదత్వేనైన సాధుత్వ
మవగంతవ్యమ్. అని వ్రాసినారు. (క. శి. భూ. ప్ర. 344-347) 108

అథర్వణాచార్యుల వారియందు నుండెడు తాత్పర్యాతిశయము వలన
నిటు లింత ప్రయాసము నొందుటే, కాని ఆకారిక కర్థ మదియుగాదు, ఈ నిర్ణ
యించినది సిద్ధాంతమున్ను గాదు. 109

ఈ సూత్రమునకే బాలసరస్వతులవారు :

'దీర్ఘాణాం = దీర్ఘములకు, హ్రస్వస్స్యాత్ = తెలుగున హ్రస్వము
గలదు. అంబ, లక్ష్మి, కరుభోరు, దేశ్యపదే = దేశీయపు తెలుగునందు.
న చ = లేదున్ను. నవలా, నేజా, లకోరీ—ఇత్యాది. ఏకవర్ణేపి = ఏకాక్షర తత్సమ
మందున్ను, న = లేదు. శ్మా, శ్రీ, భ్రూ.'

అని వ్రాసినారు. ఇది రాజమార్గం. 110

అహోబల పండితులవారి వ్యాఖ్యలో 'అత్రేయం చింతా' అని వ్రాసినది
మొదలుకొని చింతించవలసినదౌను. అథర్వణ కారికవలననే ఈకారాంతము
లికారాంతములైతే, చంచూ, తనూ మొదలైన శబ్దములు హ్రస్వము లెటుల
నాయెనో? చామరా-చామరం, ప్రీడా-ప్రీడః ఈ మొదలైన శబ్దములెటుల
హ్రస్వములాయెనో తెలియదు. అయితే అథర్వణాచార్యుల వారికి నన్నయభట్టు
గారికి, కాళిదాసాదులకు పూర్వులైన శ్రీ హర్షులవారు ద్విరూపకోశమందు.

"ప్రబోధమాధాయ మహాబ్ధికానాం
కృపా మవాప్తుం చ సతాం కవీనామ్
ద్విరూపకోశో రచితో విచార్య
బహుప్రబంధస్థితశబ్ద భేదాన్'.

అని చెప్పుటవలన శ్రీ వార్షులవారును పూర్వకవి ప్రయోగములను చూచి రచించి నాముగాన సందేహ మొందవలదని నిశ్చయముకొఱకు చెప్పినట్లు స్పష్టముగా నున్నది.

ఆ ద్విరూప కోశమందు :

'స్వర్ణదీ స్వర్ణది శ్చాపి, వల్లీ వల్లిశ్చ కీర్తితా
దాడిమీ దాడిమిశ్చ స్యాత్, మహీశ్చాపి మహీ తథా
రజనీ రజనిశ్చ స్యాత్ లక్ష్మీ ర్లక్ష్మి ర్హరిప్రియా
వలభీ వలభిశ్చ స్యాత్ నాభీ నాభిశ్చ కథ్యతే
శాల్మలీ శాల్మలి శ్చాపి, యువతీ యువతి స్సమే'

ఇటువలె ననేక శబ్దములు ఈకారాంతములు, ఇకారాంతములును రూఢిగా నున్నవి. 111

అథర్వణాచార్యులవారికి పూర్వులైన మహాకవుల ప్రయోగములు: 112

శ్రీ ఃచంబు (బాల. 25) :

నారాయణాయ నలినాయత లోచనాయ
నామావశేషిత మహాబలి వైభవాయ
నానా చరాచర విధాయక జన్మదేశ
నాభీపుటాయ పురుషాయ నమః పరస్మై. 113

శంకరాచార్యులవారి రచన :

నారీ స్తనభర నాభీదేశం
దృష్ట్వా మాగా మోహావేశమ్
ఏత న్మాంస వసాది వికారం
మనసి విచింతయ వారం వారమ్. 114

పై శ్లోకములలో 'నాభీ' ఈకారాంతము. 115

కిరాతార్జునీయము (8. 24) :

సముచ్ఛ్వసత్పంకజకోశకోమలై
రుపాహిత శ్రీణ్యుపనీవి నాభిభిః
దధంతి మధ్యేషు వలీవిభంగిషు
స్తనాతిభారా దుదరాణి నమ్రతామ్. 116

'నాభి' హ్రస్వమున్ను, 'వలీ' దీర్ఘమున్ను. 117

రఘువంశము :

తదంక శయ్యాచ్యుత నాభినాలా
కచ్చిన్మృగీణా మనఘా ప్రసూతిః 118

నాభి హ్రస్వము. 119

భోజచంపు (బాల. 53)

మందమంద మపయ ద్వలిత్రయా
గాధతా విషయ నాభి గహ్వరా
కోసలేంద్ర మహతు శ్చన్నై రభూ
న్మధ్య యష్టిరపి దృష్టి గోచరా. 120

నాభి, వలి హ్రస్వములు 121

వాసవదత్త :—

కఠినతర దామ వేష్టన
లేఖా సందేహదాయినో యస్య
రాజంతి వలి విభంగాః
స పాతు దామోదరో భవతః. 122

వలి హ్రస్వము : 123

నైషధము (2-35)

ఉదరం పరిమాతి ముష్టినా
కుతుకీ కోపి దవః స్వసుః కిము
ధృతతశ్చతురంగులీ వయ
ద్వలిభి ర్భాతి స హేమ కాంచిభిః 124

వలి, కాంచి- హ్రస్వములు 125

మేఘసందేశము (పూ. 28)

వీచి క్షోభ స్తనిత విహగశ్రేణి కాంచీ గుణాయాః
(సంసర్పన్త్యాః స్ఖలిత సుభగం దర్శితావర్తనాభేః
నిర్వింధ్యాయాః పథి భవ రసాభ్యంతర స్సన్నిపత్య
స్త్రీణా మాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు.) 126

'శ్రేణి' హ్రస్వము, 'కాంచి' దీర్ఘము. 127

అందే (ఉ. 3):

యత్రోన్మత్త భ్రమరముఖరా పాదపా నిత్యపుష్పాః
హంసశ్రేణీరచిత రశనా నిత్యపద్మా నలిన్యః
(కేకోత్కంఠా భవన శిఖినో నిత్య భాస్వత్కలాపా
నిత్యజ్యోత్స్నాః ప్రతిహతతమోవృత్తిరమ్యాః ప్రదోషాః) [1] 128

'శ్రేణీ'- దీర్ఘము 129

భోజచంపు (సుందర. 11)

ఉజ్జృంభిత స్స తరసా సురసాం విజేతుం
పాదౌ పయోధి కలితౌ పవమానసూనోః
అస్యోత్తమాంగ మభవ ద్గగన స్రవంతీ
వీచీచయ స్ఖలితశీకరమాలధారి. 130

'వీచీ'- దీర్ఘము 131

అందే (సుందర. 4)

పక్షాభిఘాత రయ రేచిత వీచిమాలా
త్పాథోనిధేః పవననందన విశ్రమాయ
ఉత్తుంగ శృంగకుల కీలిత నాకలోకో
మైనాక భూభృ దుదజృంభత సంభ్రమేణ 132

'వీచి'- హ్రస్వము 133

---

1. ఈ శ్లోకము మేఘ సందేశమున ప్రక్షిప్తమని కొన్ని ప్రతులయందు చెప్పబడినది.

అందే (సుందర. 32)

రజని చరమభాగే వారసీమంతినీనాం
కరతల కలితాభి ర్దీపికా మార్గనీభిః
దిశి దిశి పరిమృష్టం యత్తమస్తత్సమస్తం
హృదయ మవజగాహే కేవలం రావణస్య. 134

'రజని'- హ్రస్వము 135

అందే (సుందర. 110)

చక్రే శక్రజిదాదాజ్ఞయా రణముఖే యత్కార్మ్య రక్షో గణ
స్తత్కర్తుం రజనీచరక్షితిభృతా యుక్తోప్యశక్తోఽభవత్
సప్తార్చిశ్చ హనూమతా పరిచితో లంకామధాక్షీ ద్యథా
తత్ప్రీతా మరుతాయుతోపి న తథా దాహక్రియాయాం పటుః 136

'రజనీ'- దీర్ఘము 137

విల్హణ కావ్యము :-

పంచబ్రహ్మ షడంగ బీజముఖర ప్రాసాద పంచాక్షరీ
వ్యోమవ్యాప్తి పురస్సరేషు మనుషు ప్రౌఢః కులో మాదృశామ్
ఓంకారాది నమోంత ముద్రిత భవన్నామావలీ కల్పితం
సర్వం మంత్రతయా ప్రభోపరణమత్యంతర్బహిర్యాగయోః 138

'ఆవలీ'- దీర్ఘము 139

మేఘసందేశ వ్యాఖ్యానమందు నుదహరించిన

కర్మోదయము' :-

గర్భం బలాకా దధతేబ్దయోగా
న్నాకే నిబద్ధా వలయ స్సమంతాత్. 140

'ఆవలి'- హ్రస్వము 141

కాళిదాసుగారి శ్యామల దండకము :-

"...తారకారాజ నీకాశ హారావలిస్మేర చారు స్తనా
భోగ భారా నమన్మధ్య వల్లీ వలిచ్ఛేద వీచీసముల్లాస
సందర్శితాకార సౌందర్య రత్నాకరే, శ్రీకరే..." 142

'వల్లీ' - దీర్ఘము 143

భోజ చరిత్ర:—

రాజన్నభ్యుదయోస్తు, శంకరకవే కిం పత్రికాయా మిదం,
పద్యం, కస్య, తవైవ భోజనృపతే, భోః పఠ్యతాం, పఠ్యతే,
ఏతాసా మరవింద సుందర దృశాం ద్రాక్షామరాందోలనా
దుద్వేలద్భుజ వల్లి కంకణ ఝణత్కారః క్షణం వార్యతామ్. 144

'వల్లి' - హ్రస్వము 145

కాళిదాసుగారి శ్యామలా దండకము :-

'...కామలీలా ధనుస్సన్నిభ భ్రూలతా పుష్ప సందేహ కృచ్చారుణా
రోచనా పంక కేలీ లలామాభిరామే, తస్య లీలా సరోవారిధి స్తస్య కేలీ
వనం నందనమ్...' 146

'కేలీ' - దీర్ఘము 147

భోజచంబు (కిష్కింధ. 6)

ఆదౌ సిద్ధౌషధి రివ హితా కేలికాలేన యస్యా
పత్నీ త్రేతా యజనసమయే క్షత్రియాణ్యేవ యుద్ధే
శిష్యేదేవ ద్విజపితృ సమారాధనే బంధు రార్తౌ
సీతా సా మే శిశిరిత మహాకాననే కా న జాతా. 148

అందే (సుందర. 86) :

సంగ్రామ కేలి పరిఘట్టన భగ్నభుగ్న
దిగ్దంతి దంత కృతముద్ర భుజాంతరాలమ్
ఛాయాత్మనా ప్రతి తరంగ విరాజమాన
శీతాంశు మండల సనాథ మివాంబురాశిమ్. 149

'కేలి' - హ్రస్వములు 150

కాళిదాసుగారి శ్యామలా దండకము :-

...'పద్మరాగోల్లసన్మేఖలా భాస్వర శ్రోణి శోభాజిత
స్వర్ణభూభృత్తలే, చంద్రికాశీతలే...' 151

అమరము:—

'కలత్రం శ్రోణి భార్యయోః' 152

"శ్రోణి' -హ్రస్వములు 153

మేఘ సందేశము (ఉత్తర. 19)

(తన్వీశ్యామా శిఖరి దశనా పక్వబింబాధరోష్ఠీ
మధ్యే శ్యామా చకితహరిణీ ప్రేక్షణా నిమ్ననాభిః)
శ్రోణీభారా దలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
(యా తత్ర స్యా ద్యువతి విషయే సృష్టిరాద్యేవ ధాతుః) 154

"శ్రోణీ' -దీర్ఘము, 155

మేఘసందేశము (ఉత్తర. 19)

'...యా తత్ర స్యా ద్యువతి విషయే...' 156

"యువతి' -హ్రస్వము 157

భోజచరిత్ర

'యువతీకర నిర్మథితం మథితం' 158

"యువతీ' -దీర్ఘము 159

కాళిదాసుగారి శ్యామలా దండకము :-

'...దివ్యరత్నోర్మికా దీధితిస్తోమ సంధ్యాయ మానాంగుళీ
పల్లవోద్య న్నఖేందు ప్రభామండలే...' 160

"అంగులీ' -దీర్ఘము 161

భోజచరిత్ర:—

చిత్రాయ త్వయి చింతితే తనుభువా సజ్జీకృతం కార్ముకం
వర్తిం ధత్తు ముపాగతేంగులియుగే బాణా గుణే యోజితాః

ప్రారబ్ధే త్వయి చిత్రకర్మణి తదా తద్భాణ భగ్నాసతీ
భిత్తిం ద్రాగవలంబ్య సింహలపటే సా తత్ర చిత్రాయతే. 162

అంగులి - హ్రస్వము 163

శిశుపాలవధ:—

రాజీవ రాజీవశలోల భృంగ
ముష్ణంత ముష్ణం తటిభిస్తరూణామ్
కాంతాల కాంతా లలనా స్సురాణాం
రక్షోభి రక్షోభి తముద్వహంతమ్. 164

'రాజీ' -దీర్ఘము 165

అందే:—

ఉచ్చైర్మహో రజతరాజి విరాజితాసౌ
దుర్వార భిత్తి రిహ సాంద్రసుధా సవర్ణా
అభ్యేతి భస్మపరిపాండురిత స్స్మరారే
రుద్వహ్ని లోచన లలామ లలాట లీలామ్. 166

'రాజి' - హ్రస్వము 167

ఇటువలెనే అనేక పదములు హ్రస్వదీర్ఘములు బహుళములు గలవు. ఇది వరకే విస్తరించి వ్రాసినాము. ఇవి ఏ అథర్వణాచార్య కారిక వలన హ్రస్వము లనుకోను: బాల సరస్వతులవారు వ్రాసినది రాజమార్గమని తెలిపినాము అలా గున అర్థము వ్రాయక, లేని యర్థము వ్రాసి (అహోబల పండితులవారు తమకు) ఉన్న పాండిత్యమునకు లోపము చేసికొన్నారు. పండిత సార్వభౌములైన తాము అప్పకవివలె నిలువని సిద్ధాంతములు చెయ్యరాదు. కావున 'ఆత్రేయం చింతా' మొదలుకొని 'స్థితి నిర్వాహార్థం' వరకు వ్రాసిన గ్రంథము చింత కొలకు వ్రాసినదౌను. 168

'లకోరి' పదము హ్రస్వమే కాని దీర్ఘము కన్పించదు. 169

ఇక, కొందఱు లాక్షణికులు ఆంధ్రకృతులందు (కేల్యాదులు) హ్రస్వము లని వ్రాసినారు. గీర్వాణ కావ్యము లందు లేనివి తెలుగు కావ్యముల కెక్కడి నుండి వచ్చెనో తెలియదు. ఇది వరకు మేము వ్రాసిన గీర్వాణ ప్రయోగము

లకు (వారు) ఏమిగతి కల్గించుకొనిరో తెలియదు. (ఇక, తెలుగులో నొకటి రెండు ప్రయోగములు) 170

తిక్కనగారి ఉత్తరరామాయణము (1-11) :

క. ఎత్తఱి నైనను ధీరో
దాత్త గుణోత్తరుఁడు రామధరణీపతి స
ద్వృత్తమున భాగ్యమగుటను
నుత్తర రామాయణోక్తి యుక్తుఁడనైతిన్- 171

'ధరణీ' - దీర్ఘము 172

అందే : (1-80)

సీ. భూరిప్రతాపంబు వైరిమదాంధ కా
రమున కఖండ దీపముగఁ జేసి
చరితంబు నిఖిల భూజన నిత్యశోభన
లతలకు నాలవాలముగఁ జేసి
కరుణ దీనానాథ కవిబంధుజన చకో
రములకుఁ జంద్రాతపముగఁ జేసి
కీర్తిజాలము త్రిలోకీశారికకు నభి
రామరాజిత పంజరముగఁ జేసి
సుందరీ జనంబు డెందంబులకుఁ దన
నిరుపమానమైన నేర్పుకలిమి
నంబురాశిఁ జేసి యసదృశలీలమైఁ
బరిగె మనుమసిద్ధి ధరణి విభుఁడు. 173

ధరణి - హ్రస్వము. 174

అందే (1-83)

సీ. లకుమయమంత్రి పోరికి నెత్తివచ్చినఁ
గొనఁడె యాహవమున ఘోటకముల
దర్పదుర్జయులగు దబలాది నృపతుల
నని మొనఁ బరపడే యత్రమమున

శంభు రాజాది ప్రశస్తమండలికుల
చెఱిచి యేలండె కాంచీపురంబు
సింధు మంగళము గాసిగఁజేసి కాళవ
పతి నీయకొలుపఁదే పలచమునకు
రాయగండ గోపాలు నరాతిభయద
రాయపెండెర బిరుదాభిరాము నుభయ
రాయగండాంకు ఖండియరాతి తిక్క
ధరణి విభుఁ బోల రాజుల కరిదిగాదె. 175

'ధరణి' – హ్రస్వము : 176

క. భూరి శుభగుణోత్తరులగు
వారికి ధీరులకు ధరణి వల్లభులకు వా
క్పారుష్యము జనునె మహా
దారుణమది విషముకంటె దహనముకంటెన్. 177

'ధరణి' – హ్రస్వము. 178

ఇటువలె తెలుగు కావ్యములందు ('ధరణి' మొదలగు పదములు కవులు) హ్రస్వములని వ్రాసినారు. గీర్వాణ సమాసములు ఏ (భాషా) కావ్యమందు (నైన) నొకటే. 179

అంబ, లక్ష్మి మొదలైనవి ఏక పదములు (తెలుగున హ్రస్వములుగా) నుండును. 180

ఇదివరకు వ్రాసిన సంస్కృతాంధ్ర లక్ష్యములు అథర్వణాచార్యుల వారు పుట్టక మునుపటివి. ప్రతాపరుద్రయశోభూషణాది సంస్కృత కావ్యము లందును, కాశీఖండము మొదలైన తెలుగు కావ్యములందున నిటువలెనే హ్రస్వ, దీర్ఘములు (గల రూపములు) గలవు. గ్రంథ విస్తరమని వ్రాయలేదు. అథ ర్వణాచార్యుల వారి కారికల కన్నను ముందువారును, పిమ్మటివారును గూడా రచించిన హ్రస్వదీర్ఘ(ములుగల పద) ప్రయోగములు బహుళములు గలవు. కావున నహోబల పండితులవారు వ్రాసిన గ్రంథము- అనగా, 'అథర్వణ వచనమేవ మానం' 'స్థితి నిర్వాహార్థం' అను రెండు సిద్ధాంతములు వ్యర్థములు. హ్రస్వ దీర్ఘములు ఇకారాంత, ఈకారాంతములే కావు. అకారాంత, ఆకారాంత ములును గలవు. కొన్ని కొన్ని వివరించుతాము. 181

## -: భిన్నరూప సంస్కృత పదములు :-

ఇకారాంతములు :-

| | | | | |
|---|---|---|---|---|
| వీచిః | సూచిః | ఆజిః | రాజిః | ధూళిః |
| పాలిః | కేలిః | నాలిః | వేణిః | శ్రోణిః |
| శ్రేణిః | ఝల్లరిః | వల్లరిః | వల్లిః | వలభిః |
| వాపిః | యువతిః | మహిః | సుషిః | ఊర్మిః |
| నాభిః | దాడిమిః | కాశిః | మణిః | రజనిః |
| భూమిః | పృథివిః | ధరణిః | క్షోణిః | అవనిః |
| కృతిః | ప్రతతిః | పాటలిః ( = పురము) | | దూతిః |
| శాల్మలిః | రాత్రిః | మంజరిః | మధూలి (=మకరందము) | |
| కటిః | అంగులిః | దేవకిః | దూషిః (=నేత్రమలము) | |

—ఈ శబ్దములు ఈకారాంతములును గలవు. 'అంగులిః' అనిమాత్రమే కాక 'అంగులః' అని అకారాంతమును గలదు. 182

ఉకారాంతములు :-

| | | | | |
|---|---|---|---|---|
| పునర్వసుః | సరయుః | చంచుః | అలాబుః | అవటుః |
| చముః | భీరుః | తనుః | హనుః | స్వయంభుః |

—ఈశబ్దములు ఊకారాంతములును గలవు. 183

అకారాంతములు :-

| | | | | |
|---|---|---|---|---|
| శుండః | వ్రీడః | కందరః | సభః | మృగశిరః |
| క్రోడః | దాడిమః | ఫణః | క్షుధః | జాగరః |
| బాణః | జీవః | నారః | భుజః | ధారః |
| ప్రతిఘః | అప్సరసః | | | |

—ఈశబ్దములు శుండా, అప్సరసా అనురీతిలో ఆకారాంతములును గలవు. మరియు 184

| | | | | |
|---|---|---|---|---|
| జతుకం | అక్షతం | చూడం | మదిరం | వాసనం(నివాసము) |
| చామరం | తమిస్రం | బాధం | నీరాజనం | స్ఫురణం |
| కరుణం | తారం | తారకం | అర్గలం | రచనం |
| పాలనం | జ్యేష్ఠం | వజ్రం | గణనం | నారం |

—ఈ శబ్దములు జతుకా, నారా అనురీతిలో ఆకారాంతములునుగలవు. 185

మరియు కొన్ని భేదములు వివరించుతాము.

పరిరంభః-పరీరంభః
పరిభవః-పరీభావం
పరిహారం - పరీహారం
పరివృత్తం - పరీవృత్తం
సమికం - సమీకం (యుద్ధము)
ఉదితం - ఉదీతం
సలిలం - సలీలం
వాల్మికిః - వాల్మీకిః
అభ్యుషః - అభ్యూషః
కంబుకం - కంబూకం
భల్లుకః - భల్లూకః
గాండివం - గాండీవం

బాహ్లికం - బాహ్లీకం
(= ఇంగువ, కుంకుమ)
మండుకం - మండూకం

బంధురం - బంధూరం
నిష్కుహః - నిష్కూహః
ఔశిరం - ఔశీరం
నిమిషః - నిమేషః
ఉచ్ఛ్రియః - ఉచ్ఛ్రాయః
ఖలినం - ఖలీనం
నియమః - నియామః
శ్యామకః - శ్యామాకః
ప్రగ్రహః - ప్రగ్రాహః
సహచరః - సహాచరః
నిగదః - నిగాదః

పరిహాసః-పరీహాసః
పరిపాకం-పరీపాకం
పరిమలం - పరీమలం
ప్రతిహారం - ప్రతీహారం
అన్వితం - అన్వీతం
కృపిటం - కృపీటం
వల్మికం - వల్మీకం
ప్రత్యుషః - ప్రత్యూషః
జంబుకః - జంబూకః
జతుకా - జతూకా
వాస్తుకం - వాస్తూకం
బాహ్లికః - బాహ్లీకః
(= దేశము, గుఱ్ఱము).
డిండిరః - డిండీరః

ఎడుకం = ఎడూకం
(గుంజలువేసి కట్టినగోడ)
మరిచం - మరీచం
మృద్వికా - మృద్వీకా
అధికారః - అధీకారః
ఆశరః - ఆశారః
ఉల్లసితం - ఉల్లాసితం
సాలవృకం - సాలావృకం
సంయమః - సంయామః
శ్యామలః - శ్యామాలః
వదన్యః - వదాన్యః
వస్నసా - వస్నాసా
నికషః - నికాషః

—ఈ శబ్దములకు మధ్యవర్ణములందు హ్రస్వదీర్ఘములుగలవు.

భ్రుకుంసః - భ్రూకుంసః
(= స్త్రీవేషధర పురుషుడు)
అపగా - ఆపగా
అరాతిః - ఆరాతిః
అమిషం - ఆమిషం
పటీరః - పాటీరః
అవాసః - ఆవాసః
అంతరిక్షం - ఆంతరిక్షం
ఉషరం - ఊషరం
కదంబః - కాదంబః
కరిణీ - కారిణీ
ఖనిః - ఖానిః
గుడః - గూడః (=బెల్లము)
చమరం - చామరం
ఝురీ - ఝూరీ
ఝులః - ఝూలః
(= పర్వత ప్రవాహము)
తపింఛం - తాపింఛం
తుబరః - తూబరః (=వగరు)
మసారః - మాసారః (=మణి)

మదనః - మాదనః=ఉమ్మెత్త
వలుకా - వాలుకా
పులిందః - పూలిందః
చటుః - చాటుః
చపలత - చాపలః
ముసలః - మూసలః
ఖరః - ఖారః

అగారం - ఆగారం

అహితుండికః-ఆహితుండికః
అమర్షం - ఆమర్షం
అతిరూషః - ఆతిరూషః
నసా - నాసా
అవతారః - ఆవతరః
ఉషణం - ఊషణం
కమనః - కామనః
కలంబః - కాలంబః
కుణిః - కూణిః
గ్రహః - గ్రాహః
చతురః - చాతురః
చికురః - చీకురః
ఝురః - ఝూరః
తపనః - తాపనః

త్రపుషం - త్రాపుషం
పలాశః - పాలాశః
మసురాః - మాసురాః
(=వ్రీహులు, పణ్యస్త్రీలు)
యమః - యామః
శబరః - శాబరః
వణిజ్యం - వాణిజ్యం
చలం - చాలం
పటచ్చారః - పాటచ్చరః
మయూరః - మాయూరః
ప్రచీరం - ప్రాచీరం

శ్రమః - శ్రామః సదనం - సాదనం
సహస్రం - సాహస్రం సుత్రామః - సూత్రామః
సుకరా - సూకరా=సాధుధేనువు స్ఫురత్ - స్ఫూరత్
అహో - ఆహో=అవ్యయము ఆశ్చర్యార్థము.

—ఈ శబ్దముల ఆదివర్ణము లందు హ్రస్వదీర్ఘములు గలవు. 187

చేటా - చేటీ శోణా - శోణీ
ఫేలా - ఫేలీ తంద్రా - తంద్రీ
కాహలా - కాహలీ రాత్రా - రాత్రిః
జ్యోత్స్నా - జ్యోత్స్నీ వాగురా - వాగురీ

—ఈ శబ్దములు ఆకారాంతములు, ఈకారాంతములు = స్త్రీ లింగములు గలవు. 'రాత్రిః' అనునది ఇకారాంత స్త్రీ లింగము 188

సాహిత్యం - సాహితీ పాండిత్యం - పాండితీ
పారంపర్యం - పారంపరీ చాతుర్యం - చాతురీ
ద్వయం - ద్వయీ త్రయం - త్రయీ
అరరం - అరరీ నగరం - నగరీ
మృణాలం - మృణాలీ ఖలినం - ఖలినీ
ముకుటం - ముకుటీ మకుటం - మకుటీ
శస్త్రం - శస్త్రీ నిర్ఝరః - నిర్ఝరీ

—ఈ శబ్దములు అకారాంత నపుంసక లింగములు, ఈకారాంత స్త్రీ లింగములు గలవు. 'నిర్ఝరః' అనునది పుంలింగము. 189

సధర్మా - సుధర్మా గల్మః - గుల్మః
మకులః - ముకులః మకురః - ముకురః
మకుటం - ముకుటం దరోదరం - దురోదరం
భ్రకుంసః - భ్రుకుంసః=స్త్రీ వేషధర పురుషుడు.
ధ్వాంక్షః - ధూంక్షః క్షరికః - క్షురికః=బాలిదబెద్దు

—ఈ పదముల ఆదియందు అకారము, ఉకారము కలవు. 190

మహికా - మిహికా మహిరః - మిహిరః

లకుచః - లికుచః
గలితం - గిలితం

తమిరం - తిమిరం

—ఈ పదముల ఆదియందు అకారము, ఇకారము గలవు. 191

కృమిః - క్రిమిః
తృణలా - త్రిణలా

తృఫలం - త్రిఫలం

—ఈ పదముల ఆదిని ఋత్వ-రేఫములు గలవు. 192

అగరు - అగురు
ఖిదరం - ఖిదురం
శింశపా - శింశుపా

కురక్కరః - కురుక్కరః
పాండరః - పాండురః
జాంగలికః - జాంగులికః

—ఈ పద్యముల మధ్య వర్ణములందు అకారము-ఉకారము గలవు. 193

లేఖనీ - లేఖినీ
ధంమల్లః - ధంమిల్లః

ద్రుహణః - ద్రుహిణః

—ఈ పదముల మధ్య వర్ణములకు అకారము-ఇకారము గలవు. 194

అరణం - హరణం=ద్రవ్యప్రాప్తి.

అయనం - హాయనం

—ఈ పదముల ఆదిని అకార, హకారములు గలవు. 195

భృంగారః - భృంగారుః
గుగ్గలః - గుగ్గులుః

శైలః - శైలుః

—ఈ పదములు అకారాంతములు, ఉకారాంతములు గలవు. 196

కర్కశః - కర్కరః=కఠినుడు.

మాథః=మథనం

—ఇట్లును గలవు. 197

మరియు కొన్ని భేదములు వివరించుతాము

పారావతః - పారవతః
స్పర్శః - స్పృశః
మధ్యమం - మధ్యం

సరిషపః - సర్షపః
మర్దలః - మద్దలః
గ్రథితం - గ్రంథితం

గ్రథనం – గ్రంథనం
కౌమోదకీ – కౌముదకీ
దివిషదః – ద్యుషదః
మార్గశీర్షః – మార్గశిరః
మంథనం – మథనం
శకలః – శల్కః
లక్షం – లక్ష్యం
బ్రాహ్మీ – బ్రాహ్మణీ
శర్వః – సర్వః = శివుడు.
గరలం – గరం
అన్వయః – అన్వవాయః
వేశః – వేషః = వేశ్యవాటిక.
తుసః – తుషః
శూరః – సూరః = రవి.
సరయూః – శరయూః
కబేరః – కూబరః
చమూరుః – సమూరుః

నారంగం – నార్యంగం
నైచికీ – నీచికీ
పృషతః – పృషః
వ్యాయామః – యామః
నఖరం – నఖం
ఉలూఖలం – ఉదూఖలం
పాణినిః – పానినిః
భాగ్యం – భగః
ఆత్రికా – అంతికా
పరిఖా – పరిఘా
సిందూరం – సింధూరం
బుసం – బుషం
బృశీ – బృషీ
మందరః – మంథరః
కక్ష్యా – కక్షా
కలశః – కలసః
లక్షణః – లక్ష్మణః = లక్షణయుక్తుడు

చరిత్రం – చరితం
వాసరః – వాశరః
గుచ్ఛః – గుత్సః = ముక్తాహార కలాపములు, స్తబక స్తంబ హార భేదములు.
జగత్ప్రాణః – జగత్ = వాయువు
బర్హిశ్శుష్మా – బర్హిః
సురీ – సురా
అనడుహః – (అకారాంతము)
అనడ్వాన్ – (హకారాంతము)
లోలుపం – లోలుభం
వైదేహః – వైదేహిః
శిఖరం – శిఖా
పవిః – బవిః

పారదం – పారతం
కింమీరః – కిమీరః
గౌః – గవీ
ముషితం – ముష్టం
ఇందీ – ఇందిరా
కుటీ – కుటీరః
తటీ–తటిత్

వాజీ - వాజిః
రదః - రదనః
పులకః - పులః
యుక్తః - యుతం
గుంభం - గుంభనం
ఢక్కా - ఢక్కా
వృక్కా. ఆకారాంత స్త్రీ లింగము.
వృక్కం.- అకారాంత నపుంసక లింగము = దంతిచెట్టు.
జృంభం - జృంభణం
చిరంతనః - చిరత్నః
స్వవాసినీ - సువాసినీ
యోషా - జోషా
భ్రూణః - బ్రూణః
సౌహార్దం - సౌహృదం
సింధుః - సింధురః
నైవేద్యం - నివేద్యం
ఉదకం - దకం - దగం
సౌదామనీ - సౌదామ్నీ - శాదామినీ.
ధరిత్రీ - ధారయిత్రీ
ధర్మం - ధర్మః
కూషం - కూషః
లలామం - లలామః
విదారణం - దారణం.
ద్యూతం - ద్యూత్యం

ఘటీ - ఘటికా

కైకేయీ - కైకయీ
బంధుః - బాంధవః

ఎరకః - ఎడకః
ప్రత్నః - ప్రతనః
సహితం - సంహితం
అహిః - అహితః
శయ్యా - శయనం
జీవంజీవః - జీవజీవః
బీజం పూరః - బీజపూరః
వల్కలం - వల్కం
యౌవనం - యౌవతం
భర్త్సనం - భత్సనం
సమాఖ్యా - సమాజ్ఞా
సాంకర్యం - సంకరం
పారంగతం - పారగతం
కుద్దాలం - కులిలం
శిలోంఛం - ఉంఛశిలం.
శోషణం - శోషః
కోరకం - కోరకః
బర్హం - బర్హః
భేదనం - భేదః
సింహాణం - సింఘాణం
మణీకం - మణీచం
= ఒక పుష్పము.
ఉందురుః - ఉందురః
= ఎలుక
సోదర్యః - సోదరః
సదృక్ - సదృక్షః - సదృశః

తాదృక్ - తాదృక్షః - తాదృశః
వాక్-వాచా-వచః (సకారాంత నపుంసకము)
దిక్-దిశా-దిశః నవం-నవ్యం-నవీనం
అజగవం-అజిగవం-అజాగవం.
మరకతం - మకరతం - మతరకం
పారావారః - పారవారః - పారాపారః
పత్తనం - పట్టనం - పటణం
శృగాలః - సృగాలః - సృగాలీ
వాసనా - వాసనం - వాసః - నివాసము
పాదదా - పాదుకా - పాదూః - పాదావనీః
మరిచం - మరీచం - మరిచః
సుషిః - సుషిరం - శుషిరం
కుండూః - కండూయా - కండూయనం
విరించిః - విరించః - విరించనః
పురోగః - పురోగమం - పురోగామీ
స్వప్నం - స్వపనం - స్వాపం
లవః - లవనం - లావః
ధారుణీ - ధారణీ - ధరణీ
సముదాయః - సమదాయః - సముదయః
హర్మ్యం - హర్మ్యః - హర్మిః
అధ్వనీనః - అధ్వనః
హాలాహలం - హాలహలం - హలాహలం, హాలహలం.
డాహలం - దహాలం - డాహాలం.
మహిలా - మహీలా - మేహలా - మహేలికా = స్త్రీ
వనీపనః - వనీపకః, చెలం-చైలం
కదలం - కదలీ - కందలీ.
విఖ్యః - విగ్రః = విగతనాసుడు
దుత్తూరః - దుర్తూరః - దుస్తూరః
చిలీచకుః - చిలీచిమః = మత్స్యభేదము

కుటీ – కుటీరః – కుటికా
ఖురలీ – ఖురలికా – ఖురల – ఖలూరికా = గరిడీశాల.
వారణసీ – వరణాసీ – వరాణసీ – వారాణసీ = కాశి.
చంద్రః – చంద్రమాః – చందిరః
చికురః – చిహురః.
తుందీ – తుందికః – తుందిలః – తుందిభః
జీవనీయకః – జీవనం = జలము.
హాసః – హసః – హసనం – హాస్యం – హసికా
పద్గః – పదగః – పదాతిః – పదాతిగః – పదాలికః.
కండుః – కందు – కండూః.
పత్రా – పత్రీ – పత్రికా – పత్రికం – పత్రం
జంభం – జంభలః – జంబీరః = నిమ్మచెట్టు.
కిసాలయం – కిసలయం – కిసాలం – కిసలం – కిసం.
కువాలం – కువలయం – కువేలం – కువలం – కువం.
శైవాలం – శైవలం – శైవాలః – శేవలం – శివాలం.
విస్తృతం – విస్రుతం – వితతం – తతం
యుగలీ – యుగలం – యుగ్మం – యుగం
జాగరః – జాగరా – జాగర్యా – జాగరణం
పనితం – పణితం – పణయితం – పణాయితం
కౌతుకం – కుతుకం – కౌతూహలం – కుతూహలం
పీఠం – పీఠా – పీఠీ
మరుత్వాన్ = ఇంద్రుడు, మేఘము, మారుతము.
కవిః (పుంలిం) = శుక్రుడు – పండితుడు, కార్యకర్త – స్త్రీ ఖలీనము.
జామిః (స్త్రీ) = అత్తగారు, చెల్లెలు, సత్కులస్త్రీ
జామీ (స్త్రీ) = కంచుకభేదము, తల్లి, సంతతి, చర్మము.
జామి (అవ్య) = ఆలస్యం, ఉపాంతికము, అధికము.
వాసః (అ. ప్ర.) = గృహము, దేహము.
వాసః (అ. నపుం) = వస్త్రము.
వసనం = వస్త్ర, నివాసములు.

వాసనా - వాసనం = వస్త్రము.

ఝుంఝుణీ = కింకిణి = గజ్జెలు.

అబ్జః = శంఖము, చంద్రుడు.

అబ్జం = పదము.

కచ్చరః = రాక్షసుడు, వ్యాఘ్రము.

కర్బురః = రాక్షసుడు, మిశ్రవర్ణము, పాపుడు.

కర్బురం = సువర్ణము, ఉదకము, ఆకాశము సిందూరము

(ఈ పదము మూడులింగములందు నున్నది

ఫాలం - (ద్వితీయవర్ణాది) = వస్త్రము.

ఫాలః - (ద్వితీయవర్ణాది) = కరుకోల.

భాలః (చతుర్థవర్ణాది ) = నిటలము.

(నిటలార్థమున ద్వితీయవర్ణాదియని అందఱికి భ్రాంతి = ఫాలమునకు కరుకోల, వస్త్రము అని అర్థముగాని లలాటముగాదు)

పుండరీకః = అగ్ని, వ్యాఘ్రము, దిగ్గజము.

చందిరః = ఏనుగు; చంద్రుడు.

జూహూరాణః = చంద్రుడు, గుల్మము.

నప్తా = పుత్రపుత్రుడు, దుహితృపుత్రుడు, పౌత్రపుత్రుడు.

కర్కంధుః (పుం)

కర్కంధూః (స్త్రీ) = రేగుచెట్టు

కర్కంధః (నపుంసక) = ఫలము.

గుణనికా (ఆ - స్త్రీ) నాట్యప్రయోక్త వ్యార్థము, ధనుర్విద్య

క్షుత్ - క్షుతం. యోషిత్ - యోషితా

శరత్ - శరదా - శారదా = ఋతువు.

ప్రావృట్ - ప్రావృషా,

విశ్వసృట్ - విశ్వసృక్.

(ఈపదములు - అనేకార్థములిట్లుండగా :- )

అకూపారః - కూపారః; అవస్యాయః - వస్యాయః;

అవతంసః - వతంసః; అవగ్రహః - వగ్రహః

అవలగ్నం-వలగ్నం: అసూర్క్షణం - సూర్క్షణం
= అధిక్షేపము

—ఈపదముల కేకార్థమందే (పదాదిన) అకారములుండును, ఉండకుండునుగూడ. 198

భిన్నవర్ణాంతములైన కొన్ని శబ్దములు భిన్నలింగములు కూడ.

ధనుః - ధనుషౌ - ధనుషః. సకారాంతము పుంలింగము
ధనుః - ధనుషీ - ధనూంషి ,, నపుంసకలింగము.
ధన్వా - ధన్వానౌ - ధన్వానః నకారాంతము పుంలింగము.
ధన్వ - ధన్వనీ - ధన్వాని ,, నపుంసకలింగము.
ధనుః - ధనూ - ధనవః ఉకారాంతము స్త్రీ లింగము.
ధనూః - ధనూ-ధనవః ఊకారాంతము స్త్రీ లింగము
ధనుషా - ధనుషే - ధనుషాః అ ,, ,,

(ఈ విధముగా ఈ క్రిందివి చూచుకోవలయును)

తనుః-ఉ.స్త్రీ; తనూః. ఊ.స్త్రీ; తనుః-తనుషీ-తనూంషి. స.న.; తనుషా-ఆ.స్త్రీ.; నిచులః, నిచోలః-అ.పుం.; నిచోలం-న; నిచోలీ-ఈ.స్త్రీ. = వస్త్రము; అపః-స.స్త్రీ. నిత్యబహువచనము = ఆపః-ఆపసీ-ఆపాంసి. స న, అపః-అపసీ-అపాంసి; అప్నః-అప్నసీ-అప్నాంసి స. న; ఆశీః ఆశిషౌ-ఆశిషః, స.స్త్రీ; ఆశీ-ఆశ్యౌ-ఆశ్యః, ఈ. స్త్రీ; సర్పదంష్ట్రి; దోః-దోషౌ-దోషః, స పుం; దోః-దోషీ-దోంషి, స న; దోషా-దోషే-దోషాః, ఆ. స్త్రీ; రజః, స. న; రజం-రజే-రజాణి, అ. న; ఇట్లే 'శిరః'. సరః, స. న.; సరసీ, ఈ. స్త్రీ; వాసః, స. న; వాసం, అ. న.=వస్త్రము; అర్చిః-అర్చిషీ-అర్చీంషి, స. న.; అర్చిః-అర్చీ-అర్చయః, ఇ. పుం.; ఓకాః. స. పుం.; ఓకః అ. పుం.; ఓజః. స. న. మరియు అ. పుం; భాః-భాసౌ-భాసః, స. పుం.; భా-ఆ. స్త్రీ.; భాసం-అ. న.; జలూకాః-స. పుం.; జలూకః-అ. పుం.; ప్రచేతాః-స. పుం.; ప్రచేతసః-అ. పుం.; సుమనాః-స. పుం.; సమనసః-అ. పుం.; దమునాః-సం. పుం.; దమునః-అ. పుం; రేతః-స. న.; రేతం-అ. న.; నభః-స. న.; నభం-అ. న; తపః-స. న.; తపః-స. న.; తపం-అ. న.; జటాయుః-స. పుం.; మరియు ఉ. పుం.; ఇట్లే 'జరాయుః'. శేవః-స. న.; మరియు అ. పుం; మనః-స. న.; మనసం-

అ. న.; మానసం- అ. న.; వయః-స. న.; వయసః-అ. న.; మహః- స. న. మతియు అ. పుం.; విహాయసః-స. న.; విహాయః-అ. పు.; కర్మ-న. పుం.; తమః-అ. పుం.=రాహుగ్రహము; తమం-అ. న. = అంధకారము తమా-ఆ. స్త్రీ=రాత్రి తమీ-ఈ. స్త్రీ=రాత్రి. తమః స.న.=తమోగుణము, దైన్యము, అంధకారము, శోకము, మోహము, లాంఛనము, వక్షఃస్థలము. తమూః-స.పుం.= ఆరవము, ధూలి. అస్మి=అహమర్థమందు అవ్యయము, 'అయితిని' అనుట యందు క్రియాపదము.

'దాసే కృతాగసి భవత్యుచితః ప్రభూణాం
పాదప్రహార ఇతి సుందరి నాస్మి మాయే'

అని భారవి ఘంటాపథమందు వ్రాయబడినది. ధనంజయ విజయమునందు

'ప్రాసాద సంనమదధారకపోలభాషః
తేజోభిః కనక నికాష రాజి గౌరైః'

'నికషణం - నికషోపలో వా.' అనియున్నది. ఇక :

'హ్లాదీ సుఖే చేత్యాకారక ధాతూత్పన్నః కహ్లారశబ్దః ఏతచ్ఛ లింగాశక్తే యాదౌ ద్రష్టవ్యమ్, కల్హార శబ్దస్తు 'హ్లాల్హాః' ఇత్యాకారక ప్రాకృతీయ సూత్రేణ రూప నిష్పత్తి రితి బోద్ధవ్యమ్. ఏతచ్ఛ [illegible] 192 ద్రష్టవ్యమ్.'

గీర్వాణ శబ్దము 'కహ్లార' మని, ప్రాకృత శబ్దము 'కల్హార' మని శత్రద్ వ్యాఖ్యానాదుల వలన స్పష్టముగా కనుపించుచున్నది. వినిమయముగా సంస్కృత శబ్దముకు వాడుకగలదు. ప్రాకృత శబ్దమైన కల్హార శబ్దమును సంస్కృతముగా వాడుక చేసుటకు కారణము కనుపించదు.

'చిబుకం - చిబూకం - చీబుకం - చిబుః' అని నాలుగు విధములు గలదు. అందఱు పండితులును 'చుబుక' మంటారు. [illegible] ఉత్పత్తి కోశకారులు చెప్పలేదు. లింగభేదము, అంతభేదము, వచనభేదము, రూపభేదము కలిగి ఏకశబ్దమే ఏకార్థమందే కోశాదులందున మహాకావ్యము లందున నానేక శబ్ద ములుండగా ఈకారాంతము ఇకారాంతము గావడముకు [illegible]

"మ్రానం' అని అహోబల పండితులవారు నిశ్చయించుటకు కారణమేమిటో తెలి యదు. మంచిదే, ఇది అథర్వణ కారిక చేతనే వచ్చెననుకుంటే, క్రోడ, ప్రీహాది శబ్దములు అకారాంతములు, హ్రస్వములుగా నుండుటకు తను, చంచ్వాది శబ్ద ములు హ్రస్వముగా నుండుటకు ఎవరికారిక (కారణమో) తెలియదు. 200

కోశాదులందున, వ్యాఖ్యానాదులందున పరిశీలించి కొన్ని కొన్ని శబ్దముల (రూపములు) వ్రాసినాము. కొన్ని కొన్ని శబ్దములకు లక్ష్యములు వ్రాసు తాము. 201

చిబుకము ఇత్యాది యగుటకు:—

భాగవతము అష్టమ స్కంధము :

సీ. గీ. వంది వ్రాలి కుంచి వాడిన యిల్లాలి
వదన వారిజంబు వడువు చూచి
చేఁదిగిచి మగువ చిబుకంబు పుడుకుచు
వారిజాక్షి యేల వగచె దనుచు. 202

శ్రీనాథుని నైషధము (3-179) :

గీ. అబ్జగర్భుండు సుషమా సమాప్తియందు
నెత్తి చూడంగఁబోలు నీయింతి వదన
మంగులీయంత్రణక్రియాభంగి నమరి
చిబుక మొనరించెనా నిమ్న సీమసంధి. 203

లేఖకులు 'చుబుక' మని పుస్తకములందు వ్రాసినారు. అది లేఖక ప్రమా దము. భానోజీ దీక్షితులుగారు తమ అమరసుధావ్యాఖ్యయందు:-

"చివతి చివ్యతే వా, చివ్వ ఆధాన సంవరణయోః
మృగవ్యాదిః స్వార్థే కిన్. చినోతి శుభం వా ప్రాగ్వత్.
'అధస్తా దధరోష్ఠస్య, చిబుస్యా చ్చిబుకం తథా।' ఇతి నిగమః"

అని వ్రాసినారు. ఇక 'గురుబాల ప్రబోధిక' యందు:-

'చీయతే త్వఙ్మాంసాదిభి రితి చిబుకం. చిఞ్ చయనే.'

అని వ్రాసినారు. 'శబ్దార్థ కల్పతరువు' నందు చాదులు ఇత్యాదులు (నైన పదము లందు)

'చిబుకం. అదంతం క్లీబే. అమరః. ఓష్ఠా దధః ప్రదేశే=గడ్డము.

సరస్వతీ విలాసః. చిబూకం, చీబుకమ్'

అని వ్రాసినారు. ఉత్వాదియని యెవరును వ్రాయలేదు. 204

'భాలము' చతుర్థ వర్ణాదియగుటకు:-

తిమ్మకవిగారి శివలీలా విలాసము:—

సీ. భసితాంగరాగాయ భక్తానురాగాయ
భాలేక్షణాయ తుభ్యం నమోస్తు
భర్మాద్రి చాపాయ భద్రేంద్ర వాహాయ
భయ విదూరాయ తుభ్యం నమోస్తు
భరత ప్రవీణాయ భవనాయితనగాయ
భద్రప్రదాయ తుభ్యం నమోస్తు
భండనోద్దండాయ భానుప్రతాపాయ
భవ్యరూపాయ తుభ్యం నమోస్తు
భావభవ సంహరాయ తుభ్యం నమోస్తు
భవసరిన్నావికాయ తుభ్యం నమోస్తు
భద్ర చర్మాంబరాయ తుభ్యం నమోస్తు
భారతీశార్చితాయ తుభ్యం నమోస్తు 205

శబ్దాది వర్ణములన్నియు చతుర్థ వర్ణములు రీతియను గుణము. 206

'మకురము' అకారాది యగుటకు

ఊగ్గకవి సుభద్రాపరిణయము:-

క. ముకురాభ వదన చెక్కులు
మకురంబులఁ గరము దవిలి మాయఁగఁ జేయన్
సకియ గలము దరములను
త్సుకతమెయిం దెల్లబుచ్చి సుడివడఁ జేయన్. 207

'ముకరము' కు సులభము 208

'అగరు.' అకార మధ్యమగుటకు:-

ఆదిపర్వము (8-78):

చ సరళ తమాలతాల హరిచందన చంపక నారికేళ కే
సర కదళీ లవంగ పనస క్రముకార్జున కేతకీలతా
గరు ఘనసార సాల సహకార మహీరుహరాజరాజి సుం
దర నవనందనావలులఁ దత్పుర బాహ్యము లొప్పు జూడఁగన్. 209

'అగురు' ఉకారమధ్య మగుటకు:-

ఆముక్తమాల్యద (2-6)

మ. పరిఘం దత్పుర కామినీ జనము లంభఃకేలి సల్పంగ ద
ద్గురు వక్షోమదలిప్త సంకుమద కస్తూరీ మిలచ్చంద నా
గురు పంకమ్ముల సౌరభమ్ములఁ జుమీ కుంభీనసావాస ని
ర్ఝర కల్లోలిని కందు భోగవతినా జన్సంజ్ఞ గల్గెం దగన్. 210

'ధన్వ' అకారాంతముకు:-

పారిజాతాపహరణము (5-14):

చ. హరి హయుఁ డాగ్రహ జ్వలితుఁడై యనిఁ బాఱు దిశాధినాథులం
దిరుగుఁడు పోకుపోకుఁ డని తిట్టి యదల్చి నవోదయ త్పయో
ధరము నలంకరించు తన ధన్వము సజ్యముజేసి గోత్రభి
త్క్రూరమగు బాహువెత్తి తమకంబున సేనకుఁ జేయి వీచినన్. 211

'భాసం' అకారాంతమగుటకు:

కూర నారాయణుని సుదర్శన శతకము:-

స్ర. 'శ్యామం ధామ ప్రసృత్యా క్వ చ న భగవతః
క్వాపి బభ్రు ప్రకృత్యా
శుభ్రం శేషస్య భాసా క్వచ న మణిరుచా
క్వాపి వస్త్యేవ రక్తిమ్
నీలం శ్రీ నేత్రకాంత్యా క్వచిదపి మిథున
స్యాదిమస్యైవ చిత్రాం
వ్యాతన్వానం వితానశ్రియముపనత నతాం
శర్మ వ శ్చక్రభాసమ్' 212

'వ్రీడః'

శిశుపాలవధ :-

యత్రాల ముత్తుంగతయా విజేతుం
దూరా దుపస్థియత సాగరస్య
మహోర్మిభి ర్వ్యాహతవాంఛితార్థైః
వ్రీడాదివాభ్యా సగతై ర్వ్యలిత్యే 213

తిమ్మకవిగారి రసికజన మనోభిరామము :-

గీ వ్రీడవతి యేడ్చె నెలుఁగెత్తి వెక్కి వెక్కి
యశ్రుపూరంబు కుచగిరు లంటి పొరల
కిన్నరీపాణి పంకజాంకిత సువర్ణ
వల్లకీరావ సదృశ భాస్వద్గళమున. 214

'స్ఫూరత్'

ఎఱ్ఱనగారి హరివంశము. (పూ ఖా. 9-200) :-

మ. అని యుత్తుంగ తరంగహస్తములఁ గ్రూరారాతిఁ దీర స్థలం
బునకుం దెచ్చిన నవ్విభుండు ప్రసభస్ఫూరత్కృపాణాహతిన్
దనుజున్ వచ్చి (గతాసుభూసుర సుతుం దత్కుక్షిలోఁ గాన కా
మనసత్త్వంబు శరీరజంబయిన శంఖం బొప్పుతో నుండినన్.) 215

'పరీహార' మునకు :-

అందే : (ఉ. ఖా. 8-195) :

క. నీ రూపు చూచి వలచితి
కారుణికాగ్రణివి నన్ను గైకొనుము పరీ
హారంబునకున్ గారణ
మేరూపున లేదు నిక్క మిది గుణమహితా. 216

'పరిహార'ము సుప్రసిద్ధమే.

'పరీభావ'మునకు :-

అందే (ఉ. భా. 4-120):

శా. నీ వాశ్చర్య పరాక్రమంబున మహిన్ విశ్వైకరక్షార్థివై
దేవారాతులఁగూల్చు చున్కి విని నీ తేజంబు సైరింప కు
గ్రావష్టంభరతిన్ నినుం దొడరి నా వాణిన్ బరిభావమున్
భావింపన్ భవదంతరంబు తుది నాకాక్షించు నెల్లప్పుడున్. 217

'నప్త'- పౌత్రు దను నర్థమునకు:

అందే (ఉ. భా. 7-126):

క. దీప్తహంకారుం డొదలెడు
దృప్త శలభతతుఁ బోలె దివిజ బలము ల
ప్రాప్తపరిభవుం డగు హరి
నప్తఁ బొదవి రంత నుల్బణ క్రౌర్యమునన్. 218

ఇచ్చట 'నప్త' అనగా ప్రద్యుమ్న పుత్రుడగు అనిరుద్ధుడు. అనగా హరి
'పుత్రపుత్రుడు'. 219

'హవిః' ఇకారాంతమగుటకు.

అందే (ఉ. భా. 9-77):

ఉ. నా యశము న్మగంటిమియు నానయు వమ్ముగఁజేసెఁ జూడఁగా
దీ యసతి న్మదీయ గృహ మిప్పుడె వెల్వడఁద్రోచి రందు గౌ
లేయకలీఢమైన హవి లెస్సఁగఁ జూతురు యన్యదూషితం
బాయగనై నగా కకట ప్రాయిడియైనను నిచ్చగింతురే. 220

ఇందు 'హవి' ఇకారాంతము. గృహము - సప్తమికి ప్రథమ. 221

'అన్విత'

అందే :-

సీ. వరముని సహితుఁడై వనజాసనుఁడు వచ్చె
నమర సమేతుఁడై యనిమిషేంద్రుఁ
డేతెంచె నప్సరోన్వితులై గంధర్వు
లరుగు దెంచిరి పరిస్ఫురితలీల...' 222

'ప్రయతన'

అందే (ఉ. ఖా. 10-45) :

హయములు వేయు బూనిన మహారథ మెక్కి మహేశమిత్రుఁ డ
క్షయనిధి గోప్త యక్షత భుజాబలుఁ డర్థివిభుండు యక్షసం
చయసమ పేతుఁడై నడచెఁ జంచదుదాత్తగదా వివర్తన
ప్రయతన లీలఁ జూపఱకు భ్రాంత విలోకన మావహింపఁగన్. 223

ఇటువలెనే నూతన ప్రతనా ద్యనేకపదములు తెలుసుకొనేది. 224

## తెలుగు పదముల భిన్నరూపములు

గీ. అవికె యనగ మరియు త్రైక యనంగను
పైట: పయట యనగ పయ్యెద యన
పయ్యెదయు పయంట పయ్యంట యన నొప్పు
వృషతురంగ! కుక్కుటేశలింగ! 225

అవికె:—

శ్రీనాథుని నైషధము (6-181)

చ. అవికెయుఁ బట్టుపుట్టము చెఱంగు మరంగయి యున్కిఁజేసి గౌ
రవ పరిమాణముం దెలియ రామికి మెచ్చిరుచున్న యొక్క ప
ల్లవునకుఁ జూపె నొక్కతె విలాసము తోడన తోరపుం జనుం
గవ పొదగింత పొమ్మనిన కైవడి పానక హేమ కుంభమున్. 226

అవికెకు (ఉదాహరణములు) బహులములు గలవు 227

త్రైక :-

ఆంధ్ర భాషార్ణవము :

చ. తన ధనువేల యిమ్మగను దాచితివే యని యాట పట్ల త్రై
కను సడలించి చమ్మఁగవఁ గ్రక్కునఁ బట్టఁగ నెంచు నాయకుం
గనిన సుగంధి కుంతల మొగంబునఁ దోచిన చిన్ని నవ్వు కో
రిన వరమిచ్చి ప్రోవుతను శ్రీరఘునాథ నృపాల చంద్రునిన్. 228

తారాశశాంక విజయము (4-68) :

చ. మలయజగంధి తా శిరసు మజ్జనమై తెలివల్వ యొంటి కొం
గెలమి ధరించి త్రైక ధరియింపకయే కురు లార్పుచున్న నే
నలమిని గౌగలించుకొన నా హరిమధ్య యనంగసంగరా
కలనఁ బెనంగినట్టి రతి కౌశలమున్ మదిలోఁ దలంచెదన్. 229

అందే (4-74) :

చ. కలఁగిన కొప్పుతోఁ జిటిలు గందముతో విడబడ్డ త్రైకతో
తలిరుల విల్తు పాలె మొకతట్టు తళుక్కను కట్టు కొంగుతో
సొలపుల కన్నుల న్నిదుర సొక్కులతో విరిపాన్పు డిగ్గి నీ
వెలమిని వచ్చురీతి మది నెన్నుదు నో మదహంసగామినీ. 230

పూర్వలాక్షణికుల గ్రంథములందు 'అవికె' అని కకారమున కేత్వ మున్నది. 'త్రైక' అని యతి స్థానముందు తలకట్టున్నది. రెండును గలవని తోచుచున్నది. (ఇట్లే) 'పోలిక' (కకారముకు) తలకట్టు సాధారణము. (ఎత్వము గలదు) 231

శల్యపర్వము (1-158) :

క. పెనుతొంపి లోపలను బ్రుం
గిన ధేనువు నెత్తు పోలికెను శల్యుం డ
మ్మొన 232

'పైట'

చేమకూరవారి విజయవిలాసము (1-76) :

సీ. పా. బెళుకు కాటుక కంటి సొలపు చూ పెదలోనఁ
బట్టియుండెను ప్రేమఁ బట్టి యియ్య
చికిలి బంగరువ్రాత జిలుఁగు టొయ్యారంపుఁ
బైట గుబ్బలగుట్టు బైట వెయ్య...... 233

చేమకూరవారి సారంగధర చరిత్ర (2-39) :

మ. అని యూహింపుచు లజ్జవో విడిచి యేకాంతంబుఁగా నర్దెసల్
గనుచుం బైటతొలంగ నీవి వదలం గామాంధకారంబు నె

మ్మనముం గప్పినఁ గన్నుఁ గాన కపుడా మత్తేభగంభీరగా
మిని యత్యంత నిరంకుశోద్ధతిని బల్మిం బట్టఁగాఁ జూచినన్ 284

మొదటి (చరణమున) నిత్యసమాస యతి. 285

'పయట'

తారాశశాంక విజయము (2-75)

మ. జనము ల్లేని యెడన్ శశాంకు సరసన్ సాంబ్రాణి ధూపంబు వా
సన గుప్పన్ నెఱి గొప్పు విప్పి పయటం జన్దోయి నిక్కంగ వే
ద్కను గిల్గింటి ఘటించి చెంగలువ మొగ్గల్ చెక్కి రేరాజ యా
నన సీవంటిన విచ్చునం చతని మేన న్మోపుఁ దా నవ్వుచున్. 286

అందే (3-59)

చ. అని యిక మారువల్కక వలదంచును దీనత దోప నాడుచున్
చనుగవ యుబ్బఁగాఁ బయట జాఱఁగఁ గ్రొమ్ముడి వీడ దేహమె
ల్లను బులకింప నీవి వదలం గరకంకణ కింకిణీ కన
ద్ఘన మణిమేఖలా ధ్వనులు గ్రమ్మగఁ బైఁబడి కౌగిలించినన్. 287

పయ్యెద, పయ్యద (వీటి కుదాహరణములు) ప్రథమాశ్వాసము నందు వ్రాసినాము. 288

'పయంట.'

తిమ్మకవి సార్వభౌముని శివలీలావిలాసము:

సీ. కిన్నెర మీటి కన్గిఱిపి సన్నలు సేయు
పకపక నగి యేలపదము పాడు
కెంగేల లాంతంబు గిఱగిఱఁ ద్రిప్పు లోఁ
జొక్కుచు వెడవెడ మ్రొక్కు మ్రొక్కు
లింగ లింగ యటంచు చెంగునఁ దాటు మీ
సలు గీటి గడ్డంబు చక్కఁదువ్వు
కులుకుచు జిలిబిలి పలుకులు పలుకుఁ గా
మిడియై పయంట కొంగిడిసి తిరుగు

తివిరి బతిమాలు దిక్కులు తిరిగిచూచు
నవల కరిగెడుచోఁ ద్రోవ కడ్డునిలుచు
వలపు లూఱంగఁ జెలి మరల్ గొలుపు కొనుచు
కోడె ప్రాయంపు జంగమకులవిభుండు 239

తారాశశాంక విజయము (2-78)

ఉ. కమ్మ జవాది వాసనలు గ్రమ్మఁగ నోరపయంట జాఱఁగా
యెమ్మెలు మీఱ నగ్గురుని యింతి తొలంగఁగ నిమ్ములేని మా
ర్గమ్మునఁ జంద్రునిం గదియఁగాఁ జని వాని భుజంబు సోకఁగా
జిమ్మను జన్మొనల్ కలలు చెమ్మగిలన్ తనువెల్ల ఝుమ్మనన్. 240

'పయ్యెఁట'

తారాశశాంక విజయము (4-6)

ఉ. ఇంటికిఁ దోడి తెచ్చి మణిహేమ మయోజ్జ్వల పీఠి నుంచి ప
య్యంట చలింపఁగా సురటి నల్లన వీచుచుఁ బ్రాణనాథ! న
న్నొంటిగ నుంచి యీకరణి నుండుదురే క్రతువాయెనే సుఖం
బుంటిరె యిన్నినాళ్ల పురుహూతు బహూకృతి గంటిరే యనన్. 241

చేమకూరవారి విజయ విలాసము (2-134)

ఉ. గెంటని ప్రేమ మేను పులకింపఁ గిరీటికిఁ బూ లొసంగి వా
ల్గంటి గిరుక్కునం దిరుగ ఘమ్మని కస్తురి తావి గ్రమ్మ కో
గింటెపు గబ్బిగుబ్బల జిగి న్వెలిజిమ్మ నొయారి జిల్గు ప
య్యంట చెఱంగొకింత తనయంకము నందటు సోకినంతటన్. 242

ఆంధ్ర శేషమందు (52)

సీ. పా. పయ్యెద యనఁగను పైట యనంగ సం
వ్యానంబునకు నాఖ్య లగుచునుండు 243

అని రెండు పదములు మాత్రమే చెప్పినారు గాని, మహాకవి ప్రయోగము
లాఱు విధములు గలవు. 244

'వుచ్చికొని-వుచ్చుకొని, వ్రచ్చికొని-వ్రచ్చుకొని' మొదలైన శబ్దములందు ఇత్వముత్వములు రెండును చకారమునకు గలవు 245

'వుచ్చికొని' :

సౌప్తికపర్వము (2-5)

చ. సకలజనప్రశస్తమగు చక్రము నీవొసఁగంగ నేను బు
చ్చికొని భవత్పదాంబురుహసేవ పదంపడి చేసియైనఁ బో
రికి నిను నియ్యకొల్పి మది ప్రీతియెలర్పఁ బెనంగి నీకు నో
రక విలసిల్లి యెల్లఁ బొగడం బెనుపొందఁగఁ గోరి వేడితిన్ 246

'ఎల్ల' యనఁగా సమస్తమైన వారని యర్థము. ఎల్ల, ఎల్లరు, ఎల్లవారు-8 విధములు గలదు. ఎల్ల-తెలుపు వర్ణమునకు నర్థముగలదు. 247

'వ్రచ్చుకొని'.

కృష్ణరాయల ఆముక్తమాల్యద (4-21)

చ. ఒకమరి బుజ్జగింప విలయోదకముల్ పయి కుబ్బి చిప్ప వ్ర
చ్చుకొని మహాభ్రవీథిఁ జన సూకరత న్మొయివెంచి వెండి క్రిం
దికి గయిజాలు తత్సలిల నిర్మలధార నతః పరిస్ఫురత్
ప్రకృతికి నీయజాండమును బంగరుముంగరఁగా నొనర్పవే. 248

'పశ్లైరము, ఓగిరము' అని ఆంధ్రనామ సంగ్రహమందు చెప్పిరిగాని, 'పళ్యము, ఓయిరము' అనిన్నిగలదు. 249

'పళ్యము.'

శ్రీనాథుని కాశీఖండము (5-307)

ఉ. అంబుజబాంధవాన్వయ నృపాగ్రణి బోనము నేడు సూర్యపా
కంబయి నాయితంబయిన భజ్జము భోజనశాలలోనఁ బ
ళ్యం బిడినారు పంకజదలాక్షులు రెండవజాము గంట వ్రే
యంబడె నారగింప సమయంబని చెచ్చెర విన్నవించినన్. 250

'ఓయిరము'

అందే (5-297) :

గీ. అగ్ని మనలోన నొక్కరు డౌట కాఁడొ
చేయఁడే మారుతము మన చెప్పినట్ల
వరుణుఁ డెవ్వరివాఁడు ముప్వురును లేక
నాయితంబగు నెబ్బంగి నోయిరంబు. 251

ఆంధ్రనామ సంగ్రహముందు (స్థావర. 78)

గీ. దండ చేరువ సంగడ దాపు చెంత
సరస చెంగట యొద్ద దగ్గర కురంగ
టంద పజ్జ యనా సమీపాఖ్యలు...

అని చెప్పిరిగాని, 'చెరువ' (ఎత్వముతో) అనిన్ని గలదు. 252

'చెరువ'

విరాటపర్వము (4-91) :

చ. వెరవరిగాక వీఁడు కురువీరులకుం బొడసూపువాఁడె య
చ్చెరువొక క్రమాన సేరి యిటు చేరఁగ వచ్చుచు నున్నవాఁ డహం
కరణము గాని యొండొకటి గానఁడు మూర్తి విశేషమారయన్
సురపతి యట్ల వీని మది చొప్పది యెట్లు యెఱుఁగ నయ్యెడున్. 253

('రేయి' కి హ్రస్వైత్వముతో) 'రెయి' అనిన్ని గలదు. 254

ఆదిదము సూరకవి కవిజనరంజనము:

చ. అనుపమ హైమ కుడ్య ఘటితాంచదనంత మణిప్రభాలిచే
ననయము తత్పురీవర మహాగృహముల్ రెయి దోచకుండఁగా
నొనరుచుటం జుమీ గృహము లొప్పె నిశాంత సమాఖ్యయంబుల
న్వినుతి యొనర్పఁగాఁ దరమె పీటను గల్గిన రత్నసంపదన్. 255

'కూరుకు నిద్ర చేకూరుటయును' అని లాక్షణికులు రేఫములందు వ్రాసి
నారు. 'చేకూడె' యని డకారమున్ను గలదు. 256

'చేకూడె'

చేమకూరవారి విజయవిలాసము (2-111):

సీ. కలిగెఁబో యీ యింతి కులుకు గుబ్బలు చూడ
శీతశైలాదుల సేవ ఫలము
కలిగెఁబో యీభామ వళులయందము చూడ
గంగా తరంగముల్ గనిన ఫలము
కలిగెఁబో యీనాతి కనుబొమల్ చూడఁగ
మును ధనుష్కోటిలో మునుఁగు ఫలము
కలిగెఁబో యీరామ కటివిలాసము చూడ
భూప్రదక్షిణము సల్పుటకు ఫలము
తోడు తోడనె యిటుల చేకూడవలదె
తన్వి తీఱఁగ నింక ని త్తన్విఁ గూడి
సరస సల్లాప సంభోగ సరణి దేలు
నాడుగాక ఫలించుట నాదు తపము. 257

ఇటువలెనే 'సమకూడె' ననవచ్చును. ఆలంకారికులు గ్రామ్యమనిన '[illegible]' పదము (కవి ప్రయోగముల) నున్నది. గ్రామ్యము కాదు. ఆలంకారికులు పరి- 258
లించని మాట.

'చేకురె, సమకురె' అని హ్రస్వము (కకారోత్వము) గలదు. 259

మను చరిత్రము (2-58):

క. కుశలవ యే వ్రతముల నగు
నశనాయాసమున నింద్రియ నిరోధమునన్
కృశుఁడై యాత్మనలంచుట
సశరీర స్వర్గసుఖము సమకురి యుండన్. 260

అచ్చు పుస్తకములందు 'సమకురి, చేకురి' (యనునవి) అకారముతో [illegible] వ్రాసినారు, అకారమని లాక్షణికులు చెప్పనూలేదు, [illegible] 261
చవు.

'గూరిచి - గురిచి, జోహరు - జొహరు, దేహరి, దెహరి' అని యీ మొద లైనవి (ఆద్యచ్చులు) హ్రస్వదీర్ఘములు (గా) గలవు. '[illegible] - [illegible] 262
గండ్లు' అనియు గలదు.

'సోరణగండ్లు.'

చేమకూరవారి విజయవిలాసము (1-11) :

సీ. పా. తెలతెలవార నా మలయ గంధవహుండు
సోరణ గండ్లలోఁ జొచ్చియాడు...... 263

'సోర్ణగండ్లు.'

ఉద్యోగ పర్వము (2-112) :

గీ. పా తెల్లవారుమన్న దివియ లల్లార్పుచు
సోర్ణగండ్ల యందుఁ జొచ్చి సుడిసి... 264

దివియ - దివ్వె - దివ్విటీ - దీవియ అని గలదు. 265

'దీవియలు.'

భీష్మపర్వము (2-842) :

క సమర క్రీడల లీలం
దమక తమక తనిసి మరలి తమతమ యావా
సములకు నరిగి రుభయ సై
న్యముల జనంబులును దీవియలు వెలుఁగంగన్. 266

'దివ్విటీ.'

తిమ్మకవిగారి అచ్చతెనుగు రామాయణము (సుందర. 6)

క. అరిగెడుచో సీతఁడు సెలి
నరయుచునున్ వెలుఁగవలయు నని జేజేల్ వా
విరిఁ బట్టు దివ్విటీ యనఁ
దరముగ రేజేఁడు తూర్పుదెసఁ గన్పట్టెన్. 267

'దివ్వె'.

అందే (సుందర. 11)

సీ. పా. ఒడలిమే ల్రవణంపు టుఱువు మానికెములు
మలయు దివ్వెలతోడ మార్వెలుంగ... 268

'తమ తమ' అనుటకు 'తన తన' అని బహుత్వమందును గలదు. 269

(బహుత్వమున) 'తన తన'.

భీష్మపర్వము (1-175) :

క. తన తన శంఖంబులు త
క్కనుగల దొరలెల్ల ననికిఁ గొనఁగొని పూరిం
చిన వివిధ తూర్యనాదం
బును జెలఁగె నభంబు దిశలు పూర్ణంబయ్యెన్. 270

'ఉయ్యల - ఉయ్యాల - ఉయ్యేల - ఊయెల' అని గలవు. ప్రథమా
శ్వాసమందు (మొదటి) మూఁడు విధములున్నవి (వ్రాసినాము). 271

'ఊయల'

తిమ్మకవి సార్వభౌముని అచ్చ తెనుఁగు రామాయణము (అరణ్య. 59) :

సీ. వేల్పురాయఁడు బత్తి వెలయఁ బుత్తెంచిన
వుడుకు మ్రాన్వలి దావి పూవుదెత్తు
లీదు మేపరిసామి యిమ్ముగాఁ బనిచిన
మవ్వంపుఁ బలుదమ్మి మానికెములు
త్రాడుదాలుపు మిత్త తనమున కొసఁగిన
క్రొత్త నున్గట్టాణి ముత్తియంబు
లెద్దుతత్తడి జోదు నుద్దికాడిడిన హొం
బట్టు నాడెపు జిల్గు పుట్టములును
మఱియఁ దక్కిన కడలతేం డ్రురక మంచి
సేయుటకుఁ బంచు నపరంజి యూయెలలును
గద్దియలు మేలుసెజ్జలు పెద్దతొడవు
లెపుడు నాయింటఁ గొదలేక యెనసియుండు. 272

'ఊయాల' అనియు నుండ వచ్చును. 273

'కార్ముకం బొప్పు విల్లు సింగాణి యనఁగ' అని ఆంధ్రనామసంగ్రహము.
కాని 'సింగిణి, సింగిణీ విలు' అనియును గలదు. 274

సింగిణి :—

తిమ్మకవి సార్వభౌముని రసిక జనమనోభిరామము :

క. అంగన కనుబొమగవతో
సింగిణు లెదిరించి గెలుపు చేకురక వడిన్
వంగి శరమూని కడు నా
ర్తిం గొలుచుచు నుండెఁజుమ్ము నృపకుల తిలకా. 275

'చేకురక' (అని ఇక్కడ) హ్రస్వము. 276

తిమ్మన పారిజాతాపహరణము (5-16) :

ఉ. తింగున మోత మోగుచును తెక్కల పావుల వోలె శౌరిచే
సింగిణి వింట వెల్లిగొను చిత్రశరంబుల (సూతు నొంచి ర
థ్యాంగకముల్ దళించుచు నిశావయవంబులు దూల్చి దేవతా
పుంగవుఁ దోసరించుటయు బోరన నద్దము సొచ్చె సైన్యముల్) 277

'సింగిణీ విల్లు' :—

చేమకూరవారి విజయ విలాసము (1-13½) :

శా. చెండ్లా గుబ్బలు జాళువాతళుకులా చెక్కిళ్ళుడాల్ సింగిణీ
విండ్లా కన్బొమ (లింద్రనీల మణులా వేణీరుచుల్ దమ్మి లే
దూండ్లా బాహువు లింత చక్కదన మెందుం గాన మీ జవ్వనిం
బెండ్లాడం గలవాఁడు చేసినది సుమ్మీ భాగ్య మూహింపఁగన్) 278

(సాహిణి-సాహిణీ' అని రెండును గలవు.) సాహిణి సులభము. 279

'సాహిణీ'—

శ్రీ కృష్ణరాయల ఆముక్తమాల్యద :

చ. పొలమరులందుఁ గూతలిడ భూసురు లన్నది వార్చి వార్చి క్రమా
కుల తుద లెక్క సప్పటులఁగొట్టి యదల్పఁగ సాహిణీలు మా
వుల బరపంగ. 280

'లకోరి' దీర్ఘమని లాక్షణికు లన్నారు గాని (ఇకారము) హ్రస్వమును గలదు. 281

'లకోరి'—

చేమకూరవారి విజయ విలాసము (1-146) :

చ. వెడ విలుకానికిం జెఱుకువిల్లును గల్వలకోరి కోరికల్
గడలు కొనంగ నామని (యుఁ గల్వలరాయఁడు నిచ్చి మన్ననం
బడయుడు వానికెక్కుడుగ మౌర్వులు తామును గాన్క తెచ్చెనా
బడిబడి గంధలుబ్ధ మధుపంబులురాఁ జనుదెంచెఁ దెమ్మెరల్) 282

తిమ్మకవి సార్వభౌముని అచ్చ తెనుగు రామాయణము (బాల. 157) :

ఉ. అమ్మగ మానికంబు దిటమారగ నొక్క లకోరిఁ జెడ్డ రే
ద్రిమ్మరి కొమ్మ నుక్కడచి (తేటగ జన్నముగాచి చట్టు చం
దమ్మున నున్న పెందపసి తామరకంటినిఁ బ్రోచి యిందవ
చ్చె మ్మొగి నీదు జన్నమెఱసేయక చూచు కడంక మీఱఁగన్) 283

'ముందట-ముందల' (అని రెండును గలవు). 284

'ముఁదట'—

ద్రోణ పర్వము (4-94) :

క. ఎటు వోన వచ్చు నినుముం
దట నిడు కొని పోరనన్ను తగురాఖనె నె
క్కటి దోలెడు సాత్యకి నీ
వటఁ దఱుముదుగాక యొదగ నగునే నీకున్. 285

'ముఁదల'—

తిక్కనగారి ఉత్తర రామాయణము (7-68)

చ. నలినజుఁడైన బ్రహ్మకును నాలవవాఁడు దశాననుండు ని
ర్మల గుణలోల వీఁడు మనుమండని చెప్పఁగ నాకు సిగ్గగున్
పలుకులు వేయునేటికి గృపాపరతాస్తుతిదక్క వీనిముం
దల విడు నాకుగా నృపతి ధర్మ విచక్షణ పుణ్య వీక్షణా ! 286

'కన్గిఱుపుట-కన్గిలుపుట' అని రెండు విధములు గలవు. 287

'కన్గిఱుపు'—

విరాటపర్వము (5-141) :—

చ. ఉఱక నరుండు ద్రోణసుతు యుగ్యముల న్వెస నొంచి నాతఁడం
దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారి ద్రుంచి క
న్గిఱిపినమాత్ర లోన నతనిం బటు బాణచతుష్క.........యే
డ్తెఱఁ దొడి మౌర్వి(గ్రమ్మఱ ఘటించునెడ న్వడినేసి యార్చినన్. 288

'తొడిగి' యనుటకు 'తొడి' అనియు గలదు. 289

'కన్గిలుపు' —

చేమకూరవారి విజయవిలాసము (8-28) :-

సీ. పులకించె మే నేమి తలచుకొంటివొ యంచు
మేలంబు పచరించె మిత్రవింద
యిన్నాళ్ళపలె మనసిచ్చి మాటాడవే
మెందు దృష్టి యని కాళింది దెగడె
చెలిపెండ్లికత చెప్ప చెవియొగ్గి వినదేమి
కలదులే యని గేలిసలిపె భద్ర
వలపు వాసనవేసె కలికి నీ ముఖ మంచుఁ
ద్రస్తరినెఱపె సుదంత గొంత
జాంబవతి నవ్వె లక్షణ సరసమాడె
గేలి కదుసేసెదరు ముద్దరాలి ననుచు
వలికె రుక్మిణి సత్య కన్గిలిపె నపుడు
చిన్నిమఱదలి మోహంపు చిన్నెలెఱిఁగి. 290

'సంబలము-సంబడము' (రెండునుగలవు) 291

'సంబలము'—

జయ రమా రామ శతకము :-

సీ. రథభటతురగ వారణకోటి నేలి సం
బల మియ్యలేక కోతులబలంబు
గూర్చుకొంటివి పైడి కోకలుపెట్టలేఁ
బెట్టి వల్కలములు గట్టుకొంటి

నన్నము గల్గ కాయలు పండ్లు దిన నేర్చు
కొంటివి, మృదుశయ్య లింట దాచి
పవ్వళించితి చెట్లపంచల, మృగమద
శ్రీగంధ మొకమూలఁ జేర్చి బూది
బూసుకొంటివి, ధనకాంక్ష భూపతులకు
సహజ గుణమన్నమాట నిశ్చయము దోచె
నింత లోభివి నాకేమి యియ్యగలవు?
జయరమారామ! రామ! రాక్షసవిరామ! 292

''పవ్వళించితి'–'వి' అను అక్షరలోపము. 293

'సంబడము'—

తిమ్మకవి అచ్చతెనుగు రామాయణము (సుందర· 154) :—

గీ. అడవి దుంపలెకాని సంబడము లొసఁగఁ
గాసువీసంబు చేత నెక్కడను లేక
మగువఁ గోల్పోయి కడు నిడుమలఁ గలంగు
నలతిదొరఁ గొల్వఁగడఁగు వెంగళులు గలరె. 294

'దాపల-దాపర' (అని రెండు విధములున్నవి.) 295

'దాపల'—

అప్పకవీయము (5-145)-

క. లలిసరస స్థిరముల దా
పలి నాంతపదంబు లాది వలికెదుచో సం
ధులు గాంచును టతవర్గం
బులు నాటిటిచెంతఁ దక్క బొల్లు లయి హరీ! 296

'దాపర'—

అప్పకవీయము (2-21)

సీ. గీ. (యామ్యమున గండ్రగొడ్డలి యట్లొనర్పఁ
గ్రాలు నొత్వ మిన్నింటి దీర్ఘములు కుడిని)
కరికరాకృతిఁ దనర దాపర వలపల
(నమరు నైత్వౌత్వములు త్రిశూలముంకరణి.) 297

'తలము-తరము' (అని రెండునుగలవు) 298

'తలము'—

మనుచరిత్రము (2-11)

తలమే బ్రహ్మకునైన నీనగమహత్వంబెన్న నే నీయెడం
గల చోద్యంబులు జెప్పఁ గన్గొనియెద (న్గాకేమి నే దేగెదన్
నలినీబాంధవభానుతప్త రవికాంత స్యంది నీహారకం
దల చూత్కారపరంపరల్ 299

'తరము'—

తిమ్మకవి సార్వభౌముని సారంగధర చరిత్ర.

ద్విపద. దండించుఁ గాకేమి దైవయోగం బె
టుండినఁ దొలఁగఁ జేయుట కేరితరము
తరము గాదింక నీ దబ్బఱ ల్మాను
మరుదండి నిదె తెత్తు నవ్విహంగంబు. 300

'మఱువక-మఱక-మర్వక-మఱాక' (అని నాల్గు విధములును గలవు.)

'మర్వక'—

ఉద్యోగపర్వము (4-70)

చ. (అనుటయు నష్టు గొంతి హృదయంబున శోకము నివ్వటిల్ల ని
ట్లను దైవసంఘటన మక్కట యెట్లును దప్పనేర్చునే)
అనుపమ సత్యవిస్ఫురణ నాడిన మాటలు మర్వకన్న నీ
యనుజుల నల్వురం గడపు నర్జును జేతకు సమ్మతించితిన్ 302

'మఱాకు'—

తిమ్మకవి అచ్చతెనుగు రామాయణము (కిష్కింధ. 64)

గీ. కోతి రాయఁడ మాపయిఁ గూర్మి నిలిపి
నాన తటి యెల్లనగరుల లోన నుండు
తలిసిరూపుల బ్రోల్లకు దవిలిరాగ
మాకు వొసఁగదు వొమ్ము మఱాక రమ్ము 303

మిగిలినవి సులభము. 304

'అనక-అనాక' (అని రెండునుగలవు. 'అనక' సులభము) 305

'అనాక'—

తిక్కనగారి ఉత్తర రామాయణము (8-118)

ఉ. ఐనను మీకు నొక్కతెఱఁగ స్ఖలితంబుగ నేను సెప్పెదన్
దానికిఁ గాదనాక భవనంబునకు న్ననుఁ బుద్ధిఁజేయుఁ డ
జ్ఞానికి నెల్లభంగుల నిజంబుగ నిప్డు పరిత్యజించినం
గాని యకీర్తి వాయ దటు గాదని నోరులు ముయ్యవచ్చునే. 306

'ఇపుడు' అనుచోట 'ఇప్డు' అని యున్నది. 307

'పోశ్చతర్థవాచకేషూతః'

అని నన్నయ భట్టుగారి సూత్రమువలన 'అపుడు-ఇపుడు-ఎపుడు'-ఈ పదముల పువర్ణము యొక్క ఉకారమునకు లోపమని స్పష్టము. కాని (ఇట్టి లోపము పొందునవి) మరియున్ను గలవు. 308

'విడ్వ' (విడువ)—

మహాప్రస్థాన పర్వము (1-56)

చ. జనులు నుతింపఁగా సుకృతసంపదఁజేసి యమర్త్యభావముం
గనియును (జెంద) కిట్లునికి కార్యమె ద్రౌపది భీమసేను న
ర్జును గవలం ద్యజించుటకుఁ జాలితి చాలవయ్యె దీ
శునకము విడ్వ నిత్తెఱఁగు సూరినుతుండగు నీకు నర్హమే. 309

'విన్మ' (వినుము)—

అందే (1-58) :—

చ. అనఘచరిత్ర విన్మ శరణాగతుఁ జేకొనకున్కి బుద్ధ మి
త్రుసియెడఁ జేయు ద్రోహము వధూటి వధించుట విప్రునర్థముం
గొనుట యనంగఁగల్గు నివి గూడ సమంబగు నాకుఁజూడ భ
క్తు ననపరాధుని న్విడుపు దోషము తా నది యోర్వవచ్చునే. 310

'పొడ్మగ' (పొడుమగ)—

అరణ్యపర్వము (6-178) :-

ఉ. ఘోరన విస్ఫులింగములు పొడ్మగ నుగ్రవిషంబు గ్రక్కుచున్
గ్రూరవిచేష్ట నాలుకలుగోయు మహోరగరాజయుగ్మముం

జేరి పదాహతిం గినియఁ జేయఁదలంచుటగా నెఱుంగు దు
ర్వారులు మాద్రిపుత్రులు కవజ్ఞయొనర్పఁ దలంచు దేర్పదన్) 311

'కుద్చు' (కుడుచు)

అందే:—

సీ. పా. పల్లెరంబుల గుద్చు బ్రాహ్మణు లతిపుణ్యు
లెనిమిదివేల సమిద్ధ మతులు...... 312

పదద్వయ సంధి యందును ఉకార లోపము (కలదు). 313

అందే (5-333) :

మ. బలియుం డా ధృతరాష్ట్రసూనుఁడు మహాభాగుండు దుర్యోధనుం
డలఘుం డీ కమలాకరంబునకుఁ గ్రీడార్థంబు కౌతూహలం
బెలయంగాఁ బ్రియకామినీసహితుఁడై యేతెంచు చున్నాఁడు మీ
ర్వల దిందుండఁ దొలంగి పొం డనవుడు న్వా రుద్ధతక్రోధులై 314

'వెలయ' అనుటకు 'ఎలయ' అని యున్నది. 315

ఎఱ్ఱనగారి రామాయణము:-

ఉ. త్యాగులు పాతకేతరులు నై నుతి కెక్కఁగ నాకలోక లీ
లా గరిమంబు నంబుదము లాగు దలిర్చిన సంస్కృతోల్లస
ద్వాగభి యుక్తి నాత్మ విబుధత్వము సిద్ధత నొందఁగా సుధా
యోగము నొందుదు శ్రుతిపయోధి మథించి రసజ్ఞులై కవుల్. 316

శ్రీనాథుని భీమఖండము:-

సీ. పా. శాకపాకములతో సంభారములతోడ
పరిపక్వమగు పెసర్పప్పు తోడ... 317

శ్రీనాథుని కాశీఖండము (1-161) :

సీ. పా. మగఁడు దన్మొత్తిన మార్మొత్తు నలివేణి
వ్యాఘ్రియై చరియించు వనములోన... 318

పాదాంతమందు విడియుండును. 319

శ్రీనాథుని హరవిలాసము (5-18) :

క. భూత ప్రేత పిశాచ
వ్రాతములుం దోడుగాఁగఁ బ్రమథులు పగలున్
రాతిరియును నష్టాదశ
జాతి ప్రజలకును దుర్దశలు సంధింతుర్. 820

ఇటువలెనే తెలుసుకొనేది. 821

'క్వచి ద్గ కారో వః' అని నన్నయభట్టు సూత్రమున్నందున - పగలు - పవలు; తొగలు - తొవలు; పగడము - పవడము; అలిగి - అలివి; నగరు - నవరు; నిగుడించుట - నివుడించుట; తగులులు - తవులులు —ఈ మొదలైనవి తెలుసుకొనేది. 822

కొన్ని పదముల పకారముకు వకారము (వచ్చును). ఒప్పుట - ఒవ్వుట (అని రెండు నుండును.) 823

'ఒవ్వుట'

విరాట పర్వము (2-286) :

ఉ. ఒవ్వనివారు నవ్వ మహిమోద్ధతి ధర్మసుతుండు దీనికై
నెవ్వగఁ బొంద భూజనులు నింద యొనర్పఁగ (నేనొర్చు నీ
చివ్వకు నీవు నల్క మెయిఁ జేసిన యా పని గూఢ వృత్తికిన్
దవ్వగునేని నియ్యభిమతం బొదఁగూడియు నివ్వుంబగున్) 824

అరణ్య పర్వము (6-16)

క. ఒవ్వనివారల యెదురన
నివ్విధమున భంగపడితి నేనింక జనుల్
నవ్వంగ నేటి బతుకుగ
నివ్వసుమతి నేలువాఁడ నెట్లు చరింతున్. 825

కొన్నిచోటుల వకారములోపించి దాపల వర్ణమునకు దీర్ఘము వచ్చును- 826
'నావ్వక-నోవక'.

ఉద్యోగ పర్వము (1-208) :-

క. కావున మీపడిన యర
ణ్యావాస క్లేశమునకు నజ్ఞాతవిధిన్
సేవకుల రైనదానికి
నోవకుఁడీ మీరు లఘుమనోవృత్తులరే. 327

నోవ, దావ, వెఱవ, మఱవ - ఈ మొదలైన పదముల వకారములు (కొన్నిచోట్ల) లోపించును. 328

(నోవన్ + ఏయ =) 'నోనేయ'—

ద్రోణ పర్వము (4-193) :—

గీ. బలము లచ్చెరువంద నట్లలవు మెఱసి
నీ సుతుం డనిలజుఁ దాకి నిశితసాయ
కముల నొప్పించి రథతురంగముల నొంచి
సూతు నోనేయఁ గ్రోధ విస్ఫూర్తి నపుడు. 329

(లేవన్ + ఎత్త =) 'లేనెత్త'—

కవుల షష్ఠము :—

మ. తనతో నల్గిన వాణిపాదముల మీదన్ వ్రాల లేనెత్తి నా
య్యనఁ బాళ్చాత్యనిజాస్యతన్ముఖములం దన్యోన్య మొక్కప్డు చుం
బన మబ్బంగఁ జతుర్ముఖత్వము ఫలింపం జొక్కు పద్మాసనుం
దనవద్యాయురు పేతుఁ జేయు చికతిమ్మాధీశుఁ దిమ్మాధిపున్. 330

(దావన్ + ఓప =) 'దానోప'—

అరణ్య పర్వము (2-127) :-

క. నాలుగు దిశలను దాన
జ్వాలావలి గదిసె క్రమ్మంది దానోపఁ గృపా
లోలా నన్నొక్క సరి
త్కూలము చేరంగ నెత్తికొని పొమ్ము దయన్. 331

(వెఱువకు) 'వెఱకు'—

శ్రీనాథుని కాశీఖండము (6-71) :-

గీ. చెంచునింటికిఁ బోయి చెంచెతకుఁ బ్రియము
జెప్పి నమ్మించి తలమీదఁ జెయ్యివెట్టి
వెఱకు మని తన్ముఖంబున నెఱుకఁ తేని
గాంచి యాతనితోడ సఖ్యంబు సేసి. 332

ఇటువలెనే (కవి ప్రయోగములు) తెలుసుకొనేది. 333

'ఏనుగ-ఏనుఁగు-ఏనుంగు-ఏన్గు-ఏనిక'— అని గలదు. 334

'ఏనిక'—

తిమ్మకవి సార్వభౌముని రుక్మిణీపరిణయము :—

చ. అనుదినము న్మదిం జలన మానక మానక పూని దీనులన్
మనుచుచుఁ గార్యవేలలను మాధవ మాధవ ముఖ్యలౌ సురల్
దను వినుతింప మేలిదఁగఁ దానగు దాన గుణాఢ్యుఁ డంచు నిం
పెనయఁగఁ గోరి మ్రొక్కుడుదు నేనిక నేనికమోముసామికిన్. 335

'ఏనుంగు', ఏన్గు—

తిమ్మకవి అచ్చతెనుగు రామాయణము (యుద్ధ. 168) :—

గీ. తేరుతోడఁ దేరు తేజిలోఁ దేజి యే
నుంగుతోడ నేన్గుఁ ద్రుంగఁగొట్టి
బంట్ల చిత్తెఱఁగులఁ బరిమార్చివై చినఁ
జూచి దొడ్డయొదలి జోదుఁడలిగి. 336

ఇటువలెనే మరియు ననేకశబ్దము లనేకభేదములు గలవు. గ్రంథ విస్తర
భయమువలన (వానిని జూప) మానినాము. 337

మొదట వ్యంజనములు కలవి, లేనివి పదములు— 'పూనె-ఊనె;
నెగసె-ఎగసె; పొదవె-ఒదవె; పొనరె-ఒనరె; పొందె-ఒందె',— ఈ పదియు
అప్పకవిగారు లక్ష్యములతో వ్రాసినారు. 'వేఁడి-ఏఁడి; నీల్గుట-ఈల్గుట; నెగ
యుట-ఎగయుట; నంటు-అంటు; నెగ్గు-ఎగ్గు'— ఈపదియు తిమ్మకవి సార్వ
భౌముడు లక్ష్యములతో వ్రాసినాడు. మరియునుగలవు. 338

సీ. ఎడలుట యనఁగను వెడలుట యన నెల్ల
వెల్ల యనంగను వెన్ను నెన్ను
పీయము నీయము వ్రేసె నేసె ననంగ
వేచు టనంగను నేచు టనఁగ
వేర్పాటనఁగ మరి యేర్పాటనఁగ నెడ
బాపుటయును బెడబాపుటయును
హురుముంజి యన ముత్తె మురుముంజి యనఁగను
మొగి యనంగను నట్ల నొగి యనంగ
నీరు మీ రనంగ నీరలు మీరలు
నీవు నీవు నేను నే ననంగ
నేము మే మనంగఁ గృతులందు నలరారు
పృథులకీర్తి! కుక్కుటేశమూర్తి! 339

'ఎడలఁగ' (వెడలఁగ)—

హరిశ్చంద్రోపాఖ్యానము (2-90) :—

క. అన్నలినాక్షుల వాలుం
గన్నుల కెదిరింపలేని కతమున గాదే
పన్నిన భయమున బేడిస
లెన్నఁగ జలదుర్గభూము లెడలఁగ వెఱచున్. 340

శాంతిపర్వము (5-371) :—

గీ. తాను గ్రోధాదు లెడలించు గాని ముక్తి
దెచ్చి యీ దొకభంగి (ముక్తికిఁ బథంబు
నగుద ననపాయమగు నుపాయం బనంగ
వలసె నీ నేర్పుపే రిందువంశవర్య) 341

'ఎల్ల' (వెల్ల)—

శాంతిపర్వము (3-433) :—

క. విను విప్రులు బేదలగుట
మనుజేంద్రుని బుద్ధిలేమి మాతాపితృ భా
వనతఁ దగవారిఁ బ్రోచిన
గను మేలున కెల్ల గలదె కౌరవనాథా! 342

'ఎల్ల'నగా చేవగానిది—'తెలుపు' అనుట. 'తెలుపు తెల్ల వెల్ల తెలి వెలి నాగ నా, హ్వాయము లమరు ధవలవర్ణమునకు' అని ఆంధ్రనామ సంగ్రహము.

('వెల్ల' పదమున) లకార (అకారముల) లోపమున్ను గలదు. 343

ద్రోణపర్వము (5-130) :—

మ. ధనువుం గేతువుఁ ద్రుంచి సారథిని రథ్యవ్రాతముం జంపి యే
పున పాంచాలతనూజు వెల్గొడుగు సొంపుంబేవు మాయించి యా
తని (పార్శ్వంబుల యోధవీరశతముం దన్మాన్యుల న్మవ్వురం
దునిమెన్ ద్రోణసుతుండు రాజువొగడన్ దోర్గర్వదుర్వారుఁడై ) 344

'ఎన్ను' (వెన్ను)

ఆంధ్రశేషము (72)

క. వెన్ననఁగఁ బీజమంజరి
వెన్నన్ఁ జరమాంగమునకు వెలయుం బేర్మిన్
కన్నులనం బర్వమ్ములు
కన్నులనన్ లోచనములు కంతేకాలా. 345

రుక్మాంగద చరిత్ర (4-40)

గీ. పండి యెండ ముక్కువడి రాజనంబొప్పె
నితరసస్యసమితి యెన్ను వంచె
నదులు డింగి కాలునడ లయ్యె నయ్యెడఁ
బంక మింకె నీరు పలుచనయ్యె 346

వియ్యము-ఈయము

చేమకూరవారి విజయవిలాసము (3-123)

సీ. పా. వియ్యంపు మర్యాద వెలయఁ దాము నుశచీ
జాని బువ్వాన భోజనము చేసి... 347

అందే (3-126)

ఉ. ఈయపురాల వైతివిగదే యిపు డత్తవు (తొంటివావి నో
తోయజనేత్రు గాంచిన వధూమణి నీసుతఁ బెండ్లియాడఁగా

నాయము నాకుమారునకు నర్మిలి హత్తగ నత్తవావిచే
నాయువు గల్గువాఁ డవునటం(డు శుభంబగు దీన నెంతయున్) 348

'వేసె-ఏసి' భాస్కర రామాయణ పద్యము శసలకు ప్రాసమందు(ప్రథమాశ్వాసమున) వ్రాసినాము. 349

వేచుట-ఏపుట :-

శాంతిపర్వము (3-30)

చ. విను మరి జంపనుం జెఱప వేచుట లెస్స ప్రతాపభాషణం
బున (వెడనుల్లికుట్టులను బొంకుల వానిఁ గలంగఁ జేసిరేఁ
చినఁ దనపూవు దప్ప నఱసేయని చందము నమ్మియున్న దా
ద్పును మెఱయంగఁ బల్కుచుఁ గడున్ మది నమ్మకయుండుఁగా దగన్) 350

సౌప్తికపర్వము (1-63)

గీ. అలుక బొరమువాని కర్థచింతకునకు
నాతురునకు మన్మథార్తునకును
నిద్రవచ్చు నెట్లు నీవును దీనిని
నెఱిఁగి యుండి యేటి కేప నన్ను. 351

'వేర్పడు'—

శాంతి పర్వము (3-228)

గీ. మేలుచేసి తగిన మిత్రులఁ బడసి త
త్సుచరితముల వచ్చు సుఖము లనుభ
వింపఁ జూచు టుడిగి వేర్పడియుండుట
యరయ నీతివిదుల తెరవుగాదు. 352

అచ్చు (ఏర్పడు) కు కాకుస్వరములందు (లక్ష్య) మున్నది, 'ఎడబాపుట' సులభము. 353

'పెడబాపు'—

వేమకూరవారి విజయవిలాసము (3-113)

క. వడిఁ దెఱవల్ తెర వంపం
బడతుక నగుమోము గానబడియెన్ గాంతుల్
దడఁబడఁగ శరన్మేఘము
బెడపాసి వెలుంగు చంద్రబింబము వోలెన్. 354

'హరివాణము తెనె హరువును నరయఁగ, హురుమంజి ముత్తియంబు వకారంగుం, బరికింపఁగ రేఫములగు' నని లాక్షణికులు (హురుమంజి) హకార ములలో వ్రాసినారు. (కాని అజాదిగా కూడ కలదు.) 355

చేమకూరవారి సారంగధర చరిత్ర (2-62)

ఉ. నా యపరంజిమేడ నొకనాడును జూడవుగా యగోచరం
బా యురుమంజి ముత్తియపుటన్నువ సోరణగండ్లయంద మా
చాయలకెంపుటోవరుల చందము నా చెలువుల్ దొలంకురే
రాయల రాయరుంగులగు రాగము లామణికుడ్యభాగముల్ 356

హురుమంజి-ఉరుమంజి-అణి-సుపాణి-సుప్పాణి - ఈపదములు ప్రశస్తమైన ముత్యములకు పేరు. (ఇవి) విశేషణ విశేష్యములు రెండునగును.

"ఉదయాద్రి కరిమీద హురుమఁజి చౌదోలు"అని మృత్యుంజయవిలాసము

'ఈసుపాణి రదశ్రేణియే సుపాణి' అని విజయ విలాసము.(1-130)357

అత్తులు-హత్తులు; అదను-హదను; అజ్జ-హజ్జ; అంజ,—ఇటువలెనే కొన్ని పదములు రెండువిధములను గలవు. 358

మొగి-ఒగి :-

ఆదిపర్వము (6-60)

సీ. పా. మొగిని దధీచి యెమ్ముకనఁ బుట్టదయ్యేనే
వాసవాయుధమైన వజ్ర మదియు... 359

అందే (8-58)

క. ఆదిత్యదైత్యదానవు
లాదిగఁ గల భూతరాశి నగు సంభవముల్
మేదినిఁ దదంశముల మ
ర్త్యోదయములు నాకుఁ జెప్పు మొగి నేర్పడఁగన్. 360

ఈరు-మీరు, ఈరలు-మీరలు, ఈవు-నీవు, ఏను-నేను-ఏ-నే, ఏము-మేము; అఁపుట-పఁపుట. అనుపుట-పనుపుట,-ఈ మొదలయినవి రెండు విధములు ఉదాహరణములు (ఉదాహరణములు) గలవు 361

వ్రేసులు-వ్రాముడుతో—

కర్ణపర్వము (3-97)

చ. అన విని యమ్మహీరమణుఁ డాతని కిట్లను మీకు నాకతం
బున బహుదుఃఖము ల్గలిగె భూరికులంబున క్షత్రియం బొన
ర్చిన యనినీతుఁ బాపపరు వ్రేయఁదగుం దలద్రెవ్వ నీమనం
బున కృపపుట్టి కాచినను బోయెద నిప్పుడె యేను కానకున్. 362

ఇటువలెనే (ఇంకను) తెలుసుకొనేది. 363

అందఱు-అందొఱు, ఒకటి-ఒకొటి,-ఈ రెండు నప్పకవిగారును, కంటి పొరలు-పరలు, పొవమా-పవమా-ఈ రెండును తిమ్మకవి సార్వభౌముడు వ్రాసినారు. తలగుట-తొలగుట; నేల పొరలుట-పరలుట,-ఇవియును గలవు. 364

కృష్ణరాయల ఆముక్తమాల్యద (2-46) :

సీ. పా. నిద్రిత ద్రుచ్ఛాయ నిలువర జరుగు వెం
బడనె యధ్వగపంక్తి పరలు నెట్లు...... 365

వ్యాఖ్యయందు 'పొరలు వెట్టు' అను (దానికి) అర్థము వ్రాసినారు. యతి భంగము కానలేదు. మిగిలినవి (పదములకు లక్ష్యములు) సులభము 366

తద్భవ సకారముకు-కొన్నింట తలకట్టు, కొన్నింట నేత్వము (గలదు.) 'శయ్యకు'కు రెండును (ఉన్నవి.) శంఖమునకు 'సంకు', శాణముకు 'సాన', శణక-సెలగ, శక్తి-సత్తి, శల్యుడు-సెల్లుడు, శపియించుట-సెపియించుట. శయ్య-సజ్జ, సెజ్జ, శణగ శబ్దముకు జనుము. 367

'సెల్లుడు'—

ఆదిపర్వము (7-204) :

గీ. సెల్లుఁ దట్టు నేలఁ ద్రెళ్లి చెచ్చెర లేచి
యొరలు దుడుచు కొనుచు నొయ్య నరిగె... 368

(ఈ పద్యమందు) 'సెల్లుఁద'ని యెఱుగక-'శల్యుఁ దట్టు నేల చతికిలఁబడి' అని వ్రాసినారు. 369

శల్యపర్వము (1-250) :

చ. వెరవును లావుఁ జేవయును వీరల కారయ నొక్కరూప సు
స్థిరభుజశక్తి ధర్మజుఁడు సెల్లుని రూపడఁగించి యివ్వసుం
ధరఁ గొను నొక్కొ నే డితనిఁ దా సమయించి సమస్తమేకినీ
శ్వరుఁడుగఁ జేయ నోపునొకొ శల్యుఁడు గౌరవ రాజనందనున్. 870

'సెపియించు'—

శాంతిపర్వము (4-157) :

క. నృప నీవు మదీయంబగు
జపము ఫలంబడిగితేను సమ్మతి నీఁగా
విపరీత ఫణితు లాడిన
సెపియింతుఁ జుమీ యెఱుంగఁ జెప్పితి నీకున్ 871

'(శపియింతు జుమీ) యెఱుంగఁ జాటితి నీకున్' అని దిద్దినారు. అర్థము బాగులేదు. రాజు, బ్రాహ్మణుడు ఎదురుగా నుండి మాటలాడుతతో 'చాటితి' అనుట కూడదు. 872

'కొబ్బరి-కొబ్బెర అని రెండును గలవు. 873

'కొబ్బెర'—

అప్పకవీయము (2-198) :

'సీ. పా. బిరుదు లబ్బురము కొబ్బెరకాయ బెరయుట'

అని ఏత్వములందు వ్రాసినారు. 874

తిమ్మకవి శివలీలా విలాసము :

గీ. పా. పెరుగు పాలు జున్ను బెల్లంబు నెయ్యి కొ
బ్బరి యనంటి పనస పండ్లు......... 875

మన్నీడు-మనీడు, చెన్నటి-చెనటి, దున్నుట-దునుట, కొమ్మ-కొమ = స్త్రీ, కనుబొమ్మ-కనుబొమ, కన్నులు-కనులు, విల్లు-(విలు)-విల్, మూల్గు-మూల్ ప్రెగ్గడ-ప్రెగడ,—ఈ మొదలైన పదములు బహుళములు గలవు. 876

గండపెండేరము - గండపెండరము, చౌవంచి - చవువంచి - అనియు గలవు. 877

'గండపెండరము'—

తిమ్మకవి అచ్చతెలుగు రామాయణము (యు. 203)

సీ. పా. పొసఁగ నొదలల హొన్నొప్పుమిడికమ్ములు పూని
డాకాల గండపెండర మమర్చి... 878

'హొన్ను' అనుటకు 'హొన్' అని యున్నది. 879

'చవుపంచి'—

అందే (యు. 184)

సీ. పా. కాలరిపౌజు వెక్కసపు టేర్పుల జంట
చవుపంచి కటలును బెవడువడఁగ... 880

'పసిడి బంగరు బంగారు పైడిహొన్ను, జాలువా పుత్తడి యనంగ స్వర్ణ మొప్పు' అని ఆంధ్రనామ సంగ్రహము (స్థావర. 86) న చెప్పినారు గాని, 'బంగారము-బంగరము-బంగరువు'— అనిన్ని కలదు. 881

'బంగారము'—

శ్రీనాథుని కాశీఖండము (1-17)

గీ: కలిగె పదియాఱు వన్నె బంగారమునకుఁ
బద్మరాగంబు తోడ సంపర్కలబ్ధి
(కాశికాఖండ మను మహాగ్రంథమునకు
నాయకుఁడు వీరభద్రభూనాథుఁ డగుట) 882

'బంగరువు' —

అందే (7-40)

సీ. గీ. గురుతనూభవ నాకు బంగరువు తోడ
వజ్రభూషలు సేయు తాల్పింపవలయు
(ననుచుఁ బ్రార్థించి రందఱ కతడు మ్రొక్కి-
యున్నియును దాను కల్పింప నియ్యకొనియె.) 888

పూ-పూవు-పువు-పువ్వు; దొ-తొవు-దవు-దవ్వు; మామిడి-మావిడి; కేళా కేళి; మోసాల-మొగసాల-మోసల-సావడి; సంపెంగ-సంపంగి-సంపెగ-సం

పగి; గొజ్జంగ-గొజ్జంగి-గొజ్జగ; వే-వేయి-వెయ్యి-వెయి; నే-నేయి-నెయ్యి-నెయి
చే-చేయి-చెయ్యి-చెయి,— ఈ మొదలగు భేదములుగలవు. 884

'వే'—

శ్రీనాథుని నైషధము (4-25)

గీ. (స్మరశిలీముఖ కుసుమకేసరపరాగ
ధూళిపాళిక చుఱుకించెఁ దూర్పుదిక్కు)
ఇంతి వే గన్నులను గానఁ డింద్రు డిపుడు
నీ విలాసంబు పెంపు వర్ణింపఁ దరమె। 885

'నే'—

ఉద్యోగపర్వము (2-243)

క. నావుడు సంజయుఁ డిట్లను
దేవా పాండవులయలుక ధృష్టద్యుమ్నుం
డే వెరవు మాట నైనన్
నే వోసిన యగ్నివోలె నిగుడం జేయున్. 886

గ్రంథవిస్తర భయమువలన(అన్నింటికి) లక్ష్యము ఉదాహరించలే... 887

'కోయిల-కోవెల' (అని రెండున్నవి.) కోయిలకు సులభము. 888

'కోవెల'—

రాజశేఖర చరిత్ర (3-80) :-

సీ. ఎఱమామి కొనయెక్కి పెళపెళనార్చి కో
వెలవోటు గూకలు వెట్టినేని...... 889

తిమ్మకవి శివలీలా విలాసము :- 890

గీ. పా. విశ్వరూపంబు దాల్చి కోవెలయి నలుల...... 891
'వేళమ-వైళమ' (రెండు గలవు)

'వేళమ'- 'వైళమ' :—

రామాభ్యుదయము (7-260) :-

ఉ. వ్రేసిన వ్రేటునం బడక వేళను దాటి పిరిందికంటి వా
హా సముదాయ మధ్యమున కర్కశమాళవునిం ......

(జేసికొనంగఁ జేర్చి కడుఁ జిక్కఁగబట్టి సురారి నేలకున్
వ్రేసిన వెంటనే యెగసి వ్రేసెఁ దటాలునఁ జెంప లాతఁడున్). 392

ఎఱ్ఱనగారి రామాయణము :

ఉ. అంగముతోడఁ గట్టు మిఁక యజ్ఞవిఘాతకచోరు నెందు వో
వంగలవాఁడ వింక నిటు వైశమ తాపస వేషధారివై...... 393

'చైపులసాకిరి దాయమగడు' అని ఆంధ్రనామ సంగ్రహము నందున్నది పొరపాటని తిమ్మకవి సార్వభౌముడు 'లక్షణ సారసంగ్రహము, (2-441) న వ్రాసినారు, 394

నూతన్నదండిగారు—

క. మల్లెయు లంజెయు గద్దెయు
నొల్లెయు నను పగిది పలుకు లొప్పవు కృతులన్
మల్లియ లంజియ గద్దియ
నొల్లియ యని పలికిరేని యొప్పుం గృతులన్. 395

(77) అనిన్ని, వేదాలు, వాదాలు—ఈ మొదలైనవి గ్రామ్యపదములనిన్ని ఆంధ్ర భాషాభూషణమందు (26) చెప్పినారు.[1] 'ఏదంతవాచనామ్నా మన్యతర స్యామియాంతానామ్' అని నన్నయభట్టుగారి సూత్రమున్నందున మల్లె-మల్లియ; లంజె-లంజియ; గద్దె-గద్దియ (ఒల్లె-ఒల్లియ) అని రెండువిధములు గలవు. 396

'మల్లె'—

వసుచరిత్రము (3-129) :-

రగడ. మూలమూలల మల్లె లెంతటి మోహమో హరిణాక్షి డాచితి
యేల యేలకి పొదలువెదకెద వింతవింతలె యొందుఁ జూచితి 397

1. 'వేదాలు, వాదాలు' గ్రామ్యమని ఆం. భా. భూ. నందు లేదు. 'యేదాలు, వోదాలు' గ్రామ్యమని యున్నది. '...యేగగొంటూ రమ్ము యేదాలు వోదాలు మోసేటివా రాస నేసువారు...' ఆం. భా. భూ. 26.

'లంజె'—

కవికర్ణ రసాయనము (4-110) :-

సీ. గీ. లంజెతల్లు లనఁగ లక్షిపంగా నిట్టి
కట్టడులను నలువ కరుణలేక
వ్రాతిమాలినట్టి బతుకులు నిడుపుగాఁ
జేసి విటుల గోడు వోసుకొనియె. 398

'గద్దె'—

శ్రీనాథుని కాశీఖండము (4-195) :-

సీ. గీ. చంద్రికా పాండు కౌశేయశాటియైన
యతను జగజంపుగొడు గెవ్వఁ డవ్విభుండు
పెద్దకాలంబు ముత్యాలగద్దె యెక్కి
వసుధ పాలించు నేకోష్ణ వారణముగ. 399

'ఒల్లె'—

కృష్ణరాయల ఆముక్తమాల్యద (2-61) :-

సీ. గీ. నారికేలాసనపుఁ దీపు టూరుపొలయ
వలిపె యొంటొల్లెతో సురఃస్థలులఁ గూడు
ప్రియులఁ దేకువతో నెచ్చరించి కలసి
రెలమి ధన్యులు పరపు వెన్నెల బయళ్ల. 400

అహోబల పండితులవారు నూత్నదండిగారి మతము నిర్మూలమన్నారు. ఇటువలెనే అందె-అందియ; పట్టె, మట్టె, మిద్దె, ఈటె, పల్లె, కన్నె- ఈ మొదలైనవి రెండును గలవు. ముత్తెము - ముత్తియ మనిన్నిగలదు. మల్లెలు-మొల్లలు-అని పదభేదమే కాదు, అర్థ భేదము గలదని తోచుచున్నది. 401

యయాతి చరిత్ర (1-86) :

గీ. అగరు లేంకి విరవాది యాకు తీగెఁ
మల్లియలు గొజ్జెగలు దాక మొల్ల మొగలి

మొదలు (గానివి యెప్పుడుఁ బూచి కాచి
యుండు తోట లమీనుఖానుండు నిలిపె.) 402

అని (భిన్నార్థముతో ప్రయోగము) ఉన్నది.

'వేదాలు'—

శ్రీనాథుని కాశీఖండము (8-188):

సీ. అతి గుహ్యమై యకారాది క్షకారాంత
పంచాశ దక్షర ప్రకృతియైన
మాతృకయే మహామంత్ర రాజంబునై
దవయవంబులఁ బుట్టి యం దకార
మునకును నోంకారమునకు మకారంబు
నకు బిందువునకును నాదమునకు
ప్రత్యేకము పదేసి పదియేసి వర్ణంబు
లనఘ జన్యంబులై యతిశయిల్లు
నట్టి ప్రణవంబు హేమసింహాసనమున
భాస్కరుండను మాణిక్య పదకభూష
యఱుత ధరియించి దేవి గాయత్రి యొప్పు
కడుపు చల్లఁగ వేదాలఁ గన్నతల్లి. 403

'గండాన'—

అందే (5-329):

గీ. మూలనక్షత్ర మందును మొదలి కాల
కన్య గండానఁ బుట్టిన కారణమునఁ
జచ్చెఁ జింతా జ్వరము పైన జ్వరము దాకి
కర్మరుఁడు విప్రుఁ డానంద కాననమున. 404

'ప్రాణాన'—

ఉద్యోగపర్వము (3-345):

క. మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రా
ణానం గలుగంగ బంధునాశము రాజ్య
శ్రీనాశము నుద్దామ య
శో నాశముఁ జేయనేల చూచెదు చెపుమా. 405

'నిటలాన'—

కర్ణపర్వము :-

గీ. వెండి పింజెలతోడ వెడదయమ్ముల చిత్ర
సేన ధరణినాథు శిరముఁ ద్రుంచి
వాడి నారసంబు వర్మ్మని నిటలాన
నాట నేసె దివిజనాథ సుతుఁడు. 406

'ధరణి' (ఇకారాంతమును గలదు.) ఇటువలెనే (వేదాలు, ప్రాణానవంటివి) బహులములు గలవు. 'వికృతౌ క్వచిచ్చ లోపో మో ర్ధీర్ఘ శ్చాత ఆదిమస్య భవేత్' అని (నన్నయభట్టు) సూత్రమున్నందు వలన తెలుగున వికల్పముగ 'జొంప ములు – జొంపాలు' అని వ్యాఖ్య (లో లక్ష్యములు) వ్రాసినారు గాని, గీర్వాణ పదములును గలవు. 407

'ధూర్త వృద్ధౌ మూర్ఖ నీచా వుదంతావపి సమ్మతాః'

అని ఆధర్వణ కారిక ధూర్తు, వృద్ధు, మూర్ఖు, నీచు— అనిన్ని గలవని యర్థము. 'ధూర్తుడు' అని డుకారము సిద్ధమే. 408

'వృద్ధు'—

సభాపర్వము (2-27) :

క. వృద్ధు లౌక లక్ష యున్నను
బుద్ధియె యెవ్వరికి వారిఁ బూజింపంగా
నిద్ధరణీశులలో గుణ
వృద్ధని పూజించితిమి త్రివిక్రము భక్తిన్. 409

'మూర్ఖు'—

అందే (2-24) :

చ. అవినయ బుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్యమ యంటి నీవు మూ
ర్ఖవు శిశుపాల యింకఁ బలుక న్వలసెన్ (సభలోన నున్న యీ
యవనిపు లెల్ల నాతని దయం బ్రవిముక్తులు వానిచేత నా
హవ జితులుం దదీయ శరణార్థులుగా కొరులయ్య చెప్పుమా.) 410

'నీచు'—

విరాటపర్వము (2-54) :

క. అని పలికిన పలుకుల కం
గన కోపము గదిరి నీచుగావున ఝంకిం
చినఁగాని మెత్తఁబడి పో
దని మనమునఁ దలఁచి యిట్టు లనియెం బెలుచన్. 411

ఇవి మాత్రమే కావు. మరియును (గలవు) 412

సౌప్తికపర్వము (1-104) :

ఉ. భీకర విష్ణురూపములు పెక్కిటు లొక్కటఁ దోపఁ దీవ్రతా
పాకులమానసుం డగుచు నగ్గురు సూనుఁడు దుర్మదంబునం
జేకొన వైచె నట్లు కృపు జెప్పిన సత్య హితోపదేశముల్
నా కివి పెద్దయే యని మనంబున నిట్లని పల్కె వెండియున్. 413

(ఇందు 'కృపుడు' అనుటకు 'కృపు' అని యున్నది) ఇటువలెనే జనమే
జయు, ధృతరాష్ట్రి - అని యున్నవి. 414

శ్రీనాథుని నైషధము (1-35) :

సీ. గీ. చక్కదనమున గాంభీర్య సారమునను
ప్రకట ధైర్యకలాకలాపముల యందు
దండనాయక చూడావతంసమైన
మంత్రి మామిడి పెద్దనామాత్య వేము. 415

'వేముడు' అని యుండవలె. ఇటువలెనే తమ్ముడు - తమ్ము, అల్లుడు —
అల్లు —అనియు గలదు. 416

'తమ్ము'—

అరణ్యపర్వము (8-279) :-

గీ. తమ్ముచేసిన దురితంబు తలఁగఁ బూని
ధర్మబుద్ధిని వ్రతములు పేర్మిఁ జేసి
(తనయ నీకు నభీష్టంబు లైన వరము
లడుగు మిచ్చెద మీమెచ్చు గడవ నగునె. 417

'అగ్రజు'...

అరణ్యపర్వము (5-334):—

చ. అనుపమతేజుఁ డున్నత భుజాగ్రుఁడు దుర్జనవైరి విగ్రహం
దనముఁడు వాయుసూనుఁడు నిజాగ్రజుఁ జేసిన సత్యపాశ బం
ధనమున (జిక్కి తత్సమయ తత్పరుఁడై యిటు ఘోరదుఃఖవే
దనములు సైచెఁగాక మది తద్దయుఁ గ్రోధమయంబు వానికిన్). 418

'అనుజు'—

విరాటపర్వము (5-81):-

గీ. అవుడు రాధేయుఁ డమ్మెయి ననుజు వదుట
చూచి (యేనుంగునకు సిఘ్గ చూపినట్లు
కవిసి హయముల మత్స్యభూకాంతుతనయు
నేసి పండ్రెండు శరముల నేసె నరుని). 419

## -: కొన్ని విభక్తి రూపముల విచారము :-

తిమ్మకవి సార్వభౌముడుగారు లక్షణసార సంగ్రహమునందు (1-358):

గీ. కూర్చియను ద్వితీయకును నొక్కషష్ఠికిఁ
బై విభక్తి గానఁబడఁగ రాక
యడఁగియుండుఁ గృతుల నాచార్యుఁ బ్రణమిల్లె
రాజుకొడుకు కనంగ రాజమకుట! 420

గీ. లలిఁ దృతీయాదులగు విభక్తులకు నెల్లఁ
గలుగు మధ్య నకారంబు, దొలఁగుచుండు
రాముచే రాముకొఱకు శ్రీరాముకంటె
రాముకును రామునం దని రాజభూష! (1-368) 421

'టాదివిభక్తౌ నిర్నేత్యేకే' అని శబ్దశాసన సూత్రము గలదు. దానికి తృతీయాది విభక్తులందు నికారానకు లోపమువచ్చి రాముచేత, రాముకొఱకు, రామువలన, రాముకు, రామునం దని బాలసరస్వతిగారు వ్యాఖ్యవ్రాసినను కొందరు

షష్టికి రామునకు అనికద్దుగనుక, 'రామునకు' అన్నచోట నికారముగాక నకారము వచ్చుచున్నది. దానికి లోపములేదని 'రాముకు' అని అనరా దన్నారు.

మొత్నదండి ఆంధ్రభాషాభూషణమునందు—

క. సుతుఁ గనియె సుతుని గనియెన్[1]
సుతుచేతన్ సుతునిచేత సుతునకు నిచ్చెన్
సుతు కిచ్చె సుతునివలనన్
సుతువలనన్ సుతునిధనము సుతుధన మెలమిన్. 422

(39) అని చెప్పినాడు గనుక—

సభాపర్వము (3-196) :-

సీ. పా. సహదేవ నకుల వాసవసుత భీము ల
గ్రమమున నలువురఁ గౌరవేంద్రు
కొక్కొక్క యేటున నుక్కునంబున నొద్ది
యోడి తన్నును నొద్ది యోటువడిన...... 423

అనిన్ని మహాకవి లక్ష్యము మరియును వ్రాసినారు. 424

విరాటపర్వము (5-342) :-

ఉ. అత్తఱి లేచివచ్చి తన యన్నలఁ దమ్ములఁ గానుపించె న
య్యుత్తరు కర్ణునుండు వగనొందఁగ నప్పుడ బిల్వఁబంచె (మా
తోత్కృత్త ము డార్యమిత్ర సచివోత్కర సోదరవర్గ పుత్రకో
దాత్త భటాది యోగ్యుల ముదంబునఁ బాండవదర్శనార్థమై). 425

అచ్చు పుస్తకములందు 'ఉత్తరకు' అని వ్రాసినారు. మరికొంత గ్రంథమైన పిమ్మట గాని యుత్తర కథ రాదు. ఇచ్చట సందర్భమున్ను లేదు. జనకునితో పుత్రుడు చెప్పుచున్న కథ గావున పొరపాటుగాని, సుష్ఠువుగాదు. 426

---

1. ము. ప్ర. 'సుతుఁడు సుతు సుతునిఁ గనియెన్...'

క. ధనవర్గంబులు వీరి
చ్చిన యవి యట్లగుట వేడ్క సేయవు తగ నూ
తనమగు కానుక యీవల
యను దోడ్తేరంగఁ బనుపు ముత్తరఁ బ్రీతిన్

అని (విరాట. 5-353) ఉత్తరుడే చెప్పినాడు. 427

ఎఱ్ఱనగారి హరివంశము. (ఉ. భా 4-275):

క. అందఱు హరిదెస ప్రణయ
స్యంది మనోజ్ఞులును లబ్ధసంతానులునై
నందించిరి హరిమహిమల
చందము నఱుకైన బొగడ శక్యమె బుద్ధిన్. 428

కవిత్రయ ప్రయోగముల మూడును గలవు. 429

శ్రీనాథుని నైషధము (6-115):

ఉ. (లాలనఁ గ్రొత్త బెబ్బులి కలాసము వెట్టిరి యాసనంబుగా)
గోలయు సాధువైన యొక కోమటికిన్ నిషధేంద్రు బచ్చుకున్
(మేలపుమై వడిం దమ సమీపపు ధూర్తులు తత్పురఃస్థలాం
గూలత యవ్వణిక్కునకుఁ గోశ విజృంభణ శంకసేయఁగన్) 430

కవికర్ణ రసాయనము (8-117):

సీ. పా. నీ తూపు కోర్వక నిటలాక్షుఁడును తనూ
ఫలకంబు చాటును బాయఁ డెపుడు...... 431

ఇటువలెనే మహాకవి ప్రయోగములు కలవు. 432

అహోబలుడు కవిశిరోభూషణమందు—

"నః కౌ. నే రపవాదః. నామ్నః కౌపరే వః స్యాత్.రా మునకు కృష్ణునకు ఇత్యాది. ఉకారాదేకాక్షర గతా దూకారా దృకారాచ్చ పరోఽయం నకారః. అత ఏవ ద్వితీయాబార్యేణో క్తమ్.

"సర్వేషామే మచోదంత శబ్దానాం కౌపరే భవేత్
నః ప్రాయః స్యా దుకారాచ్చ సర్వపండిత సమ్మతే"

రితి. 'రామాయణముగ రచించి ప్రాచేతసుకున్' ఇతి భాస్కరోక్తి రసంగతైవ. 'కై' విభక్త్యా పాఠ స్సాధుః. "వంతుకు వచ్చు సత్యగరు వంబిక' ఇత్యత్ర 'వంతున కెక్కు సత్యగరువం' బిత్యేవ పాఠ స్సాధుః. వ్యాకరణ ద్వయేపి నస్యైవ విధానాత్. విధాతృ... ఋకారాంతోదాహరణమ్. ప్రాయో గ్రహణా దూదంతతాదపి భవతీతి జ్ఞేయమ్."

అని వ్రాసినారు. 433

ఈ సూత్రమునకే బాలసరస్వతులవారు:—

"కౌ = కు అనే విభక్తిపరమైతే నః = న అనే ఆగమము వచ్చును. 'ని' యనేది రాదు. అనితాం = ఇకారాంత వ్యతిరిక్తములైన నామముల యొక్క, ఙమః = షష్ఠికి, కు అనేదివచ్చును. రామునకు, సామాన్యాకారమున న్యాగమము వచ్చితే ఇకారాంత మవుచున్నది గనుక, 'అనితాం' అనే పర్యుదాసచేత నుక్వాదేశము రాదు 'ఙసః కిచ్చ' అను వక్ష్యమాణ సూత్రము చేత 'కి' వచ్చును. 'రామునికి' అను రూపమున్ను గలదు.

అని వ్రాసినారు. 434

అయితే, ఎంతటి పండితులకు నొకచోట భ్రాంతత్వము గలదు. అందఱు పండితులకు నొకచోటనే భ్రాంతత్వము గలుగదు. ఇన్ని ప్రయోగములు దిద్దక రెండు మాత్రము (అహోబలుడుగారు) దిద్దినారు. (అది) వారి ఔద్ధత్యముగాని (అవి) అసాధువులుగావు. రామునికి, రామునకు, రాముకు అని మూడు విధముల నుంద వచ్చును. 435

క. గురునికి గురునకు ననఁగాఁ
బరఁగఁగ బాలునికి ననఁగ బాలున కనగా
(గరగకు గౌరవకు ననఁగా
దరమున కుదరమునకు నా నుదాహరణంబుల్) (6) 436

అని నూత్నదండి ఆంధ్ర భాషాభూషణమున (చెప్పినారు) 'విధాతకు' అనవచ్చును. 437

పోతనగారి భాగవతము ప్రథమస్కంధము :—

ఉ. చేతులు మోడ్చి మ్రొక్కెద నశేషచరాచర భూతసృష్టి వి
జ్ఞాతకు భారతీహృదయ సౌఖ్యవిధాతకు వేదరాశిని
ర్ణేతకు దేవతానికరనేతకుఁ గల్మష జేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిలతాపసలోక సుఖప్రదాతకున్. 438

సప్తమీ విభక్తికి నాలుగు విధములు గలవు. 439

అరణ్యపర్వము (6–367) :-

చ. ఉరమునయందుఁ గన్నులు పృథూదర దేశమునందు నోరుఁ బ్ర
స్ఫురిత భుజద్వయంబు (గులభూమిధరోన్నత భావముం గరం
బరుదుగ నుగ్రమైన వికృతాకృతితోడ నశేషసత్త్వ ఘ
స్మరుఁడగుచున్నవాని దివిజారిఁ గబంధునిఁ గాంచి రచ్చటన్). 440

వసుచరిత్రము (1-51) :-

మ. హరుఁడా తారకశైలదుర్గమున నధ్యాసీనుఁడై రాజశే
ఖర విఖ్యాతివహించుఁ చంద్రగిరిదుర్గంబందు శ్రీవేంకటే
శ్వరుఁ డొప్పున్ (బహురాజశేఖర సదాసంసేవ్యుఁడై యారయి
ద్ధర బందేలికవాసి తద్గిరులకుం దద్వల్లభశ్రీకున్.) 441

శ్రీనాథుని కాశీఖండము (2-119) :—

సీ. పా. అవిముక్తమందు నుపాస్యుఁ డాత్మయటంచు
యాజ్ఞవల్క్యుం డత్రి కానతిచ్చె...... 442

కవికర్ణ రసాయనము (పీఠిక. 58) :-

మ. హరిదశ్వాన్వయమందు దాశరథినై యస్మత్పదాంభోజ త
త్పరుఁడై యుండు విభీషణాఖ్యునకు (నుద్ధామంబు శ్రీరంగమే
గరుణాధీనత నీ నతండు గొనిఁరా గావేరిలోఁ బుండ్రపు
ష్కరణీతీరమునందు గైకొనియెదం గల్పావధిస్థైర్యమున్). 443

తిమ్మకవి లక్షణసార సంగ్రహమునందు (1–339) :-

క. కదిసి ముకారాంతములగు
పదములపై సప్తమీవిభక్తి యొదవుచో

ప్రహదమున ప్రహదమునయందున్
ప్రహదమందున్ ప్రహదమునందు నన జను శర్వా! 444

సంబోధనకు 'సురలార, తరులార, నరులార' (ఇత్యాదిగా) అనుట సులభము. ప్రథమాబహువచనమటుల ('ఆర' విరహితముగాకూడ) వచ్చును 445

నూత్నదండి ఆంధ్ర భాషాభూషణము ( 9 ):-

క. ఒప్పులు గలిగిన మెచ్చుడు
తప్పులు గలిగిన నెఱిఁగి తగఁ దీర్పుడు త
ప్పొప్పనకుఁ డొప్పు తప్పని
చెప్పకుఁడీ కవు లుపాస్తి చేసెద మిమ్మున్. 446

(సంబోధనమున)ఉకారాంతములకు 'విష్ణుడ, విష్ణుడా, విష్ణూ' (ఇత్యాదిగా) అనవచ్చును. 447

ఓరి అనునది ఒకనికి అనేకులకు పిలువనగు. 448

మై యనునది తృతీయావిభక్తికి నగును. 449

షష్ఠికి ప్రథమ విశేషణము చెల్లును. 450

ఉద్యోగపర్వము :—

క. మీపనుపున రాజ్యము పా
లీ పాండు తనూభవులకు నీకున్న భుజా
టోప భయంకరుఁ దర్జును
కోపానల మదరి ముట్టుకొనదే వారిన్. 451

భీష్మపర్వము (2-892) :—

క. అపరాహ్ణ సమయమున ని
ట్లుపమాతీతముగ ఘోరయుద్ధం బయ్యెన్
రిపుభయదభుజుఁడు భీమున
కపరిమితబలుండు కౌరవాధీశునకున్. 452

అమహత్తులైన 'సముద్ర, మేఘ' పదంబులు మహత్తులవలె నగున న్నారు. మరియునుగలవు 453

ఆదిపర్వము (1-107) :—

చ అరిది తపోవిభూతి నమరారుల బాధలు వొందకుండఁగా
నురగుల నెల్లఁ గాచిన మహోరగనాయకుఁ (దానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచి శోభిత పాదున కద్రినందనే
శ్వరునకు భూషణంబయిన వాసుకి మాకు బ్రసన్నమయ్యెడున్,) 454

అరణ్యపర్వము (4-100) :-

క మృగయార్థ మరిగి హిమవ
న్నగ భూముల యందుఁ బవన నందనుఁ డొక ప
న్నగు చేతపట్టు వడి (యి
మ్మగ ధర్మతనూజు చేత మోక్షితుఁ డయ్యెన్) 455

కర్ణపర్వము (2-74) :

క. తలకొని జలములఁ బక్షం
బులు దుండము దోక జోక బొగిపొరి నెగయన్
బలమరి మై దిగఁబడఁగా
సొలసి యెగయ లేక వాయసుఁడు దెగడొందెన్. 456

ఇటువలెనే తెలుసుకొనేది. 457

హంస - హంసము; దూత - దూతుఁడు అని గలవు చరిత చరిత్ర తరం గాలకాక్షతాది పదములు రెండు విధములు గలవు. 458

అసుర పదము స్త్రీ లింగము వంటిది. 459

'సురలు' (దీనికి) ఏకవచనము లేదు. 460

అప్ శబ్దము (నకు) ఏకవచనము లేదు. 461

"అప్పుపాలైన శుభ్రాబ్జంబు రుచియెంత" ఇత్యాదయః కవిప్రయోగాస్తు న సాధవః. 'అప్పుల పాలైన యబ్జంబు రుచియెంత' ఇత్యాది పాఠ స్సాధుః,

అని అహోబలుడుగారు కవి శిరోభూషణమున నన్నారు.

వసుచరిత్రము (1-36) :

సీ. పా. తన కూర్మి రేని నప్పుననె ముంచె.

'అప్సరసలు - అప్సర' రెండు గలవని అహోబల పండితులు కవిశిరో భూషణమున వ్రాసినారు. 462

సుభ్రువుడు రాముడు, సుభ్రుడు, సుభ్రువునకు, సుభ్రునికి. క ప్రత్యయమందు - 'సుభ్రూకుడు'. 463

కృష్ణరాయల ఆముక్తమాల్యదలోని—

సీ. పా. నిస్తులాన్య వయస్తంభ విక్షిప్త
నింబచ్ఛదభ్రు వల్ఫంబు నిక్క...

(5-67) ప్రయోగ మనాకరమన్నారు. 'సుభ్రూవు' అనవలెనని తాత్పర్యము 464

చతుర్ముఖ పరమైన బ్రహ్మ శబ్దముకు మాత్రము 'బ్రహ్మకు' అని యుండుటున్నది. 465

దైవవాచకములైన నకారాంత (పద) ములకు— కృష్ణవర్త్మకు (ఇత్యాదిగా) అనరాదన్నారు. కృష్ణవర్త్మనకు అని యుండవలెను. వసుచరిత్రమందు 'తొలు దొలుత కృష్ణవర్త్మకు కలయొసంగి' అను ప్రయోగము అనాకరమన్నారు. మనుష్యవాచకములు 'నిగమశర్ముడు - నిగమశర్మ' (ఇత్యాదిగా) అనవచ్చునన్నారు. 466

'పాండు భూవరునకుఁ గోడలైతి' అను తిక్కనగారి ప్రయోగము అనాకరమన్నారు. అయితే నన్నయభట్టుగారు, అధర్వణాచార్యులు నెవరును 'ను వర్ణకమునకు (కోడలను అనుచోట) లోపము చెప్పలేదని అనాకరమన్నారు (కాని) సోమయాజిగారిని నన్నయభట్టాధర్వణాచార్యుల వారికన్నను తక్కువ యనుకొనరాదు. లెస్స పరిశీలించ నందుననే కాని, వీరిద్దరి కన్న నుత్కృష్టులగుదురు. 467

తిక్కనగారి ఉత్తర రామాయణము (1-2) :

చ. హరిహర పద్మగర్భులను నాదికవీంద్రుల నూత్న సత్కవీ
శ్వరులను భక్తిఁ గొల్చి తగవారి కృపం గవితావిలాస వి
స్తర మహనీయుఁడైనను సర్వగుణోత్తరమూర్తి మన్మభూ
వరుఁడు దగంగ రాఁబిలిచి వారని మన్నన నాదరింపుచున్. 468

"మహనీయుడనై' అని (ఉండవలసిన) చోట 'మహనీయుడైన' అనిన్ని— 469

ఉద్యోగపర్వము (3-108) :

చ. వరమునఁ బుట్టితిన్ భరత వంశము జొచ్చితి నందుఁ బాండు భూ
వరునకుఁ గోడలైతి జనవంద్యులఁ బొందితి (నీతి విక్రమ
స్థిరులగు పుత్రులం బడసితిన్ సహజన్ముల బ్రాపు గాంచితిన్
సరసిజనాభ యిన్నిటఁ బ్రశస్తికి నెక్కిన దాన నెంతయున్.) 470

'కోడలనైతి' అని (ఉండవలసిన) చోట 'కోడలైతి' అనిన్ని సోమయాజిగారి ప్రయోగమున్నందుననే—

శ్రీనాథుని నైషధము (2-28) :

గీ. అధికతాప పరీతాత్ముఁడైన నాకు
నెట్లు వచ్చితి చలిగాడ్పునట్లు నీవు
(పూర్వజన్మ మహాతపః స్ఫురణఁ జేసి
నీదు సన్నిధి సమకూరె నిధియుఁబోలె) 471

శ్రీనాథుని కాశీఖండము (1-140) :

సీ. గీ. రండు నను గూడి యో పరివ్రాట్టులార
వత్సలత గల్గి, మీరేల వత్తురయ్య
పరమ నిర్భాగ్యుఁడైన నా పజ్జఁ దగిలి
కటకటా సౌఖ్యజలరాశి కాశిఁ బాసి. 472

అని శ్రీనాథ మహాకవి చక్రవర్తి ప్రయోగములున్ను గలవు. సోమయాజిగారి ప్రయోగమైనా, శ్రీనాథుఁడుగారి ప్రయోగమైనను ఒకటొకటే చాలును. సోమయాజిగారి ప్రయోగము ననాకరమనుట అహోబల పండితులవారి ఛాందసత్వమే. 473

అస్మదర్థమందు 'ను' వర్ణక లోపమైనటులె యుష్మదర్థమందు 'వు' వర్ణక లోపమగును. 474

తిక్కనగారి ఉత్తర రామాయణము (5-38)

క. ఏ నొకటి నీకుఁ జెప్పెద
దానవకులముఖ్య దేవతలకు నవధ్యుం
డైన నినుఁబోటి వాఁడీ
మానవుల జయింప విక్రమమునుం గలఁడే. 475

'అవధ్యుండవైన' అనుటకు 'అవధ్యుండైన' అని 'వు' లోపము. 476

వసుచరిత్రము (3-16) :

చ. అరుదుగ నీ విమానము ప్రజాధిపుడుం బురుషోత్తముండు శం
కరుఁడును దక్క నన్యులకుఁ గా దవరోహ మొనర్ప వారి సు
స్థిర కరుణా విశేషమున జిష్ణుఁడనై కయిగొంటి దీనినే
నరవర సర్వసద్గుణ గణంబుల ప్రోవగు నీ కొసంగితిన్. 477

'ప్రోవవగు' అనుటకు 'ప్రోవగు' అని 'వు' లోపము. ఇటువలెనే మహా
కవి ప్రయోగములు మరియును గలవు. 478

ఆదిపర్వము (2-29) :

మ. వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలావనైలావలీ
లవలీ లుంగ లవంగ సంగత లతా లాస్యంబు లీక్షించుచున్
ధవలాక్షుల్ సని గాంచి రంత నెదురం దత్తీరదేశంబునం
దవదాతాంబుజ ఫేనపుంజనిభు నయ్యశ్వోత్తముం దవ్వులన్. 479

'అశ్వోత్తమము' అనుటకు 'అశ్వోత్తము' అని మహద్వాచకముగా
(నన్నయ్యగారు) ప్రయోగించినారు. 480

'ఇంద్రజి, ఇంద్రజితుడు'— 'జిత్పదంబున కింద్రజి త్తింద్రజిత్తుండు...'
అని లాక్షణికులు చెప్పినారు కాని, ఇంద్రజి, ఇంద్రజితుడు' అనియు గలవు. 481

తిక్కనగారి ఉత్తరరామాయణము (1-81)

క. ఇంద్రజితుఁ జంపి రణమున
నింద్రాది త్రిదశనుతుల కెక్కిన యనుజున్
సాంద్రామోదంబున రఘు
చంద్రుఁడు మోమెలమి వొంద సంభావించెన్. 482

అందే (2-18)

చ. ఇవి యెఱుఁగఁగ నెంత పను లింద్రజి చావు దలంప వాని నా
హవమున కూలిచైనఁ జెనయం భయ మాతఁడు (పిల్కు మారినన్
భువనము లెల్ల నిర్భయతఁ బొంది మహాద్భుత మంది లక్ష్మణ
స్తవన కథా విధాచరణతా పరతంత్రములయ్యె రాఘవా!) 483

అందే (4-18) :—

గీ. పిదప నింద్రజి యనుపేరు పెంపు వడయు
న ద్దశానన నందనుం డభిమతముగ.
(దానిఁ బదపడి చెప్పెద మానవేంద్ర
వినుము తరువాతికథలు సవిస్తరముగ) 484

ఇటువలెనే పరిక్షిత్తు-పరిక్షితుడు; హనుమంతుడు-హనుమానుడు (ఇత్యా దిగా) మహాకవి ప్రయోగములు గలవు. 485

మరుత్-మరుత్త అని రెండును గలవు. 'మరుత్' సులభము 486

'మరుత్త'—

శ్రీనాథుని కాశీఖండము (1-7) :-

సీ. పా. చిన్నారి పొన్నారి చిఱుత కూకటి నాడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర. 487

అందే :—

సీ. వహ్ని సమాఖ్యుఁ దర్వసుఁ డాత్మజుని గాంచె
గోభానుఁడ న్వహ్ని కొడుకు కతనికి
నీశానుఁ దనఁ బుట్టె నీశానునకుఁ గరం
దముఁ డుద్భవించె న ద్ధరణి పతికి
ధర్మచిత్తుఁడు మరుత్తుఁడు నాఁగ జనియించె
సంవర్తయజ్వుఁడై చను మరుత్తుఁ
డధిప యాతఁడు గాక యన్యుఁడు సుమ్మీ మ
రుత్తుఁ డపుత్త్రుఁడై రూఢ తేజ...... 488

ఇటువలెనే కేకయ-కైకయ; కోసల-కౌసల; అధర్వ-అథర్వణ; ధరణ-ధారణ,—ఇత్యాది రూపభేదములు మహాకవి ప్రయోగముల బహుళములు గలవు గ్రంథ విస్తరమని (అన్నిటికిని లక్ష్యములు చూపుట) మానినాము. 489

## —: కొన్ని పదవాక్యార్థ దోషముల విచారణ :—

ప్రతాప రుద్రీయ మందు వాక్యదోషములు ఇరువది నాలుగు చెప్పినారు. వాటిలో భగ్నచ్ఛందము యతిభ్రష్ట మనునవి యున్నవి.

'ఛందోభంగం వచో యత్ర, తద్భగ్న చ్ఛంద ఉచ్యతే
యత్ర స్థానే యతిభ్రంశః, స్తద్యతిభ్రష్ట ముచ్యతే'

అని లక్షణము (దోష. 35) చెప్పి :-

వింధ్యారణ్యే కృత కుటుంబ రక్షణస్య
కిం భద్రం భవతి జనస్య మాదృశస్య'

అని లక్ష్యము చెప్పినారు. కోలచల మల్లినాధ సూరి పుత్రుండగు కుమార స్వామి సోమయాజి రచించిన రత్నాపణవ్యాఖ్య (ఈ సందర్భమున నిట్లున్నది):-

"ఛందోభగ్నమితి. భగ్నం ఛందో వృత్తం యత్ర తచ్ఛందో భగ్నమ్. యతి ర్విచ్ఛేద ఇతి ఛాందసాః. భ్రష్టా యతి ర్యత్ర తద్యతి భ్రష్టమ్. ఉభయత్ర వాహితాగ్న్యా దిష్వితి పరనిపాతః. వింధ్యా రణ్యేతి. తృతీయ వర్ణే యతిభంగః. ప్రహర్షిణీ వృత్తే తృతీయ దశమ వర్ణయోః విభేదో విహితః. తదుక్తం వృత్తరత్నాకరే—'మ్నౌజ్రౌ గస్త్రిదశ యతిః ప్రహర్షిణీయం' ఇతి. తత్ర తృతీయ వర్ణే పరభావా ద్యతి భ్రష్టమ్. పాదాంత వర్ణస్య గురుత్వాభావా చ్ఛందో భగ్నశ్చ. నను క్వచి దవసానేపి 'లఘ్వంత్య' మితి వచనేన గురుత్వ విధానా దత్రాపి గురుత్వాంగీకారే న చ్ఛందో భగ్న ఇతి చేత్, సత్యం. య త్రేంద్రవజ్రో పేంద్రవజ్రాదౌ పాదాంత వర్ణస్య లాక్షణిక గురుత్వేపి శ్రావ్యత్వ భంగాభావ స్తత్ర మాభూ చ్ఛందోభంగః. ప్రహర్షిణీ, వైతాలీయ, వసంత తిలకాదౌ తు వైపరీత్యా దస్త్యేవ దోష ఇతి ప్రాచీనాః"

పాదాంత లఘువు వికల్పముగా గురువగు ననగా కావలసినపుడు గురువగునని యర్థముగాని, కొన్ని వృత్తముల కగునని, కొన్ని వృత్తములకు కాదని అర్థముకాదు. లాక్షణిక మతమును ప్రతికూలించి ఆలంకారికులు ఛందోభంగ మని చెప్పరాదు. వ్యాఖ్యాకారులును పరిశీలించనిది ప్రహర్షిణీ వసంత తిలకాదు

లందు (పాదాంతమందు లఘువుండుట) దోషమని చెప్పినారు. ప్రహర్షిణీ వృత్తమునకు లక్షణము వ్రాసిన ఆ వృత్తరత్నాకరమందే :—

'సానుస్వారో విసర్గాంతో, దీర్ఘో యుక్త పరశ్చ యః
వా పాదాంత 'స్త్వసౌ గ్వక్రో, జ్ఞేయోన్యో మాత్రికోల్పజుః'

(అని చెప్పబడినది. దీనికి) గోమేధభట్ట పండిత పుత్ర శ్రీనాథ విరచిత వ్యాఖ్యానము (ఇట్లున్నది.)

'సానుస్వారఇతి. అనుస్వారేణ బిందునా సమవర్తత ఇతి సానుస్వారః. విసర్గో బిందు ద్వయరూపో సోంతో యస్య సః విసర్గాంతః. దీర్ఘో ద్విమాత్రకః. యుక్తపరః సంయుక్తపరః ఇత్యర్థః. పరః అనంతరయుక్తః పరో యస్మాదసౌ యుక్తపరః. వా శబ్దో వికల్పార్థః. పాదాంతే వర్తమానః. తు శబ్దో పూర్వోక్తే భ్యోస్య విశేష సూచనే. అసౌ వర్ణ ఇతి శేషః. గీ గురు సంజ్ఞికః. ప్రస్తరే కుటిల రేఖాకారః. నాగలిప్యాః ఉకార సదృశః భవతీతి శేషః. యథోక్తగుర్వన్యో మాత్రికో హల్ లఘు సంజ్ఞికః. ప్రస్తరే ఋజుః. ఊర్ధ్వ సంజ్ఞస్థ రేఖైకదేశ మాన ఇతి యావత్ అయమన్వయః. యో మాత్రికః అనుస్వారేణయుక్తః భవతి అసౌ గ్ జ్ఞేయః. యో మాత్రకః విసర్గేణ సహితః భవతి అసౌ గ్ జ్ఞేయః. యో మాత్రకః దీర్ఘో భవతి అసౌ గ్ జ్ఞేయః. యో మాత్రికః సంయుక్త పరో భవతి, అసౌ గ్ జ్ఞేయః. యో మాత్రికః పాదాంతో భవతి అసౌతు వా వికల్పేన గ్ జ్ఞేయః. అసౌ వక్రో భవతి. అన్యోత్ ఋజుః జ్ఞేయః."

ఇందువలన పాదాంత లఘువు వికల్పముచే గురువగునని స్పష్టమగుచున్నది. ఏ శాస్త్రమున కెవరు కర్తలో వారి సిద్ధాంతము ముఖ్యము (ఆ శాస్త్ర విషయమున) ఆలంకారిక సిద్ధాంతము ముఖ్యముకాదు. అయినా వారు (ఆలంకారికులు)ను పాదాంత లఘువును గురువుగా ప్రయోగించిరి. ప్రతాప రుద్రీయమందు (నాయక-14)

'మురారే ర్యః పూర్వం జలనిధి సుతాయా ముదభవత్
మహాదేవా జ్ఞాత స్స్వపున ర వనీభృ ద్దుహితరి '

అనుచోట పాదాంతమున 'రి' లఘువు గురువు.

రేరే ఘూర్జర జర్ఝరోసి సమరే లంపాక కిం కంపసే
వంగ త్వంగసి కిం ముధాబలరజః కాణోసి కిం కొంకణ'—(నాయక 31)

అనుచోట పాదాంతమున 'ణ' లఘువు గురువు విద్యానాథుని గారి ప్రయోగములే ఎన్నో గలవు. 'ఇంద్రవజ్రోపేంద్రవజ్రాది' అని వ్యాఖ్యయందు వ్రాసిరి గాన, శిఖరిణీ, శార్దూలములు 'ఆది'లోనివని తలంతురు. 490

శ్రీ వీరభద్ర నృపతేః ప్రియ వల్లభస్య
రాజ్యాభిషేక సలిలై స్సరసీ కృతాయాః
సద్య స్సముచ్ఛ్వసిత సాంద్ర పరాగరేఖా
క్షోణ్యాః ప్రమోద పులకాంకుర మంజరీవ. 491

రెండు పాదాంత లఘువులు గురువులుగా నుండెను. 492

'శ్రీ కాకతీంద్ర నగరీ మనిశం స్తువంతి'

మరియును వసంత తిలకములే గలవు. వ్యాఖ్యాకారు లచ్చట నేమను కొనిరో తెలియదు. వృత్త రత్నాకరమందు:-

'ఉక్తా వసంత తిలకా తభజా జగౌగః'

అని లక్షణము, లక్ష్యము చెప్పి, ఈ వసంత తిలకమునకే మరియును నామధేయములు గలవని చెప్పిన శ్లోక మిది:-

సింహోద్ధతేయ ముదితో ముని కాశ్యపేన
ఉద్ధర్షిణీయ ముదితా మునిసైతవేన
సోమేన సేయ ముదితా మధుమాధవీతి
శోభావతీయ ముదితా భుజగాధిపేన.

ఇందు నాలుగు పాదాంత లఘువులు గురువులుగా నుండెను. కోలచల కుమారస్వామిగారు వృత్త రత్నాకరము నేమి పరిశీలించిరో తెలియదు. మరియును కొన్ని వసంత తిలకలు ఉదాహరించుతాము. 493

జగన్నాథ పండితరాయ శతకము:—

నీలం వపు ర్వహతు చుంచుతు సత్ఫలాని
హర్మ్యేషు సంచరతు చూతవనాంతరే వా
పుంస్కోకిలస్య చరితాని కరోతునామ
కాకః కలస్వన విధౌ స తు కాక ఏవ. 494

—మూడు పాదాంత లఘువులు.

దానార్థినో మధుకరా యది కర్ణతాలైః
దూరీకృతాః కరివరేణ మదాంధబుద్ధ్యా
తస్యైవ గండయుగ మండన హానిరేవ
భృంగాః పరం వికచ పద్మవనే చరంతి. 495

—రెండు పాదాంత లఘువులు

ఏతావాంత్సరసిజ కుట్మల స్వయత్నైః
భిత్వాంభస్సరసి వినిర్గమో యదంతః
ఆమోదా వికసన మందిరానివాస
స్తత్సర్వం దినకర కృత్య మామనంతి. 496

—ఇవి ప్రహర్షిణీ వృత్తము. ఇందొక పాదాంత లఘువు. 497

ప్రబోధ చంద్రోదయము:—

ఉత్తుంగ పీవర కుచద్వయ పీడితాంగ
మాలింగితః పులకితేన భుజేన రత్యా
శ్రీమాన్ జగంతి మదయన్నయనాభిరామః
కామోయ మేతి మదఘూర్ణితనేత్ర పద్మః 498

—ఇది వసంత తిలక. ఇందు రెండు పాదాంత లఘువులు. 499

కిరాతార్జునీయము (7-7)

రామాణా మవజిత మాల్య సౌకుమార్యే
సంప్రాప్తే వపుషి సహత్వ మాతపస్య
గంధర్వై రధిగత విస్మయైః ప్రతీయే
కల్యాణీ విధిషు విచిత్రతా విధాతుః 500

ఇది ప్రహర్షిణి. ఇందొక పాదాంతలఘువు. 501

శిశుపాలవధ:—

ఏకత్ర స్ఫటిక తటాంశు భిన్ననీరా
నీలాశ్మ ద్యుతిభిదురాంభసో పరత్ర

కాలిందీ జల జనిత శ్రియశ్శ్రయంతే
వైదగ్ధీమిహ సరితస్సురాపగాయాః 502

ఇదియు ప్రహర్షిణి. ఇందొక పాదాంతలఘువు. 503

ఇటువలెనే వసంత తిలకా, ప్రహర్షిణీ వృత్తము లందును పాదాంతలఘువులు గురువులుగా ఐహాంలములు గలవు. వ్యాఖ్యాకారులీ ప్రయోగము లన్నిటికి నేమి సమాధానము చేసికొనిరో తెలియదు. సమస్త వృత్తము లందును పాదాంత లఘువులు కావలసిననప్పుడు గురువు లగుట నిస్సందేహము. దోషముకాని దానిని దోషమనుట యొక దోషము. తాము దోషమనిన్ని, పాదాంత లఘువులు గురువులుగా ప్రయోగించుట రెండవ దోషము. ఆలంకారికుల తాత్పర్యము తెలియదు. వ్యాఖ్యాకారుల సిద్ధాంతము పరిశీలించక చేసినదని వేరే చెప్పనేల! 504

విద్యానాథుడుగారు యతిభ్రష్టమునకు—

'వింధ్యారణ్య కృతకుటుంబ రక్షణస్య'

అని లక్ష్యము చెప్పిరి. క్రమభ్రష్ట మనెడు దోషము తాము చెప్పినదే, ఇచ్చట సంభవించెను. 505

పాదాంత లఘువు కావలసినపుడు గురువెటులగునో రేఫసంయోగమున కివతల నుండెడు వర్ణము (లఘువు) కావలసినపుడు లఘువగును. 506

వృత్తరత్నాకరము :-

పాదాదా విహ వర్ణస్య సంయోగః క్రమ సంజ్ఞికః.
వ్యవస్థితేన తేన స్యా ల్లఘుతాపి క్వచి ద్గురోః.

వ్యాఖ్య :—

పాదాదా వితి. ఇహ అస్మిన్ వర్ణసంయోగః క్రమసంజ్ఞికః. పాదాదౌ— పాదస్యాదౌ పురఃస్థితస్యేతి శేషః. వర్ణస్య సంయోగః క్రమసంజ్ఞికః. క్రమ ఇతి సంజ్ఞా యస్య స తథోక్తః. శేషాద్విభాషా ఇతి. కః పురఃస్థితేన అగ్రగతేన క్రమ సంజ్ఞేన పూర్వ స్యైవ వర్ణస్య గురోః క్వచిల్లఘుత్వమపి స్యాత్. ఛందశ్శేఖర ఇదముక్తం :-

సర్వాస్వపి చ భాషాసు, రహ యుక్తేక్షరే పరే
పూర్వ వర్ణస్య లఘుతా, వేష్టా తు క్వాదికే పరే.

అస్యార్థః. సంస్కృతాపభ్రంశ మాగధ శౌరసేన లక్షణాసు భాషాసు రేఫేణ హకారేణ వా యుక్తేక్షరే పరే పూర్వస్య పాదాంతస్య వర్ణస్య లఘుతా వా వికల్పేన ఇష్టా. రేఫ సంయుక్తే సతి—'కథం భ్రమర గ్రామే వసతి-హసతి ప్రాజ్ఞా' ఇత్యుదాహరణమ్. హకార సంయుక్తే సతి-'భవతి ప్రాస విష ప్రాస్వస్త్యజతి హ్రియ' మితి.

'తరుణం సర్షప శాకం
నవోదనం పిచ్ఛిలాని చ దధీని
అల్ప వ్యయేన సుందరి
గ్రామ్యజనో మృష్ట మశ్నాతి'

తరుణమితి. ఆర్యావృత్త మేతత్. మృష్టం నామ మధురం. అత్ర ద్వితీయ చతుర్థ పాదాంతయోః వర్ణయోర్గురుత్వమ్. తృతీయ పాదాంతస్య సుందరీతి పదాంతస్య ఇకారస్య ఉపరిస్థిత గకార రేఫ సంయోగాత్ లఘుత్వం దర్శిత మితి జ్ఞేయమ్.'

అనియున్నది. పూర్వార్థమందు చివరనున్న 'ని' వర్ణము; ఉత్తరార్థమందు చివరనున్న 'తి' వర్ణము (పాదాంత మందలి లఘువులగుటచే వికల్పముగా గురువులు) తృతీయ పాదాంతమందున్న 'రి' (రేఫ) సంయుక్తమున కివతలనుండుట వలన గురువైనను లఘువు. ఇది లాక్షణిక సిద్ధాంతము. వాస్తవ మిటువలె నుండగా 'సాహిత్య రత్నాకరము'న శబ్దాలంకార తరంగ మందు ధర్మాభట్టు గారు—

ఏకాచ్కం సర్వతో లఘు, నిరోష్ఠ్యం చ. యథా—

'అను హరణ చరణ రణ చణ
దళగల గలగహనదహన సరలశర
అతరల నతరత నయజయ
జయదశరథతనయ జలజదళ నయన'

అని వ్రాసినారు. ద్వితీయ చతుర్థ పాదాంత లఘువులైన ర, న—ఈ రెండక్షరములు ఆర్యావృత్తమునకు గురువులు కావలెను. గురువులు కాకపోతే ఛందోభంగము. గురువులైతే సర్వలఘు నిర్ణయము పోవును. ఇంతేకాదు; ఆలంకారికులు పాదాంత లఘువును గురువుగా నంగీకరించలేదు. (కుమారస్వామి సోమ

యాజి ఈ విషయమున వ్రాసినది ముందే వ్రాసినాము.) ఛందోభంగమని దోషమన్నారు. ధర్మాభట్టుగారి తాత్పర్యము గోచరించదు. (పై పద్యమును) అచలధృతియను వృత్తమని చెప్పితే మంచిదగును. 507

'ద్విగుణిత వసులఘు రచల ధృతి రిహ తు'

అని అచలధృతి లక్షణమున్నది. పదారు లఘువులు పాదమునకు 'సర్వతో లఘు'వని చెప్పవచ్చును. అటువంటి జగదేక పండిత సార్వభౌములకు నిటువంటి పొరపాటులు. ఏమనుకోము! 508

యత్సౌందర్యమవేక్ష్య జీర్ణమునయో వాతాంబు పర్ణాశనాః
ధైర్యం నార్య ఇవాపసార్య సహసా సంత్యజ్య లజ్జామపి
సంభోగం కిల వవ్రు రిత్యభిదధే పౌరాణికై స్తత్క్వవా
రామస్య క్వ ను కామరూపవిభవ శ్రీమాత్ర వేత్రప్రదః 509

ద్వితీయ పాదాంతము లఘువు. గురువు కావలెను. కాకపోతే ఛందోభంగము. అయితే ఆలంకారికులు నిర్ణయించిన ఛందోభంగము. 510

'రామాస్త్రేణ హతం ద్విషత్కరిశిరో భోగీంద్ర భోగా ఇవ' ఇచ్చటఛందోభంగమని వ్రాసినారు. (పై పద్యమున ద్వితీయ పాదాంతమున) 'అసి' అనుచోట ఛందోభంగమెందుకు కారాదో తెలియదు. రెండును శార్దూల వృత్తములే. ఒక చోట ఛందోభంగమేమి? ఒకచోట కాకపోవటమేమి? ఇవి ఏమనుకోము! 511

'నిర్ముక్తం రుధిరాప్లవేన ఘనమాణిక్యత్విషే వారుణమ్'.

'మాణిక్యేత్యత్ర యతి భంగః' అన్నారు. పదమధ్య పదావసానములని వారి తాత్పర్యము. 'మాణిక్య' పదము మూడక్షరములు. అందులో రెండవ యక్షరము యతి. అట్లు నుండరాదు. పదాది వర్ణమే యుండవలెనని ఆలంకారికుల తాత్పర్యము. అయితే వారును (ఇట్లుండుట) దోషమనుచేకాని (ప్రయోగించుట) మానలేదు. 512

'జిత్వా రామావధాని ప్రవరముఖ మరుద్వేగవద్వేదచర్చా
గోష్ఠ్యాం నారాయణార్యస్సదసి బుధశతై శ్లాఘ్యమానావధానః
సంతుష్టా ద్ధర్మభూపాదలభత శిబికాం చామరచ్ఛత్ర పూర్వం
గర్వాఖర్వావధానీశ్వర శరభమటా గండ భేరుండ చిహ్నమ్' 513

చతుర్థచరణమందు 'ఈశ్వర' పదమధ్యమందుతన 'శ్వ' వర్ణము యతి ఇచ్చట ద్వితీయ వర్ణమే యతి. మరి యతిభంగ మెందుకు కాకపోయెనో తెలియదు. 514

గీర్వాణ కవిత్వమందు, యతియనగా నిలుపుదేకాని, పదమధ్య, పదావసానము కాకూడదని కాదు. ఆలంకారికులు చెప్పిన యతిభంగ ఛందోభంగములు ప్రతికావ్యమందును గలవు. ఇవి దోషములైతే మహాకవు లేల రచింతురు! ఇంకను కొన్ని ఉదాహరణములు వ్రాసుతున్నాము. 515

ప్రబోధ చంద్రోదయము :-

ఏనత్రిస్సప్తకృత్వో నృపబహుళ వసామాంసమస్తిష్కపంక
ప్రాగ్భారేకారి భూరిచ్యుతరుధిరసరి ద్వారిపూరాభిషేకః
యస్య స్త్రీబాలవృద్ధావధి నిధనవిధౌ నిర్దయో విశ్రుతోసౌ
రాజన్యోచ్చాంసకూట త్రుటన పటురటద్ఘోరధారః కుఠారః 516

(తృతీయ చరణమందు) 'అవధి' యందలి ద్వితీయ వర్ణము యతి. 517

స్ఫురద్రామోద్భేదస్తరలతర తారాకుల దృశో
భయోత్కంపోత్తుంగ స్తనయుగభరా సంగసుభగః
అధీరాక్ష్యాశ్శింజన్మణివలయ దోర్వల్లిరచితః
పరీరంభామోదం జనయతి చ సమ్మోహయతి చ. 518

ప్రథమ చరణమందు తారాలోని 'రా' యతి. చతుర్థ చరణమందు (పాదాంతలఘువు గాన) ఛందోభంగము. రెండు దోషములు చెప్పవలెను. 519

ఇందు 'వల్లి' ఇకారాంతము. 'పరీరంభ' పదములో 'రీ' దీర్ఘము. 520

దండి విరచిత 'ఆనామయము' :-

స్తోత్రం సమ్యక్స్వరమవిదుషా దండినా వాచ్యవృత్తా
న్మందాక్రాంతా త్రిభువనగురోః పార్వతీవల్లభస్య
కృత్వా స్తోత్రం యది సుభగ మాప్నోతి నిత్యం హి వృణ్యం
తేన వ్యాధిం హరహర నృణాం స్తోత్రపాఠేన సత్యమ్. 521

తృతీయ చరణమందు 'ప్నో' యతి. ద్వితీయ చరణమందు పాదాంతలఘువు గురువు. ఇది మందాక్రాంతావృత్తము.

దీనిలక్షణము—

'మందాక్రాంతాజలధిషడగైర్మ్భోనతౌ గురూచ'
లక్షణము చెప్పు నీ లక్ష్యమునందే (పాదాంత) లఘువు గురువు 522

హలాయుధము:—

త్వత్పూజాయాం కుసుమ హరణే ధావతః పాదయుగ్మం
యత్పాషాణ వ్రజపరికరో ద్గీర్ణరేఖాంక మాసీత్
తస్యాప్యేవం తదనుచరతో రుద్రలోకం గతస్య
బ్రహ్మాదీనాం మకుట కిరణ శ్రేణియ శ్శోణయంతి. 523

(ద్వితీయ చరణమందు యతిభ్రష్టము ('ఉద్గీర్ణ' లో ద్గీ యతి) చతుర్థ చరణమందు (పాదాంత లఘువుగాన) ఛందో భంగము. 524

మేఘసందేశము (ఉత్తర. 6)

నేత్రా నీతా స్సతత గతినా యద్విమానాగ్రభూమీ
రాలేఖ్యానాం స్వజల కణికా దోష ముత్పాద్య సద్యః
శంకా స్పృష్టా ఇవ జలముచ స్త్వాదృశా జాలమార్గై
ర్ధూమోద్గారానుకృతినిపుణా ఝర్ఝరా నిష్పతంతి. 525

చతుర్థ చరణమందు యతి, ఛందోభంగములు రెండును. ఇటువలెనే మేఘ సందేశమందు మరియును గలవు. 526

నైషధము (2-102):

అభ్రాంత శ్రుతి పాఠపూతరసనావిర్భూత భూరి స్తవా
జిహ్మ బ్రహ్మముఖౌఘవిఘ్నిత నవ స్వర్గక్రియా కేలినా
పూర్వం గాధిసుతేన సామిఘటితా ముక్తానుమందాకినీ
యత్ప్రాసాద దుకూల వల్లిరనిలాందోలై రఖేల ద్దివి. 527

ప్రథమ, చతుర్థ చరణములందు యతి భంగములు. చతుర్థ చరణమందు ఛందోభంగమున్ను. 528

భర్తృహరి సుభాషితము:—

లభేచ్ఛ సికతాసు తైలమపి యత్నతః పీడయన్
పిబేచ్ఛ మృగతృష్ణికాసు సలిలం పిపాసార్దితః

కదాపి పర్యటన్ శశ విషాణ మాసాదయే
న్నతు ప్రతినివిష్ట మూర్ఖజన చిత్త మారాధయేత్. 529

ఇది పృథ్వీవృత్తము. "జసౌజసయలా వసుగ్రహ యతిశ్చ పృథ్వీ గురుః" అను లక్షణము వలన ప్రథమ చరణమందు 'ల', ద్వితీయ చరణమందు 'సు', చతుర్థ చరణమందు 'ర్ఖ' పదాంత (వర్ణ)ములుగాన యతి భంగములు. 530

వృత్తరత్నాకరము:—

వంశే భూ త్కాశ్యపస్య ప్రకట గుణగణ శ్శైవ సిద్ధాంత వేత్తా
పీర్యః పచ్చేక నామా విమలతరమతి ర్వేదశాస్త్రార్థ బోధీ
కేదార స్తస్య పుత్ర శ్శివచరణ యుగారాధ నైకాగ్ర చిత్త
ఛద స్తే నాభిరామం ప్రవిరచిత మిదం వృత్త రత్నాకరాఖ్యమ్. 531

తృతీయ చరణమందు 'రా' ద్వితీయ వర్ణము యతి. లాక్షణికుడే ఇట్లు రచించగా ఆలంకారికులు యతిభంగ, చ్ఛందోభంగములు దోషములనరాదు ఇన్ని ప్రయోగములు వాలుర తెలివిడి కొఱకు వ్రాసినాము. పదమధ్య పదావసాద వర్ణములు యతులు గలవు. పాదాంతగురువు లఘువు కలదు పాదమధ్య గురువును లఘువు కలదు. 532

తిమ్మకవి 'లక్షణసార సంగ్రహము (2-23)

గీ. సంస్కృత పదంబు లొగి సమాసములు గూర్చ
నపుడు క్రారను గూడిన యక్కరంబు
లూదియుండు నొకొక్కచో నూదకుండు
తెనుఁగు కృతులందు సామజాజిన నిచోల. 533

లక్ష్యములు:—

శాంతిపర్వము (4-81)

ఉ. కావున కామ క్రోధములు గ్రాచుచు నాశ్రిత కోటి (గాచుచున్
భూవలయ ప్రజన్ సమతఁ బ్రోచుచు రాజ్యముసేత మేలు భి
క్షావిధి లోనుగా గలుగు సారపు ధర్మములం ఘటించు మే
ల్గావిరి నప్రయత్నమున వానికి వచ్చు నృపాల యమ్మెయిన్) 534

అచ్చు పుస్తకములందు లక్షణ భంగమనుకొని 'కామరోషముల' అని దిద్ది నారు. 585

ఉద్యోగపర్వము (2-24) :

చ. అనవుడు నిట్లను న్విదురుఁ డక్కట ధర్మసుతుండు బాంధవుం
డును చెలికాడునుం దగు భటుండును బ్రెగ్గడయుం గురుండుగా
డె నరవరేణ్య ధర్మప్రకటీకృత చిత్తుఁడు శాంతమూర్తి స
ద్వినయ వివేక శీలముల విశ్రుతుఁ డాతఁడు కీడు వల్కునే 586

శల్యపర్వము (1-221) :

చ. కృపకృతవర్మలం గడిమి గిట్టి శిఖండి ప్రభద్రకుల్ మహో
గ్రపు వడిఁ దోర్ప్రదంగ భుజగర్వము చూపిన నా బలాఢ్యులన్
గుపిత మనస్కులయ్యెఁ బలుగోల్తలఁ జేర్చిన లావు చేవఁ గ
య్యపు నెరవేల్పు దాల్మి సరివచ్చెడు పాటున ముంచెఁ జూపఱన్. 587

ఈ పద్యము లచ్చు పుస్తకములందు దిద్దలేదు. ఇక్కడ నేమనుకొనిరో తెలియదు 588

కాశీఖండము (4-81) :

సీ. పా. సంధ్యాభివందన శ్రద్ధయుజ్జన సేయు
గీతవాద్య వినోద క్రియలఁ దగుచు... 589

అచ్చు పుస్తకము లందు 'వినోదకేలి' యని దిద్దినారు. 540

సభాపర్వము (1-78) :

ఉ. వానికి నెయ్యుఁడై యమర వంద్య పదాంబుజుఁ డంబికా బృహ
త్పీన పయోధరాగ్ర పరిపీడిత వక్షుఁడు భూషణీకృతా
హీనుఁ డశేషలోకగురుఁ డీశ్వరుఁ డెప్పుడు నంద యుండు నా
నా నిశితాయుధాయుత సనాథ మహాద్భుత భూతకోటికిన్. 541

రాఘవ పాండవీయము (1-85) :

క. వేంకట వరదుఁడు వెలయు ని
రంకుశ వితరణ నిరూఢ ప్రజ్ఞను రణ ని
శ్శంకిత ప్రాభవమున నక
లంకిత కీర్తి ప్రతాప లక్ష్మల మహిమన్. 542

ద్వితీయ తృతీయ చరణములందు వరుసగా థ, త అను ...కువుల లఘువులు. 543

'సంయుక్తే సంస్కృతాద్యే స్యాః, త్సర్వమాంధ్రపదం లఘు
భవే దాద్య సమాసేపి, రేఫయోగాత్పరం తథా
పదేపి చ తథాత్వం స్యాత్ క్వచిన్నైవ న రేఫయోః
సర్వాస్వపి చ భాషాసు, రహయుక్తేక్షరే పరే
పూర్వవర్ణస్య లఘుతా, వేష్టా మల్హాది కేపి చ'

అని ఆథర్వణ సూత్రమున్నది గాన గీర్వాణ మందును ఈలా... ...లదు.
ఉదాహరణము శిశుపాలవధ యందలి

'ప్రాప్తనాభిహ్రద మజ్జన...'

మనునది వ్రాసినారు. మరియును గలవు. నన్నయభట్ట కారిక:—

'ఈ దంతా ఇద్వదేవ కృత హ్రస్వాః' (ఆ. శ. చి. అజం. 41)

'రేఫ సంయోగే పరే పూర్వ వర్ణస్య లఘుత్వే. 'శత తాళదఘ్న ప్రావ మునం బడియెన్' ఇత్యాదయః కవి ప్రయోగాః ఉదాహరణమ్' (క. శి. భూ. పు. 173)

అని అహోబల పండితులు వ్రాసినారు. 544

ప్రతాపరుద్రీయము నందు చెప్పబడిన పద దోషములలో క్లిష్టమన్న దొకటి. దానికి లక్ష్య మిట్లున్నది:—

'నభస్వదశ నారాతి ధ్వజాగ్రజ విరోధిమ (దోష. 16)

"నభస్వదశనా స్సర్పాః తేషా మరాతిర్గరుత్మాన్.స ఏవ ధ్వజో యస్యేతి విష్ణు, స్తస్యాగ్రజ ఇంద్ర, స్తస్య విరోధిమ పర... ...ప్రతీతే రతి దూరత్వాత్ క్లిష్టమ్'

అని వ్రాసినారు. అతి దూరార్థమైనందున 'క్లిష్ట' మను ... చెప్పి నారు, సరే. 545

కామారిః అంటే శివుడుగాని, శివారిః అంటే కాముడుగాడు. నాగారిః = సింహము, కాని సింహారిః = ఏనుగుకాదు. అనగా నోడినవారికి అరి, విరోధి ప్రభృతిశబ్దములు చెల్లవు, జయించినవారికి చెల్లును. ఇంద్రునికి పర్వతము లోడినవి గాని పర్వతముల కింద్రు డోడలేదు. సురాసురులకు సమానముగాన వారికొకరి కొకరికి పరస్పరము చెల్లును. అమరమునందు—'బర్హిర్ముఖాః క్రతుభుజో గీర్వాణా దానవారయః' అని (దానవారయః) = రాక్షసులకు శత్రువులని చెప్పినారు. మరియు "శుక్రశిష్యాదితిసుతాః పూర్వదేవా స్సురద్విషః" అని (సురద్విషః =) దేవతలకు శత్రువులని చెప్పినారు. కావున "నభస్వదశనారాతి ధ్వజాగ్రజః విరోధీ యేషాం తే" అని బహువ్రీహి చెప్పితే యుక్తముగానుండును. మూల వ్యాఖ్యానములందు షష్ఠితత్పురుషమే వ్రాసినారు. 546

ప్రతాపరుద్రీయమందు చెప్పబడిన అర్థదోషములలో 'అతిమాత్ర' మన్న ది'కటి.

'యత్సర్వలోకాతీతం త, దతిమాత్రం ప్రకీర్త్యతే' అని లక్షణము చెప్పి :-

మా భూ దేకార్ణవం విశ్వ, మితి సంకోచితాశ్రుభిః
అరణ్యే హూణ నారీభిః, అసంఖ్యా నిమ్నగాః కృతాః (దోష. 54)

అని లక్ష్యము చెప్పినారు. ఇది దోషమైతే 547

పారిజాతాపహరణము (1-10)

ఉ. రాజుల సేతయుం బరశు రాముఁడు నంతలు సేసె రెండుమూఁ
డీ జగతిం గణింప నది యెంతటి విస్మయ మంచు, నీ సుహృ
త్తే జుఁడు కందుకూరికద తిమ్మయ యీశ్వరుచేఁ జనించె ఘో
రాజి బెడందకోట యవనాశ్విక రక్తనదీసహస్రముల్. 548

వసు చరిత్రము (1-74)

మ. జలధిన్ దానపయోనదీఝురులచే చంద్రున్ యశోలక్ష్మిచే
జలదవ్రాతము నాత్మకారిత మహాసత్రాగ్ని ధూమంబుచే

జెలువొప్ప న్వెలయింపఁజాలు భళిరే శ్రీరంగరాయక్షమా
లలనావల్లభుఁ డుర్వి దాతలకు నెల్లన్ దాత యూహింపఁగన్. 549

(అనుచోట్ల దోషముకావలెను. కాని,) ఇటువలెనే మహాకవులందఱు నతి
మాత్రమునే వర్ణించినారు. అవి యెన్నని వ్రాయము ! 550

వసు చరిత్రము (I-88) నందే :-

మ. అతిధీరుం డతిదానశీలుఁ డతిరమ్యాకారుఁ డత్యంత సు
వ్రతుఁ డంచున్ దనుసన్నుతించు కవి వాగ్వ్యాపారమెల్లన్ యథా
ర్థతరంబై విలసిల్ల తిర్మల మహారాయేంద్రు శ్రీ వేంకట
క్షితినాథోత్తముఁ డిందు నందు గతి గల్గించున్ గవి శ్రేణికిన్. 551

అన్ని పుస్తములందు (చతుర్థచరణమందు) 'కల్పించున్' అవి యున్నది.
వ్యాఖ్యాకారులును యతిభంగము కానక తప్పునకే అర్థము వ్రాసినారు. 'కల్పించె'
ననగా ఉత్తిదనుటే, గాన నర్థమున్ను బాగులేదు. ధనకనక వస్తుదానాదులచే
గతి కల్గించినాడనిన్ని, ఉత్తమపురుషగుణస్తుతిచే నందు పరము గల్పించి
నాడనిన్ని అర్థము. ఇచ్చట నతిమాత్రమే కాకపోతే :- 552

స్వర్గారోహణ పర్వము (1-88) నందు :-

క. విను మొక్కటి సెప్పెద రా
జను వానికినెల్లఁ దప్ప దవనీశ్వర యె
ట్లును నారక స్థలంబుం
గనుగొనవలయు టిది వేద కథితము సుమ్మీ 553

అని ధర్మరాజుతో నింద్రుడు చెప్పెనుగదా ! మరియును :-

'అసత్కీర్తనకాంతార, పరివర్తన పాంసులామ్
వాచం శౌరికథాలాప, గంగయైవ పునీమహే !

అని వేదవ్యాసులవారు రాజులను వర్ణించుట చేతను వాక్యము పాంసుల
మైనది. శ్రీ భగవత్కథాగంగ చేత పవిత్రమును చేయుచున్నామని హరివంశ
ము రచించినారని స్పష్టముగా నుండగా వేంకటేంద్రుని వర్ణించిన కవీశ్వరులకు

నుత్తమ లోకము లెటుల గలుగును? (కావున) ఇది అతిమాత్రము. ఎటువంటి దుశ్చరితుడైనను కవీశ్వరులచేత వర్ణించబడెనా, వానికి నుత్తమ లోకము సిద్ధము.

'కీర్తిం స్వర్గఫలా మాహుః, ఆసంసారం విపశ్చితః
అకీర్తింతు నిరాలోక, నరకోద్దేశ దూతికామ్'.

ఎవ్వని కీర్తి ఎంత మట్టుకుంటున్నకో వానికి నంత మట్టుకు స్వర్గప్రాప్తి. ఎవ్వనికి ఎంతమట్టుకు నపకీర్తి ఉంటున్నదో వానికి నంతమట్టుకు నంధకార బంధురమైన నరకప్రాప్తి.

'మహానదీ ప్రవిష్టాని, రథ్యాంబూ నీవ పావనాః
కావ్యే ష్వంకిత నామాన, స్సేవ్యంతే మానవా నరైః'

అని యున్నందున కవీశ్వరులచే వర్ణింపబడిన వారికి సద్గతి కల్గునని యుండగా, రాజులను వర్ణించిన కవీశ్వరులకు సద్గతి యనుట అతిమాత్ర మెందుకు కాకపోయెను? ఇతర కవీశ్వరులు మాత్రమే కాదు, విద్యానాథుడుగారును అతిమాత్ర దోషమునకు పాల్పడిన వారే. 554

ప్రతాపరుద్రీయము:—

"బ్రహ్మన్ మేరుగిరౌ కృతేపి కిమిదం నైవం విధాస్తే ముదః
స్వామిన్ సత్య మధిక్రియాద్య ఫలితా యద్వీరరుద్రః కృతః
మిథ్యా కిన్ను వికత్థసే త్రిజగత స్త్రాణాయ మత్ప్రార్థితః
శంభుః శ్మా మవతీర్ణవానితి కథా జాతా హరి బ్రహ్మణోః." 555

ఇచ్చట నతిమాత్ర మెందుకు కాకపోయెనో తెలియదు. 556

"స్వామిన్ గోత్ర మహీధరాన్ కిమధునా నీచై ర్విధత్సే కుతో
గాధానంబునిధీన్ కురోషి కురుషే కిం దిక్పతీ నల్పకాన్
ఇత్థం పార్శ్వచరానులాప మఖిలం న్యక్కృత్య ధర్మైషిణా
సృష్టః పద్మభువా గుణైక వసతిః శ్రీవీరరుద్రో నృపః" 557

"వదాన్యో నాన్యోస్తి త్రిజగతి సమో రుద్ర నృపతేః
గుణశ్రేణీ శ్లాఘా పిహిత హరిదీశాన యశసః
సమాంతా దుద్భూతై ర్ద్విరద మదగంధై స్సురభయః
క్రియంతే యద్విద్వజ్జనమణిగృహ ప్రాంగణ భువః." (నాయక.16) 558

ఇంతకన్న నతిమాత్రము కన్పించదు. 559

విద్యానాథుడుగారు గల్ల కటి శబ్దములు గ్రామ్యములన్నారు ధర్మాభట్టు గారు గల్ల శబ్దము మాత్రమే గ్రామ్యమన్నారు. కటి శబ్దము మహాకవు లందరును వాడుక చేసినారు. 560

కాళిదాస దండకము :

'చారు శింజత్కటీ సూత్ర నిర్భర్త్సి తానంగ లీలా
ధనుశ్శింజనీదంబరే, దివ్య పీతాంబరే...' 561

ఆముక్తమాల్యద (1-56):

మ. శయపూజాంబుజముల్ ఘటిం దడఁబడన్ జన్నోయి లేఁగౌను పై
దయదప్పం బసపాడి పాగడపు పాదంబొప్ప జెంగల్వ డి
గ్గియ నీ రచ్యుతమజ్జనార్థము గటిం గీలించి దివ్య ప్రబం
ధయుతాస్యల్ ద్రవిడాంగనల్ నడతు రుద్యానంపు లోఁద్రోవలన్. 562

ఇటువలెనే మహాకవి ప్రయోగములు బహుళములు గలవు. సరసమైన కటి పదమును గ్రామ్యమనరాదు. 563

ధర్మాభట్టుగారు అశ్లీలమునకు పదగత దోషములందు 'గుహ్యకేశ' పదమును, అర్థగత దోషములందు 'మదనధ్వజ' పదమును వ్రాసినారు. యుక్తముగా నున్నది. 'గుహ్యక' పదము, 'ఈశ' పదము— రెండు కలిపితే 'గుహ్యకేశ' అని వ్రీడాకరమైన అశ్లీలము. 'గుహ్యకేశ్వరః' 'యక్షేశః' అని ఉంటే, పదగత దోషము లేదు. 'మదన' పదము మంచిదే. 'ధ్వజ' పదమును మంచిదే 'మదన ధ్వజ' మని రెండు కలిపితే వ్రీడాకరమైన అశ్లీలము. మత్స్యము కర్థ ముండినా, చటుకున వ్రీడాకరమగు నర్థమే స్ఫురించును. 'గుహ్యకేశః' కుబేరున కర్థముండినా, వ్రీడాకరమగు నర్థమే చటుకున స్ఫురించును. గాన ధర్మాభట్టుగారి నిర్ణయము యుక్తముగా నున్నది. 564

విద్యానాథుడుగారు అశ్లీలమును మూడు విధములుగా చెప్పినారు— 'అమంగల, జుగుప్సా, వ్రీడాకం త్రివిధ మశ్లీలం' అని. ఉదాహరణము, వివరణ ఇట్లున్నది.

'అభిప్రేత పదావాసః, కదా న స్స్యం భవిష్యతి
నీచం సాధన మేతేషాం, పరోత్సర్గైక జీవినామ్'

"అత్ర అభిప్రేత పదాత్ ప్రేతలోక ప్రతీతే రమంగలత్వం, సాధనం నీచ మిత్యనేన తుచ్ఛ మేహన ప్రతీతేః ప్రీడాకరత్వం, పరోత్సర్గైక జీవినా మిత్యనేన అధోవాయు ప్రతీతేః జుగుప్సాకరత్వమ్."

సాధన పదముకు మేహనమున్ను కోశమం దర్థమున్న దీని ప్రీడాకరత్వమే అయితే: రఘువంశము (చతుర్థ సర్గ) యందు

'ప్రతి జగ్రాహ కాలింగ, స్తను స్త్రీర్గజ సాధనః
మణిర్ద్వయో రజాకంఠ, స్తనే రత్నే ప్యలంజికే'

అనుచోట, 'లలంజః = నిరర్థక జన్మవాన్. స్వార్థే కః, మేహనాగ్రే' అని నానార్థ రత్నమాల యందు ఉండుటచేత అశ్లీలమగును. ఇదిట్లుండగా, తేజశ్శబ్దమునకు రేతమని సాధారణముగా నర్థము ఉన్నది.

'శుక్రం తేజో రేత నీచ బీజ వీరేంద్రియాణి చ'

అని నిఘంటువు. తేజ శ్శబ్దము జుగుప్సాకరము కావలె. కాని మహాకవి ప్రయోగములు బహూలములు గలవు.

సాహిత్య రత్నాకరమందు :

'రాజతేంద్రౌ సుధాబ్ధౌ చ, శ్రియమాహృత్య రాజతే
రాజతేజోనిధేః కీర్తిః, త్రైలోక్యే రఘు రాజతే.

అని యున్నది. మరి ఇది అశ్లీలము కావలె: "భగ యోనిర్ద్వయోః' అని నిఘంటువున్నందున 'సుభగః' ప్రీడాకర మనవలె. కాని అహోబల పండితుల వారు

"వీర్యసుభగాది శబ్దా, విక్రమ సుందర ముఖాభిధేయేషు
కావ్యేషు సంప్రయుక్తాః, కవిభిః శ్లాఘాయుజో భవంత్యేవ."

అని చక్రవర్తిగారు సంజీవని యందు చెప్పినారని వ్రాసినారు. పీక్షు సుభగ పదములే మంచివని మహాకవి ప్రయోగము ఉండగా, సాధన పదమునకు మేహనార్థ మెక్కడో కోశమందున్నదని అశ్లీలమనుట యుక్తముగా కనిపించదు. అర్థమందున నిదే చూచుకొమ్మన్నారు. అటువంటిది అర్థగత దోషముగా వ్రాయరాదు. అన్ని విధములను సందర్భము కనిపించదు. 585

'అంబికా రమణ' పదమున 'విరుద్ధమతికృత్' దోషమన్నారు. కాని బహుల ప్రయోగములు కలవు. 586

కవి రామభద్రుని జయరమా రామశతకము:

సీ. పా. గాధి తనూజ యగత్రాణ విశ్రుతం
మంబికా రమణ శరాస భంగ...

ఆంధ్రనామ సంగ్రహము:—

సీ. పా. మరకతచ్ఛవికి నంబరమున కగు బేరు
పచ్చడాలనిన నంబాకళత్ర...

అందే :—

గీ. పా. నాగవాసమనుట నామమౌ వేశ్యాజ
నంబుమేళమునకు నంబికేళ

ఇటువలనే మహాకవులు ప్రయోగించినారు. ఆలంకారికు లెందుకు దోష 587
మనిరో మహాకవు లెందుకు ప్రయోగించిరో తెలియదు.

'ధావన్మృగేషసంభ్రామ్య త్కరిషూద్యత్రరక్షుమ
వింధ్యారణ్యేషు...

588

అనుచోట పతత్ ప్రకర్షదోషమని ఉదాహరించినారు.

'భ్రామ్యత్కరి షూద్యత్రరక్షుమ, ధావన్మృగే ష్వితి
వక్తవ్యేన తథోక్తమితి పతత్ప్రకర్షతా'

589

అని వివరించినారు.

'తురగాన్ కరిణోధవా'

అనుచోట క్రమభ్రష్ట మను దోషమన్నారు. రెండును పతత్ ప్రకర్ష దోషమనే చెప్పవలెను. (రెంటికిని) భేదము లేశమును కనిపించదు. మరి పతత్ ప్రకర్షము దోషమే అయితే

'న బ్రహ్మ విష్ణువచసామపి గోచరస్త్వ
మస్మద్విధస్య కిమహో తదవైమి సర్వమ్'

అను మల్హణకవి పద్య మేమగునో। మరియు అతని పద్యమే యగు

'బ్రహ్మేంద్రవిష్ణుసురదానవలోకపాలైః'
అన్నదేమగునోః ఇంకను గలవు. 570

దండిగారి అనామయము :-

వేధావిష్ణుర్వరుణధనదౌవాసవో జీవితేశ
శ్చంద్రాదిత్యౌ వసవ ఇతియా దేవతాభిన్న కక్ష్యాః
మన్యే తాసామపి న భజతే భారతీ తే స్వరూపం
స్థూలే త్వంశే స్పృశతి సదృశం తత్పున ర్మాదృశోపి. 571

సుభాషిత రత్నావలి :

శంభుస్స్వయంభు హరయో హరిణేక్షణానాం
యేనాక్రియంత సుతతం గృహకుంభదాసాః
వాచామగోచర చరిత్ర పవిత్రితాయ
తస్మై నమో భగవతే మదనధ్వజాయ. 572

ఇందు పాదాంత లఘువులు గురువులు, 'స్వయంభు' హ్రస్వాంతము, గమనించవలెను. 573

'భద్రాసనాని దృషదః భద్రాణి చ మహీరుహాః
దుర్దశా రాజ్యమూర్ధాభిషిక్తాః పున రహో వయః'

అనుచోట 'సంబంధ వివర్జిత' మను దోషమన్నారు. సరే, భిన్నలింగ వచన దోషములకు

'సముద్రా ఇవ గంభీరం, మనో మాల్యభూభుజః
గిరిణేనాంధ్రనృపతి ధ్వజిన్యా కలుషీకృతమ్'

అని లక్ష్యము వ్రాసినారు. ఈ భిన్నలింగ దోషము 'భద్రాసనాని' అను శ్లోకమందును కనుపించుచున్నది. (భిన్నలింగ, వచనములకు కొన్ని ఉదాహరణములు వ్రాసుతాము.) 574

'రాత్రి ర్యామత్రయపరిమితా వల్లభా స్తే సహస్రమ్ ; 575

'వల్లభా స్తే సహస్రం' భిన్నలింగము. 576

ధర్మభట్టుగారి నరకాసుర విజయము :

'శయ్యాంబరం శశిశిరోరివ భాతి, లాక్షా
తాంబూలయో రివ రసై రరుణాభ్రలేశైః...' 577

ఇదియు భిన్నలింగమే. 578

జయదేవ మహాకవికృత ప్రసన్న రాఘవము :

కిం శీతాంశు మరీచయః కిము సురస్రోతస్వినీ వీచయః
కిం వా కేతక సూచయః కిమథవా చంద్రోపల శ్రీ చయః
ఇత్థం జాతకుతూహలాభి......స్సానందమాలోకితాః
కాంతాభిం స్త్రిదివౌకసాం దిశిదిశి క్రీడంతి యత్కీర్తయః 579

ఇచ్చట (వీచయః మొదలగునవి బహువచనములు శ్రీచయః ఏకవచనము) కాగా భిన్నవచనము. 580

(ఇటువలెనే ఆలంకారికుల దోషమార్గమును మహాకవుల ప్రయోగ మార్గమును పరిశీలించుకొనవలెను. దిక్సూచనగా బాలుర తెలివిడి కొఱ కివి వ్రాసినాము). 581

